# మహా భిక్షు



చిక్కాల కృష్ణారావు

ప్రచురణ నెం. : 9

సర్వహక్కులు : చిక్కాల కృష్ణారావు

నిర్వహణ : వెలివెల నాగమణి

ప్రథమ ముద్రణ : 1997 బుద్ధపూర్ణిమ

ద్వితీయ ముద్రణ: 2000 ”

ప్రతులు : 1000

ధర : 70-00

ప్రతులకు :

చిక్కాల కృష్ణారావు
కృష్ణ నిలయం
గొల్లవీధి
భీమునిపట్నం
విశాఖ జిల్లా-531 163

ప్రెస్ :

డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2

# అంకితం



సమస్తం [illegible]

స్వస్వరూపంగా దర్శించే

అరుణాచల రమణునికి

ప్రేమతో

తెప్పవలె ఒడ్డున చేర్చడానికి
ధర్మోపదేశం చేశాను కాని,
నెత్తినపెట్టుకుని
మోసుకు తిరగడానికి కాదు.

**బుద్ధుడు**

ధర్మాన్ని బోధించిన బుద్ధునికి
బుద్ధిరూప పాత్రల్లో బౌద్ధధర్మాన్ని నింపుకుని,
భద్రపరచి-ప్రపంచానికి అందించిన
ఆనంద్-ఉపాలి-మహాకాశ్యపులకు-

ఆ తర్వాత కాలంలో వచ్చిన
భాష్యకారులకు, ప్రచారకులకు -
మహాభిక్షు గ్రంధావతరణకు
కావలసిన సమాచారం అందించిన వారందరికి -

గ్రంధాన్ని ఆమూలాగ్రం శ్రద్ధగా
చదివిన రమణ మూర్తిగారికి,
వినిన స్వామి యోగానందగారికి,

ఈ గ్రంధాన్ని రవీంద్రనాథ్‌టాగూర్
కవితతో ప్రారంభిస్తున్నందుకు - వారికి -

నాపుస్తకాల్ని శ్రద్ధగా - అందంగా
అచ్చువేయించి అందిస్తున్న బాబూరావుగారికి

నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

# విషయసూచిక

# ఒక మాట

దున్నని బీడునేల వలె

ఉలిదెబ్బ తనని బండరాయి వలె

పుష్పించని గొడ్డుచెట్టువలె

ముప్పై ఏళ్ళు గడిచాయి.

పరిస్థితులు - పెద్దల ప్రవచనాలు

అన్వేష్యా ఆశా, ప్రయత్నాల్లో వుంచాయి.

ప్రతిస్పందనే మనోదాస్యమని తెలియడం -

బీటలు తీసిన నేలకు తొలకరి జల్లుగా,

దారిపక్క బండరాయి ఆలయం మెట్టుగా,

గొడ్డుచెట్టున పూసిన పువ్వుగా,

మహా భిక్షు అవతరించింది.

కృష్ణ

# ముందు మాట

చిన్నప్పుడంతా బుద్ధుడంటే బొద్దుగా, ముద్దుగా వుండే బొమ్మగుర్తు-తర్వాత పాఠ్య పుస్తకాల్లో చదివింది, ఆయన సంక్షిప్త జీవిత చరిత్ర.

అరుణాచలంలో శ్రీ గుడిపాటి వెంకటాచలంగారితో వున్నప్పుడు, ప్రతిఏటు ఆయన పుట్టినరోజు పండగ, బుద్ధ పూర్ణిమనాడు జరగడం చూసినా, బుద్ధుడు నాకేమీ పట్టలేదు.

**1966**-లో- బుద్ధ పూర్ణిమ రోజున అకస్మాత్తుగా, అప్రయత్నంగా, అనాలోచితంగా నా మదిలో ఒక దివ్య స్వరూపం మెరుపులాగ మెరిసింది.

ఆ రూపం నన్ను విస్మయం, విభ్రమం చెందించగా-

"ఎవరీ మహానుభావుడు?" అని అనుకున్నానో - లేదో -

"నేనా? నేనీ లోకానికి అతిథిని. భూమాతబిడ్డను. ఏదీ బంధించని వాణ్ణి," అన్నమాటలు వినిపించాయి.

"ఓ, మహాత్మా! ఓ మహాభిక్షూ!!

నా జీవితాన్ని తాకి, నన్ను స్పందింప జేసినందుకు, నీకు, నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నీ ప్రవేశంతో నా ఉత్తేజాలన్నీ ప్రజ్వరిల్లాయి.

పరిపూర్ణ ప్రేమతో నీ సమ్యక్ సంబోధిత్వం నన్ను చేరింది. మహాసముద్రం-నది కలిసినట్లు," అని అనుకున్నాను.

* * *

నేను చరిత్రకారుడను. పరిశోధకుడను కాను. సామాన్య పరిశీలకుడను.

బుద్ధుని బోధలు, ఉపదేశాలు, చర్చలు, సంభాషణలు, కేవలం వేదాలవలె అనుశ్రుతంగా వచ్చాయేకాని, చాలా కాలం లిపి బద్ధం కాలేదు.

బుద్ధుని మరణానంతరం, అనుభవజ్ఞులు - భిక్షులు, మేధావంతులు, తత్త్వవేత్తలు, సాధువులు, సాధకులు, సత్యాన్వేషకులు, చరిత్రకారులు, విద్యావంతులు మహిమాన్వితమైన బుద్ధుని జీవిత చరిత్రనూ, బౌద్ధ ధర్మాన్ని విస్తృత గ్రంథ రూపంలోకి తీసుకొచ్చారు.

ప్రచారంలో, గ్రంథాల్లో, ఆరామాల్లో, శిలా శాసనాలుగా నిక్షిప్తమైవున్నవే నేటి బౌద్ధ వాఙ్మయానికి ఆధారాలు.

ఈ ముప్ఫై ఏళ్ళ కాలంలో, నా ఆసక్తి మేరకు బుద్ధుని విషయమై లభించిన- చిన్న కాగితం ముక్క మొదలు, పెద్ద గ్రంథాల వరకు చదివి- సమాచారం సేకరించి, "మహాభిక్షు" గ్రంథంగా రూపొందించాను.

ఈ గ్రంథం తయారు చేయడంలో నా ఉద్దేశ్యం - బుద్ధుని జీవితం—తత్త్వం— వీలైనంత స్పష్టంగా, సులభంగా, సహజంగా, పాఠకులకు అందివ్వాలనే కాని, ఇప్పటి వరకు బుద్ధునిపై, బౌద్ధ ధర్మంపై వచ్చిన అనేక గ్రంథాలకు నేను మరో గ్రంథం చేర్చడం కాదు.

నేను సేకరించిన సమాచారం నుంచి అందమయిన, అర్థయుక్తమయిన కొన్ని సంగతులు, సంఘటనలు, విషయాలు ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది.

కొన్ని విషయాలు పదే పదే చెప్పడం కూడా జరిగింది. ఆచర్విత చర్వణం, ఉద్దేశ్యపూర్వకమే-సత్యం, ఒక్కటే అయినా, విషయాల్లో సామ్యమెంతవున్నా, బుద్ధుని ప్రవచనాల్లో, సంభాషణల్లో, చర్చల్లో, సమాధానాల్లో, ప్రతిచోటా, ప్రతిసారి నూతనత్వం కనుపిస్తుంది.

బుద్ధుడు చెప్పిన విషయాల్లో వదలతగిన పదంకాని, సంగతికాని ఏమీలేదు.

ఈ గ్రంథం పాఠకులకు కొంతైనా ఉపయోగపడుతుందనే ఆశతో—

కృష్ణ

# ఈ ప్రపంచం,

అనంతంగా, అనాదిగా
భయం-భ్రాంతులతో, హింసా-ద్వేషాలతో
ఘోర కుటిల-నిష్ఠుర-కంటకాల-మోహా, జటిల-
మలిన దుర్వాసనల- వక్రమార్గాల, అత్యాశల- కలవరాల
విషపూరిత ఉన్మత్త స్థితిలో
విశృంఖల వీరవిహారం చేస్తోంది.
ప్రభో!
నీ మహావతరణం కోసం,
సమస్త జీవకోటి వేదనా భరిత హృదయంతో, ఆక్రోశిస్తోంది.
పరమాత్మా,
అనంత జీవనా-
నీ అమృతవాణితో వారిని కడతేర్చు.
నిరంతర బాధాతప్త హృదయావేదన నుంచి, వారిని కాపాడు.
శాశ్వతమైన వారి ఆకాంక్షను ఉన్నత స్థానంలో వుంచు.
తరగని మధునిధి కల ప్రేమ పద్మదళాల్ని,
నీ దివ్యకాంతితో వికసింపచెయ్యి.
హే, శాంతస్వరూపా,
ముక్తిదా,
హే, అనంత పుణ్యమూర్తి!
అపార కరుణా సముద్రా-
ఈ ధరా హృదయంమీది సమస్త మాలిన్యపు మరకల్ని తుడిచెయ్యి.
శాశ్వత ఫలదాయకా,
పరమాత్మా,
దానవీరా-

అనంతశూన్యుడా,
సరళ సమర్పణ శక్తిని మాకు ప్రసాదించు.
మహా భిక్షూ!
మా అత్యాశల్ని, అహంకారాన్ని అణచడానికి
మరొకమాటు అవతరించు.
ప్రభో!
సమస్త ప్రజానీక శోకాన్ని తీర్చు.
మోహాన్ని ఖండించు.
నీ నూతన జ్ఞానప్రకాశదీప్తిలో, అంధుల్ని కళ్ళు తెరవనియ్యి-
మృతుల్ని పునర్జీవితుల్ని చెయ్యి.
ఎటు చూసినా ఆక్రందనం- దుఃఖం-బాధ-భయం.
సమస్త హృదయాలు విషయ వాసనలతో
విష స్వభావాలతో- వికార చేష్టలతో
శిథిలమై, శుష్కించి తాపంతో దహించుకుపోతున్నాయి.
రక్షించు ప్రభో!
ఓ, శాంతస్వరూపుడా!
ముక్తుడా!
పరితృప్తుడా-
ప్రపంచ దేశాలు ఘోర కర్మకాండలతో
రక్తమయం, కలుషితం, మురికి, మాలిన్యంచేసి, తిలకిస్తున్నాయి.
ఓ, మహాత్మా!
మహనీయమైన- మంగళకరమైన- అనంతమైన
నీ అమృత హస్తాన్ని మాపై వుంచు.
ఓ ప్రభూ!
నీ దివ్యమంగళ శంఖం పూరించు.
శుభ సంగీత స్వరాలతో- సుందర దరహాస విలాసాలతో,

లయ, తాళ చంధస్సులతో,
మరొకమారు అవతరించి, రక్షించు.
హే, శాంతస్వరూపా!
ఓ, ముక్తుడా!
అనంత పుణ్యమూర్తీ,
కరుణామయా,
పరమేశ్వరా!
అనంత సూక్ష్మ స్వరూపా,
నీ పునరాగమనంతో ఈ లోకాన్ని రక్షించు.

(రవీంద్రనాథ్ టాగూర్)

# పరిచయం

ఈ భూమిమీద అవతరించిన మహాత్ములలో గౌతమబుద్ధుడు మహామహుడు, జ్ఞానశ్రేష్ఠుడు. ఆయన అవతరణ, మానవ చరిత్రలో అందమైన- అపురూపమైన- ఆనందదాయకమైన ఒక ఉషోదయం. భారతీయ తాత్విక దృష్టికి, వసంతోదయం. మానవాళి సుషుప్తిలో ఒక సుందర స్వప్నం.

సిద్ధార్థునిలో జిజ్ఞాసాంకురం ఉదయించడంతో, ప్రేమించే తల్లి—తండ్రులను, భార్యా-బిడ్డలను, బంధు-మిత్రులను, అనంతధన-సువర్ణ రాసులను, రమణీయ మధుర యవ్వనాన్ని, సుఖాల్ని, ఐహిక ఆనందాల్ని పరిత్యజించి, జ్వాలవంటి విషరూపిణి అయిన తృష్ణను-రాగ ద్వేషాదులను నిర్విశేషంగా జయించి, మాయా మోహాలు లేని వాడై మృత్యువును జయించి, మృత్యుంజయుడై విరాట్ స్వరూపాన్ని దర్శించాడు.

ముని శ్రేష్ఠుడైన సిద్ధార్థుడు, ఆకాలానికి అన్నివిధాలా ముఖ్యమైన క్రియా శక్తిగా, అవసరమైన వ్యక్తిగా, దివ్య తేజస్సుతో- జగన్మోహనాకారంతో- ప్రసన్న గాంభీర్యంతో-లోకాతీత సౌజన్యంతో-కోమలత్వంతో-అగాధ దయాంతరంగంతో, మేరువంత ఉన్నతంగా, సముద్రమంత గాంభీర్యంగా, మహోన్నతంగా దర్శనమిచ్చాడు.

మనుష్యుల మధ్య మసలినా, ఆయన వారిలో ఒకడు కాదు. ఆయన ఒక అగ్నిపర్వతం-కాకపోతే, అఖండజ్యోతి. అంటే, సర్వజ్ఞానజ్యోతి. అది- అహంకారానికి, సంబంధానికి, సర్వావస్థలకు అతీతమైనది. అది, స్వయంస్థితి కలిగి, సర్వాధారమై వుంది. ఆయన చాలా వరకు ఏకాంతంగా వుండేవాడు. మనో విజృంభణ లేకపోవుటే, ఏకాంతం. ఆయన ఏకాంత ప్రదేశాన్ని, ఎవరైనా సరే ఏకాకులై చేరవలసిందే!"

అలలు లేని కొలనువలె, విమలమై, నిశ్చలమై, నిర్మలమై, సర్వజ్ఞత్వంతో విలసిల్లే బుద్ధుని ప్రభంజన లీలలను, ఆనాటి ప్రజలు అమితాశ్చర్యంతో తిలకించారు. ఆయన్ని అంగీకరించని వారికి-బౌద్ధ ధర్మం అర్థంకాని వారికి కూడా వారి సన్నిధి - సహజీవనం ఉత్సాహ పరచి, ఉత్తేజపరచింది.

ఆ దృశ్యాన్ని దర్శించిన ఒకకవి "పరిపూర్ణశాంతి- మాధుర్యాలు రూపొందిన సుందర స్వరూపం వారిది. ఆయన చిరునవ్వు- రాత్రివేళ చిరుపాపల కనురెప్పలపై పడే చంద్రకాంతి వలె, ఉదయకాంతిలో వికసించే పద్మంవలె వుంది" అన్నారు.

"ఆయన జీవితం, మహిమాన్వితం. ఆయన వ్యక్తిత్వం, అపూర్వం. ఆయన మౌనం, అర్థరాత్రి అంత అగాధం. ఆయనవాచ, గంభీరం, మధురం. అది వెలుగురేఖలంత సౌన్నత్యం కలది. ఆయన వాణి, విశద మనోజ్ఞం. జీవితమంతా దుఃఖితుల కోసం వ్యథపడ్డా రాయన. ఆ వ్యథ-అవ్యక్తం కోసం అశ్రులు జాచేవారి చిరునవ్వు మాదిరిగా వుంది" అన్నారు మరొక కవి.

జ్ఞాన స్వరూపమే, బుద్ధ స్వరూపం - ఆ జ్ఞానం, ప్రజల్లో నవ చైతన్యాన్ని కలిగించి, నూతన జీవితానికి మేల్కొలుపును ఇచ్చింది. మేల్కొన్నవారు బౌద్ధధర్మం స్వీకరించి- అనుసరించి - ఆచరించారు. బౌద్ధాన్ని తెలుసుకునే మార్గమే, జ్ఞానాన్ని తెలుసుకునే మార్గం. నిత్య జీవితంలో సంశయాలు, విష సంకటాలు ఎదురైనప్పుడు — అప్పుడు బుద్ధుని బోధ ఎటువంటివారినైనాసరే, స్థిర చిత్తుల్ని చేయక మానదు.

కొన్ని ముఖ్యమైన-క్లిష్టమైన, చిక్కైన ప్రశ్నలకు బుద్ధుడు మౌనం వహించాడు. ఆత్మ-పరమాత్మ, జన్మ-మృత్యువు - గురించి మాళుక్య పుత్ర ప్రశ్నించినప్పుడు "ఏదైతే - వ్యక్తంకాలేదో - తెలియదో, దాన్ని వ్యక్తంకానట్లే — తెలియనట్లే విడిచిపెట్టండి. ఏదైతే వ్యక్తమైనదో-తెలిసిందో-దాన్నే స్వీకరించండి" అన్నాడు బుద్ధుడు.

ఆయన స్వతంత్ర ఆలోచనాపరుడు. మానవాళిని దుఃఖం నుంచి విముక్తి పరచపలచిన దయామయుడు. ఆ కారణానికే ఆయన బోధ నేటికీ ఆచరణీయంగా వుంది.

బుద్ధుడు మార్గదర్శకుడేకాని, ఏనాడూ సిద్ధులు, మహిమలు ప్రదర్శించలేదు. తాను దైవాంశ సంభూతుడననిగాని, దేవుని కుమారుడననిగాని, దేవదూతననిగాని అనలేదు. అంతేకాదు, ఎప్పుడూ, ఎవరికీ ఎటువంటి వాగ్దానమూ చేయలేదు – హామీ ఇవ్వ లేదు. కేవలం మానవ మాత్రుడుగా వ్యవహరించి, మహోన్నత ధర్మం బోధించాడు. ఆ ధర్మంలో మర్మంలేదు. దానికి వారసులు లేరు. ధర్మమే ధర్మానికి వారసురాలు. ధర్మానికి ధర్మమే అధికారి. అటువంటి ధర్మం బోధించడమే ధర్మంగా పెట్టుకున్నాడు కాని, ధర్మాన్ని శాసించలేదు. శాసించడం, ఆయన ధర్మం కాదు.

బుద్ధుడు అవతారపురుషుడూ, పురాణపురుషుడూ కాదు. ఆయన ఈ తీరాన నడచినా, ఆ తీరానికి చెందినవాడు. ఆ తీరంచేర దలచినవారిని, నడిపించేవాడు. భయంకరమైన సంసారార్ణవాన్ని తాము తరించి, ఇతరులనుకూడా నిర్హేతుక కటాక్షంలో తరింప జేయుటే బుద్ధుని లక్ష్యం.

విహారాల్లో విశ్రమించి, భిక్షాన్నం భుజించి, ఎటువంటి వాంఛ నల్ని- వాసనల్ని తలెత్తనీయకుండా, కాలంలో వచ్చే మార్పును తీసుకుని, నిష్ఠాపరమైన జీవితం గడుపుతూ, పరిభ్రమించిన ఆయన జీవితం ధన్యం. ఆ జీవితం-ఒక చక్కని సంగీత స్వరం మాదిరిగా సాగింది. అనేక అందమైన రాగాలతో సత్యాన్ని - ధర్మాన్ని గానం చేస్తో నలభై ఐదేళ్ళు సంచార జీవితం సాగించాడు బుద్ధుడు. ఆ జీవితం స్వచ్ఛమైన దర్పణం వంటిది. అందుకు - మన జీవితమంతా ప్రతిబింబిస్తుంది.

హృదయం- మేధస్సు అత్యద్భుతంగా మేళవించిన మహ నీయుడు బుద్ధుడు. భూమ్యాకాశాలస్నేహం, స్వర్గనరకాల వైవిధ్యం

అవగాహన చేసుకుని సత్ చింతా నిమగ్నుడైనటువంటి మహనీయుని శక్తివంతుని- మనం అరుదుగా దర్శిస్తాం. అందుచేతనే మధురమైన పాలు తాగే లేగదూడ తల్లిని వదలనట్లు- బుద్ధుని బోధలను అర్థం చేసుకున్నవారు తాము పొందే సుఖాన్ని వదలిపోరు.

మానవ హృదయ సింహాసనంమీద, మహాయోగ ముద్రలో చెరగకుండా, చెదకుండా, చెదరకుండా మహాజ్ఞానంతో ఈ నాటికి నిలిచి వెలుగుతున్న మహోన్నతుడు- బుద్ధ భగవానుడు. ఆకాశ హర్మ్యంపై అఖండ జ్యోతివలె వెలుగుతున్న బుద్ధుని దివ్యత్వాన్ని యావత్ ప్రపంచం ఈ నాటికీ గుర్తిస్తోంది.

*　　　　*　　　　*

బుద్ధునికి పూర్వం ఇండియాలో సన్యాసులకు ప్రత్యేక ఆశ్రమాలు, మఠాలు లేవు. వ్యక్తిగత సమస్యలవల్ల సన్యసించి, అరణ్యాల్ని ఆశ్రయించి, కొన్నాళ్ళో - జీవితకాలమో సన్యాస జీవితం గడిపేవారు. కాని, బుద్ధుడు వచ్చిన తర్వాత, సన్యసించి, జీవితాంతం ధర్మజీవనం గడపనారంభించారు. అటువంటి పరివ్రాజకులకు బుద్ధుడు "భిక్షువులు" అనే పదం వాడాడు. ఆ భిక్షువులకు ప్రత్యేక ఆశ్రమాలు, ఆరామాలు ఏర్పాటు చేయబడ్డాయి. అవి సంఘం ఆధీనంలో వుండేవి.

దయాధర్మాన్ని ఆధారం చేసుకుని, భక్తి-కర్మ-జ్ఞానయోగాలలో దేనివల్లనైనా మోక్షాన్ని పొందవచ్చు. అంటే, నిర్వాణాన్ని సాధించవచ్చు. నిర్వాణమంటే, శాశ్వతదుఃఖనివృత్తి, - అని చెప్పి - పెరిగి పోయిన వర్గ-వర్ణకాఠిన్యాన్ని తన సౌభాతృత్వంతో అణచేశాడు బుద్ధుడు. చిరస్థాపిత సాంప్రదాయాల్ని - వైదిక కార్యకలాపాల్ని అవసరమైన మేరకు ప్రతిఘటించి, వ్యతిరేకించాడు. సమానత్వాన్ని బోధించాడు. జంతు బలుల్ని ఆపి, సత్పురుషుల నిష్కామ కర్మరాశేయజ్ఞమన్నాడు.

గౌతముడు తానొక ప్రత్యేక వ్యక్తిననే అహంభావ - అవిద్యలనుంచి విముక్తుడై - సత్యమార్గాన్ని అనుష్ఠించి, చతుస్సత్యాలను తెలుసు కున్నాడు. మొదటిసత్యం - సర్వం దుఃఖమయం. రెండవ సత్యం - దుఃఖకారణం. ఆకారణం - తృష్ణ - కోర్కె. మూడవసత్యం - దుఃఖనివృత్తి. అది - తృష్ణను, జీవితోష్ణాన్ని జయించడం. ప్రేమ విజయాన్ని సాధించడం. అదే శాంతి. నాల్గవ సత్యం - సాధనా మార్గం. అది - అష్టాంగమార్గం. ఆ మార్గం సూటైనది, సరైనది. ఆ మార్గాన్ని అనుసరిస్తే - అన్ని విధాలైన దుఃఖాలునివృత్తి అవుతాయి. అన్ని విధాలైన దప్పికలు అణగుతాయి. ఎప్పటికీ వాడని పువ్వులు విచ్చుకుంటాయి.

అన్ని సత్యాలలో చతుస్సత్యాలు శ్రేష్ఠం. అన్ని మార్గాలలో అష్టాంగమార్గం శ్రేష్ఠం. అన్ని ధర్మాలలో తృష్ణారాహిత్యం-అదే నిర్వాణం, శ్రేష్ఠం. దుఃఖానికి కారణం, కోర్కె. కోర్కెను జయించాలంటే, అష్టాంగ మార్గాన్ని అనుసరించాలి. అది, బుద్ధుడు బోధించిన నూతనధర్మం. ఆ ధర్మం - ప్రపంచంలో ఒక దివ్య శంఖారావమై, ప్రజలహృదయాల్లో మారుమ్రోగింది.

తాను తెలుసుకున్న సత్యాన్ని తెలియ జేయడంతో, ఆయనలో-అన్ని కాలాల, అన్నిదేశాల, అన్నిమతాల, వర్గాల వారి పూర్తి భావన - అవగాహన - గోచరమౌతుంది. ఒక మహాత్ముణ్ణి దర్శించి, గుర్తించి, అనుసరించామనే పరమానందంలో - ఆయన పేరుమీద భూమి నాలుగు చెరగులా - అంధకారంలాంటి గుహల్లో సైతం-ఆలయాలు నిర్మించారు. శిలలపై శిల్పాలు చెక్కారు. ఆయన అనుచరులంతా ఎంతో ఉత్సాహ - ప్రోత్సాహాలతో పనిచేశారు. ఆనాటి ప్రజాభాష అయిన పాలీభాషలో-ఆయన ధర్మం బోధించడంతో- ఆ భాషను లిపిబద్ధం చేశారు, దానితో చిత్రకళ - శిల్పకళ-రచన-ఇత్యాది కళలు మరింత వెలుగులోకి వచ్చాయి. జీవన తత్వంలోనేగాక, కళలలోకూడా బుద్ధుడు కేంద్రమైనాడు.

ప్రపంచంలో, మతపరమైన ఆలోచనల్లో, భావాల్లో గొప్ప మార్పు తీసుకొచ్చిన జ్ఞానమూర్తి, బుద్ధుడు. ఆయన గురువులకు గురువు. మహత్తరమైన ధర్మాన్ని బోధించిన నీతి బోధకుడు. సంఘసంస్కర్తగా సర్వజ్ఞత్వంతో పని చేసిన సాంఘిక వాదేకాని, బుద్ధుడు తిరుగుబాటుదారుడు, పరమత ద్వేషికాడు. సర్వశక్తి సంపన్నుడు. ఆయన బోధించిన ధర్మం— ఉపనిషద్ధర్మంకన్నా, భిన్నంకాదు. మానవుణ్ణి దుఃఖం నుంచి తప్పించే తరుణోపాయం చూపడం- వారికి పరిపూర్ణత చేకూర్చడం ధర్మంగా పెట్టుకున్న మహాత్ముడు, మార్గదర్శకుడు. బుద్ధుని నడవడి- బౌద్ధ సంఘంలోని శిక్షణా, ప్రజల్ని బాగా ఆకర్షించాయి. ఆయన ధర్మశీల ప్రబోధమే, బౌద్ధమత విజయానికి ప్రధాన కారణం.

* * *

బుద్ధుని దృష్టిలో వున్నది మానవ జీవిత తరుణోపాయం ఒక్కటే. మానవోద్ధరణే, ధ్యేయంగా పెట్టుకున్న కరుణామయుడు, బుద్ధుడు. దుఃఖ నివారణోపాయాన్ని సూచించి, లోక కళ్యాణార్థం శ్రమించిన దయానిధి బుద్ధుడు. మానవుల్ని దుఃఖ విముక్తుల్ని చేయాలని- వారి జీవితంలో పరిపూర్ణత చేకూర్చాలని దృఢ సంకల్పంతో గృహ-బంధు-మిత్ర బంధ విముక్తుడై-మోహదూరుడై-సర్వస్వాన్ని పరిత్యజించి, అర్ధరాత్రి వేళ ఇల్లు వదలి - ఘోర తపస్సు గావించి తనను తాను తెలుసుకున్న పురుషోత్తముడు, బుద్ధుడు.

ముక్తి బంధనాల విముక్తుడై, నిర్వాణస్థితిని పొందాడు. అంతే, ఆయనలో విషయవాసనలు అంతరించాయి. అంతశ్శత్రు వర్గం నశించింది. ఆయన చుట్టూ జ్ఞాన ప్రకాశం విరజిమ్మి, సర్వం తేజోమయం చేసింది. ఆనాటినుంచి ఆయన్నుంచి అలౌకిక మనోహర ప్రభలు ప్రసరించాయి.

బుద్ధుడు హిందువుగా పుట్టి, హిందువుగా పెరిగి, హిందువుల మధ్య మసిలాడు. ఏనాడూ హిందువుల్నిగాని, హిందూ మతాన్ని గాని విమర్శించలేదు - ఖండించలేదు - నిరసించలేదు - నిందించ లేదు - నిరాకరించలేదు. కాని, ఆయన జన్మించేప్పటికే భారత దేశంలో ఉపనిషత్ వేదాంతం, మూఢభక్తి, బ్రాహ్మణాధిక్యత, యజ్ఞ యాగాదిక్రతువులు, జంతుబలి, కుల-మత-వర్గ-వర్ణవిభేదాలు బానిసత్వం — అంటరానితనం - పురుషాధిక్యత - ఇన్ని ప్రబలంగా వున్నాయి.

బుద్ధునికి ఒక్క మానవులపైనే ప్రేమకాదు. సమస్త జీవకోటిపై అమితమైన ప్రేమ, దయ, కరుణ. అది ఆయన స్వభావం కాని, గుణంకాదు, ఆయన చూపిన ప్రేమ, దయ,-చేసిన పనులు,-జీవించిన జీవితం - బౌద్ధమతంకన్నా - బోధించిన బోధలకన్నా గొప్పవి. యజ్ఞయాగాది క్రతువులపేరుతో జరిగే జంతుబలుల్ని - ఆపమన్న కారుణ్యమూర్తి, బుద్ధుడు. సర్వప్రాపంచిక భావాలను, స్వార్థ-అహంకార-పశువాసనలను బ్రహ్మాగ్ని కుండంలో ఆహుతి చేయడమే, బ్రహ్మయజ్ఞమన్నాడు. స్వార్థత్యాగ రూపమైన ప్రతి కర్మ, యజ్ఞమే. సమస్త కర్మలలోని చెడును, హింసను సంస్కరించి, ప్రజలను అహింసా పరులుగా మార్చుటే, యజ్ఞం యొక్క ఉద్దేశ్యం కనుక ప్రతి ఒక్కరూ - అనుక్షణం తాముచేసే ప్రతీ పనినీ, ఒక యజ్ఞకర్మగా భావించి- దాన్నే ఆరాధన, ఉపాసన భావంతో, బ్రహ్మార్పణ బుద్ధితో నిష్కామంగా చెయ్యమన్నాడు. దేనియందు ఫలాపేక్ష-ఇచ్ఛవుండదో- ఏది విధిపూర్వకంగా కర్తవ్యమనుకొని మనసును దానియందు లగ్నంచేసి చేయబడుచున్నదో, ఆ యజ్ఞం-సాత్వికం. కనుక యజ్ఞ-దాన-తపస్సులు మానవులకు చిత్తశుద్ధిని కలిగిస్తుంది" అన్నాడు.

బానిస స్త్రీలను గౌరవంగా చూడమనీ, చాందస భావాల్ని సాంప్రదాయాల్ని వీడమనీ, నూతన సమాజ నిర్మాణానికి వేగు

చుక్కలా పనిచేశాడు, బుద్ధుడు-దుఃఖితుల, బాధితుల పతితుల, అణ
గారిన వారి పాలిట, దీన బంధువుగా నిలిచాడు. ఆ సందర్భంలో
అధికార మదోన్మత్తుల్ని- కుటిల-కుతర్కాలతో తనను ఓడించాలని
నిష్కారణ ద్వేషం పూనినవారినీ, గర్వితుల్ని ఒక్క చిరునవ్వుతో
నిర్వీర్యుల్ని చేసిన సంఘటనలెన్నో వున్నాయి; ఆయన జీవితంలో.
క్రూరమైన, పనికిమాలిన, బుద్ధి తక్కువైన కుల, మత, వర్గ, వర్ణ,
జాతీయతల పేరుమీద భూమిని రక్తంతో తడిపి, ఆ తడి ఆరకుండా
చేస్తున్న సంఘవిద్రోహక శక్తుల్ని, సంకుచిత స్వభావుల్ని నిరసించి,
ఖండించాడు. ప్రేమ, దయ, కరుణ, అహింస, సామరస్యం, సమ
త్వము, సౌభ్రాతృత్వం సమదృష్టి బోధించిన ధర్మమూర్తి బుద్ధుడు.
విశ్వమానవ శ్రేయస్సు కోసం నిస్సహాయుల-నిర్భాగ్యుల, నిర్ధనుల,
బానిసలను ఉద్ధరించడానికి అవతరించిన ప్రేమర్షి బుద్ధుడు.

ఆయన బోధలు-సిద్ధాంతాల, నమ్మకాల, పద్ధతుల, విశ్వాసాల
సాంప్రదాయాల, వాదాలమీద ఆధారపడక, సూటి స్వానుభవం
మీద ఆధారపడి ఉన్నాయి. కనుక అవి నిజమైన సత్యాన్వేషికి, అంత
రంగిక మార్గదర్శకత్వం వహిస్తాయి.

నిత్య జీవిత సత్యాలను తెలియజేస్తూ, జన సామాన్య సమస్య
లను స్పష్టమైన, బహు ముఖ్యమైన వివరణలతో పరిష్కరిస్తూ—
ధర్మం ప్రచారం చేశాడు.

అంతరంగిక అనుభూతిలో స్థిరంగా నిలిచి, చివరి వరకు
బోధించాడు. ఆయన బోధల వెనక, ఆయన అదృశ్య కంఠం గంభీ
రంగా ధ్వనిస్తున్నట్లే వుంటుంది.

సహజం, చైతన్యవంతం, జ్ఞానస్వరూపం అయిన బుద్ధుని
బోధలు, ప్రతి ఒక్కరికీ- అవి తమకే చెప్పినట్లు వుంటాయి.

* * *

బుద్ధుని ప్రచార కాలమంతా, సాధువుల, సన్యాసుల, అను
చరుల, శిష్యులతో పరివేష్టితమై వుండేది. ఆయన తన అనుచరులతో

ఒక సంఘం ఏర్పాటు చేశాడు. అందు అందరికీ ప్రవేశ అర్హత కల్పించాడు. తల్లి—తండ్రి లేక, పోషకుల, సంరక్షకుల అనుమతి లేకుండా చిన్నవారికి దీక్ష ఇచ్చేవాడు కాదు. సంఘం సక్రమంగా నడవడానికి కొన్ని నియమాలు పెట్టాడు. తన వారసులుగా సంఘ సభ్యులెవరినీ బుద్ధుడు నియమించలేదు. భిక్షువు అయినవాడు నిగర్వం, నిరహంకారం, నిర్మమత అలవరచుకోవాలి. భిక్షు—భిక్షుణీ గణానికి బుద్ధుడు సత్ప్రవర్తనతో కూడిన సేవా ధర్మం బోధించాడు. నిరాడంబర జీవితం గడిపి, ఆరామాల్లో సమానత్వం పాటించి సహ జీవనం గడపమన్నాడు. వారు పాటించవలసిన నియమాలు బ్రహ్మ చర్యం, అస్తేయం కూడదు, ప్రగల్భాలు పలకరాదు, హింసకూడదు, ఆస్తి వుండకూడదు. ఏక భుక్తం, చేతికర్ర, భిక్షాపాత్ర, క్షురకత్తి, మూడు వస్త్రాలు మాత్రమే వుండాలి. ఆరామాలు ఏర్పడే వరకు, భిక్షువులు, అనుచరులు చెట్లకింద, మండపాల్లో నిద్రించేవారు. ఇంటిం టికీ భిక్షకు వెళ్ళేవారు. భిక్షువుకు పాపం, దైవం, ఆత్మవంటివి లేవు.

కులం, సంపద, వ్యక్తిగత ఇష్టా ఇష్టాలు ఏమీ లేకుండా నిజా యితీగా, ధర్మంగా జీవించాలి. అటువంటి భిక్షువులను ఉద్దేశించి "లోకంలోకి వెళ్ళి, ధర్మం బోధించండి. దివ్యజీవనాన్ని ప్రకటిం చండి. ధర్మదీక్ష ఇవ్వండి. దయామయులై—ధర్మ జీవనం గడపండి" అన్నాడు. అని, "గురువో, గ్రంధమో, మతమో, మహాత్ముడో— ఎవరో ఏదో చెప్పారని అంగీకరించి, ఆమోదించి తీసుకుని అనుస రించకండి. ఏదీ భావించి, ఊహించి అనుకూలంగా, ఆచరణ్యంగా వుందని ఒప్పుకోకండి. అంతరంగాన్ని స్వానుభవంతో నడచుకోండి. అంతర్వాణి మాట తు. చ. తప్పకుండా పాటించండి" అని హితవు చెప్పేవాడు.

సంఘంలో అందరూ సమానులే. స్త్రీలకు కూడా అవకాశం కల్పించడంతో—రాకుమార్తెలు, పెద్దింటి స్త్రీలు, విధవలు, దుఃఖితు లైన తల్లులు, సాధారణ గృహిణులు, అనాధలు— ఎందరో చేరి

ధర్మం అనుష్ఠించి, అర్హతపొంది, నిర్వాణపథాన్ని చేరుకున్నవారూ వున్నారు. భిక్షువు, సన్యాసినుంచి భిన్నం. భిక్షువు గృహాన్ని మాత్రమే వదులుతాడు. సన్యాసి సర్వం పరిత్యజిస్తాడు. తప్పు చేస్తే భిక్షువుకు శిక్ష వుంది. సన్యాసికి శిక్షలేదు. భిక్షువు త్రిశరణాలైన— "బుద్ధం శరణం గచ్ఛామి — ధర్మం శరణం గచ్ఛామి — సంఘం శరణం గచ్ఛామి" అంటూ శరణుజొచ్చుతాడు. సన్యాసికి బ్రహ్మమే శరణ్యం. భిక్షువుకు, శీలం ప్రధానం.

సారిపుత్త, మొగ్గల్లానాల వంటివారికి సంఘంలో సముచిత స్థానం ఇచ్చినట్లే, ఖేమా—ఉత్పలవర్ణ వంటి స్త్రీలను ప్రధాన శిష్యురాండ్రుగా చేశాడు. సంఘంలో స్త్రీల కోసం ఒక ప్రత్యేక వ్యవస్థను రూపొందించి, అవసరమైన నిబంధనలను ఏర్పాటుచేసి, గౌరవ స్థానాన్ని కల్పించాడు. అంబాపాలివంటివారికి కూడా సమానావకాశాలు కల్పించి, సంఘానికి పెద్దచేశాడు. సునీతుడు అనే పాకీవానిని అర్హతుడుగా చేసి, సంఘంలో ఉన్నత స్థానం కల్పించాడు. గజదొంగ — హంతకుడు అయిన అంగుళీమాలుని మహాయోగిగా మార్చాడు. దుఃఖ నివృత్తి సాధనా యత్నంలో, స్త్రీలు, పురుషులు, అన్ని తెగల, వర్గాల, వర్ణాలవారు— అందరూ సమానులే అన్నాడు బుద్ధుడు.

"అంతర చైతన్యం ద్వారా ఆధ్యాత్మిక—ఆది భౌతిక — ఆది దైవిక బాధల్ని పూర్తిగా తొలగించుట నిర్వాణం. పాపం చెయ్యక పోవుటే, పుణ్యం. ప్రార్థనలు, యజ్ఞయాగాది క్రతువులు, నిష్ప్రయోజనాలు. అవి—అవతలి ఒడ్డును — ఇవతలకు తీసుకురాలేవు. సద్గుణాలు కలిగివుంటే చాలు. ఇతరుల మాటకో-భావానికో— అభిప్రాయానికో—దేనికో ఒకదానికి నువ్వుకోప్పడి, బాధపడితే— అది నీ దుర్బలత్వం. వారు మనసుతో గాక, స్వేచ్ఛగా—అనాలోచితంగా అనినా, చేసినా—నువ్వు దానికి ప్రతి స్పందించి—ప్రతి క్రియ చేయడం అది నీ మనోదాస్యం. అది తగదు" అని హితవు చెప్పేవాడు బుద్ధుడు.

*　　　*　　　*

బోధి వృక్షం క్రింద సిద్ధార్థుడు పొందినస్థితి - అది - లో దృష్టి కలవారికి మాత్రమే తెలియగలదు. సత్యసందర్శనా నంతరం ఆయనలో ప్రేమ - దయ - జాలి - కరుణ - సమాన త్వం వంటి గుణాలు మిగిలివుండటంతో, "చెప్పడానికి ఎంతో వుంది" అని అనుకుని దేశాలు తిరిగి ధర్మం బోధించాడు బుద్ధుడు. కాని, జ్ఞాన మార్గంలో, కడపటిదైన "శూన్యత" అనేది ఒకటి వుంది. అంటే, "నేను" అనేది లేనిస్థితి. ఆ స్థితిలో అహంకారం, వ్యక్తిత్వం-గతం ఏమీలేవు; వుండవు. ఆ స్థితికి బుద్ధుడు ఆత్మసాక్షాత్కారం- ఈశ్వర దర్శనం-సత్యసందర్శనం-వంటి మాటలు ఉపయోగించ లేదు. తన మనుగడకోసం, ఘనతకోసం మనసు తనకు అనుకూల మైనమాటల్ని ఉపయోగించుకుంటుంది. ఏదైనా పొందాలనుకున్నా-పొందేమనుకున్నా అందు "నేను" అనేది వుండనేవుంటుంది. కనుక ఆస్థితిని-"నిలువునా వెలుగుతున్న కొవ్వొత్తిని ఒక్కసారిగా ఊదిఆర్పెయ్యడం వంటిది," అన్నాడు బుద్ధుడు. వెలుగుతున్న కొవ్వొత్తికి ఒకరు ఎరుకలో వున్నారంటే- "నేను" అనే వ్యక్తిత్వ భావం వున్నట్లేకదా? అది కూడా పోతే, ఇంకమిగిలేది శూన్యం. రంగుల దీపాలన్నీ పూర్తిగా-ఒక్కసారిగా ఆరిపోయిన తర్వాతే, రంగస్థలం రాణిస్తుంది. వెండికటి కవ్వల ప్రకాశ్యతిలో వెలిగే-వెలుగే-నిర్వాణం. అటువంటిస్థితిలో బుద్ధుడు నిలిచినా, అతనితో ఇంకా ప్రేమ-దయ-కరుణ-జాలి వంటి గుణాలు మిగలడంతో - ధర్మావేశాన్ని ప్రకటించే మహత్తరమైనమౌనం-చైతన్యరూపం దాల్చింది. అంటే, కరుణ యొక్క ఉత్కృష్టమైన, ఉన్నతమైన రూపమే, మౌనం. అది సనాతన స్వరూపం. అది - అహం వృత్తి ఉపయించ నట్టి స్థితి. మౌనం, అద్భుతశక్తికల కర్మయోగం. అదే అత్యుత్తమ మైన, ఆధ్యాత్మికోపదేశం. అది-నిరంతర భాషణ. కనుక, మహాత్ములందరి మాదిరిగానే, బుద్ధునిలోంచి కూడా, మాటలు వెలు

వచ్చాయి. ఆ సందర్భంలో "అందరూ దుఃఖవిముఖులైతే తప్ప, తాను దుఃఖ విముక్తుణ్ణి అనుకోను." అన్న బుద్ధుని మాటను ఆధారంగా తీసుకుని, "బహుజన హితాయ - బహుజన సుఖాయ" అనే ధర్మసూత్రాన్ని ప్రతి పాదించింది, బౌద్ధం. మానసిక ప్రశాంతత పొందుటే, ప్రతి ఒక్కరి లక్ష్యం. అదే నిర్వాణం. బాహ్య జగత్తుకు సంబంధించిన కర్మలు ఆచరిస్తూ, బహుజన హితం - సుఖంకోరి- అష్టాంగ మార్గం అనుసరించి - నిర్వాణం కొరకు కృషి చేయడం బౌద్ధుల ధర్మం.

బుద్ధుని శాంతం - నిర్మలత్వం, సూక్ష్మమైన మేధాశక్తి, విస్తారమైన లోక దృష్టి, సహజ విజ్ఞానం, వివేకం, కేంద్రీకృత ఆలోచనా విధానం, స్వేచ్ఛనివ్వని వాటి నుంచి దూరంగా తొలగే స్వభావంతో మనుష్యుల గుణ- గణాల్ని-స్వభావాల్ని నిశితంగా పరిశీలించి, పరీక్షించి, పరిశోధించి సామాన్య ప్రజలకు సహితం సుభంగా గ్రాహ్యమయ్యేవాడుక భాష పాలిబాషలో నిత్యజీవిత సత్యాల్ని - ధర్మాల్ని చిన్న చిన్న కథలుగా అర్థయుక్తమైన మాటలతో, భావగంభీరమైన విషయాలు చెప్పారేకాని; తానొక గురువుగా నిలవలేదు. తాను చెప్పే సంగతుల్ని "స్వానుభవంతో చెప్పుతున్నాను" అన్నారేకాని, మర్మయోగిగా మాట్లాడలేదు. తాత్త్వికం - ఆధ్యాత్మికం అంటూ సూత్రాల్ని - పద్ధతుల్ని ప్రోత్స హించలేదు. శుష్క - తర్క మీ మాంసాదులతో కాలం వృథా చేయలేదు. ఆయనకు కాలం, ముఖ్యం. గతమంటే వెనుక ఏ గుర్తూ వదలని ఒక కల - వర్తమానం, ఆ క్షణంలో మెరిసే ఒక మెరుపు - భవిష్యత్తు, నిర్మల నీలా కాశంలో ఆకస్మాత్తుగా మబ్బులు ఎట్లాకూడతాయో అట్లా ముందుగా ఏమీ తెలియనిస్థితి," అనేది బుద్ధుని అభిప్రాయం.

తనను ఒక గురువుగాగాని, ప్రత్యేక వ్యక్తిగాగాని ఎప్పుడూ ఎవరినీ, దేనికీ చూడనిచ్చేవారు కాదు. గురు వచనమే గురువుకాని,

దేహం గురువుకాదని, పదే-పదే చెప్పేవారు-తన బోధల్ని గొప్ప చేయడంకన్నా, ఎవరికి వారు తాము విశాలంగా ఎదగడం ముఖ్య మనేవారు. తనను అనుసరించేవారు, విముక్తి కోసం చూచుకోవాలి గాని, ప్రపంచం నుంచి పలాయనం కాకూడదు. అంతకన్నా, అణ గారిన వారితో చేతులు కలిపి-ప్రజలందరి విమోచన కోసం పాటు పడటం మంచిదనేవారు.

గౌతమబుద్ధుడు గొప్ప శక్తి సామర్థ్యాలుకల వ్యక్తి అయినప్ప టికీ, ఎప్పుడూ మానవాతీతుడుగా మాట్లాడలేదు, ప్రవర్తించలేదు. చాలా వివేకవంతంగా మసులుకున్నాడు. బాహ్య ప్రమాణాలకు లోబడక, స్వబుద్ధితో సకల విషయాల్ని విచారించి, విచక్షణతో నిర్ణ యం తీసుకునేవాడు. చాలా వరకు మౌనంగా వుండేవాడు. అటు వంటి సద్గురువు అరుదుగా అవతరిస్తాడు. ఆయన అవతరణతో ఈ భూమిమీద గొప్ప శాంతి, కాంతి ఏర్పడ్డాయి. ఆయన ఒక జ్ఞాన జ్యోతి.

మనలో వెలిగే అంతర జ్యోతే జ్ఞానం. మనసుకు అవగతమై నదే, జ్ఞానం. ఆ జ్ఞాన జ్యోతిని, ఎవరికి వారు దర్శించడమే, అంతిమ సత్యం. అటువంటి జ్ఞానాన్ని ఒకరు ఇంకొకరికి ఇవ్వలేరు, చూప లేరు. దానికోసం ఎక్కడెక్కడో వెదకనవసరం లేదు. ఎవరినీ అనుసరించనవసరం లేదు. ఏదీ ఆచరించవలసిన పనిలేదు. దేన్ని అర్థించవలసిన అవసరం లేదు. "ఒక్క శీలవంతునికే అటువంటి జ్ఞానం అబ్బుతుంది" అంటాడు బుద్ధుడు.

బుద్ధుని బోధలో "శీలం" ముఖ్యం. ఆ శీలం—ప్రజ్ఞ, న్యాయం. ధర్మంతో నిండి వుంది. జ్ఞానమే సర్వస్వమైనా—శీలంలేని జ్ఞానం, వ్యర్థం. ఆచరణ ధర్మం, శీలమైతే — విచారణ ధర్మం, ప్రజ్ఞ, "ప్రజ్ఞ" అంటే, అవగాహన. కాని, కరుణలేని శీలం, ప్రజ్ఞ విలువ లేనివి. "కరుణ" అంటే ప్రేమ ప్రజ్ఞ-కరుణలతోకూడిన ధర్మాన్నే బుద్ధుడు బోధించాడు.

సత్యాన్వేషణలో సిద్ధాంతాలకు, శాస్త్రాలకు, పురాణాలకు, యజ్ఞయాగాది క్రతువులకు-దేనికీ చోటులేదు. నిశ్చల మనస్సు కల వారు ధ్యానంలో దర్శించినదాన్నే, జ్ఞాని-సమస్త చరాచరంలో దర్శిస్తాడు. జ్ఞాని నిత్యయోగి. యోగమంటే, దుఃఖంవల్ల చలించని స్థితి. అటువంటి యోగి హృదయంలో ప్రేమ-వైరాగ్యం ఏకమై వుంటాయి. కనుక "అసలు వున్నది ఒక్కటే సత్యం" అనే స్థిర భావంతో వుంటారు జ్ఞానులు. కాని సామాన్యుల మనో దర్పణంలో ఆ సత్యం అనేక విధాల ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిరూపాలే-లోకంలో సమస్త చరాచరాలు. అందుచేత ఈ విశ్వం-అది జగత్తు కాని, ఉత్త అవ్యక్త స్థితి కాదు. అంటే అది COSMOS కాని, వుత్త CHAOS కాదు.

అటువంటి జ్ఞాన మార్గాన నడచి, అందర్నీ నడపాలనుకునే వాళ్ళను బోధిసత్వులంటారు. బుద్ధుడు ప్రజలకు జనన-మరణ వలయం నుంచి తప్పించుకుని సుఖంగా, శాంతిగా బ్రతికే మార్గం చూపాడు. అదే అష్టాంగ మార్గం. తద్వారా దివ్యజీవనం సాధ్య మన్నాడు బుద్ధుడు.

★ ★ ★

"బుద్ధుడు ఒక దివ్యబోధకుడుగా, ధర్మమూర్తిగా, సర్వసంగ పరిత్యాగిగా మనం ఆయన్ని గౌరవించగలమేకాని, ఆయన అందర్నీ అన్నింటినీ మించిన పరిపూర్ణ శ్రేష్ఠ మానవుడు, "అంటే ఎట్లా?" అని ఎవరైనా అంటే-అవును-ఆయన అఖండ సత్తా స్వరూపుడు, సత్యధర్మ-ప్రచారకుడు, అంతశ్శత్రు వర్గాన్ని జయించినవాడు—లోకారాధ్యుడు-పరతత్వానుభవం కలవాడు — అత్యుత్తమ తేజో వంతుడు సర్వగుణశోభితుడు-దశబల సంపన్నుడు- భయంకరమైన భవసాగరాన్ని అవలీలగా దాటినవాడు— "నేను-నాది" అనే భావంలేనివాడు-దుఃఖ నివృత్తి మార్గాన్ని చూపి, శాశ్వత చైత

న్యాన్ని కలిగించి-అఖండ జ్ఞానజ్యోతిని వెలిగించి-సర్వోత్కృష్టమైన సత్యాన్ని ప్రసాదించినవాడు-అవధులులేని అపార దయాదృష్టి కల వాడు" అనడంలో అతిశయోక్తి ఏమీలేదు. ఆయన బోధలోని నీతి విశిష్టమైనది, ఉత్తమమైనది. మనిషికి-మనిషికి మధ్య కల సంబంధం, సదవగాహన నీతి సంబంధమైనదిగా వుండవలెనంటాడు. "నీతి" అనేది నిత్య జీవితానికి సంబంధించింది కనుక-అది వాస్తవమైనది; ఆచరణీయమైనది. ఆ నీతే, ధర్మం. ధర్మమే నీతి. అటువంటి ధర్మ స్థాపన-ధర్మ నిరూపణ- ధర్మాచరణ-ధర్మప్రచారమే బుద్ధుని పూర్ణ రూపంగా ద్యోతకమౌతుంది. నీతి లేకపోతే, ధర్మంలేదు. అందుకే బుద్ధుడు శీల నిర్మాణానికి విశేష ప్రాధాన్యం ఇచ్చాడు.

సంశయచ్ఛేదమొనర్చే ధర్మపదమును బోధించడంతో, శోకానలంగా కనుపించే మానవ హృదయంలో ధర్మపదం వసంతో దయచ్ఛాయగా వెలుగొందింది. ఆ ధర్మం-నూతన ప్రపంచ ద్వారాలు తెరిచింది. చంద్రోదయానంతరం సమస్త తాపాలు ఉపశమించునట్లు, భయంకరమైన కామ-భవ- అవిద్యా-తృష్ణల నుంచి ఆయన బోధ, విముక్తి దరుస్తుంది. అంటే, పునర్జన్మకారిణియైన తృష్ణ నశించిపోతుంది.

ధర్మ శబ్దం విపులార్థం కలది. అది గంభీరమైనది. దాన్ని అర్థం చేసుకోవడం, అనుభవంలోకి తెచ్చుకోవడం చాలా కష్టం. కేవలం భాషా పాండిత్యం వల్ల అది తెలిసే సంగతికాదు. అచంచలమైన ధర్మ నిష్ఠ-ధర్మ నిరతి-సత్యవంతమైన, నిర్మలమైన అంతరంగం-సాత్విక ప్రవృత్తి-శమం, దమం-భూతదయ దానికి అవసరం. అప్పుడే ధర్మ స్వరూపాన్ని దర్శించగలరు. "శమం" అంటే అంతరింద్రియ నిగ్రహం. "దమం" అంటే, బాహ్యేంద్రియ నిగ్రహము. అలాగే, వైరాగ్య భావంతో ఓర్పు-నమ్రత గలవాడే అటువంటి ధర్మాన్ని ఆచరించగలడు.

ధర్మమంటే, క్రమశిక్షణ అని కూడా అర్థం. ఆ క్రమశిక్షణను తెలుసుకోవడంలో-దాన్ని పాటించడంలో శక్తి-నిష్ఠ-సామర్థ్యం—ఆసక్తి వుండాలి. ఆ సంపర్కంలో గత దురభిమానాల్ని వదలుకోవడం, మనసును గతం నుంచి పక్కకు తొలగించడం, దృష్టిని మహోన్నతం వైపుకు మరల్చి కదలడం. అటువంటివారే సత్యాన్ని తెలుసుకోగలరు. అదే ధర్మం అంటే, ధర్మమే-సత్యం అదే శాశ్వత ధామం. శాశ్వత పథం. ధర్మం, ఆకాశం వంటిది. దాని ఉత్కృష్ట గుణాలు, భూతదయ-విశ్వ ప్రేమ-సత్యం- అహింస- సమత్వం మొదలైనవి.

అటువంటి ధర్మం నేటికీ సజీవంగా నిలవడానికి కారణాలు—బుద్ధుడు చూపిన ప్రేమ, దయ, జాలి, కరుణ, వాత్సల్యం- సమత్వం. వాటికితోడు, ఆయన వ్యక్తిత్వం- సచ్ఛీలం-నడవడి-ఆ ధర్మం ఏ కాలానికీ, ఏ దేశానికీ, ఏ జాతికీ- సాంప్రదాయానికీ, మతానికీ, సిద్ధాంతానికీ- ఏ ఒక్కదానికీ చెందింది కాదు. అది సర్వజనీనమైన-సర్వకాలీనమైన ధర్మం.

జ్ఞాని, జీవన్ముక్తుడు-సత్యానుభూతి పొందిన బుద్ధుడు సదా కార్య నిమగ్నుడై జీవించాడు, లోక కళ్యాణకరములైన కార్యాలే చేపట్టాడు. స్వస్తి వాచకాలే ఉచ్చరించాడు. సర్వజీవకోటి శుభం కోరాడు. మహా మౌనంలో మునిగి జీవించాడు. మానవ జాతికి మంగళా శాసనంగా వర్తించాడు.

ఆయన విశుద్ధ సిద్ధాంత బీజాలు, శాఖోపశాఖలై, నేడు ప్రపంచమంతా వ్యాపించాయి. ఆయన అనాడు వెలిగించిన జ్ఞాన జ్యోతి, ఆరిపోకుండా—నిలిచి-దేదీప్యమానంగా నేటికీ వెలగడానికి కారణం-ఆ ధర్మమే. పెను తుఫానులు కూడా దాన్ని ఆర్పేయలేకపోయాయి. అందుచేతనే ఆయన నామం కూడా ఇన్నేళ్ళయినా మరుగున పడలేదు. ఈనాటి ఘోర కలికి బుద్ధుని ధర్మమొక్కటే శరణ్యం.

* * *

బుద్ధుడు ఒక చైతన్య సాధకుడు. నిత్యజీవితానికి సంబంధించినవే బోధించాడు. ఆబోధ, తార్కికం, హేతుబద్ధం, వాస్తవం, అందుకే ఆయన్ని "నిరీశ్వరవాది," అన్నారు. మానవ సంక్షేమానికి ఉపయోగపడని ఎటువంటి విషయాన్ని ఆయన చర్చించలేదు, బోధించలేదు. మనసు- వాక్కు - దృష్టి దేనిని చేరలేవో - దాన్ని వర్ణించడం కష్టం. ఏది అనిర్వచనీయమో దాని గూర్చి మౌనమే శరణ్యం. మౌన భాష ఒక్కటే అవ్యక్తాన్ని వ్యక్త పరచ గలదు.

సత్కర్మాచరణ ద్వారా తనను తాను అర్పించుకుని - కోపాన్ని, కసిని, పగను, ద్వేషాన్ని జయించిన వారిలోనే కరుణ- దయ - ప్రేమ వుంటాయి. గతంనుంచి ఉత్పన్నమయ్యేదే, ద్వేషం, భూత, భవిష్యత్తుల్లో లేనిది ప్రేమ, కాంతి, చీకటిని తరుమునట్లు. ప్రేమ, ద్వేషాన్ని తరుముతుంది. కాబట్టి మనకు కావలసింది - దీపం. దీపాన్ని తీసుకుని గదిలోకి వెడితే, చీకటి పోతుంది. గదిలో దీపాన్ని ఆర్పేసినా, గదిలోంచి దీపాన్ని తీసేసినా - గది మళ్ళా చీకటి కూపం అవుతుంది. మది విషయమూ అంతే! మనకు ఉన్నది ఆ దీపం ఒక్కటే, లేని చీకటిని, ఉన్నదనుకుని వృధాగా దాన్ని తరుము తాము. అదే చాలా మందిచేసేపని ఆ పనికి ఎన్నో పెద్ద పెద్ద పేర్లు - మనం చేయవలసింది - ఉన్న దీపాన్ని ఉపయోగించు కోవడం. ఆ దీపకాంతికి సదా ఎరుకలో వుండి - చురుకుగా, వేగంగా, నిశ్చలంగా, నిర్మలంగా, నిశ్శబ్దంగా, నిర్భయంగా, మౌనంగా, అనాలోచితంగా, మెలకువగా ముందుకు సాగాలి. అటువంటి శుద్ధప్రేమే, బుద్ధుని శక్తి. ఆ శక్తితో ఒక సంఘం స్థాపించి, దానికి సద్ధర్మం బోధించి, ప్రజలలో పరివర్తనం తీసుకొచ్చిన మహానుభావుడు, బుద్ధుడు. ఈ విషయంలో సాధకుడు ఒక సంగతి దృష్టిలో పెట్టుకోవలసి వుంటుంది - తరచుగా మేధకూ - హృదయానికి మధ్య ఘర్షణ జరుగుతుంది. తత్ఫలితంగా సద్ధర్మం మరచి

పోయే పొరపాటు జరుగుతుంది. సత్యజ్ఞానం లేని వానికి శరీరం - శాంతిలేని వానికి మనస్సు - అవివేకికి శాస్త్రం - భారమైనట్లు - సద్ధర్మం ఎరుగని వానికి, లేదా - దాన్ని మరచినవానికి - జీవితం భారం - దుర్భరం అవుతుంది.

బుద్ధుని బోధ నీతి సంబంధమైన ఋజువర్తన కలది. భౌతిక, నైతిక, ఆధ్యాత్మిక సత్యాల్ని అవగాహన చేసుకోవడం - వాటిని ఆచరణలో పెట్టడం - బౌద్ధ ధర్మంలో విశేషం. అన్నీ పరీక్షించి, పరిశీలించి, పరిశోధించిన తర్వాత తనను తాను తెలుసుకో మంటుంది, బౌద్ధం హేతువాదంతో ప్రారంభం కావడంతో అందు అంధ విశ్వాసానికి తావులేదు. ప్రతిదానికి కారణం తెలుసుకుని, సమగ్రంగా అవగాహన చేసుకునే విధానం కనుక, దాన్ని "నివృత్తి పథం" అన్నారు. బౌద్ధంలో ఒక్క తనకు తప్ప భగవంతునికి - దేవతలకు - మహిమలకు - నమ్మకానికి - దేనికి చోటు లేదు.

"బుద్ధత్వమనేది అందరిలో నిబిడీకృతమై వుంది కనుక, అందరూ బుద్ధులే," అంటూ జీవితానికి ఒక గొప్ప నిర్వచనం, విలువా ఇచ్చాడు బుద్ధుడు. జీవితం - ఒక ఖైదుకాదు. అది శిక్షకాదు. అది - ఒక ప్రతిఫలం. కనుక, నిష్కళంకమైన జీవితం గడపమనీ, అజ్ఞాన నివృత్తి చేసుకోమనీ చెప్పే ధర్మమే, బౌద్ధ ధర్మం. అదే ధర్మపదం. అదే సత్యమార్గం. అదే బౌద్ధమతం.

ప్రతి బౌద్ధ భిక్షువూ తన బుద్ధిని ఉపయోగించి, హేతువాద భావనా దృష్టిని పెంచుకుని, తానూ బుద్ధుడు కావాలని త్రిశరణా లను - త్రిరత్నాలను శరణుజొచ్చుతాడు. అతనికి కర్మవిషయమై - ఒక నిర్దిష్టమైన, నిశ్చయమైన, స్వచ్ఛమైన భావంవుంది — కర్మే నన్ను గర్భాన ధరించింది. కర్మే; నా జాతి. కర్మే నాకు శరణ్యం, అనే నిర్ణయంతో వుంటాడు. అందుచేత అతను త్రిశరణ శుద్ధిగా చేసే ప్రతి కర్మా, అతను ధర్మంగా చేస్తాడు. కనుక - తాను

చేసిన పనికి తానే బాధ్యుడననీ గుర్తించి, సమస్తాన్నీ సృష్టించేది తానే నని తెలుసుకుంటాడు.

*　　*　　*

స్వామి వివేకానంద బుద్ధగయ వెళ్ళి—తిరిగి వచ్చి— రామకృష్ణ పరమహంసతో, "బుద్ధుడు తానేం తెలుసుకున్నాడో దాన్ని చెప్పలేకపోయాడు" అన్నాడు. దానికి గురుదేవులు— "బుద్ధుడు నాస్తికుడు కాదు. తన అనుభవాన్ని మాటల్లో చెప్పలేకపోయాడు. అంతే!" అన్నాడు.

అనుభవాన్ని మాటల్లో పెడితే, అది జ్ఞాపకమైపోతుంది. జ్ఞాపకమంటే, కొన్ని మాటల మూట. అదొక తెర. మాట వర్తమాన జీవితంలో సమస్యకు సవాలుకు—సమాధానం ఇవ్వడానికే పనికివస్తుంది. జ్ఞాపకంలో వున్న మాటలు బైటికి వస్తాయి ఆ క్షణంలో. అనుభవ కాలంలో అనుభవించువాడు వుండడు కనుక గుర్తు పెట్టుకుని చెప్పడానికి వుండడు.

బుద్ధుడు తత్వవేత్త—వేదాంతీకాడు. ఒక చక్కని ఆధ్యాత్మిక మార్గాన్ని కనుక్కున్న మహాత్ముడు. ఆయన మానవతావాది. ఆయన బోధలో నిత్యజీవితం-అదీ ఆ క్షణం-ముఖ్యం. సత్యాన్వేషణలో సాధకునికి ఆ క్షణంలో సూటిగా సహాయపడు చే, ఆయన ముఖ్యోద్దేశ్యం. కాని, ఆత్మ-దైవం గురించిన చర్చ-శుష్కతర్కం— ఆయన అభిమతం కాదు. ఆ తర్కం, వ్యర్థమన్నాడు. "విషపూరితబాణం గుచ్చుకున్నప్పుడు, వెంటనే దాన్ని బైటికితీసే నివారణోపాయాన్ని వెతుక్కోవాలిగాని, అది ఏ రకం బాణం- దాన్ని ఏ లోహంతో తయారుచేశారు-దాన్ని ఏ కులస్థుడు, ఏ మతస్థుడు విడిచాడు. అది ఎటువంటి విషం? అనికాదు; ఆ క్షణంలో చూడవలసింది. అలాగే నిత్య జీవితంలో విషతుల్యమైన, ప్రమాదకరమైన జటిలమైన, భయంకరమైన సమస్య ఎదురైనప్పుడు- అప్పుడు దాని గతం గురించీ-

భవిష్యత్ గురించి యోచించక, తక్షణ తరుణోపాయం చూడాల న్నాడు బుద్ధుడు. అంతేకాని, ఇంకెటువంటి ఆలోచనా విధానానికి చోటు ఇవ్వలేదు. అలాగే దైవం గురించి ప్రశ్నించినా, సమాధానం చెప్పకుండా మౌనంగా వుండటంతో ఆయన్ని "నాస్తికుడు" అన్నారు.

విజ్ఞానం పరిమితమైతే, దైవం గురించిన విజ్ఞానంకూడా అట్టిదే అవుతుంది. "దైవం" అనే పదాన్ని అపార్థంచేసుకుని, తప్పుగానే ఉపయోగిస్తున్నారు. "దైవం" ఒక ఉనికేగాని, ఒక మూర్తికాదు. దైవం అనే పదం ఉపయోగించవలసివస్తే, బుద్ధుడు దానికి "ధర్మం" అనే మాట ఉపయోగించాడనిపిస్తుంది. అంత మాత్రంచేత ఆయన శూన్యవాది - నాస్తికుడుకాదు. ఆయన్ని అలా అనడం తప్పు - పొరపాటు అవుతుందేమో!

అవాఙ్మానస గోచరుడు, విశ్వంభరుడు, అగు ఈశ్వరుడు ఒకడు వున్నాడు—అన్నప్పుడు, బుద్ధుడు మౌనం వహించాడు. సనాతన ఆర్షధర్మంలోని ఆలోచనా భాగాన్ని ఉపేక్షించి, ఆచరణ భాగాన్నే బుద్ధుడు గ్రహించాడనిపిస్తుంది. అందుచేతనే ఆయన శీలానికి అధిక ప్రాధాన్యం ఇచ్చాడు. అంతుపట్టని ఆలోచనలకు అవకాశంగా వున్న శాశ్వతాత్మ - విశ్వేశ్వరుడు మొదలైన వాటి గురించీ బుద్ధుడు పట్టించుకోలేదు. ఈ విశ్వం యొక్క స్థితి తెలుసు కోవడానికి కార్య-కారణ సిద్ధాంతం ఒక్కటిచాలు అన్నాడేకాని, తాను దేవుని కుమారుణ్ణి అనిగాని - దేవునిచే పంపబడ్డ దేవదూత ననిగాని అనలేదు. పైగా-నేను శుద్ధోధన మహారాజు కుమారుడను. నేనూ మీ వంటి వాడినే అన్నాడు. కనీసం తానొక అతీతవ్యక్తినని కూడా అనలేదు.

మతాధిపతులు, మేధావంతులు, బోధకులు, గురువులు, గ్రంథాలు "దైవం" అనేది ఒకటి వుందని వర్ణించి చెప్పాయి. ఆ వర్ణనానుసారం, మనిషి ఒక రూపాన్ని ఊహించి, దానికో పేరు

పెట్టాడు. నిజం చెప్పాలంటే, ఆ రూపం, ఆనామం, ఆవర్ణనా "దైవం" కాదు. అవిద్య- అంధత్వంవల్ల ఒక పద్ధతిని, ఒక సిద్ధాంతాన్ని, దైవాన్ని ఆశ్రయిస్తారు, ప్రజలు. వారు ఆ దైవం శరణుజొచ్చి, ఆయనతో బేరాలాడతారు. దైవం, మనిషికి పెద్దరక్షణ. అందుకే దానికి అనేక గొప్పశక్తులు అంటకట్టాడు. ఆలోచన-తాను అందుకోలేనిదాన్ని, దైవం అంటుంది. కాని, మనసు కల్పించేది సృష్టించేది మాత్రం దైవంకాదు. దైవాన్ని తెలుసుకోవాలంటే, మనసుపూర్తి నిశ్చలమైపోవాలి. మనోసృష్టి అయిన దైవం-దాని ఆరాధన, తనను ఆరాధించుకోవడమే అవుతుంది.

"సృష్టికి కారణం భగవంతుడని నిర్ధారణ చేసి చెప్పడానికి ఆధారంలేదు. "వాస్తవం" అని ఒక దాన్ని నమ్మేందుకు రుజువు వుండాలి," అన్నాడు కపిలుడు. "తెలుసుకోవడానికి అసాధ్యమైన నిర్గుణ - నిరాకార పరబ్రహ్మంకంటే, తేలికగా బోధపడు సగుణ - సాకార దైవంమేలు," అని కొందరంటే, దేవుని ఉనికికి హేతుబద్ధమైన ఎటువంటి ఆధారంలేదు కనుక - దైవం - పరలోకం - పునర్జన్మ - మొదలైన వాటిని పిరికితనం, మనోదౌర్బల్యంగా జమకట్టారు చార్వాకులు.

కాలడిలో జన్మించిన ఆదిశంకరులు, చిన్ననాడే సమస్త శాస్త్రాలూ అధ్యయనం చేసి, నిర్గుణ తత్వం బోధించాడు. అన్నిటికన్నా ధ్యానం ముఖ్యమన్నాడు. అని, "జీవుడు, బ్రహ్మం కంటె వేరుకాదు. జీవుడూ, బ్రహ్మమే," అన్నాడు. అతని బోధ విన్నవారు, "ఈశ్వరుడు లేని చేదు జీవితం కన్నా, భయంకరమైన మృత్యువు నయం," అన్నారు కొందరు.

అటువంటి తీవ్రవాద ధోరణి ఆధారంగా ఆ తర్వాత కాలంలో అనేకమంది మేధావులలో కొన్ని భావాలు, అభిప్రాయాలు, విశ్వాసాలు, సిద్ధాంతాలు, పద్ధతులు బుద్ధుని పరంగా చోటు చేసుకున్నాయి. ఈశ్వరుని అస్థిత్వాన్ని విశ్వసించక పోయేటప్పటికి, వైదికమత సిద్ధాంతం పూర్తిగా పునాదులతో సహా, కదిలిపోయింది

సనాతనత్వం యొక్క సంకుచితత్వం, బట్టబయలు అయింది. ఛాందసులకు, అది సహించరానిది అయింది. పూర్వాచార పరాయణులకు సాంప్రదాయ వాదులకు అది భరించరానిది అయింది.

సత్యాన్వేషకుడైన బుద్ధునికి సత్యమే, సత్ప్రవర్తనే దైవంగా తోచింది అనిపిస్తుంది. అవే, నిర్వాణ హేతువులని ఆయన భావన. ఆ కారణానికే ఆయన్ని నాస్తికుడనుట విమర్శకుల దృష్టిదోషమే కావచ్చు. ఆయన భగవంతుని ఉనికి, అస్తిత్వం విషయం ప్రస్తావించక — మౌనం వహించారేకాని, భగవంతుని నిర్వసించలేదు— వ్యతిరేకించనూ లేదు. ఆయన అహంకారానికి వ్యతిరేకి, అహంకారం, మనిషి మనోతటాకంలో ఒకనీడ మాత్రమే. ఆ అహంకారమే, వ్యక్తిత్వం. ఆ అహంకారాన్ని వదలమంటారు విజ్ఞులు. మనం వున్నంత కాలం ఆ నీడా వుంటుంది. దాన్ని మనం ఎన్నటికీ వదలలేము, తరమలేము. దాని, ఆధారం తొలగితే, అదే తొలగుతుంది. అంటే, మనం తొలగాలి. మన వ్యక్తిత్వం తొలగాలి. మనలో అంతర్వీక్షణ తీవ్రంగా సాగేకొద్దీ — అంటే — మనం లో లోపలకు వెళ్ళేకొద్దీ — విచారణ సాగేకొద్దీ — ఎరుకలో స్థిరంగా నిలిచేకొద్దీ — అహం కారం కరగడం, తరగడం ఆరంభిస్తుంది.

"దైవం" అనేది ఆ క్షణంలో ఒక అంపమైన — నిజమైన- వాస్తవమైన — యదార్థమైన — సత్యమైన భావన, ఊహ, కల్పన, సంకల్పం వంటిది. దైవానికి మూల స్థానం భావం. ఆ భావాను భవాన్నే, దైవదర్శనంగా చెపుతారు. అంతటా వున్నది, వుండేది దైవం — మనం దర్శింపగల, ప్రేమించగలదైవం — మన జీవితాల్ని పూర్తిగా మార్చగల దైవం — మనను పరివర్తనం చెందింపగల దైవం — ఆ దైవం — బుద్ధుడు అన్నట్లు జీవితమే అయితే — ఇంక ఇతరంతో పనేముంది? ఇతరం ఏమీ కానట్టి అటువంటి దైవం గురించిన యోచనే, బౌద్ధుల యోచన.

"దైవం" అని అనాదిగా వస్తున్న జనమత భావం గురించిన చర్చ, వృథా ప్రయాస, కాలయాపన అని బుద్ధుని భావన. వాస్తవ జీవితంనుంచి పలాయనం చిత్తగించి, మోక్షసాధనకు యత్నిస్తున్న వారిని తిరిగి వాస్తవ జీవితంవైపు మళ్ళించి — నియమబద్ధ జీవితం — క్రమ శిక్షణ అవసరమని చెప్పి—నడవ మన్నాడు. శక్తుల కోసం కిందా, పైనా, చుట్టూ వెదకడం మాని, సజీవం — చైతన్యవంతం అయిన వాటితో సంబంధం పెట్టుకోమన్నాడు. తత్ఫలితంగా ఆనందం— దుఃఖంగా, — దుఃఖం,—ఆనందంగా — ముందు— వెనుకగా, వెనుక — ముందుగా — ఓడబండిగా — బండి, ఓడగా మారడం; రారాజు తిరిపమెత్తుకుంటూ తిరగడం—వంటి సంగతులు అనుభవంలో వుండే సత్యం తెలుస్తుంది.

కోర్కె—లేని స్థితే, నిర్వాణమని ఆయన భావన. మూలంలో ఏమీ మిగల్చకుండా మండించే జ్వాలే, నిర్వాణస్థితి. అది పరి పూర్ణం. అటువంటి నిర్వాణ ప్రాప్తికి, సౌశీల్యం — ప్రజ్ఞ-సమాధి— మూడూ ముఖ్యమని చెప్పాడు, బుద్ధుడు. ఎందుకంటే, సౌశీల్య సమన్వితమైన సమాధి, ఉత్తమ ఫలదాయి. సమాధి సమన్వితమైన ప్రజ్ఞ ఉత్తమ ఫలదాయకం. ప్రజ్ఞ సమన్వితమైన చిత్తం, అవిద్యా పారవశ్యాన్ని పారద్రోలి, నిర్వాణ స్థితిని ప్రసాదిస్తుంది. అందు చేత, శీలం, ప్రజ్ఞ, సమాధి మూడూ అవసరమన్నాడు జీవితంలో వాటిని అభ్యసించాలే కాని, బాహ్యాభాష—భాష—ఆచార — వ్యవ హార — నమ్మకాల — సిద్ధాంతాల — సాంప్రదాయాల ప్రకటన కాదన్నాడు.

* * *

తత్వజిజ్ఞాస, లోలోపలనుంచి రావలసిందే! అన్ని మతాల లక్ష్యం, ఆత్మ. అది, కేవలం ఒక మాట, ఉద్దేశ్యం, అభిప్రాయం, మాత్రమే. సామాన్య మానవుడి దైనందిన జీవితానికి, ఆత్మతో పని లేదు. దాని అవసరమూలేదు. అతడు ఆత్మ అనేది లేకుండానే

అన్ని పనులు సవ్యంగా, సక్రమంగా, సరిగ్గా, సమంగా, సంపూర్ణంగా చేసుకుపోతున్నాడు. నాశనమయ్యే దేహంకన్నా-భౌతికానికి అతీతమైనది-శాశ్వతమైనది ఒకటి వుండాలని సంస్కృతి-నాగరికత–సాంప్రదాయం-అన్నీ కలసి "ఆత్మ" అనే మాటను సృష్టించాయనిపిస్తుంది.

అనాలోచితంగా ఎందరో దాన్ని విశ్వసించి అతుక్కు-పోయారు. ఆ తర్వాత దానికి తత్వాలు, సిద్ధాంతాలు, అభిప్రాయాలు ఏర్పరిచారు. ఆ తర్వాత దానికి వ్యాఖ్యాలు- విమర్శలు వచ్చాయి. దానితో "ఆత్మ" అత్యధిక ప్రాధాన్యం కలది అయిపోయింది.

తన మనుగడకోసం, తన ఘనతకోసం- తన శాశ్వతత్వం కోసం మనసు సృష్టించుకున్నదే-"ఆత్మ" ఆ ఆత్మ వుందా? లేదా? అనే ఆలోచనతో కాలాన్ని వృధా చేయడమే జరుగుతోంది. అది-సోమరితనం, చైతన్య విహీనం, చురుకుదనం లేకపోవడం అపంతా మనోవ్యాపారం.

పండితులు ఆత్మ గురించి యోచించి- యోచించి అనేకం ఊహించి, భావించి ఎంతో చెప్పారు. కాని నాశనమయ్యే దేహం, ఆత్మకాదు. ఆత్మ దేహంవంటి జడపదార్థమైతే- అదీ బుబ్బు పడ వలె. మనసు, ఇచ్ఛ, స్వభావం–ఇవన్నీ కలిసిగాని, విడివిడిగా కాని ఏదీ ఆత్మకాదు. అలాగే అది ఒక భావనాకాదు. దాన్ని చూడలేం, వినలేం, స్పృజించలేం. కేవలం మన భావనలో, ఊహలో, కల్పనలో అభిప్రాయంలో మాత్రమే దాని ఉనికి. అంతే! భూతాలూ ఆత్మ కాదు. స్ఫురణ, చైతన్యం ఆత్మకాదు. "ఆత్మ" అంటే కేవలం ఆత్మేకాని, వేరొక ఆత్మ అంటూ విడిగా, భిన్నంగా అన్యంగాలేదు. కాని, అన్నింటికీ సదా సాక్షిభూతంగా వుండేస్థితి ఒకటి వుంది. అదే నిర్వాణం.

అందుకే మహాయానం అంటుంది- సంబంధానికి, అహంకారానికి, సర్వావస్థలకు అతీతమైనది స్వయంస్థితి కలిగి- సర్వాధారమై వున్నదేదో- అది సర్వ జ్ఞానజ్యోతి. అది శుద్ధ చిత్ స్వరూపం. అదే నిత్యం, సత్యం, ఆనంద స్వరూపం- పవిత్రం-అఖండజ్వాల-సమగ్ర యదార్థ జ్ఞానం, నిత్యముక్తం- అవినాశనము- స్వయం ప్రభుతకలది. అటువంటి సత్పదార్థం ఒకటి వుందని అంటుంది.

ప్రతి ఒక్కరిలో ఆత్మ వుందనేవారు దేన్ని ఆత్మ అంటున్నారో-అనుకుంటున్నారో, అది ఆత్మకాదు. బహుశా వారు అనుకునేది పంచస్కందాల వల్ల నిర్మాణమైన దాని విషయమై వుండవలె. రూప, వేదన, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానం- అనే పంచస్కందాల చేత నిర్మాణమైనదే మానవుడు. మనిషంటే- భౌతిక శరీరం- భావాలు, జ్ఞానం, స్పందనలు, గోచరమైనవి- వ్యక్తమైనవి. KNOWN-ఉద్వేగ ప్రతి చర్యలు, చైతన్యం. అంటే, అది మనిషి మేల్కొన్న స్థితి, ఆ స్థితిలో, ఆ ఐదింటి మిశ్రమమే, మనిషి. కాని ఆ ఐదింటిలో ఏ ఒక్కటీ ఆత్మను ఏర్పాటు చేయలేవు, చేయవు కూడాను. కనుక ఏదీ ఆ ఐదింటికి విడిగా, వేరుగా, భిన్నంగా, అన్యంగా, బాహ్యంగా లేదు. వారు అనే, అనుకునే ఆత్మ-అటువంటి మనిషినుంచి పుట్టేదే అయితే, అదీ అనిత్యమే, అశాశ్వతమే అవుతుంది. అనిత్యమైనది—అశాశ్వతమైనది ఆత్మకాదని అందరికీ తెలుసు. కాదంటే, అది సంకుచితమైన భ్రాంతి భావన కావలె.

సమస్తం- కేవలం సత్యాభాసములు. జీవాత్మా- దేహం రెండూ భౌతికమైనవి కనుక, చివరికి అవి వాటి-వాటి భూతాల్లో కలిసిపోతాయి. జీవాత్మ అవిద్యా కర్మలకు సంతాన కారణం గనుక పరమ సత్యస్వరూపమైన పరమాత్మ, విశ్వాత్మ, సత్యాత్మ— అయినటు వంటిది- జీవాత్మయందు వున్నదంటే బుద్ధునికి అంగీకారం కాలేదనిపిస్తుంది. ఆయన ఎప్పుడూ "ఆత్మ అనేది లేదు" అని అనలేదు. లోకులు భావించు సంకుచిత ఆత్మను మాత్రమే కాదన్నాడు.

నిర్మాణ రూపమైన మహాత్మను అంగీకరించారనిపిస్తుంది. అందుకే దుఃఖరూపాలు అనాత్మ సంపన్న రూపాలు - ఆత్మకాద న్నాడు.

అనాత్మ సిద్ధాంతాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం. "అనాత్మ" అనే మాట వినగానే, అది వట్టి శూన్యవాదమనిపిస్తుంది. అనాత్మ వాదాన్ని- ఆ సిద్ధాంతాన్ని ఆనాడూ ఈనాడూ కూడా కొందరు అపార్థమే చేసుకుంటున్నారనిపిస్తుంది. అనాత్మవాదం — లోకంలో ఎంతో కలవరాన్ని, అకమకను, గందరగోళాన్ని సృష్టిం చింది. భాషాతీతమైనదాన్ని నిర్వసించ నిరాకరించాడు, బుద్ధుడు. ఆత్మ అస్తిత్వ—నాస్తిత్వముల విషయంలో మౌనం వహించాడు. ఆత్మకు ఒక ఉనికి వుందనలేము- లేదనలేము. వ్యర్థ, శుష్క-తర్కం ఎంతకాలం చేసినా, అవస్నీ మానసికం గనుక ఆత్మశాశ్వతత్వాన్ని గాని, దాని వాస్తవత్వాన్నిగాని నిర్ధారణ చేయలేమని ఆయన భావన అయి వుండవలె. అలాగే మనో బుద్ధులకు అతీతమైనదాన్ని, భూతాల సమ్మేళనమనీ అనలేము. కాని, అసలు అది ఏమిటో ఊహించ, భావించ నిరాకరించాడు. అందుకే ఆయన్ని "అనాత్మ వాది" అన్నారు.

ఆత్మకాని, ఇతర పదార్థ లక్షణాల్ని వివరించు సూత్రమే, అనాత్మ లక్షణ సూత్రం. నామ-రూపాల్ని సమ్యక్ప్రజ్ఞ వల్ల ఉన్నది వున్నట్లుగా, యదాతథంగా చూసి- "ఇది నేను కాదు- అదీ నేను కాదు- ఈ రూపం- ఈ నామం నావి కావు" అని తెలుసుకోవడం. అంటే, మీరుకాని దానిని వర్జించవలె. రూపవేదనాదులు మీరు కాదు. కాబట్టి వాటినీ వర్జించవలెను. స్కంధాలు మీరు కాదు. అవి మీ ఆత్మ కాదు. కాబట్టి-వాటినీ విసర్జించవలెను. "ఏదీ నేను కాదు — ఆత్మకాదు" అనే భావం కలగాలి. అటువంటి భావం కలవాడు బుద్ధుడు.

సమస్తం నాశనమయ్యేవే. ఇకపోతే అనుభూతి - దృశ్యం- దర్శనం-వ్యక్తమయ్యేది, గోచరమయ్యేది- అదంతా విజ్ఞానం. ఆ

విజ్ఞానం, నామ-రూపాల్ని సృష్టిస్తుంది. అందుచేత నిత్యపరిణామ శీలములైన నామ-రూపాలూ ఆత్మకాదు. అటువంటి విజ్ఞానం కూడా ఆత్మకాదు. అలాగే పంచస్కంధాల వలన జన్మించిన అహంస్ఫూర్తీ, ఆత్మకాదు. నిరంతరం ప్రవాహరూపంలో పరుగిడుతున్న భావ సముచ్ఛయమునే మనం ఆత్మగా భావిస్తాం. స్కందజన్యమై క్షణ క్షణం పరివర్తనం చెందుచున్న, అహంకార రూపమైన వ్యావహారిక ఆత్మనే బుద్ధుడు నిరసించాడు.

* * *

ప్రతిదానికి ఒక కారణం వుంటుంది. ఆ కారణంవల్ల ఒక కార్యం జరుగుతుంది. ఆ కర్మ, ఫలితాన్ని ఇస్తుంది. ఆ ఫలితం, మరొక పనికి కారణమై, వేరొకపని జరిగి, ఇంకొక ఫలితాన్ని ఇస్తుంది ఆ విధంగా కార్య-కారణాలు పరస్పరాధారమై అనంతంగా మారుతూ వుంటాయి. ఈ జగత్తుకు అంతకుమించి మరో మూలకారణంగాని, ఆధికారణంగాని వుంటుందని - అది భగవంతుడని నిర్ధారణ చేయడానికిగాని, సిద్ధాంతీకరించడానికిగాని వీలులేదు. కాబట్టి, ఈ జగత్తుకు ఒక మూలకారణం వుండి వుంటుందని ఊహించడం - అది కేవలం ఒక ఊహ మాత్రమే అవుతుంది.

ఈ భూమిమీద ప్రతిదీ నశిస్తుంది. లేదా, మార్పు చెందుతుంది. అది ఈ భూమి సహజ లక్షణం. శాశ్వతంగా కనపడినా — చివరికి — అదీ—ఎప్పటికో ఒకప్పటికి తప్పక నశిస్తుంది. బాగా పెరిగింది విరుగుతుంది. పుట్టింది చస్తుంది. ఆది వుంటే, అంతం వుంటుంది. కలయిక వుంటే, వియోగం తప్పదు-ప్రాణమున్నచోట మృత్యువు వుంటుంది. ఇంక ఏదైనా శాశ్వతమైనది వున్నదంటే, అది నిర్వాణం. ఆ స్థితి అందుకోవడం, జనన — మరణ వలయం దాటడం. నిర్వాణమంటే, "నేను" అనే అహంభావాన్ని విసర్జించడం, అజ్ఞానం నివృత్తికావడం ... దానికి అంతర్వీక్షణ అవసరం. ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకుంటూ, తనను తాను అర్థం చేసు

కోవడం ద్వారా నిర్వాణ స్థితిని చేరుకోగలరు. దానికి నీతి మొదటి మెట్టు కనుక, క్రమశిక్షణతో కూడిన పవిత్ర జీవనం కావాలి. కోరిక్కలనే బంధాల నుండి విముక్తి పొందడమే నిర్వాణం. అది పూర్ణ మోక్ష రూపం. అది శూన్యంకాదు. వినాశనమూ కాదు. జీవితంలో అటువంటి నిర్వాణాన్ని పొందవచ్చు, ఆ స్థితిని పొందడానికి పలాయనం, అనుసరణ, ఆచరణ, ఆరాధన - ఏదీ కాదంటూ-దానికి అష్టాంగ మార్గం సూచించాడు బుద్ధుడు.

*　　　　*　　　　*

సర్వశాస్త్రసారం ఎరిగిన, శ్రేష్ఠమైన బుద్ధి-జ్ఞాన చక్షువు కలిగిన సిద్ధార్థుడు సర్వజనుల హితంకోరి - సర్వసంగ పరిత్యాగం చేసి, జన్మరూపమైన భయంకర సంసార సాగరందాటి, సత్య దృష్టితో - సద్భావంతో శబ్ద - రూప - స్పర్శ - రస - గంధము లనే విషయాల్ని పరికించి - అవి-లోక వంచకాలని గుర్తించి, సత్యాసత్య విమర్శకాని వైరాగ్యానికి శాస్త్ర పరిశీలన గాదని తెలుసు కుని, శాస్త్ర - లోక సంబంధవాసనలచే, చలించని స్థిరచిత్తంతో, సత్యాన్వేషణకు బయలు దేరాడు సిద్ధార్థుడు.

ఏకమైవున్న సత్యాన్ని బహు విధములుగా చూపేదే మాయ. దానికంటె వేరైనది - అవిద్య. ఎప్పుడూ వుండే సత్యాన్ని మరపు జేసి, అసత్తునందు సత్య భ్రాంతినిచ్చేదే, అవిద్య. ఆ అవిద్య, మనసుకు వేరుగాలేదు. అటువంటి అవిద్యా కామ కర్మాది రూప మైన పాశబంధంనుంచి తప్పించ ఎవరితరం కాదని, అది - తనను తాను తెలుసుకోవడం ద్వారానే తొలగునని - తనను తాను తెలుసు కునే యత్నంలో ఇంటి నుంచి బయలు దేరాడు.

మరచిపోయిన నిజస్థితిని తిరిగి స్మృతి పథంలోకి తెచ్చు కోవడం కోసం, ఏడేళ్ళు ఎన్నో చేశాడు. నిజస్థితిని గురించిన యోచనే ఉపాసన, తపస్సు, యోగం. ఆ మూడూ పర్యాయ

పదాతే! "ఉపాసన" అంటే, తనయందు నిలకడకలిగి వుండటం. తపస్సు అంటే, శక్తిని నిర్విషయ మొనర్చడం. కాని, నిర్విషయం సుషుప్తినందు అందరికీ అనుభవమే. కాని, అందు దర్శనమయ్యే దృశ్యాలు సత్ సముద్ర తరంగాలేనని తెలియుట— దృగ్దృశ్యము లందు ఐక్యమగుట. యోగమంటే, చిత్తవృత్తి నిరోధం. చిత్తం చలించుటే బంధం. స్థిరంగా వుండుటే మోక్షం. యోగి—వాక్కును మనస్సులో, మనస్సును బుద్ధిలో, బుద్ధిని సాక్షియందు లయింపజేసి, ఆ సాక్షిని అసలు సత్యంగా గుర్తిస్తాడు. ఆ విధంగా యోగి సదా చిత్త నిరోధం గావించును.

సిద్ధార్థుడు ఆరేళ్ళు కఠోరతపస్సు చేశాడు. చివరికి విచార శీలుడై, దృఢమైన వివేకజ్ఞానంతో సారం గ్రహించి, అ సారం త్రోసి వేశాడు. అంతరింద్రియ నిగ్రహంతో బోధి వృక్షమూలవాసియై, బ్రహ్మాస్థితిలోవున్న సిద్ధార్థునికి ఒకరోజు ఉదయం – ఉదయతార దర్శనా నంతరం అతని జీవితంలో గొప్ప మార్పు వచ్చింది. అది మహాత్మ్యమయమని చెప్పవచ్చు. జిజ్ఞాసువులకు మూల సంబంధమైన ఆలోచనే యోగం. చివరికి సిద్ధార్థుడు భోగ్యజాతం జయించిన యోగిపుంగవుడు అయ్యాడు. అతని ఘోరతపస్సు – అపారమైన అతని యోగ వైభవాన్ని వెల్లడించింది. ఆ తర్వాత అతని ద్వారా జరిగిన కర్మలన్నీ చిత్తశుద్ధినే కలిగించాయి. ఆ కర్మలు లోకోప కారానికే ఉపయోగపడ్డాయి.

అతనికి కలిగిన అనుభవజ్ఞానం అద్వితీయమైనది. చక్రం, ఇరుసు ఇతర వస్తువుల సంఘాతమే, రథం. అలాగే ఇంద్రియాలు, మనసు మొదలగు వాని సంఘాతమే, జీవుడు. జగత్తు, అనునిత్యం మారునట్లు - రూపాది స్కందాలు ప్రతిక్షణం మారునట్లు - జీవుడూ, మారతాడు. పృథ్వి - అగ్ని - జలం - వాయువు - అనే నాలుగు ధాతువుల సమ్మేళనంవల్ల దేహ నిర్మాణం జరుగుతుంది. మరణా నంతరం ఆ నాలుగు ధాతువులు - తిరిగి ఆయా మూల

ధాతువులలో కలిసిపోతాయి. ఆ విధంగా కలిసి పోయిన ఆ ధాతువులే, తిరిగి సమ్మేళనమై - మరో దేహరూపం ధరిస్తాయనడానికి వీలులేదు. మరణానంతరం - ఆ ధాతువులు విశ్వాంతరాళంలో ఆయా మూలధాతువుల్లో ఎటువంటి ప్రత్యేకతా లేకుండా కలసిపోతాయి. నాలుగు భూతాలు కలిసినప్పుడే, మరో కొత్త దేహ నిర్మాణం జరుగుతుంది. అంటే మరో కొత్తప్రాణి సృష్టి అవుతుంది. భూతాలు శాశ్వతం. దేహం అశాశ్వతం.

ప్రవాహరూపమైన నది - దీపశిఖా - ఎప్పుడూ మారుతూ వుంటాయి. ప్రతిక్షణం ఒకటి పోయి మరొకటి వస్తుంది. ఒక వస్తువుయొక్క అస్తిత్వ ప్రవాహంలో ఒక అవస్థవుట్టి — అది లయమై - వేరొకటి పుడుతుంది. ఆ విధానం ఎడతెగక సాగుతుంది. అందు కాలవ్యవధి వుంటే, "లయం - నాశనం - పుట్టుక" అనేవి సంభవించవు. వాటి గమనంలో - ఆ అవస్థలమధ్యలో — ఒక్క క్షణం కూడా వ్యవధి వుండదు. అది ఏ విధంగానంటే - పాలు, పెరుగుగా - పెరుగు వెన్నగా ఒక క్రమంలో మారునట్లు. దీన్నే "సంతానవాద"మన్నారు. ఆయా వస్తువుల అవస్థల పరంపరే, వస్తు ఐక్యంగా తోస్తుంది. నదీప్రవాహం - దీపశిఖలలో కూడా మొదటిది నశించి, ఆ వెంటనే వేరొకటి పుట్టును. దాన్నే "ప్రతీత్యసముత్పాదం" అంటారు. ఒక దీపం ఆరిపోతూ, మరోదీపాన్ని వెలిగించడం జరిగినట్లే, ఒకవ్యక్తి మరణించి, మరోవ్యక్తి జన్మకు కారణం అవుతాడు. అంటే, ఒక జీవుడు నశించిన వెంటనే, వేరొక జీవుడు పుట్టడం - దీపాంతకాంతుల్లో వ్యత్యాసం వున్నట్లే, ఆయా జన్మల్లో - ఆయా వ్యక్తుల్లో వ్యత్యాసం వుంటుంది. దాన్నే "మానసికస్థితుల అవిచ్ఛిన్నత" అన్నాడు బుద్ధుడు.

అవిద్యవల్ల మానవుడు శుభాశుభ కర్మలు చేసి, వాటివల్ల కొన్ని సంస్కారాలు పొందుతాడు. అవి - పునర్జన్మకారిణియైన

విజ్ఞానాన్ని కలిగిస్తాయి. దానివల్ల తిరిగి జన్మించాలనే భావం - కోర్కె కలుగుతుంది. దానితో జనన - మరణాలు సంభవిస్తాయి. అప్పుడు మళ్ళా అవిద్య ప్రారంభమౌతుంది.

ఆ విధంగా భవచక్రం నిర్విరామంగా - అనంతంగా పరిభ్రమిస్తూ వుంటుంది. ఒక్క అవిద్యను నిరోధిస్తే - తక్కిన వన్నీ నిరోధించబడతాయి. దానితో నిర్వాణం లభిస్తుంది. అంటే, బ్రహ్మైక్యం సిద్ధిస్తుంది. బ్రహ్మం అంటే - ఏది మనస్సుతో స్వీకరించుటలేదో - దేని ప్రభావంవల్ల మనస్సు సంకల్పించు చున్నదో, అదే బ్రహ్మం.

ఈ విషయంలో బుద్ధుడు పరిణామాన్ని సిద్ధాంతం చేసు కున్నాడు. సర్వభూత సమన్వితమైన పదార్థాన్ని - శక్తి అను నిత్యం పరిణామం గావిస్తుంది. ఆ పరిణామమే, కాలస్వరూపం. అటువంటి పరిణామశీలమైన ప్రపంచానికి అతీతంగా శాశ్వతమైన- సత్యమైన "ఆత్మ" అనేది ఒకటి వుందని — అదే "పరబ్రహ్మ" అని - ఆ పరబ్రహ్మ — "సృష్టికర్త" అని అన్నారు ఉపనిషత్ ఋషులు. ఆ ఆత్మ సాక్షాత్కారమే జీవిత ఏకైక లక్ష్యంగా చెప్పే ప్పటికి, ఎందరో మేధావులు సహితం సుదీర్ఘప్రయత్నాలు చేశారు. బుద్ధుడు కూడా ఆరేళ్ళు కఠోర తపస్సుచేసి - చివరకు అదంతా వృథాప్రయాసేననే సంగతి స్వానుభవంతో తెలుసుకున్నాడు. ఆ అనుభవంనుంచే బౌద్ధ ధర్మం పుట్టింది. శాశ్వతమనే ఈశ్వర - ఆత్మ భావనను ఆశ్రయించేవారిపై బౌద్ధం ఆరోపణగా నిలిచింది. పరిణామ కారిణియైన క్రియాశక్తీ, మహాకాలుని నిత్యతాండవ వైభవం రెండూ వేరుకావనీ, ఆ క్రియాశక్తివల్ల సంహారమేకాక- సృష్టి జరుగుతుందనీ, అటువంటి ...త్రైతక — ... స్వరూపం ప్రకాశించదనీ సిద్ధార్థునికీ తెలుసు.

బుద్ధుడు చెప్పిన దాన్ని ప్రజలు అర్థం చేసుకోలేకపోగా- పైగా చాలా మంది ఆయన్ని అపార్థం చేసుకుని "నాస్తికుడు-

నిరీశ్వరవాది - అనాత్మవాది - శూన్యవాది," అని అన్నారేకాని, సమస్త చరాచరం తన వంటిదేననీ - తాను విశ్వంలో - విశ్వం తనలో వుందనీ - అనుభవ పూర్వకంగా తెలుసుకున్న జ్ఞానని గుర్తించలేకపోయారు, కొందరు. గుర్తించినవారికి ఆయన సాంగత్యం అపరోక్ష జ్ఞానానికి — ఆయన బోధలు పరోక్ష జ్ఞానానికి కారణా లయ్యాయి.

ఆయన శాంతి, అత్యంతం. ఆయన శక్తి, పరమోత్కృష్టం. ఆయన కరుణ, అపారం రూప—శీల—వాక్ వర్తనములందు ఆయన మధురమూర్తి. అటువంటి బుద్ధుడు దివ్య వాత్రప్రబోధకుడై సద్ధర్మం బోధించాడు. అది— మానవ కళ్యాణార్థం అన్వేషింపబడిన ధర్మం.

తత్వార్థవేత్త— సంగరహితుడు— శోకనాశకుడు — జ్ఞానదాత- నిరుపమాన సత్వం కలవాడు- సర్వార్తిహారకుడు - ఘనతేజస్వి, యతి పతి-అయిన బుద్ధుడు సత్పురుషులకు సహితం పూజనీయుడు, లోక గురువు, పరమాచార్యుడు అయినాడు.

*　　　*　　　*

ఈ సృష్టిలో ఏదీ అఖండం, శాశ్వతం కాదు. అన్నీ గతించి పోయేవే. పదార్థం, చలన రహిత శాశ్వత వస్తువుకాదు. శక్తి రూపాంతరమే, పదార్థం. శక్తి అంటే, మానవ చైతన్యం కాదు. దానికి భిన్నమైనది రంగు - రుచి—వాసన - స్పర్శ - అనే నాలుగు లక్షణాలు కలిగిన మిశ్రమధాతువే, పదార్థం దాని అతి స్వల్ప రూపం-పరమాణువు. అయినా అదీ శాశ్వతం కాదు. విశ్వాజనీనమైన పదార్థం యొక్క లక్షణాలు - వాటి కార్యాచరణలోనూ, అవి నిర్వ హించే ప్రయోజనాలలోనూ వ్యక్తమౌతాయి. ఆ లక్షణాలు వస్తు రూపాలు కావు, శక్తి రూపాలు. కార్య-కారణాలవల్ల వివిధ మిశ్రమ పదార్థాలు ఏర్పడతాయి. అవీ శాశ్వతం కావు. అన్నీ- అంతాకార్య- కారణ సంబంధం కలవే. ప్రతీదీ సాపేక్షకం. కార్య- కారణాలే పర

స్వరాధారాలు. చలన శీలమైన ఈ దృక్పథంతో, బుద్ధుని బోధలు వెలుగులోకి వచ్చాయి. ప్రతిదీ చలన శీలమనే బౌద్ధంలోని క్రియాశీల లక్షణం, ప్రపంచానికి కొత్త దృష్టిని ఇచ్చింది. అది పరిణామ శీలం. ఉల్లిపాయలోని పొరలు ఒలుచుకుంటూపోతే-చివరికి ఏమీ మిగలదు. వుండేవి పొరలు తప్ప మూల పదార్థం ఏమీ వుండదు. అలాగే ఈ జగత్తులో ఏ వస్తువును విశ్లేషిస్తూపోయినా, మూల వస్తువు అంటూ ఏదీ మిగలదు. చివరికి శూన్యమే మిగులుతుంది. ఆ విధంగా శూన్య వాదం రూపొందింది. "శూన్యత" అంటే, నిరంతరం మార్పు చెందేది. ఈ ప్రపంచం- అనంత పరిణామ క్రమం. పాతది నశించి- దానిలోంచి కొత్తది వస్తుంది. అదే ఈ లోకరీతి. అందుచేత అవస్తు ప్రవాహక సస్కృత్యాలే. ప్రతీదీ పుట్టి- పెరిగి - నశించి — లయమయ్యే క్రమంలో సాగే తరంగ శ్రేణి.

ప్రపంచం నిరంతరం పరిణామం చెందుతోంది అంటే, అదే వస్తువు తిరిగి వస్తుందనడానికి వీలులేదు. ఒక పనివల్ల కలిగే ఫలితం, అదే నూతన సృష్టి- అది జరిగిందంటే- అనేక కారణాలు కలిస్తేనే ఆ సృష్టి జరుగుతుంది. ఏ చిన్న కారణం లోపించినా, ఆ సృష్టి జరగదు. ఫలితం ఏర్పడటమంటే, గుణాత్మక పరిణామం జరిగిందన్న మాట. ప్రపంచానికి వాస్తవమంటూ లేదు.

అది మనో జనితం. మనోవాంఛితంపై నిర్మాణమైన కల్పనా ప్రపంచమిది. అంటే, మన భ్రాంతుల ఫలితం. మనసు యొక్క దురాశ-కోర్కె-కోపం - మూర్ఖం-అజ్ఞాన ఫలితమే ప్రపంచం. ఒక దానికొకటి సంబంధం- సహకారం కలిగి-అనేక ముడులు-కన్నులు కల, వల వంటిది ఈ ప్రపంచం. ప్రతి కన్నుకీ ఓ చోటుతోపాటు - తక్కిన కన్నులతో సంబంధం వుంటుంది. బంధమే కాదు, బాధ్యతా వుంటుంది. ప్రపంచంలో ప్రతీదీ వలలోని కన్ను మాదిరిగా వుండీ, సక్రమంగా తన పని తాను చేయాలేకాని - తాను ప్రత్యేకం- విడి-

భిన్నం- అన్యం అనుకుని తనకు స్వేచ్ఛా- స్వాతంత్ర్యాలు వున్నా యనుకోవడంగాని, వుండాలనుకోవడంగాని పొరపాటు. అటువంటి ప్రపంచాన్ని- నిశిత పరిశీలన-సమవగాహనవంటి విషయాలపై సద్భావన కలిగి నిర్వాణపథాన్ని చేరాలంటే- కార్యకారణ సంబంధాల ప్రాముఖ్యత సరిగ్గా, స్పష్టంగా, పూర్తిగా తెలుసుకుని- ఆ తర్వాతే వాటిని ఎదుర్కోవాలి. కోర్కెలతో- బంధాలతో వాటిని సాధించ శక్యం కాదు. కాని, ప్రపంచాన్ని యదాతథంగా చూసి, గ్రహించి, అవగాహన చేసుకోవడం సామాన్యులకు సాధ్యంకాదు. ఎందుకంటే- అది-సత్యంగా, వాస్తవంగా, యదార్థంగా తోచినా- కనుపించినా, అది- అదికాదు. అది అసత్యంగా గోచరించినా, అది అసత్యంకాదు. ప్రపంచానికి చెందిన సత్యాన్ని జ్ఞానులు మాత్రమే తెలుసుకోగలరు. అందుచేతనే బుద్ధుడు ప్రపంచాన్ని "అసత్యం, అబద్ధం, మాయ, అని కాని- అది "సత్యం, వాస్తవం" అనికాని అనలేదు. దాన్ని మంచివనిగాని, చెడ్డదనిగాని అనలేదు. అది ఎట్లా వుందో— అట్లా ప్రజలకు వివరించి చెప్పాడు. ఆ విషయాన్నే ప్రజల ముందు వుంచాడు. బుద్ధుని బోధలో మర్మంలేదు. మాయ, కాపట్యం, అసత్యము లేదు. ఆయన ప్రపంచ విషయాల్ని యదాతథంగా దర్శించి, ఆ విషయాన్నే ప్రజలకు చెప్పాడు. పిల్లల్ని- తల్లి,తండ్రులు ఏ విధంగా ప్రేమిస్తారో, బుద్ధుడూ ప్రజల్ని ఆ విధంగా ప్రేమించాడు.

* * *

మన విజ్ఞానం నామ రూపాల్ని కల్పిస్తుంది. అది ఈ ఉనికిలో ఒక సంస్కారం మాత్రమే. అదీ, మారేదే. కనుక శీలం-శిక్షణ అలవరచుకుని, లోకంలో శాంతి- దాంతులు వెలయించి, కళ్యాణం కలిగించమని బుద్ధుడు బోధించేదేకాని, అంతుపట్టని, చిక్కైన ఆత్మ విషయ ప్రస్తావన చేయలేదు. చూసేవాడు అసత్యమైతే, చూడబడేది

కూడా అసత్యమే కదా? అందుచేత మనం భావించి, ఊహించి, కల్పించి, యోచించే ఆత్మ కూడా అసత్యమే అవుతుంది. పంచ స్కంధాలలోని సంస్కారస్కంధం- పూర్వజన్మ వాసన కలిగివున్నట్లుగా, ఒకదాన్ని సూచించాడు, బుద్ధుడు. అదే కర్మ బీజం.

ఋగ్వేదకాలంలో శారీరక, మానసిక కార్యక్రమాలన్నీ కర్మలుగానే జమకట్టబడ్డాయి. యజుర్వేద కాలంలో మానసిక, శారీరక కర్మల్ని తక్కువగా అంచనావేసి- న్యూనతగా ఎంచి- మత కర్మలే, కర్మలన్నారు వైదికులు. కాని, కర్మనిర్వహణవల్లనే నైతిక క్రమం ఏర్పడుతుంది. కర్తవ్యంగా భావించి, ఇచ్ఛా పూర్వకంగా చేసేదే "నైతికం" అనిపించుకొనగలిగిన కర్మ. చెడు కర్మవల్ల నైతిక క్రమం చెడుతుంది. ఆ విధంగా కర్మసిద్ధాంతం బౌద్ధంలో ప్రవేశించింది. ఆ సృష్టి క్రమాన్ని నియమాలన్నారు. ఆ నియమాలే, ఋతు నియమాలు- బీజ నియమాలు. అందుచేత "చెడు చేయకు. ప్రతీదీ నిష్కామంగా చెయ్యి" అన్నారు. ఎందుకంటే, ఏం చేసినా ఫలితం తప్పదు. ఇరుసును, చక్రం అనుసరిస్తుంది. ఆ చక్రాన్ని మురికి అంటుతుంది. అలాగే, ఫలితాన్ని దుఃఖం అనుసరిస్తుంది. కనుక, కర్మ అగ్నిరూపం దాల్చినప్పుడే, అది పరిశుద్ధమౌతుంది.

కర్మఫలితం అనుభవించవలసి వుంది. ఆ విషయాన్నే బుద్ధుడు ఒక జ్యోతి ఆరిపోతూ, మరొక జ్యోతిని వెలిగించినట్లు- ఒక జీవితం ముగిసి, మరో జీవితం ఆవిర్భవించినట్లుంది" అన్నారు. ఆ విధంగా పునర్జన్మ భావన బౌద్ధంలో చోటు చేసుకున్నది.

ఆత్మపరంగా బుద్ధుడు వినాశవాదిగా కనుపించినా, పదార్థ పరంగా వినాశవాదికాదు. పునర్జన్మ విషయంలో జన్మించేది, మరణించేది దేహం. ఆ దేహం, పంచభూతాత్మకం. మరణించిన దేహం పంచభూతాల్లో కలసి, కొంతకాలం అకాశంలో నిలిచి, వేరొక

దేహంగా ఏర్పడుతుంది. కొత్తగా జన్మించిన దేహం- ముందు మరణించిన దేహానికి సంబంధించినదే అనడానికి ఆస్కారం లేదు. ఆ విధంగా జన్మించిన నూతన జన్మనే, పునర్జన్మగా చెపుతోంది బౌద్ధం. అంటే, మరణించిన వ్యక్తే - మళ్ళా జన్మించునట్లు కాదు. జన్మే, పునర్జన్మ. మరణానంతరం కొనసాగాలనే కోర్కె నుండే, పునర్జన్మ సిద్ధాంతం పుట్టింది. పదార్థం ద్వారా పునర్జన్మ వుంది.

మన ప్రగాఢ వాంఛే - తృష్ణే మరణానంతరం - అనంత విశ్వంలో తేలియాడుతూ, మరో దేహధారణ కోసం నిరీక్షిస్తూ వుంటుంది. కొంతకాలం తర్వాత - అది ఎంత కాలమనికాదు- హిమ బిందువుల్ని దిగజార్చిన పొగమంచుపైకెగసి, మబ్బుగా మారి - వర్ష రూపంలో కిందపడుతుంది. అలాగే మానవుడూను. అసలు ఎందుకు, ఏ విధంగా ఈ జన్మ కల్గిందో - అదే విధంగా - అదే కారణంగా అనేక జన్మలూ కలుగుతాయి. అవి దేహానికి సంబంధించినవి. దేహంతో సంబంధం పెట్టుకోవడం వల్ల మనసు కూడా అన్నీ అనుభవించవలసి వస్తుంది.

* * *

ఉన్నది పరిణామ మొక్కటే - దేనినుంచి అయినా సృష్టి జరిగిందంటే - ఆ సృష్టికి పూర్వం-ఒక పదార్థం వుండి వుండవలె. అటువంటప్పుడు అది "దైవ సృష్టి" అనడానికి వీలులేదు. బౌద్ధం యొక్క మౌలిక ప్రాతిపదిక అంతా "అన్నీ అశాశ్వతం" అనే భావన మీద ఆధారపడింది. ఆ మౌలిక ప్రాతిపదికనుండే, "దైవం-ఆత్మ" అనే భావాలు నిరాకరించబడ్డాయి. దానితో బౌద్ధంలో సృష్టి కర్తకు చోటులేకుండా పోయింది. "ఇదంతా దైవసృష్టి అనడం-ఆ దైవంపై ఆధారపడి - నమ్మకం కలిగి వుండటం-అలాగే ఆత్మను నమ్మడం కూడా ఒకటే," అని బుద్ధుడు అన్నాడని, ఆయన్ని నిరీశ్వరవాది - అనాత్మవాది అన్నారు.

ఈ సచేతన ఉనికి నామ రూపమైనది. భౌతిక - మానసిక పదార్థాల కలయికే చేతనత్వం. భౌతిక పదార్థాల్ని స్కంధాలు అంటారు. ఆ భౌతిక పదార్థాలు కలిస్తే - "దేహం" ఏర్పడుతుంది. దానితోపాటు, చైతన్యం అదే "నేను" అనే భావం ఏర్పడుతుంది. ఆ భౌతిక పదార్థాలు నశిస్తే - ఇంక - "నేను" అనేభావం ఎక్కడ వుంటుంది? దేహంతో పాటే - ఆ భావనా నశిస్తుంది.

అనిత్యం-అశుచి భాండాగారమైన దేహం - పంచభూతాత్మకం అయినట్టే, జీవుడు కూడా పంచభూతాత్మకంతో పాటు మానసిక పదార్థాల సమ్మేళనం. కాబట్టి దేహం, జీవుడు రెండూ చివరికి ఆయా భూతాలలో లీనమైపోతాయి. అంతేకాదు క్షణక్షణానికీ దేహం మారుతూ, ఎన్నో రూపాలు ధరిస్తో వుంటుంది. ఒక రూపానికీ-వేరొక రూపానికీ ఏ మాత్రం సంబంధం - సారూప్యం వుండదు. కాబట్టి, మనం ఏ ఒక్కరూపానికీ అతుక్కొని వుండకూడదు.

మనం ఎప్పుడూ ఒకటికాదు. ఒకటి అనుకున్నా - "ఒకే నేను" అనేది వుండదు. "నేను" అనేది క్షణ క్షణానికీ మారుతూ వుంటుంది. నిత్యజీవితంలో మనకు తటస్థపడే విషయాల, సంగతుల, సంఘటనలవల్ల, మన వ్యక్తిత్వం మారుతూ వుంటుంది. మనలోని గుణాల ఫలితమే - మన వ్యక్తిత్వం - వాటిల్లో ఏ ఒక్క గుణం-అసలు మనంకాదు. అన్నివేళలా మనం, మనంకాము. మన ప్రవర్తన అందరి యెడలా, అన్నింటి యెడలా చివరకు మన యెడలా ఎప్పుడూ ఒకే విధంగా వుండదు. ఎందుకంటే, మనమీద మనకు ప్రేమ- విశ్వాసం లేదు. అందుకే మన గుణాలు, స్వభావాలు అవకాశాన్ని బట్టి మార్చుకుంటూ, వాటికి అనుకూలంగా ప్రపంచాన్ని - పరిసరాల్ని - పరిస్థితుల్ని మార్చాలని చూస్తాం. అదీ అసలైన మనం దానికంతకూ కారణం, చిన్నప్పటి నుంచీ మనల్ని అనేక విధాల ప్రభావితం చేసిన-సహజత్వాన్ని అణచిన-

మతం, సమ్మతం, సాంప్రదాయం - చదువు — పరిసరాలు, సంఘం- తల్లి తండ్రులు, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు - మొదలైనవి. అలాగే ప్రపంచం నిరంతరం అతివేగంగా మార్పుచెందుతూ వుంటుంది. అది మారి, అనంతంలో-అవ్యక్తంలో లీనమైపోతుంది, నామ-రూపం లేకుండా-వస్తుత ప్రతీదీ కార్యకారణ సంబంధం ద్వారా జరుగుతుంది. కాని చిత్త సంక్షోభానికి కారణం, దుఃఖం. అది-మనసునిడ-వసర, ప్రతి ఒక్కరూ తమ చిత్తవృత్తిని తామే సరిదిద్దుకోవడం - తమనుతామే నిగ్రహించుకోవడం- తమ అభివృద్ధికి తామే పాటు పడటం-తమను తామే తెలుసుకోవడం- తమకు ఇవ్వబడిన కాలాన్ని- అవకాశాన్ని తామే సద్వినియోగం చేసుకోవడం - ఇవన్నీ బుద్ధుడు చెప్పిన సంగతులు.

దానికి మనం చేయవలసిన పని - ఆలోచనల్ని గమనించడం అంతకుమించి మనం ఏం చేసినా, అది మనకూ, ఇతరులకూ దుఃఖ కారణమే అవుతుంది. ఆ దుఃఖాన్ని భరించలేక, ఇతరుల్ని - సంఘాన్ని, ప్రపంచాన్ని - చివరికి విధిని, ప్రకృతిని - అన్నింటినీ నిందిస్తాం కాని, మనని మనం నిందించుకోలేము - మనని మనం పరిశీలించుకోము- పరీక్షించుకోము - పరిశోధించుకోము. మనని మనం నిజంగా, లోతుగా, శ్రద్ధగా, పూర్తిగా పరిశీలించుకున్న క్షణంలో- మనలో కాంతికిరణం ప్రవేశించి, ప్రకాశిస్తుంది. అది - పసితనం వంటిది. మనస్సు-నిర్మలం అయిన స్థితి. అదే మనకు మార్గదర్శియై మనల్ని ఉన్నతులుగా, అర్హులుగా, మారుస్తుంది. అదొక్కటే మార్గం. ఆ మార్గం విస్మరించి-అంతులేని అగాధాన్ని ఆలోచనా టేప్‌తో కొలవ యత్నిస్తాం. అది పొరపాటు. దేనికోసమూ భవిష్యత్తులోకి చూడవద్దు.

ఏదో సాధించాలని దేవతల్ని ప్రార్థించవద్దు. ఏం చేసినా అంధకారం, ప్రకాశించదు. నిశ్శబ్దాన్ని అడగవద్దు - అది మాట్లాడ లేదు. దుఃఖిత మనస్సును పవిత్రవేదనలతో శోభపెట్టవద్దు, స్తోత్రాల-కానుకల—లంచాలతో— శాంతిని పొందలేము. "మన దుఃఖానికి

మనమే కారణంకాని, ఇతరులు కాదు" అని అనుభవ పూర్వకంగా తెలుసుకుని, మనలోనే ఏమోహనను వెదకాలి.

*   *   *

సంస్కృతానికి-పాలీ భాషకు పెద్ద తేడా కనుపించదు.

సంస్కృతం ప్రాచీన భారతదేశపు భాష. అది ఇండో - యూరోపియన్ కుటుంబాల వారి భాషని చెపుతారు.

"ధర్మ" అనేది సంస్కృతమైతే, "ధమ్మ" పాలీ భాష. "నిర్వాణం" సంస్కృతమైతే "నిబ్బాన" పాలీ భాష.

మహాయాన సాంప్రదాయాన్ని సంస్కృతంలో రాస్తే - తేర వాదవాఙ్మయం పాలీ భాషలో రాశారు. ఇరవై ఐదు వందల సంవత్సరాల క్రిందట బౌద్ధ వాఙ్మయంలోని కొన్ని విషయాలకు సాంకేతిక పదాలకు-ఇందు కొంత వివరణ ఇవ్వబడింది, సులభంగా గ్రాహ్యమయ్యేందుకు. జ్ఞానులు సూటిగా, సులభంగా చెప్పిన విషయాల్లో - మన అంతరంగిక వివరణ లోపంవల్ల అందు కొన్ని మాటలు అతిగానో, అల్పంగానో చోటు చేసుకునే అవకాశం ఎప్పుడూ వుండనే వుంటుంది.

జ్ఞానోదయం కాకముందు సిద్ధార్థుని బోధిసత్వుడన్నారు. తన లక్ష్యమైన శుద్ధ జ్ఞానాన్ని సాధించిన తర్వాత అతన్ని "బుద్ధుడు" అన్నారు. బుద్ధుడంటే, స్వస్వరూప జ్ఞానం పొందినవాడని అర్థం. తేజోంశ స్వరూపమే, బుద్ధ స్వరూపం. కాని, మహాయానం వారు బుద్ధత్వం పొందగోరే వారందర్నీ బోధిసత్వులనే పిలిచేవారు. ఆ తర్వాత అర్హతులై-ధర్మం బోధించేవారిని కూడా బోధిసత్వులనే వారు.

బుద్ధుని బోధలో సూత్రాలూ, నియమాలూ, ధర్మాలూ ఉన్నాయి. వాటిపై పెద్దలు, పండితులు, మేధావంతులు చేసిన వ్యాఖ్యలే అభి ధర్మం. ఆ మూడింటినీ కలిపి త్రిపిటకాలన్నారు.

బుద్ధుడు బోధించిన బౌద్ధ ధర్మాల్ని అనుష్ఠించి, ఆ క్రమ శిక్షణల్ని నియమాల్ని పాటించడం, జనన-మరణ వలయం నుంచి తప్పించుకోవడానికి సాధన ద్వారా యత్నించడం, అంటే - అవతలి తీరానికి దాట తలచడం—అంటే, జ్ఞాన ప్రపంచం చేరడం, ఆ విషయానికి "పారమిత" అనే పదం వాడబడింది. ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా-ఓర్పు, నీతి, ప్రయత్నం ఏకాగ్రత, జ్ఞానం, క్రమశిక్షణ— అనే ఆరింటినీ త్రికరణశుద్ధిగా పాటించవలసి వుంది. అందు- జ్ఞానమంటే, జారని అనుభవం. అటువంటి జ్ఞాన మూలాన్వేషణే, బుద్ధోపాసన. 'ఉపాసన' అంటే-సహజ స్థితి అనుభవం. అది నిశ్చలంగా వుండటమే జ్ఞానం 'బుద్ధోపాసన' అంటే-దృక్, దృశ్యాల మధ్య వున్న ఆకాశాన్ని సదా చూడ్డం. అదే ప్రజ్ఞ. ప్రజ్ఞ అంటే, అఖండ ధార కలది. దానికి నానాత్వం లేదు. అటువంటి ప్రజ్ఞ సంపూర్ణంగా కలవానిని బుద్ధుడంటారు. ప్రజ్ఞ అనేది సామాన్య విషయ జ్ఞానం కన్నా శ్రేష్ఠమైనది. అది విషయాల యందు ప్రీతి గల విజ్ఞానంకాదు. అది అంతిమ సత్యం.

కొన్ని విధాలైన సాధనల ద్వారా, ధ్యాన-సమాధుల ద్వారా సరైన మార్గాన మానవ జీవితానికి సంబంధించిన అన్ని మాలిన్యాలు భ్రష్టత్వాలు, వాంఛలు, తృష్ణలు, కోర్కెలు పూర్తిగా- ఒక్కసారిగా అంటే, నిలువునా వెలుగుతున్న కొవ్వొత్తిని ఊది, ఆర్పేసినట్లు అంతరింపజేసి, నాశనం చేయడం. అది పరిపూర్ణమైన శాంతి స్థితి. దాన్నే నిర్వాణ మంటారు. అటువంటి స్థితిని అందుకున్న వారిని బుద్ధుడంటారు. ఆ స్థితిని సిద్ధార్థుడు మరణానంతరం అందుకున్నట్లు కొందరు చెప్తారు. దాన్నే మహాపరినిర్వాణమన్నారు. ఎందుకంటే జ్ఞానోదయానంతరం సిద్ధార్థునిలో ఇంకా— "లోక రక్షణార్థం" అంటూ కొన్ని కోర్కెలు మిగిలి వున్నాయనేది వారి వాదన.

ఈ ఉనికి అశాశ్వతం. ప్రపంచం అవాస్తవం. అటువంటి అశాశ్వతం, అవాస్తవం అయినదాంట్లో, శాశ్వతం, వాస్తవం, నిత్యం,

సత్యం—అయిన పదార్థంగాని-విషయంగాని - వస్తువుగాని వుండదు. అందుచేత ఆ విషయాన్ని "అనాత్మ"గా చెప్పబడింది. అనాత్మతో పాటు బౌద్ధ వాఙ్మయంలో అనిత్యం-అశాశ్వతం అనే పదాలు కూడా చోటు చేసుకున్నాయి. దృగ్గోచరమైనదంతా నిరంతరం మారుతూ వుంటుంది. ఏదీ ఓ క్షణం కూడా ఒకే విధంగా వుండదు. ప్రతీదీ మారి నశిస్తుంది; ఎప్పుడో ఒకప్పుడు, అటువంటి అనిత్య- దృగ్గోచర విషయం, దుఃఖ కారణం.

ఏదీ శాశ్వతం కాదు-అంతా అశాశ్వతం-అసత్యం - అనిత్యం - అవాస్తవం అనేది బౌద్ధమత వాఙ్మయంలో ప్రధానాంశం. ప్రతి దానికీ ఒక కారణం వుంటుంది. కనుక-భావం - ఊహ, తలంపు, శాస్త్రం, భావన మొదలైన వాటికి అంతు తావులేదు. అలాగే, ఒక దాన్ని తీసుకుని-అదే అంతిమ సత్యం, శాశ్వతం, పరిపూర్ణం, జ్ఞానం, స్వతంత్రమైనది - అని అనడం - అనుకోవడం మూర్ఖం, అసత్యం, అవాస్తవం. ఎందుకంటే-ఆ విషయం అప్రమాణమైనది కనుక, దాన్నే "శూన్యత" అన్నారు.

మహాయానం వారు దాన్నే ప్రజ్ఞా శాస్త్రాల్లో మౌలికమైన అంతరవాహినిగా పేర్కొన్నారు. "శూన్యత" అంటే, నిరూపించు జాలనిది, ప్రామాణికంగా చెప్పజాలనిది, అసలు లేనే లేనిది- అనే అర్థంలో వాడారు. ఏ పేరూ దేనికీ పెట్టనప్పుడే "శూన్యత" అనేది అర్థమౌతుంది. అది నామ, రూప రహితమైనది. అదే స్వస్వరూప జ్ఞానం.

బౌద్ధ వాఙ్మయంలో వాడిన మరికొన్ని సాంకేతిక పదాల అర్థాలు తెలుసుకోవడం కూడా అవసరం :

ఆర్య సత్యాలు ; అవి నాలుగు. 1) దుఃఖం, 2) దుఃఖహేతువు 3) దుఃఖ నిరోధం, 4) దుఃఖనిరోధ మార్గం.

దుఃఖం — జన్మ-జరా-వ్యాధి-మరణాలు, ప్రియవియోగం-
అప్రియ సంయోగం, కోరినది లభించకపోవుట.

దుఃఖ హేతువులు—తృష్ణ, భోగతృష్ణ - భవతృష్ణ- విభవ
తృష్ణ.

దుఃఖ నిరోధం—తృష్ణా నాశనం.

దుఃఖనిరోధక మార్గం—ఆర్యాష్టాంగ మార్గం.

త్రిరత్నాలు : శీలం-సమాధి-ప్రజ్ఞ.

శీలం : పంచశీల, అహింస, అస్తేయం, సత్యం, బ్రహ్మ
చర్యం మమకార వస్తు నిషేధం.

సమాధి : పూర్వజన్మ స్మృతి-జీవోత్పత్తి—వినాశజ్ఞానం.

ప్రజ్ఞ : శ్రుతమయి-చింతామయి.
ప్రజ్ఞవలన జ్ఞాన పర్యసం. మనోమయ - శరీర
ధార నిర్మాణం, దివ్యచక్షువు కలుగును.

త్రిశరణాలు : బుద్ధం, శరణం గచ్ఛామి. ధర్మం, శరణం
గచ్ఛామి. సంఘం, శరణం గచ్ఛామి.

బోధిసత్వుడు : బుద్ధుడగుటకు యత్నించువాడు.

నిర్వాణం : మోక్షం. సమ్యక్ సమాధి.
రాగద్వేషాది దుఃఖాల్ని నిరోధించుటచే చిత్తం
ఏకాగ్రమగును.

ధాతు : పదార్థం-తత్వం.

ప్రవ్రజ్య : సన్యాసదీక్ష.

బౌద్ధ భిక్షువులు : ఉపసంపదా దీక్ష పొందినవారు.

ఉప సంపద : కేశఖండన-కాషాయవస్త్రధారణ - త్రిశరణదీక్ష-భిక్షు నమస్కారం.

ఇరవై ఏళ్ళ తర్వాత తల్లిదండ్రుల, భార్య, సంరక్షకుల అనుమతిపై-దీక్ష తీసుకోవడం.

విహారం : భిక్షువుల నివాస స్థలం.

స్తూపం : భిక్షువుల అస్తికలపై కట్టినది.

శ్రావక సంఘం : శిష్య సంఘం.

పారమితలు : పూర్ణప్రజ్ఞలు-దాన, శీల, నిష్క్రమ, ప్రజ్ఞా, వీర్య, క్షాంతి, సత్య, అధిష్ఠాన, మైత్రి, ఉపేక్షా ఈ పది పారమితలు పూర్తికానిదే బుద్ధుడు కాలేడు.

చెప్పుకోదగ్గ బౌద్ధ క్షేత్రాలు : లుంబినీ - బుద్ధగయ-సారనాథ్ - కుశీనగరం-రాజగృహ-నలంద- శ్రావస్తి - కపిలవస్తు-సాంచి-తక్షశిల-కౌసంబి-ఎల్లోరా - అజంతా కార్లీ గుహలు-అమరావతి-నాగార్జునకొండ.

ఆయా ప్రదేశాలలో ఆరామాలు, మందిరాలు, విహారాలు, క్షేత్రాలు, స్తూపాలు, శిల్పాలు, స్తంభాలు, గోడలపై సుందర శిల్పాలు (గుహల్లో) ప్రదర్శనశాలలు, గ్రంథాలు కలవు.

ఈనాటికీ లుంబినీ, బుద్ధగయ, సారనాథ్, కుసినార ప్రముఖ బౌద్ధ యాత్రా స్థలాలుగా నిలిచి వున్నాయి.

* * *

చూచిన ఒక వింత, మధుర స్వప్నం నుంచి మేల్కొన్నది. కాని, ఆమె మనసు, హృదయం శాంతంగా వున్నాయి. తెల్లవారిన తర్వాత తన కలను శుద్ధోధన మహారాజుకు వివరించింది. కలలో మాయాదేవి శయ్య దగ్గరకు లోకపాలురైన నలుగురు దిక్పాలకులు వచ్చి, ఆ శయ్యను తమ చేతులమీద పైకెత్తి, హిమాలయ పర్వత శిఖరాలకు తీసుకువెళ్ళారు. అక్కడ ఆ దిక్పాలకుల సతీమణులు మాయాదేవికి అంగరక్షకులుగా వుండి-చెంగల్వలతోను, తామరలతోను, హంసల వంటి రాజహంసలతోనూ శోభించుచున్న మానస సరోవరానికి తీసుకువెళ్ళి, అందు స్నానం చేయించి, భూలోక మాలిన్యాన్ని వదిలేసి, పవిత్ర వస్త్రాలు ధరింపచేసి, సుగంధ పరిమళాలు పూసి-అపూర్వమైన పుష్పాలు అలంకరించి, స్వర్ణసౌధంలో ప్రత్యేకంగా అమర్చిన శయ్యపై పవళింపచేశారు. ఆ స్వర్ణసౌధం, ఒక వెండికొండపై వుంది. ఆ శయ్య శిరోభాగం తూర్పుదిశగా వుంది. ఆ వెండికొండకు చేరువలో, ఒక బంగారు పర్వతం వుంది. ఆ పర్వత శిఖరాగ్రాన తేటనీలపు రంగులో-ముత్యపు కాంతులు విరజిమ్ముతూ అనేకకోణాల నక్షత్రం వంటి-దివ్యకాంతులు వెదజల్లుతూ వుంది. ఆ కాంతి క్రమంగా ఐరావతంగా మారి, మాయాదేవి పవళించిన శయ్య దగ్గరకు ఉత్తర దిశనుంచి వచ్చింది. దాని తొండంలో ఒక తెల్ల తామరపువ్వు వుంది. ఆ ఐరావతం మాయాదేవి శయ్య చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేసి, తన తొండంతో ఆమె నడుమును కోమలంగా తాకి, సూక్ష్మరూపం ధరించి, ఆమె కుడి డొక్కలోంచి గర్భంలో ప్రవేశించింది. అదీ ఆమె కల.

అంతకు ముందు ఆమె కలలో "సుమేధుడు" అను బోధి సత్త్వుడు కనబడి "ప్రపంచంలో నేను చివరిసారిగా నీ గర్భాన జన్మించదలిచాను. నువ్వు అంగీకరిస్తావా!" అని అడిగితే, ఆమె పరమానందంతో అంగీకరించింది. బోధిసత్త్వుడంటే జ్ఞానోదయమైనవాడు. పూర్వజన్మ సత్వం కలవాడు. తృష్ణ- ఆసక్తి లేనివాడు. తృష్ణ లేకపోతే, మనో విజృంభణ వుండదు. ఆసక్తి లేకపోతే, మనసు దహించదు. విజృంభించని, దహించని మనసు కలవానినే

బోధిసత్త్వుడంటాడు. అటువంటి బోధిసత్త్వుని - నీటిమీద చంద మామతో పోలుస్తారు, విజ్ఞులు. కదులుతూ కనుపించే రూపాలన్నింటికీ బోధిసత్త్వుల మనసు అనాసక్తంగా వుంటుంది. మనో విజృంభణ లేకుండా ప్రతి సత్కర్మకు ప్రతిస్పందించడమే, బోధిసత్త్వులు చేసే పనులు. స్వరూపతః సమస్త జీవకోటి బోధిసత్త్వులే. స్వభావతః అలావుండటానికి ధైర్యం కావాలి. సమస్త జీవకోటి శ్రేయస్సు కోరి బోధిసత్త్వుడు మాయాదేవి గర్భాన జన్మిస్తానన్నాడు. అపారమైన కరుణతో ఆ నిర్ణయం తీసుకున్నాడు.

తెల్లవారిన తర్వాత తన స్వప్న వృత్తాంతం భర్తకు చెప్పగా అతడు వెంటనే స్వప్నశాస్త్ర పారంగతులైన అరవై నలుగురు మహోన్నత పండితులను రప్పించి, మాయాదేవి స్వప్నం వివరించి, దాని అంతరార్థం చెప్పమని కోరాడు, పండితులు కూర్చుని చర్చించేందుకు, ఒక ప్రత్యేక ప్రదేశం పరిశుభ్రపరచి, ముగ్గులుపెట్టి, అందమైన తివాచీలు పరిచారు. వాటిపై రకరకాల పుష్పాలు చల్లారు. వాటి మధ్య బంగారు పళ్ళాలలో వెండిగిన్నెల్లో పాలు, వెన్న, తేనె పళ్ళు వుంచారు. పండితులకు పట్టుబట్టలు ఇచ్చారు. ఎవరెవరికో ఎన్నెన్నో బహుమతులు ఇచ్చారు. ఆ రోజు గొప్ప విందు ఏర్పాటు చేశారు. వారిలో ధనుడు, కౌసత, సుయాముడు, సుభోగుడు ముఖ్యులు.

పండితులు మాయాదేవి స్వప్నం చర్చించి, తమలో తాము తర్కించి, చివరికి ఒక నిర్ణయానికి వచ్చి, "మహారాజా! మాయాదేవి గర్భవతి అవుతుంది. ఆమె గర్భాన ఒక మగపిల్లవాడు జన్మిస్తాడు. అతడు రారాజైనా కావచ్చు - లేదా, జగద్గురువైనా కావచ్చు. అతడు నిశ్చయంగా ఈ భూమండలాన్ని శాశ్వతంగా పాలిస్తాడు. అతడు చక్రవర్తి కాకపోతే, సర్వసంగ పరిత్యాగియై సంబుద్ధుడౌతాడు" అన్నారు. అని— "బుద్ధుడంటే, జ్ఞానమూర్తి. జ్ఞాన స్వరూపమే, బుద్ధస్వరూపం అతడే తథాగతుడు. బ్రహ్మమార్గమైన ధర్మమార్గాన్ని లోకానికి తెలుపుటకై ఆత్మ శక్తికి — పవిత్రతకు

నిలయమగు ఒక దివ్యమానవ రూపంలో ఆవిర్భావం జరగబోతోంది" అన్నారు. అది విని రాజ దంపతులు పరమానంద భరితులయ్యారు.

పండితవాక్కు ప్రకారం మాయాదేవి గర్భవతి అయింది. నవమాసాలు నిండి, ప్రసవసమయం ఆసన్నమైనది. దేశ - కాల, ఆచార-సాంప్రదాయాల ప్రకారం పురుడుపోసు పుట్టింటికి బయలు దేరింది. ఆ రోజు మంగళవారం-వైశాఖ పూర్ణిమ. దారిలో-కపిల వస్తుకు ఇరవై మైళ్ళ దూరంలో "లుంబినీ" అనే ఉద్యానవనం వుంది. అది శుద్ధోధనుని ప్రత్యేక ఉద్యానవనం. ఆ సమయానికి ఆ వనం పచ్చగా, రకరకాల-రంగురంగుల పుష్పాలతో అందంగా వుంది. ఆ ప్రకృతి సౌందర్యానికి మాయాదేవి ముగ్ధురాలై, సాల వృక్ష ఛాయలో కొంతసేపు విశ్రమించడానికి ఆగింది.

ప్రయాణబడలిక తీర్చుకునే లోపల మాయాదేవికి అకస్మాత్తుగా పురుటి నొప్పులు ఆరంభమయ్యాయి. మరికొంతసేపటికి ఆమె ఒక మగబిడ్డను ప్రసవించింది. భూలోకక్షేమం కొరకు లోకోత్తర ఆకృతిగల పుణ్యశ్లోకుడైన పుత్రుడు ఉదయించాడు. బహువిచిత్రంగా అప్పుడు లుంబినీ వనమంతా కొంతసేపు నిశ్చలంగా వుంది. ఆ క్షణాన ఆకాశశోభ, బ్రహ్మాండ సృష్టి సంకీర్ణత్వంతో శోభిల్లింది. బుద్ధుని జననకాల నిర్ణయం విషయంలో చరిత్రకారులు భిన్నాభి ప్రాయాలు వెల్లడించి, చివరకు-క్రీస్తుపూర్వం ఐదువందల అరవై మూడుగా నిర్ధారణ చేశారు. ఆ తర్వాత మాయాదేవి, పసిబిడ్డతో కలసి కపిలవస్తుకే తిరిగి వచ్చింది.

పుత్రోదయ సందర్భాన్ని పురస్కరించుకుని శుద్ధోధనుడు పక్షాలమీద రాజ్యమంతటా గొప్ప ఉత్సవం ఏర్పాటు చేశాడు. కపిల వస్తు నగరమంతా పచ్చని తోరణాలు కట్టారు. జెండాలు ఎగుర వేశారు. రాజ మార్గాల్లో పూరేకులు చల్లారు. పోటీ భేరీలు, వాయిద్య సమ్మేళనాలు, నాట్య నాటక ప్రదర్శనలు— వివిధ కార్యక్రమాలు

ఏర్పాటు చేశారు. బంధు మిత్రులతో, ఉద్యోగులతో, రైతులతో, వర్తకులతో నగరం కిక్కిరిసిపోయింది. బాణాసంచా కాల్పులతో నగరమంతా బహు సందడిగా, సరదాగా, సంతోషంగా, కోలాహలంగా వుంది. ప్రజలందరికీ రకరకాల బహుమతులు- వస్త్రాలు, పళ్ళు, మణిమాణిక్యాలు-ఇలా ఏమేమిటి ఎన్నెన్నో బాలునికి సమర్పించారు.

ఐదవ రోజున పుట్టిన స్నానానంతరం బాలునికి నామకరణ మహోత్సవం జరిపించారు. ఎందరో జ్యోతిషశాస్త్రవేత్తలు వచ్చారు. బాలుని జాతకం చూసి అబ్బురపడి, అతనికి "సిద్ధార్థ" అని నామకరణం చేశారు. సిద్ధార్థ అంటే, సమస్త అభీష్టాలు నెరవేర్చువాడని అర్థం. భూగర్భమందున్న బీజమంతయు యావద్ద్రవ్యమూ కానరాకుండా ఇమిడి వున్నట్లు. సిద్ధార్థుడు తల్లి కుక్షిలో ప్రశాంతంగా వున్నాడు.

సత్యార్థసిద్ధి కోసం అవతరించిన సిద్ధార్థుని దర్శనార్థం అనేక ప్రాంతాల నుంచి అనేకమంది మహాత్ములు, మునులు, యోగులు, బ్రాహ్మణ పండితులు వచ్చారు. మహామేధావి, మంత్రవేత్త అయిన అసిత మహర్షి హిమాలయాల నుంచి వచ్చారు. వయో వృద్ధుడైన ఆ మహర్షిని చూసి, రాజ దంపతులు సాష్టాంగ నమస్కారం చేసి — సిద్ధార్థుని ఆయన పాదాల ముందు వుంచారు. ఆయన ఆ బాలుని ప్రేమగా చేతుల్లోకి తీసుకుని-అతనిలో ముప్పైరెండు మహా పురుష లక్షణాలు వున్నాయని-అష్ట సిద్ధులూ కలవాడని - ఇంకా అనేక మాంగళ్య లక్షణాలు కలవాడని గ్రహించి- రాజ దంపతులను ఉద్దేశించి, "ఈ బిడ్డడు సామాన్య మానవపుత్రుడు కాడు. పరమోన్నతమైన, పరిపూర్ణమైన జ్ఞానాన్ని- ముప్పైఐదవ ఏట సంపూర్ణంగా పొందుతాడు. ఇతడు లోకరక్షకుడై, అందరికీ పూజనీయుడుగా అవుతాడు. భూమండలం వున్నంత వరకు ఇతని కీర్తి నిలుస్తుంది.

ఇతని స్థానం, ఈ సృష్టిలోని మానవ-గగనతలంలో. ఇతడు తథాగతుడౌతాడు. ఇతని విషయమై మీరు ఎటువంటి సంశయాన్ని - ఆరాటాన్ని పొందనక్కరలేదు" అని చెప్పి "ఇతడు మానవ జాతిని తరింపచేస్తాడు. బుద్ధత్వం పొంది మానవులకు జన్మరాహిత్యం బోధిస్తాడు. జగత్తుకే సద్గురువు అవుతాడు. నూతన ధర్మాన్ని బోధిస్తాడు. ప్రేమతో, కరుణతో ధర్మాన్ని బోధించడానికి అవతరించిన కారణజన్ముడు. విశ్వకళ్యాణార్థం పవిత్ర జీవనాన్ని ప్రబోధిస్తాడు. ఇతడు తప్పక పరిపూర్ణుడు అవుతాడు" అని తన గౌరవాభిమానాల్ని సంతోషంతో వ్యక్తం చేసి-మరుక్షణం అందరికీ ఆశ్చర్యం గొలిపేటట్లు గంభీరులై, దీర్ఘ మౌనం వహించారు. ఆయన గంభీర మౌనం చూసి, "స్వామి మీరు ఎందుకు మౌనం వహించారు? మా బిడ్డకు ఏం జరగబోతోంది? ఆ సంగతి మాకు వివరంగా చెప్పండి" అని అడిగారు రాజ దంపతులు. దానికి ఆయన "బాలుడైన ఈ మహాత్ముని చూసిన సంతోషంతో వున్నాను. కాని, ఇతడు పెద్దవాడై-మహాజ్ఞాని అయిన తర్వాత-ఇతను బోధించే మహత్తర ధర్మాన్ని వినేందుకు నేను జీవించి వుండను కదా? అని ఆలోచిస్తున్నాను. అంతే" అన్నాడు.

అసిత మహర్షి వెళ్ళిన తర్వాత శుద్ధోధనుడు - తన కుమారుడు మహాత్ముడు అవుతాడని-బుద్ధుడై సర్వమానవాళినీ ఉద్ధరించ అవతరించిన జగద్గురువని-ఆ సంగతి అసిత మహర్షే స్వయంగా చెప్పారని- ఆ విషయ నిర్ధారణకు ఏడుగురు పండితులను రప్పించి సిద్ధార్థుని జాతకం చెప్పమన్నాడు. దీర్ఘ చర్చానంతరం సిద్ధార్థుని భావి జీవితం విషయంలో రెండు మార్గాలు వున్నట్లు ఆ పండితులు చెప్పారు.

ఒకటి : సిద్ధార్థుడు రాజ భవనంలోనే వుంటే, రారాజై భూమండలాన్ని గొప్ప దక్షతతో పరిపాలిస్తాడు. ప్రపంచానికే అధినేత అవుతాడు.

రెండవది : "రాజ్యాధికారాన్ని కాదని-సర్వసంగపరిత్యాగియై, లోకోద్ధరణకు పూనుకుని బుద్ధుడు అవుతాడు. ప్రపంచాన్ని ఉద్ధరిస్తాడు. ఇటువంటి మహా పురుషుడు వేల సంవత్సరాలకుగాని అవతరించడు. ప్రపంచాన్ని తన జ్ఞాన కాంతితో నింపుతాడు" అన్నారు.

ఆ పండితులలో కౌండిన్య తెగకు చెందిన సుధాత్త - లేక, సుదంతుడు అనే బ్రాహ్మణ పండితుడు వున్నాడు. అందరూ ఆయన్నే "కౌండన్య" అనేవారు. ఆయన సిద్ధార్థుని జాతకం నిశితంగా పరీక్షించి "ఇతడు సంసార విషయాలను పరిత్యజించి - సన్యసించి- బుద్ధుడై లోకం నుంచి దుఃఖాన్ని తరిమి-సమస్త జీవకోటిని ఉద్ధరిస్తాడు. కాని, ఒకటి మాత్రం నిశ్చయం-ఒక నిర్ణీత కాలంలో ఇతడు వరసగా నాలుగు విధాలైన సంఘటనలను చూస్తాడు. తత్ఫలితంగా సన్యసిస్తాడు, తప్పదు" అని చెప్పాడు.

సుధాత్త చెప్పిన సంగతులన్ని శ్రద్ధగా విన్న తర్వాత మిగిలిన పండితులు ఆ విషయాన్ని వివరిస్తూ-సిద్ధార్థుడు వరసగా ముసలి వానిని-రోగిని-మృత కళేబరాన్ని - సన్యాసిని చూసి, పరివర్తనం చెంది-సర్వసంగ పరిత్యాగం చేస్తాడు" అన్నారు.

పండితుల మాటలు విని శుద్ధోధనుడు కలవరపడ్డాడు. లేక లేక కలిగిన కుమారుడు తిరుగులేని రారాజు కావాలిగాని, రాజ్యాన్ని--- సమస్తాన్ని వదలి-దేశదిమ్మరి సన్యాసియై బుద్ధుడు కావడం జరుగ కూడదనుకున్నాడు.

సిద్ధార్థుడు పుట్టిన ఏడు రోజులకు తల్లి-మాయాదేవి మరణించడంతో- అతన్ని ప్రజాపతి గౌతమి పెంచడం చేత అతన్ని "గౌతముడు" అని పిలిచేవారు. ఆమె కుమారుడు నందుడు, ఐదురోజుల వాడు సిద్ధార్థుని పినతండ్రి శుక్లోధనుని కుమారుడు-మహానాముడు. అతడు సిద్ధార్థుని కన్నా పెద్దవాడు. ఆనందుడు-అమితోధనుడనే

పినతండ్రి కుమారుడు. సిద్ధార్థుని మేనత్త - "అమిత" కొడుకే దేవదత్తుడు. వారంతా సిద్ధార్థుని సమ వయస్కులు. సిద్ధార్థునికి అక్షరాభ్యాసం చేసి, "విశ్వామిత్రుడు" అనే గురువు దగ్గరకు పంపించారు. ఆయన వేద-వేదాంగ, ఉపనిషత్తులలో నిష్ణాతుడు. భాషా - తత్వ శాస్త్రాల్లో మంచి ప్రావీణ్యం గలవాడు. సిద్ధార్థుని అమోఘమైన తెలివి-అపారమైన జ్ఞాపకశక్తి ఉపాధ్యాయుల్ని - సహాధ్యాయుల్ని ఆశ్చర్యచకితుల్ని చేసేది. ప్రతి విషయంలో అతడు మేటి-అనిపించుకున్నాడు. అతనికి గణితమంటే ఎంతో ఇష్టం. పదవ ఏట నుంచే సమస్త విద్యలు-హస్తిపట్టడం, మల్లయుద్ధం, గుర్రపుస్వారీ - విలువిద్య మొదలైన విద్యలు నేర్చి, వాటిల్లో మంచి నైపుణ్యం సంపాదించాడు. భరద్వాజుని దగ్గర యోగశాస్త్రం - ధ్యానం నేర్చాడు. సంగీత-సాహిత్యాల్లో, భాషా- వ్యాకరణాల్లో - వేద-వేదాంగాలలో, శృతి-పురాణ-ఇతిహాసాల్లో-ఉపనిషత్తుల్లో-సర్వ శాస్త్రాల్లో ప్రవీణుడయ్యాడు. తాను అధ్యయనం చేసి, అభ్యసించిన విద్యల సారాన్ని గ్రహించి అవగాహన చేసుకున్నాడు. ధారణాబలంతో మంత్ర-తంత్ర రహస్యాలూ తెలుసుకున్నాడు. అతని మధుర భాషణమే, అతనికి వినయ సంపత్తిని చేకూర్చాయి. శాక్యవంశంలో జన్మించడం చేత అతన్ని "శాక్యసింహ" అని కొందరు పిలిచేవారు.

* * *

సిద్ధార్థుడు చాలా వరకు ఒంటరిగా, ఏకాంతంగా ఉండేవాడు. ప్రకృతి సౌందర్యానికి ముగ్ధుడై తన్మయత్వంలోకి పోయేవాడు. తరచు ధ్యాన నిమగ్నుడయ్యేవాడు. సర్వ ప్రాణులను సమానంగా చూసి, ప్రేమించేవాడు. ఒక రోజున సిద్ధార్థుడు తండ్రితో కలసి నగరం వెలుపలకు వెళ్ళాడు. అక్కడ ఒక పక్షి ఆకాశంలోంచి భూమిమీదకు వ్రాలి - నాగలి-చాలులో బైటపడ్డ పురుగును తన్నుకు పోవడం చూసి, "ఈ భూమిమీద సమస్త జీవకోటి ఒకదాన్ని

ఒకటి చంపుకు తింటాయనే" సత్యాన్ని గ్రహించాడు. ప్రపంచంలో ఎటు చూసినా హత్య, బాధ, మరణం, దుఃఖమేనని తెలుసుకున్నాడు. నిరంతరం, సమస్త ప్రాణికోటిచుట్టూ మృత్యువు తిరుగుతూ వుంటుందని గ్రహించి, "నాన్నగారూ, ఈ భూమినా నన్ను పాలించమంటున్నారు? ఇది - ఘోరంగా, దారుణంగా, క్రూరంగా, హింసాకాండతో నిండివుంది," అన్నాడు. అంత చిన్న వయసులో అతని మాటలు శుద్ధోధనునికి మేల్కొలుపుగా ధ్వనించాయి. దుఃఖమంటే ఏమిటో స్వానుభవంలో లేకపోయినా - ఆ దృశ్యం సిద్ధార్థుని లేతమనసులో చెరగని స్మృతిగా మిగిలిపోయింది. అలాగే, మనుష్యుల బాధలు, కష్టాలు, యాతనలు, వేదనలు, దుఃఖాలు - వాటి గురించిన ఆలోచనలు అతని హృదయంలో చోటు చేసుకుని - లోతుగా నాటుకుపోవడంతో - సంతప్త హృదయుడై - వేదనా భరితుడై కలతపడేవాడు.

వయసు పెరిగేకొద్దీ సిద్ధార్థుడు దృఢంగా, పొడవుగా, అందంగా, నాజూకుగా తయారయ్యాడు. చక్కని ఒళ్ళు, మేలిమి బంగారు ఛాయ, శ్రీకారం లాంటి చెవులు, పద్మాల్లాంటి నేత్రాలు. సూటైన ముక్కు, ఉన్నత భుజాలు, సమ్మోహనమైన చిరునవ్వుతో- తీక్షణమైన చూపులతో - గొప్ప అందంతో వెలిగిపోయేవాడు. మంచి అలవాట్లతో సర్వగుణ సంపన్నుడుగా - సౌమ్యుడుగా - దయాళువుగా వుండి అందరికీ ప్రేమాస్పదుడైనాడు.

కపిలవస్తులో ఏరువాక పండుగ చాలా ప్రధానమైనది. ఆ ఉత్సవంలో శుద్ధోధనునిది ప్రధానపాత్ర. ఉత్సవ సమయానికి దేశమంతా పచ్చని చెట్లతో, చిరు ప్రవాహాలతో కల కలలాడుతూ వుంటుంది. పిల్లలు గాలిపటాలు ఎగరేస్తూ, ఉత్సాహంగా వుంటారు. ఏరువాక పండుగ ఉత్సవాల్లో అందరూ పాల్గొంటారు. ఆ సంవత్సరం ఉత్సవం ఆరంభమైంది. శుద్ధోధనుడు బంగారు నాగలి చేతబట్టి,

నేలమన్నాడు, ఆ తర్వాత ఆయన బంధు - మిత్రులు, దళాధిపతులు, ఉద్యోగులు, తక్కిన ప్రజలు అందరూ నాగళ్ళు పట్టుకుని పొలాల్లోకి వెళ్ళి నేలదున్నారు. సిద్ధార్థుడు ఒక వటిమిచెట్టు నీడను స్థిరంగా కూర్చుని, క్రమంగా ధ్యాననిమగ్నుడయ్యాడు. ఎన్నో సంవత్సరాలు తీవ్ర తపస్సుచేసిన వాని మాదిరిగా అతడు సమాధి స్థితి చేరుకున్నాడు. పరిచారకులు అతని స్థితి గమనించి, రాకుమారుని పై చెట్టునీడ పడుతోందనే ధైర్యంతో వెళ్ళి - వేడుకల్లో పాల్గొన్నారు. వారు తిరిగి సాయంత్రం వచ్చేప్పటికి సిద్ధార్థుడు అట్లానే చెట్టుకింద- యోగాసనంలో స్థిరంగా కూర్చునే వున్నాడు. అది చూసి, ఆశ్చర్యపోయి - ఆ సంగతి రాజుగారికి చెప్పారు.

★ ★ ★

ఒకరోజున సిద్ధార్థుడు వనంలోకి వెళ్ళాడు. అక్కడ ఒక చోట ఆకాశం నుంచి భూమిమీదకు ఎర్రటి రక్తం ధారగా కారడం చూసి- పరుగు పరుగున అక్కడకు వెళ్ళి చూడగా - ఆ రక్తం మడుగులో ఒక హంస గిలగిలా తన్నుకుంటూ పడింది. సిద్ధార్థుడు దాన్ని చేతుల్లోకి తీసుకుని, దగ్గరలోవున్న కొలనులోని నీరు త్రాగించి, గాయం కడిగి, తన ఉత్తరీయం చింపి, కట్టుకట్టి - ఒడిలో పెట్టుకుని ఓదార్చాడు — అతని ఒళ్ళూ - బట్టలూ రక్తమయమైనాయి. హంస కళ్ళు తేలేసి, తలవాల్చేసి బాధగా, దీనంగా అతని కళ్ళల్లోకి చూస్తూ వుండగా దేవదత్తుడు వచ్చి—సిద్ధార్థుని ఒడిలో వున్న హంసను బలవంతంగా లాక్కోబోతే, "దేవదత్తా, నువ్వేనా దీన్ని బాణంతో కొట్టింది? ఎంత క్రూరమైనపని చేశావు. ఇప్పుడు దీన్ని ఏం చేయబోతున్నావు?" అని అడిగితే - "ఇది నాది - దీన్ని నా ఇష్టం వచ్చినట్లు చేసుకుంటాను. దీన్ని నేనే బాణంతో కొట్టాను." అన్నాడు. అతని క్రూరస్వభావం గమనించి, "అనంత ఆకాశంలో ఎగిరేదానికి ఎవరూ యజమానులుకారు. కాని, నేను దీనికి ప్రాణం పోశాను. కనుక, ఇది నాది," అన్నాడు సిద్ధార్థుడు.

దేవదత్తుడు దానికి అంగీకరించలేదు. చివరికి ఇద్దరూ ఒక నిర్ణయానికి వచ్చారు. పెద్దల తీర్పు ప్రకారం సమస్యను పరిష్కరించుకోదలిచారు. ప్రాణదానం చేసిన వానికే, దానిపై హక్కు వుంటుందన్నారు, పెద్దలు. ఆనాటి నుంచి దేవదత్తుడు సిద్ధార్థునిపై శత్రుత్వం వహించాడు. అతడెవరో కాదు, సిద్ధార్థుని బంధువర్గంలోని వాడే. కోలుకునే వరకు హంసను శ్రద్ధగా కాపాడి, తర్వాత దాన్ని విడిచిపెట్టాడు- అనంత ఆకాశంలోకి.

సిద్ధార్థుని అహింసా తత్వం, లోక కళ్యాణమార్గం, గొప్ప అనుభవశాలి మాదిరిగా గంటల తరబడి ధ్యాననిమగ్నుడు కావడం- అందు సమాధిస్థితికి వెళ్ళడం వంటి విషయాలు శుద్ధోధనుని కలవర పరిచాయి. మహర్షి మాటలు నిజమౌతాయనే భయంతో సిద్ధార్థునికి సమస్త విద్యలు అంతఃపురంలోనే ఏర్పాటు చేశాడు. అయినా అతనిలో అగ్ని రగులుతూనే వుంది. అతనిస్థితి గమనించినకొద్దీ, అసితమహర్షి మాటలు, కౌండిన్యుల వారు చెప్పిన సంగతులు జ్ఞప్తికి వచ్చి, శుద్ధోధనుడు ఆందోళన చెందేవాడు. సిద్ధార్థుని కళ్ళల్లో లోకాతీతమైన శాంతం - ప్రసన్నతతోపాటు వదనంలో విషాద రేఖలు గోచరించేవి. మహాత్ముల మాటల్లో విశ్వాసముంచి - ముసలి వారిని - రోగులను - మృతకళేబరాలను - అతని కంట పడకుండా వుండేందుకు వీలుగా, మూడుకాలాలకు అనుకూలంగా వుండే మూడు మహా సౌధాలు నిర్మించాడు, శుద్ధోధనుడు. వాటికి "శుభ- రమ్య - సురమ్య" అని పేర్లు పెట్టారు. ఆ సౌధాలలో సమస్త సౌకర్యాలు సమకూర్చబడ్డాయి. ఎటువంటి పరిస్థితులలోనూ సిద్ధార్థునికి జీవితంమీద విరక్తి కలగకుండా - ఆసక్తి కలిగేందుకు అందు అందమైన విలాసినులను, నాట్యకత్తెలను నియమించారు. ఆ భవనాలచుట్టూ గట్టి బంధోబస్తు వుంచాడు. ఆ సౌధాల ఆవరణలో

ఉద్యానవనాలు, కొలనులు, ఏర్పాటు చేశారు. మూడుకాలాలకు తగినట్లు కొలనులలో ఎరుపు – తెలుపు - నీలం - తామరపుష్పాలు పూసేటట్లు చేశారు. విలాసవతులు అతని ఒంటికి చందనంపూత పెట్టేవారు. అతను బయటికి వెడితే, ఆడవాళ్ళే ఛత్రం పట్టేవారు. అతని చుట్టూ అన్ని వేళలా అందమైన అమ్మాయిలు వీణలు వాయిస్తో, పాటలుపాడుతో, నృత్యంచేస్తో, సరసాలాడుతో వుండే వారు. ఆ మూడు సౌధాలకు మూడుమైళ్ళ పరిధిలో సిద్ధార్థుని పరిత్యాగానికి సంబంధించిన ముసలి, రోగి, మృతుడు, సన్యాసి అతని కంట పడనీయరాదని శుద్ధోధనుడు కఠినంగా శాసించాడు. ప్రతివిషయం - ప్రతివస్తువు - సిద్ధార్థుని దృష్టికి సర్వాంగ సుందరంగా, రమ్యంగా, ఆకర్షణీయంగా వుండేటట్లు ఏర్పాటు చేయించాడు. ఆ విధంగా అతని చుట్టూ భూలోకస్వర్గం నిర్మించాడు. దుఃఖం - బాధ - కష్టం - మొదలైన విషయాలేవీ అతని కంట పడకుండా ఏర్పాటు చేశాడు. ఏ విధంగానైనా సరే - సిద్ధార్థుని విధి నిర్ణయాన్ని మార్చాలని మహారాజు శుద్ధోధనుడు అనేక ప్రయత్నాలు చేశాడు. చివరికి పెద్దల సలహామేరకు అతనికి వివాహం చేయ నిశ్చయించుకున్నాడు. ఆ సంగతి సిద్ధార్థునితో చెప్పగా, "వివాహానికి ముందు లోకానుభవం సంపాదించడానికి దేశాటన చేస్తాను" అన్నాడు సిద్ధార్థుడు. దానికి శుద్ధోధనుడు, "రాజ్య పాలనకు, వివాహానికి దేశాటన చేయనవసరంలేదు, నువ్వు వివాహం చేసుకుంటే, ఆ వైభవం కళ్ళారాచూసి సంతోషించాలని నా కోరిక," అన్నాడు. సిద్ధార్థుడు మౌనం వహించడంతో అంగీకారంగా భావించాడు తండ్రి.

సిద్ధార్థుడు భోగలాలస పరుడనీ, లోకానుభవం లేనివాడనీ, సోమరి జీవితం గడిపేవాడనీ, విద్యలేవీ నేర్వలేదనీ రాజులు తమ కుమార్తెలనిచ్చి వివాహం చేయడానికి ఎవరూ ముందుకురాలేదు. ఆ సంగతి తెలిసి సిద్ధార్థుడు కపిలవస్తులో విలువిద్య-గుర్రపుస్వారీ వంటి

పోటీ ప్రదర్శన ఏర్పాటుచేసి, రాకుమారులకు ఆహ్వానాలు పంపి, అందర్నీ రప్పించి, వారిలో-తానే మొదటివాడుగా వచ్చి-చూడ వచ్చిన పెద్దల మెప్పు పొందాడు. ఆ పోటిలో తన గుర్రం "కాంతక" తన ప్రత్యేకతను చూపించింది. ఆ తర్వాత-తన మేనమామ - కొలి యాన్ రాజ్యాధిపతి-దండపాణి కుమార్తె- యశోధరను - రమణీయ సిద్విలాసంకల సిద్ధార్థుడు వివాహం చేసుకున్నాడు. ఆమెనే అశ్వ ఘోషుడు "యశోవిశాల" అన్నాడు.

సిద్ధార్థుడు యశోధరతో చాలా అన్యోన్యంగా వుండేవాడు. అతడు అనునిత్యం ఆమెయందు అనురాగంతో వుండేవాడు. ఆమె పాడితే, అతడు వీణ వాయించేవాడు. సాయంత్రాలు ఇద్దరూ ఉద్యానవనంలో విహరించేవారు. సూర్యోదయం వేళ సెలయేటి గట్టున కూర్చుని, ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులయ్యేవారు. అతడు ఆమెకు అనేక సంగతులు చెప్పేవాడు. నవ్వించేవాడు - లాలించే వాడు.

ఆమెను గట్టిగా హత్తుకుని తన్మయత్వం పొందేవాడు. అంత లోనే అతని చూపు చెదిరి, దృష్టిమారేది. ఏ లోకంలోనో విహరిస్తున్నట్లు వుండి, క్రమంగా ధ్యాన నిమగ్నుడయ్యేవాడు. ఆమె అతన్ని గమ నించకుండా పాడుతూ వుండేది. ఆమె అతని చిత్తాన్ని ఎంత రక్తిపంతమొనర్చినా-సర్వరసానుభూతివంతుడైన సిద్ధార్థుడు తరచు పరధ్యానంలో పడేవాడు. అతని స్థితి చూసి ఆమె ఆశ్చర్యపడేది. అతడు నెమ్మదిగా తేరుకుని, గొప్ప అనుభవజ్ఞుని మాదిరిగా ఏవేవో సంగతులు చెప్పేవాడు. ఒక్కొసారి అతని విషయం అగమ్యగోచ రంగా వుండేది. తరచు అతని చూపుల్లో ప్రేమ-దయ-కరుణ-జాలి వంటివి కనుపించేవి. ఒక్కొక్కసారి అతని వింత స్థితి చూచి కలవర పడి కన్నీరు పెట్టుకునేది, ఆ కన్నీరుచూసి అతను ఆమెను ఒడి లోకి తీసుకుని ఓదార్చేవాడు. పాటలుపాడి, నవ్వించి మరిపించే వాడు.

తన చుట్టూ ఆసక్తికరమైన, వినోదభరితమైన, విలాసవంత మైన పరిస్థితులు ఎన్ని వున్నా, సిద్ధార్థుడు మొదటినుంచీ సజ్జనుల సాంగత్యం-ఏకాంతం ఇష్టపడేవాడు. ఇతర ఆలోచనలు- సంకల్పాలు ఏమీలేకుండా బ్రహ్మసంపంలో మునిగి వుండేవాడు నిశ్చలంగా, నిర్వికారంగా, నిర్లిప్తంగా, నిగూఢంగా వుండేవాడు.

కులగురువు-అమాత్యుడు అయిన ఉదయుడు ఎప్పుడూ సిద్ధార్థుని వెంట వుండి అనేక దుష్ప్రేరణలు చేసేవాడు. విషయ భోగాసక్తి కలగించ యత్నించేవాడు. ఉద్రేకపరచ చూసేవాడు. సిద్ధార్థుని చుట్టూ సమ్మోహన శక్తులు కల అందమైన అమ్మాయిలు హావ- భావ కేళీ విలాసాల్లో ఆరితేరినవారు-వుండేవారు. సిద్ధార్థుడు వారిని లక్ష్య పెట్టక, స్థిర సంకల్పంతో వుండటం చూసి అతని మనసు మార్చాలని అనేక పురాణ గాథలు చెప్పేవాడు.

పురంధరుడైన దేవేంద్రుడు, గౌతముని భార్య అహల్యను వలచాడు. సోముని భార్య - రోహిణిని అగస్త్యుడు వలచాడు. లోపాముద్ర సహితం వలపించబడ్డట్లు శృతిలో చెప్పబడింది. బృహస్పతి-మమతను రమించి భరద్వాజుని కన్నాడు. వ్రతదీక్షలో వున్న బృహస్పతి భార్య-తారను చంద్రుడు రమించి, బుధుని కన్నాడు. పరాశరుడు కామోద్రేకంతో కాళిని సంభోగించాడు. వశిష్టుడు తక్కువ కులస్థురాలైన అక్షమాలతో సహజీవనం గడిపాడు. రాజర్షి యయాతి వార్ధక్యంలో సహితం విశ్వాకి అనే అప్సరసతో కాలం గడిపాడు. విశ్వామిత్రుడు మేనకతో సుఖించాడు రమిస్తే మరణం తప్పదని తెలిసికూడా పాండురాజు మాద్రితో కూడాడు. కనుక నువ్వూ ఈ విలాసవతుల కోర్కెలు నిరాకరించకు" అని ప్రోత్సాహించేవాడు. సిద్ధార్థుడు అతని మాటలు వినక మౌనంగా వుండేవాడు.

"తాను అనుభవిస్తున్న సుఖలాలస-శృంగార రసభరితజీవితం కాక ఈ లోకంలో ఇంకా ఏ విధమైన జీవితం వుంది?" అని తనలో

తాను అనుకున్నాడు, సిద్ధార్థుడు. అతడు అమాయకుడు, అజ్ఞాని, అవివేకికాడు. మహా మేధా సంపన్నుడు. మానవ జీవితోద్దేశ్యం ఏమిటో తెలుసుకోదలిచాడు. తనకు ఏదో కావాలి. తాను, ఏదో తెలుసుకోవాలి. ప్రతిదీ తనకు స్వానుభవంకావాలి. తాను మారాలి. తనకు అర్థంకాకుండా, అందకుండా, అగోచరంగా వున్నదేదో— దాన్ని-తాను పొంది, అవగాహన చేసుకోవాలనుకున్నాడు. అప్పుడప్పుడూ అతడు ఏదో తెలియని వేదనతో బాధపడేవాడు; తపన పడేవాడు. తనని తాను ఏ అరమరికా లేకుండా లోపల, బైటా పరీక్షగా, పరిశీలనగా చూసుకునేవాడు. వైరాగ్య భావం అతనిలో పెరిగే కొద్దీ, ఆలోచనలు కూడా అధికమయ్యాయి. గొలుసులతో బంధించబడ్డ మదపుటేనుగుకు, విస్తృత విహారం చేయాలన్న సంకల్పం కలిగినట్లు, సిద్ధార్థునికి లోకం చూడాలన్న కోర్కె కలిగింది.

* * *

సిద్ధార్థుడు జన్మించినప్పటికే ఆర్యులు ఉత్తరభారత భూభాగమంతా ఆక్రమించి, స్థిరపడ్డారు. వారి భాష, సంస్కృతం. వారికి వేదమే, ప్రమాణం. వారి దృష్టిలో వేదం. సమస్త విద్యల సారం. వారు, తమ ఆచార వ్యవహారాలను, సాంప్రదాయ పద్ధతులను తమ జానిసలపై రుద్దారు. ఆర్యుల ప్రవేశంతో, భారతదేశంలో వర్ణవ్యవస్థ మరింత గట్టిపడింది. సంఘం-కులం-వర్ణం-ప్రాముఖ్యత వహించాయి. ప్రజలు మనుధర్మశాస్త్రాన్ని పాటించేవారు. దేశాల మధ్య ఐక్యమత్యం వుండేదికాదు. సామాన్య ప్రజలు మూఢ విశ్వాసాలతో వుండేవారు. వారు చాలావరకు ప్రకృతి ఆరాధకులు. స్వరూపజ్ఞానం మరచి, అర్థరహితములైన యజ్ఞయాగాది క్రతువులతో, బహు దేవతారాధనతో-అర్థశూన్యమగు కర్మకాండతో ప్రజాజీవితం నిండి వుండేది. సంఘంలో బ్రాహ్మణపురోహితులదే పైచేయిగా వుండేది. బ్రహ్మైక్య సంధాన విధానమైన వైదికమతం, చెలామణిలో వుండేది. కృత

యుగం-వేదయుగం, ఋగ్వేదం-ప్రజ్ఞానాం, బ్రహ్మ. యజుర్వేదం అహం బ్రహ్మాస్మి. సామవేదం- తత్వమసి - అథర్వణవేదం - అయమాత్మా బ్రహ్మ. ఆ విధంగా ఆ నాలుగు వేదాలూ బ్రహ్మను తెలియజేస్తే, త్రేతాయుగం, స్మృతియుగమని, ద్వాపరయుగం-పౌరాణికమని, కలియుగంలో ఆగమబద్ధమైన పూజా ప్రార్థన ఆచరణీయాలని చెప్పేవారు. అంతేకాదు-నామస్మరణే చాలునని కూడా చెప్పారు.

తత్వవిజ్ఞానానికి అది క్షీణకాలమని చెప్పవచ్చు. కాని, స్వస్వరూప జ్ఞానం కల మహాత్ములు లేకపోలేదు. వేద సాంప్రదాయానికి విరుద్ధంగా, ఎన్నో బయలుదేరాయి. బ్రాహ్మణ మతానికి చెందిన శాంత, సమచిత్తులైన శ్రమణులూ, యతీశ్వరులూ వుండేవారు. సన్యాసంతో కొందరు మోక్షం కోరేవారూ వుండేవారు. మొత్తంమీద బ్రాహ్మణులు-శ్రమణులు పరాన్న జీవులుగా బ్రతికేవారు. వారిలో కొందరు క్షుద్రవిద్యలూ నేర్చారు.

ఉపనిషత్తు కాలంలో జీవాత్మ–పరమాత్మ; ఆత్మ-పదార్థం వంటి విషయాలు చర్చలోకి వచ్చాయి. ఆ తర్వాత, చార్వాకుల భోగపరాయణత్వం, పెనుతుఫానులాగ, దేశంమీదికి వచ్చి పడింది. "చావుతో అన్నీ అంతమౌతాయి. తిరిగి అవి పంచభూతాల్లో కలుస్తాయి. ప్రత్యక్షంగా, గోచరించేదే, సత్యం. వేరేదీ లేదు" అన్నారు. వారి పద్ధతిలో ఊహకీ, భావానికీ చోటులేదు. వారికి, ఇతరుల సాక్ష్యం, అంగీకారయోగ్యం కాదు. ఇంద్రియానుభవం ఒక్కటే, వారికి జ్ఞానం. పునర్జన్మ-కర్మ, స్వర్గం, నరకాలు-ఏమీలేవు. అంధవిశ్వాసానికి అవివేకమే కారణమన్నారు. దైవం, పరలోకం-పిరికితనం, దౌర్బల్యం అన్నారు. దానితో ఆస్తిక - నాస్తిక వాదాలు బయల్దేరాయి. బాహ్య ప్రపంచంలోని వైరుధ్యాలు, మనోగతాలైన వైరుధ్యాలు ప్రజా జీవితంలో తలెత్తాయి. కాలం, చిత్ర–

విచిత్ర భావ సంపుటంగా, కోలాహలంగా తయారైనది. భావ సాంకర్యంతో కాలం, ప్రళయతాండవం ఆడుతున్న రోజులవి. విజ్ఞాన సాంకర్యం, నీతి సాంకర్యానికి దారితీసింది. తత్ఫలితంగా, ప్రజల దృష్టి, క్రమంగా తత్వగోష్ఠి - విషయ చర్చలమీదకు మళ్ళింది. కానీ, నైతిక దృష్టి శూన్యం. మతాధిపతుల - పురోహితుల - రాజుల ఆధిపత్యం అధికమై - వారి అహంకార, అన్యాయాలకు సామాన్య ప్రజలు నలిగి - అలసి - అణగి - నూతన ధర్మప్రబోధంకోసం ఎదురు చూస్తున్నారు.

* * *

ఆ రోజుల్లో సంఘాలకు ఎంతో ప్రాముఖ్యం వుండేది. దాన్ని వ్యతిరేకించే శక్తి - ధైర్యం - సామర్థ్యం ఎవరికీ— చివరికి రాజులకు సైతం వుండేదికాదు. సిద్ధార్థుడు కూడా ఇరవయ్యో ఏట శాక్య సంఘంలోచేరి — ఎనిమిదేళ్ళు శ్రద్ధగా పని చేశాడు.

శాక్యులకు, సరిహద్దునవున్న కొలియులకూ రోహిణీనది నీరే ఆధారం; ప్రజలకు - పశువులకు - పంటలకు - ఆ నీటి వినియోగం విషయంలో తరచు వారిద్దరిమధ్య తగాదాలు వచ్చేవి. ఒకొక్కసారి యుద్ధాలకు దారితీసేవి. సిద్ధార్థుడు ఎప్పుడూ కలహాలను, యుద్ధాలను అంగీకరించే వాడుకాదు. సామరస్యంగా సమస్య పరిష్కరించాలనేవాడు. అహంభావంకల సంఘపెద్దలు - యుద్ధానికి సిద్ధపడేవారు. సంఘపెద్దలు సిద్ధార్థుని అర్థం చేసుకునేవారు కాదు. అటువంటి విషయాలతో - ప్రజలతో — సంఘటనలతో నిరంతరం సతమత మగుటకంటే - పరివ్రాజక జీవితం మేలనుకున్న సమయాలు లేకపోలేదు, సిద్ధార్థుని జీవితంలో. సంఘాన్ని వ్యతిరేకిస్తే - ఎదురయ్యే సమస్యకూడా సిద్ధార్థునికి తెలుసు.

క్రమంగా సిద్ధార్థునిలో ఏదో తెలియని వేదన ఆరంభమైంది. తనకు ఏం కావాలో - అసలు తానేమిటో తెలుసుకోవాలన్న ఆర్తి

అతనిలో అధికమైంది. ఆ సంపర్కంలో ఒకరోజున సిద్ధార్థుడు తన సారథి చెన్నుణ్ని పిలిచి, "చెన్నా, మనం నగరంలోకివెళ్ళి - ప్రపంచం ఎట్లావుందో చూసి వద్దాం, రథం సిద్ధం చెయ్యి", అన్నాడు.

సిద్ధార్థుడు ఎన్నడూ కోరని కోర్కె కోరాడు. అది విని చెన్నుడు ఖిన్నుడై - "రాజాజ్ఞలేనిదే ఎవరూ - దేనికీ - ఎప్పుడూ- సిద్ధార్థుని ఆ మూడు సౌధాలనుంచి బైటికి తీసుకుపోరాదు," అనే సంగతి గుర్తుకు తెచ్చుకుని, అక్కడి నుంచి సరాసరి శుద్ధోధన మహారాజు దగ్గరకువెళ్ళి "మహారాజా, యువరాజావారు నగరం చూస్తానంటూ నన్ను రథం సిద్ధం చేయమన్నారు తమ ఆజ్ఞ ఏమిటి?" అన్నాడు.

అశనిపాతం లాంటి ఆ వార్తవిని, శుద్ధోధనుడు - ఓ క్షణం నిశ్చేష్టుడై - "చెన్నా అలాగే తీసుకువెళ్ళు. కాని, రాజాజ్ఞమరచి పోకు. జాగ్రత్త! అతనికి వయసు వచ్చింది. వివాహమైంది. లోకాను భవం పొందాలి - రాజ్యాధికారం చేపట్టవలసిన సమయమిది. కాని, అతని కంట ఏటువంటి బాధాకరమైన సంగతి - సంఘటన చివరికి - వాడిన పుష్పం - రాలిన ఆకు - ఎండుకొమ్మ - కాలు విరిగిన చీమ సైతం — ఏదీ అతని దృష్టిలో పడకుండా చూడు" అని చెప్పి — రాజమార్గం శుభ్రంచేయించాడు. నగరవాసులందర్నీ తమ - తమ గృహాలు అందంగా అలంకరించి, యువరాజుకు సంతోషంతో స్వాగతం చెప్పమన్నాడు.

సిద్ధార్థుని రథం కదిలింది. రాచ - [illegible] ఖచితంగా గమ్యానికి చేరువ అవుతోంది. సిద్ధార్థుడు [illegible]లో ప్రవేశించాడు. రాజాజ్ఞ ప్రకారం నగరమంతా అందంగా అలంకరించారు. సుందర ప్రపంచానికి కపిలవస్తువే, కేంద్రం అనిపించింది. నగరంలో ఎక్కడా వికృతం - వికారం - క్రూరత్వం - హింస - సద్ది - వంటి-

అప్పటి - రోగి - ముసలి - మృత్యువు - బాధ - దుఃఖం — కష్టం ఏడుపు - విచారం - సన్యాసి - ఏదీ - ఏమీ కానరాకుండా నగర మంతా గొప్ప సంతోషంగా - ఉత్సవదినంగా - ఉత్సాహంగా ఉల్లాసంగావుంది. సిద్ధార్థుడు తిరిగి రాజభవనం చేరుకునే వరకూ దారిపొడవునా గట్టి బందోబస్తు చేయించాడు, శుద్ధోధనుడు. అతని కంట ఏ విధమైన విషాద సంఘటన పడకుండా కట్టుదిట్టం చేశాడు. నగరాన్ని చూస్తూ, "చెన్నా, ప్రపంచం ఎంత బావుంది! ఎంత అందంగా వుంది! ఎంత ఆనందంగా వుంది. ఈ పదార్థ ప్రపంచానికి అవతల ఇంకా ఏముందో - అది ఎట్లావుందో వెళ్ళి చూద్దాం - రథాన్ని ముందుకు పోనియ్యి," అన్నాడు.

దారిపొడవునా ప్రజలు గుంపులు గుంపులుగా గుమిగూడి - జండాలు పట్టుకుని - పుష్పాలు వెదజల్లుతూ, "యువరాజుకీ - జై" అంటూ నినాదాలు చేస్తూ సంతోషంగా వున్నారు - పళ్ళు - పువ్వులు అందమైన వస్తువులు కానుకలుగా సమర్పించారు. అదంతా రాజాజ్ఞ అని సిద్ధార్థునికి తెలియదు.

సిద్ధార్థుని రథానికి నాలుగు తెల్లని గుర్రాలు కట్టారు. అవి ఏమచ్చాలేని తామరపుష్పాల్లా వున్నాయి. అవి ఎంత వేగంగా పరిగెత్తుతున్నాయో, అంతకన్నా వేగంగా సిద్ధార్థునిలో ఆలోచనలు పరిగెత్తుతున్నాయి. అతనిలో ఏదో తెలియని అశాంతి. ఎంత దూరం వెళ్ళి - ఎన్ని చూసినా అన్నీ ఒకే విధంగా వుండి విసుగు పుట్టించాయి.

అంతలో ఆకస్మాత్తుగా వారి రథానికి ఒక ముసలి అతను అతిభారంగా అడుగులు వేస్తూ, అడ్డువచ్చాడు. రథం ఆగింది. అతడు బాగా చిక్కి శల్యమైవున్నాడు. రక్త మాంసరహితమైన దేహంతో, కాంతిలేని అతని కళ్ళు, గుంటల్లా వున్నాయి. తెల్లటి పీచులాంటిజుట్టు - బోసినోరు - గూనివీపు - వంకరకాళ్ళు - చేతిలో

త్ర — ఎముకల గూడుపైన ఎండిన చర్మం కప్పినట్లున్నాడు - గాలి పీల్చడం - పదలడం కూడా అతనికి కష్టంగానే వుంది. ఆ వ్యక్తి - ఆడో - మగో తెలియకుండా వుంది. ఆ వ్యక్తినిచూసి, "చెన్నా అతడు అంత దౌర్భాగ్యమైన - దీనమైన - హీనమైన - భయంకర మైన స్థితిలో ఎందుకు వున్నాడు?" అని అడిగాడు. దానికి చెన్నుడు "యువరాజా, అతడూ అందరిలాంటి మనిషే. కాని, వయసువల్ల ముసలివాడైనాడు. ఎనభై ఏళ్ళక్రితం, అతని వీపు నిటారుగా, కళ్ళు కాంతి వంతంగా, దేహం, దారుఢ్యంతో - అందంగావుండేది. వయసు, జీవితసారాన్ని పిండేసింది. దేహం, కుష్కించింది. నూనె అయిపోతే, దీపం ఎట్లా వుంటుందో, అట్లావుంది అతని ప్రస్తుతదేహ స్థితి. నూనె అయిపోయి, వత్తికాలి, నుసికట్టింది. దీపం మిణుకు-మిణుకు మంటోంది. అతని రూపం, స్మృతి - పరాక్రమం అన్నీ నశించాయి. దేహం, రాలిపోవడానికి సిద్ధంగా వుంది," అన్నాడు.

"చెన్నా, నేను ఇంతవరకు అటువంటి మనిషిని చూడలేదు. ఇదంతా చూస్తోంటే, ఈ జన్మ అసహ్యంగా తోస్తోంది. అన్నేళ్ళు బ్రతికితే, ఆ అవస్థ అందరికీ తప్పకుండా దాపురిస్తుందా? ఈ యదార్థం తెలిసికూడా, ప్రజలు ఏల విచారశూన్యులగు చున్నారు?" అన్నాడు బాధగా సిద్ధార్థుడు.

దీర్ఘకాలం జీవించిన వారందరికీ ముసలితనం సంభవిస్తుందనీ, దానికి తరతమ భేదభావంలేదనీ తెలుసుకుని, మానవ జీవితం మీద చాలాసేపు యోచించాడు. అప్పటి వరకు ఉల్లాసంగావున్న సిద్ధార్థుని మనసు, క్షణంలో సంక్షోభంలో పడిపోయింది.

రథం, రాజభవనం చేరుకుంది. సిద్ధార్థుని చూపులో, మాటలో మార్పు వచ్చింది. అతను ఎవరితోనూ, ఏమీ మాట్లాడక - సరాసరి తన గదికి వెళ్ళి దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. యశోధర వెళ్ళి ఎంత పలకరించినా, సిద్ధార్థుడు గంభీరంగా వుండిపోయాడు, అతని

స్థితి చూసి, ఆమె నిలవలేక అతని పాదాలమీదపడి, ఏడ్చి ప్రాధేయ పడింది, మాట్లాడమని-అతడు మౌనంగానే వుండిపోయాడు. అతడు ఆ రాత్రి ఏమీ తినలేదు, నిద్రపోలేదు.

*　　　*　　　*

ఆ మర్నాడు, జరిగిన సంగతంతా చెన్నుడు చెప్పగా విని, శుద్ధోధనుడు "చెన్నా, నువ్వు నన్ను నాశనం చేశావు" అని, "అయినా నువ్వేం చేస్తావు? ఇదంతా నా ప్రారబ్ధం. జరగకూడనిది జరిగింది. అసలు జరగవలసింది, జరిగింది" అని, సిద్ధార్థుని దగ్గరకు వెళ్ళి చూశాడు. అతడు అందరానంత దూరాలకు వెళ్ళినట్లు అనిపించింది. అతడు తన చేతినుంచి జారిపోయాడనుకున్నాడు. ఏమైనా విధి బలీయమైనదనుకున్నాడు. జ్యోతిషం తప్పిపోదనిపించింది. అసితుని మాటలు అసత్యం కావు. కాని, తాను తండ్రిగా చివరి వరకు, గట్టి ప్రయత్నం చేయదలిచాడు. సిద్ధార్థుని మనసు మార్చ డానికి ఆ రోజు గొప్పవిందు— వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు. ఏ ఒక్కటీ అతనిని ఆకర్షించలేదు.

యశోధర సిద్ధార్థుని సమీపించి, ప్రభూ, నన్నూ భరించ లేకుండా వున్నారా?" అని దీనంగా అడిగింది. దానికి అతడు— "యశోధరా, నా మనసు, మామూలు సుఖాల్ని కోరడంలేదు. ఒక రోజున ఇదంతా తప్పక అంతం అవుతుంది. కనుక, ఇది త్వరగా అంతం కావాలని నా మనసు ఆశతో ఆరాట పడుతోంది. మనం కొన్నేళ్ళ తర్వాత ముసలివాళ్ళం అవుతాం. భయంకరమైన ఆ స్థితి నుంచి తప్పించుకునే తరుణోపాయాన్ని నా మనసు వెదుకుతోంది" అన్నాడు.

ఆ రాత్రి శుద్ధోధనుని కలలో—బంగారం వలె ధగధగమెరుస్తో ఒక జెండా కనుపించింది. దాని మధ్య వజ్రాయుధం వుంది.

అంతలో, అకస్మాత్తుగా పెనుతుఫాను వచ్చింది. జెండా తునాతునక లైంది. అది నేలకూలి- మట్టిపాలైంది. కాని, చిరిగిన ఆ జెండా పీలికల్ని ఒక అపూర్వశక్తి-కలిపి, మళ్ళా జెండాగాచేసి, కోట తూర్పు ద్వారంమీద ఎగరేసింది."

ఆ తర్వాత మరో కల- పెద్ద రథం. దానికి నాలుగు గుర్రాలు కట్టారు. ఆ రథంలో సిద్ధార్థుడు కూర్చున్నాడు. ఆ రథం నిప్పు రవ్వలు వెదజల్లుతూ వెడుతోంది.

తెల్లవారు జామున ఇంకో కల : ఆరుగురు వికృతాకారులు, అరుస్తో, భయపెడుతో కనుపించారు. ఆ విధంగా శుద్ధోధనుడు రాత్రంతా కలల-కలత నిద్రలోనే గడిపాడు.

ఉదయమే పండితుల్ని రప్పించి, తన కలలు చెప్పి— వాటిని వివరించమని కోరాడు శుద్ధోధనుడు-ఎవరూ వివరించలేకపోయారు. కాని, అంతలో ఎక్కడనుంచో ఒక మహాత్ముడు వచ్చి, విషయం తెలుసుకుని, "మహారాజా, అవి పీడకలలు కావు. నువ్వు భయపడ నవసరం లేదు. త్వరలోనే కపిలవస్తు కీర్తి దశదిశలా వ్యాపించ బోతోంది" అన్నాడు. ఆయన మాటలువిని—శుద్ధోధనుడు పట్టరాని సంతోషంతో ఎన్నో దానాలు చేశాడు.

ఆనాటి నుంచి శుద్ధోధనుడు సిద్ధార్థుని విషయంలో మరింత శ్రద్ధ వహించాడు. మరొకసారి పరివారానికి గట్టి ఆజ్ఞల్ని జారీ చేశాడు. సిద్ధార్థుని భవనాల చుట్టూ కాపలాపెట్టాడు ఎటువంటి అవాంఛనీయ దృశ్యాలూ కానరాకుండా.

★ ★ ★

కొన్నాళ్ళ తర్వాత సిద్ధార్థుడు ప్రకృతిశోభ తిలకించడానికి పల్లెప్రాంతం వెళ్ళడానికి తండ్రి అనుమతి కోరాడు. కొడుకు చెయ్యి జారిపోతున్నాడన్న సంగతి ఆయనకు తెలుస్తోనే వుంది. అయినా

కాదనలేక, అంగీకరించాడు. చెన్నుని సారథ్యంలో రథం నగరం దాటిన తర్వాత— దారిపక్క, చెట్టుకింద ఒకతను, ఒంటరిగా మోకాళ్ళపై తలపెట్టుకుని - బాధగా మూలుగుతున్నాడు. సిద్ధార్థుడు అతన్ని చూసి, రథం ఆపమని, క్రిందికి దిగి - అతన్ని ప్రేమగా - దయగా చేతుల్లోకి తీసుకుని - ఉపచారంచేసి - చెన్నుణ్ని పిలిచి, "ఇతనెవరు? ఇతనికి ఏమైనది?" అని అడిగాడు. దానికతడు, "అతని ఆరోగ్యం చెడిపోయింది. అటువంటి అనారోగ్యవంతులు, లోకంలో ఎప్పుడూ ఎందరో వుండనే వుంటారు. శరీరం విషయంలో శ్రద్ధ చూపకపోతే, ఎవరికైనా ఆ స్థితి తప్పదు," అన్నాడు.

"ప్రజలు రోగాలతో ఆ విధంగా బాధపడకుండా ప్రభువులు కాపాడకపోతే, ఇంత రాజ్యపాలన ఎందుకు?" అని "దుఃఖిత ప్రపంచమా" అని నిట్టూర్చి, ధూమ్రాకాశాలవంత శూన్యంగా చూశాడు, సిద్ధార్థుడు.

హృదయ భారంతో సిద్ధార్థుడు రాజభవనం చేరుకున్నాడు. చెన్నునిద్వారా సిద్ధార్థుని సంగతులు తెలుసుకున్న శుద్ధోధనుడు, ఇంక అతని జీవనగమనం ఆపటం ఎవరి తరమూ కాదని నిర్ధారణ చేసుకుని, అయినా అతని మనసు మార్చాలని - ఆ రోజు కూడా విందు - వినోదాలు ఏర్పాటు చేశాడు. కాని, సిద్ధార్థుడు వాటిల్లో పాల్గొనలేదు.

* * *

మరి కొన్నాళ్ళ తర్వాత సిద్ధార్థుడు చెన్నుణ్ణి పిలచి - రథం సిద్ధం చేయమన్నాడు. ఆ రోజు ఉద్యానవనంవైపు వెళ్ళారు. కొంత దూరం వెళ్ళాక - ఒకచోట కొందరు గుండెలు బాదుకుని ఏడుస్తున్నారు. కొందరు ఒకతన్ని పాడెపై పడుకోబెట్టి మోసుకు పోతున్నారు. అటువంటి దృశ్యం అంతకు ముందెన్నడూ సిద్ధార్థుడు చూడలేదు. అదిచూసి, "అదేమిటి? అతన్ని అలా ఎందుకు మోసుకు

పోతున్నారు?" అని చెన్నుణ్ణి అడిగితే "అతను మరణించాడు. ఆ శవాన్ని శ్మశానానికి మోసుకుపోతున్నారు. అతనేకాదు-అందరూ-ఎప్పుడో ఒకప్పుడు మరణించవలసిందే! ఈ జీవితానికి అంతం, మృత్యువు. అది అనేక కారణాల సంభవించవచ్చు. చావు, ప్రకృతి సహజం – అది సర్వప్రాణికోటి సామాన్య ధర్మం. అది కేవలం స్థితి పరివర్తన – లేదా - ఒకదీర్ఘనిద్ర – అంతే – దాని గురించి యోచించడం మూర్ఖం. వీలైనంత ఎక్కువకాలం, జీవించడానికి ప్రయత్నించాలి," అన్నాడు. అతని మాటలు శ్రద్ధగావిని - "చచ్చేది ఏది? చనిపోయేది ఎవరు?" అనుకుంటూ, తీవ్ర ఆలోచనల్లో మునిగిపోయాడు, సిద్ధార్థుడు. కావాలని తనను తండ్రే తన జీవితస్థితి - గతులనుంచి ఇన్నేళ్ళూ దూరం చేశాడనే సంగతి గ్రహించి, "ఇంతకాలం మహాసౌధాల్లోవుండి భోగజీవితాన్ని గడిపి– ఏదీ గమనించకుండా - దేనికీ ఎరుకలో లేకుండా తప్పుడు జీవన విధానాన్నే చూశాను," అని అనుకున్నాడు.

సిద్ధార్థునిలో అగ్నిపర్వతం బ్రద్దలైంది. ఆవేశం, తీవ్రమైంది. లోకానికీ, జీవితానికీ కళ్ళు తెరిచాడు. అతనిలో అణగివున్న ఉత్తేజాలన్నీ ఒక్కసారి ప్రజ్వరిల్లాయి. ఏదో తెలియని బాధ - దాన్ని మించిన దుఃఖం - తనకే తెలియని తనస్థితి అసహ్యంగా తోచి, "ఈలోకం నుంచి దుఃఖాన్ని - బాధని ఎవరూ తరిమెయ్యలేరా? దాన్నించి తప్పించ శక్యం కాకపోతే, ఈ ప్రాణికోటికి ఇంకెట్లా విముక్తి కలుగుతుంది? "అని అనుకుని," జీవితం దుఃఖమయం. దాన్నించి తప్పించుకునే ఉపాయంకాని, ఉపశమన మార్గంకాని, విమోచనా విధానంకాని ఏమీవున్నట్లు తోచకపోవడంతో-సిద్ధార్థుని ఆలోచన దుఃఖనివృత్తి మార్గాన్వేషణలో పడింది. తానేకాదు - సమస్త ప్రజానీకం – సర్వప్రాణికోటి - దుఃఖంనించి తప్పించుకునే తరుణోపాయం - యోచించ నారంభించాడు. "ఈ జీవితం,

ఇంతేనా? అయితే నేను దేనికోసం రేపటికి జీవించాలి? జీవితార్థం ఇంకా ఏదోవుంది. లేకపోతే - అది అర్థరహితం," అనుకున్నాడు సిద్ధార్థుడు.

సిద్ధార్థుడు రాజభవనం చేరాడు. అయినా అతన్ని ఆ ఆలోచనలు వదలలేదు. మొదట-తనని తాను సమస్త బంధాలనుంచి స్వేచ్ఛపరచవలెనుకున్నాడు. దుఃఖమూలాన్ని కనుక్కొని, దాన్నించి తప్పించుకునే మార్గం తెలుసుకుని—ఆ రహస్యం అందరికీ తెలియపరచాలనుకున్నాడు. కాని, మానవుల అహంకారం చూసి, నవ్వుకున్నాడు. క్రమంగా అతనిలో, శూన్యభావం ఏర్పడింది. లోకపరమైన సుఖ-శాంతులు, కళా కాంతులు సిద్ధార్థునిలో సన్నగిల్లాయి. ముకుళిత పద్మం మాదిరిగా వున్నాడు.

భవిష్యత్తు ఏ విధంగా తన కర్తవ్యం నెరవేర్చుకుంటోందో, జ్యోతిషం ఏ విధంగా యదార్థం కాబోతోందో, మానవ ప్రయత్నం ఎంత చేసీ ఈశ్వర నిర్ణయంవల్ల - అది ఏ విధంగా విఫలం కాబోతోందో, ఒక్కొక్కటి చూసి గమనిస్తున్నాడు శుద్ధోధనుడు. తన కొడుకు సర్వసంగ పరిత్యాగం చేసి-చివరికి ఇల్లువదలి-సన్యాసి అవుతాడనే దృఢ నిశ్చయానికి వచ్చాడు. కాని, తండ్రిగా తన బాధ్యత చివరివరకు నిర్వర్తించాలని, ఏ విధంగానైనా సిద్ధార్థుని మనసు మార్చి-అతని జీవిత గమ్యాన్ని తిప్పాలని-తాను చేస్తున్న ప్రయత్నాలు వ్యర్థమని తెలిసి కూడా అతడు- ఆ రోజు రాత్రి - ఒక నాట్య ప్రదర్శన ఏర్పాటు చేశాడు.

* * *

మరి కొన్నాళ్ళ తర్వాత సిద్ధార్థుడు చెన్నునితో కలసి అరణ్య ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ ఒక శిథిలాలయం మెట్లమీద ఒక వ్యక్తి కూర్చుని సూర్యాస్తమయశోభను తిలకిస్తూ, నిశ్చలంగా ప్రశాంతంగా వున్నాడు. అతడు కాషాయాంబరాలు ధరించాడు.

అతని అనాసక్తతకు సిద్ధార్థుడు విభ్రమచెందాడు. అతని పక్కన భిక్షాపాత్ర-ఒక కర్రా వున్నాయి. అతను అందరికంటే హాయిగా, ఆనందంగా, శాంతంగా, సుఖంగా, సంతోషంగా వున్నట్లు తోచింది, సిద్ధార్థునికి. బాధల నుంచి, యాతనల నుంచి- సంబంధాల నుంచి - విచారాలనుంచి-వేదనలనుంచి - ఆవేదనలనుంచి - తృష్ణ, మోహం నుంచి-తనను తాను విముక్తిపరచుకునే యత్నంలో అతను ఆ విధమైన జీవన విధానాన్ని ఎన్నుకున్నాడనుకున్నాడు. అతని కాళ్ళకు చెప్పులులేవు. గుండు చేయించుకున్నాడు. దేన్నీ లక్ష్యపెట్టని అతని ఎంత వైఖరి, సిద్ధార్థుని బాగా ఆకర్షించగా, చెన్నునికి అతన్నిచూపి "ఎవరీ మహానుభావుడు? ఎంత నిశ్చలంగా-నిశ్చింతగా- నిర్మలంగా - నిర్భయంగా-ప్రశాంతంగా-ప్రపంచ సుఖ దుఃఖాలకు అతీతంగా- ఒంటరిగా—హాయిగా, ఆనందంగా-వున్న ఆ మహాత్ముడెవరు?" అని అడిగాడు.

"యువరాజా! అతడొక పరివ్రాజకుడు. జనన—మరణ రహస్యాలు తెలుసుకోవాలని బయలుదేరిన, శ్రమణుడు. విశుద్ధ మానసుడు. పవిత్రశీలుడు. తపోధనుడు. జన్మ, జరా, మృత్యు తరంగాలతో పొంగిన - భయంకరమైన సంసార సాగరం దాటి - మహత్తరమైన నిర్వాణపథాన్ని పొందాలని - పరమార్థ మార్గంలో ఇంద్రియ సుఖాలు విసర్జించినవాడు జీవితం దుఃఖమయమని తెలుసుకుని-స్వేచ్ఛ కోసం-ముక్తికోసం-శాంతి, ఆనందం కోసం - సర్వసంగపరిత్యాగం చేసినమహానుభావుడు. ముసలితనం-రోగం-మృత్యువు-మనిషిని ఎట్లా పట్టి పీడిస్తాయో తెలుసుకుని- ప్రపంచాన్ని పరిత్యజించి-జీవిత పరమార్థాన్ని అన్వేషించడానికిబయలుదేరిన వారిలో ఇతడొకడు. అవిద్యా సంసారబంధం నుండి-విముక్తికై, ఆవేదన పడువాడు. ఇతనికి స్థిర నివాసమంటూ వుండదు. ఎవరైనా-ఏదైనా పెడితే, తింటాడు. ఏ చోటైనా నిద్రిస్తాడు. వారికి తన - పరభేదం వుండదు. వారికి అందర్నూ అంతటా ఒకటే, సమానమే. సదాసంచారులైన ఈ సాధువుళ్ళు ఆశ-ప్రయత్నంలేని జీవితం గడుపుతారు. నిరాడంబరంగా

జీవిస్తారు. ప్రపంచాన్ని దుఃఖం నుంచి తప్పించేందుకు, తపిస్తారు. ధ్యానం ద్వారా సత్ప్రవర్తన ద్వారా-ఆత్మ శాంతి, ఆనందం లభిస్తాయని బోధిస్తారు" అన్నాడు.

చెన్నుని మాటలు సిద్ధార్థునికి ఎంతో ప్రీతి కలిగించాయి. కనువిప్పు కలిగించాయి. ఉపశమనాన్ని-ఓదార్పునీ ఇచ్చాయి. మనసు తేలికపడి- "చెన్నూ, ఒక సాధువు-సన్యాసి గురించి ఏం చెప్పాలో, అది చాలా గొప్పగా చెప్పావు. నీ మాటలు నన్ను తృప్తి పరిచాయి. నాకూ, అటువంటి దివ్య జీవనం గడపాలని వుంది. అటువంటి జీవితం వాంఛింపతగ్గది," అని, "చెన్నా మనం త్వరగా రాజభవనం చేరుకోవాలి," అన్నాడు సిద్ధార్థుడు.

దారిలో ఒక క్షత్రియ కన్య- "కిసా గౌతమి" సిద్ధార్థునికి ఎదురై-"ఇతని తల్లి-తండ్రి-భార్య-పరమానందమూర్తులు" అంటూ పొగిడింది. ఆ పొగడ్తలో, "నిర్వృత్తి" అనే పదాన్ని ఉపయోగించింది. ఆ మాట సిద్ధార్థుని హృదయాన్ని గట్టిగా తాకింది. అతనికెంతో పరమానందమైంది. ఆ మాటమీద యోచించాడు. ఏది శాంతించగా, హృదయం పరమశాంతి పొందుతుంది? రాగం శాంతిస్తే దోషాగ్ని శాంతిస్తుంది. దోషాగ్ని శాంతిస్తే, మోహాగ్ని శాంతిస్తుంది. మోహాగ్ని శాంతిస్తే-అభిమానాది సకలదోషాలు ఉపశమిస్తాయి. అప్పుడే మానవుడు శాంతిగా వుండగలడు" అని నిశ్చయించుకుని, ఆ రాత్రే తాను సత్యాన్వేషణకు బయలుదేరి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. అంతటి పరమ సత్యాన్ని తెలియజేసినందుకు, ఆమెను తన గురువుగా భావించి- తన మెడలోని ముత్యాలహారాన్ని బహుమానంగా పంపితే, ఆమె తీసుకుని, సిద్ధార్థుడు తనను ప్రేమిస్తున్నాడనుకుంది.

సిద్ధార్థుడు రాజభవనం చేరి- "నిర్వృత్తి" అనే మాట మీద ముఖ్య ఆలోచన చేశాడు. నిర్వాణ మార్గాన్ని దర్శించ యత్నించాడు. ఆ క్షణంలో-అతనిలో ఒక భయంకరమైన ఆలోచన చెల

రేగింది. "ఈ జీవితానికి మృత్యువే పరమావధి అయితే, ఇంక ఈ జీవితార్థం ఏమిటి?" దానిపై యోచిస్తో-రాజభవనం ముందున్న పొన్న చెట్టుకింద హార్చుని-దేశదిమ్మరి జీవితం గడిపి అయినా సరే, దుఃఖనివారణోపాయాన్ని తెలుసుకోవాలనుకున్నాడు. వీలైనంత త్వరగా బంధాల నుంచి-బాధ్యతల నుంచి బైటపడాలనే గట్టి నిశ్చయానికి వచ్చాడు.

బరువైన ఆలోచనతో భవనంలోకి వెళ్ళాడు. మొదట వినోద-క్రీడాస్థలికి వెళ్ళాడు. అక్కడ అందరూ అందమైన అమ్మాయిలే వున్నారు. వాళ్ళంతా మద్య, మాంసాల్లో మునిగి, మత్తెక్కి వున్నారు. నాట్యాలు, కచేరీలు జోరుగా సాగుతూ, తారస్థాయిలో వున్నాయి. వారిలో కొంతమంది విద్యావేత్తలు, కళాకారులు వున్నారు. అక్కడ ఎటు చూసినా ఆకర్షణలే, ఆహ్వానాలే. అవన్నీ తన కోసం, తన తండ్రి ఏర్పాటు చేసినవే. కాని ఏ ఒక్కటీ సిద్ధార్థుని ఆకర్షించలేదు. అవన్నీ చూసి, "నేను ఆ సన్యాసి మాదిరిగా సంకల్ప రహితంగా జీవిస్తాను. ఈ రోజే-ఈ రాత్రే-ఈ క్షణంలోనే అన్నీ వదలిపోతాను. ఎప్పుడోకాదు-ఇప్పుడే - ఈ క్షణంలోనే-అది జరగాలి. నా హృదయ భారం తగ్గాలి. ఇన్నేళ్ళూ ఏదీ తెలుసుకోకుండా-దేనికీ ఎరుకలో లేకుండా, చివరికి నన్ను నేను లోపలా, బైట-ఎప్పుడూ పరిశీలనగా-పరీక్షగా చూసుకోకుండా బ్రతికిన వృథా బ్రతుకునుంచి బైటపడతాను. నేను తప్పకుండా ఈ క్షణంలోనే సన్యసిస్తాను. విముక్తికై అన్వేషిస్తాను" అని, అనుకుని "జీవితాన్ని పూర్తిగా అనుభవించి-ప్రాపంచిక ధర్మాన్ని చేపట్టమన్న తండ్రి మాటలమీద మరొకసారి యోచించాడు.

అంతలో శుద్ధోధనుడు పంపగా వచ్చిన పరిచారకుడు "యువరాజా! యువరాణీవారు-మగబిడ్డను ప్రసవించారు" అన్నాడు. అది విని, "ఆహా, రాహువు పుట్టాడా?" అన్నాడు సిద్ధార్థుడు. రాహు

అంటే అర్థం-ప్రతిబంధకం. సిద్ధార్థుడు అట్లా అన్నాడని-ఆ బాలునికి "రాహులుడు" అని పేరుపెట్టారు. రాహులుడు అంటే, ప్రేమించ దగినవాడని అర్థం. తనను బంధించేందుకు మరొక బంధం పుట్టిం దనుకున్నాడు సిద్ధార్థుడు. అక్కడ నుంచి భవనం లోపలకు వెళ్ళాడు. అక్కడ వున్నవారందరికీ అతని వైఖరి భిన్నంగా తోచింది. జరగకూడదనిది-ఏదో జరగనున్నట్లు కొందరికి అనిపించింది.

మనుమడు పుట్టిన సంతోషంలో శుద్ధోధనుడు బ్రహ్మాండమైన కార్యక్రమాలు — విందు — వినోదాలు ఏర్పాటు చేశాడు. అనేక దానాలు చేశాడు. సిద్ధార్థుడు ఆ వేడుకలన్నీ యాంత్రికంగా చూశాడు. అయినా అతని దృష్టి వాటిపైలేదు. దృష్టి బట్టే సృష్టి కదా? వేడుకలు ఎంతగొప్పగా — వైభవంగా — కోలాహలంగా — ఉత్సాహంగా — ఉల్లాసకరంగా వున్నా, సిద్ధార్థుడు దేనిపైనా ఆసక్తి చూపలేదు. అతని స్థితి శుద్ధోధనుడు — ప్రజాపతి గౌతమి దూరం నుంచి చూసి — గమనిస్తున్నారు. అందరూ బాగా తిని — తాగి — ఆడి — పాడి మత్తులో ఎక్కడివారు అక్కడ - అస్తవ్యస్తంగాపడి నిద్రపోయారు - పెనుతుఫాను, చెట్లను కూకటి వేళ్ళతో కూల్చి నట్లు - విశృంఖల ఇంద్రియ సుఖాలు - వారి జీవితాల్ని అట్లా కూల్చాయి. సిద్ధార్థుడు అవన్నీచూసి, ఒకవిధమైన - చిత్రమైన నిద్రమత్తులో మునిగిపోయాడు.

అర్ధరాత్రి తర్వాత, సిద్ధార్థుడు మగత నిద్రనుంచి మేల్కొని, చుట్టూ చూశాడు. రాజభవనం నిశ్శబ్దంగావుంది. అప్పటి వరకు ఆడి - పాడిన రసికశిఖామణులు - ప్రఖ్యాతరాజనర్తకులు - ఎక్కడి వారక్కడ - ఒంటిని - బట్టల్ని సరిచూసుకోకుండా - వికృతంగా పడివున్నారు. వారి దేహాలు, చైతన్యం - జీవకళ - అందం - సొగసు - నాజూకుతనం - ఆకర్షణ - అన్నీపోయి వికారంగా పడి వున్నాయి. ఆ దృశ్యం - సిద్ధార్థునికి జుగుప్సాకరంగా తోచింది.

అది చూసి - కామ, భోగాలను అసహ్యించుకున్నాడు. కాంచనం మీది కాంక్ష, కామినీమీది వాంఛ - మనిషిని ఎట్లాహీన పరుస్తాయో, గమనించాడు. సృష్టి సౌందర్యశోభలో ఎన్ని అందాలు తనవచ్చినా, మనిషి అది కాలం మానవుడుగానే మిగిలిపోయాడు - ఏ మార్పు - వికాసం లేకుండా. అందాల్ని - ఆనందాల్ని - సుఖాల్ని నాశనం చేస్తున్న వివిధ వైరుధ్య, విషపూరిత - దృశ్యమాన జగత్తంతా అసత్యమని అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు, సిద్ధార్థుడు.

అటువంటి అనుభవానంతరం, సిద్ధార్థునికి ప్రాపంచిక జీవనం మీద-విషయాకర్షణలమీద విరక్తి కలిగింది. చిత్తక్షేత్రంలోగల సమస్త వృత్తులూ సమూలంగా అణగి, ఆరిపోయాయి. సమస్త ప్రపంచం - జీవితం - అగ్నిజ్వాలల మధ్య రగులుతున్నట్లు అనిపించి, బైటికి వెళ్ళి - పున్నమివెన్నెల వెలుగునీడల్లో - శిరీషం - వృక్షం క్రింద కూర్చుని - జనన మరణాలమధ్య, జీవితం గురించి మరొకసారి దీర్ఘంగా యోచించాడు. కాని, అతన్ని నిద్ర పూర్తిగా వదలలేదు. అతన్ని వెదుక్కుంటూ అంతరాత్రి వేళ-వచ్చి బాలింత-యశోధర వచ్చి, అతని వింతస్థితిచూసి - అది నిద్రకాదని గ్రహించి, "ప్రభూ! మేల్కొండి. నాతో మాట్లాడండి. ఒక్కసారి కన్నెత్తి నన్ను చూసి-యశోధరా! "అనిపిలవండి. మీ రాకకోసం ఇప్పటి వరకు ఎదురు చూశాను. రాహులుని మీ చేతుల్లోకి తీసుకుని ముద్దాడరా? ఎంత అందంగా వున్నాడో! ఆ చిరునవ్వూ అన్నీ మీ పోలికలే ప్రభూ! రండి. వచ్చి, రాహులుని తీసుకోండి," అని దీనంగా అర్థించింది.

సిద్ధార్థుడు అర్ధనిమీలిత నేత్రాలతో - యశోధరవంక చూసి-చిరునవ్వునవ్వి - మళ్ళా పక్కకు తిరిగి, బరువుగా కళ్ళు మూశాడు. ఎన్నడూలేని ఆ మాయనిద్ర - ఆ రోజు అతన్ని ఆవహించింది. సిద్ధార్థుడు ఏ నాడూ యశోధరయెడల అట్లా ప్రవర్తించలేదు. అతని వింత పరిస్థితి చూసి, "ప్రభూ కళ్ళుతెరచి - నన్ను చూసి - మాట్లాడండి. నా కోసం, ఈ మాయనిద్రనుంచి మేల్కొండి," అన్నది.

ఆమె మాటలు, అభ్యర్థన విని, "యశోధరా, నీ కోసం తప్ప కుండా మేల్కొంటాను. మేల్కొన్నాను. ఈ రాత్రి, పూర్తిగా మేల్కొన్నాను. ఒక్క నీ కోసమేకాదు, సమస్త ప్రాణికోటి కోసం మేల్కొంటాను. నీ బిడ్డనూ, నిన్నూ ఈ రాత్రి తప్పకుండా చూస్తాను" అన్నాడు. సిద్ధార్థుడు ఓదార్పుగా - అర్థయుక్తంగా- కాని, అతని కళ్ళు మూతలు పడే వున్నాయి. తడిఆరని కన్నీళ్ళతో యశోధర వెళ్ళిపోయింది.

*　　　*　　　*

ఇరవై తొమ్మిది సంవత్సరాలు, సమస్త భోగభాగ్యాలతో— విలాస, వినోదాలతో కాలం గడిపిన సిద్ధార్థుని అంతర్యంలో ఆ రాత్రి బుద్ధత్వం పొందేందుకు అంకురార్పణ జరిగింది. అందమైన భార్య - అప్పుడే పుట్టిన కొడుకు - ఆప్యాయత - అనురాగం - ప్రేమాభిమానాలు చూపే తల్లి - తండ్రి-ఎదురుచూస్తున్న రాజ్యాధి కారం - బంధుమిత్రులు, ప్రేమించే ప్రజానీకం - సమస్తం అతనికి ఒక్క రాత్రి కాలంలో కొరగానివిగా, నిరుపయోగమైనవిగా తోచాయి. సమస్త బంధాలు మనస్సులోంచి శాశ్వతంగా తెగి పోయాయి. ఎటువంటి కలతలూ, కెరటాలూలేని నిశ్చలమైన సరస్సు మాదిరిగా, ఆ క్షణాన అతని మనస్సు నిర్మలం, శాంతంగా వుంది. అసలు మానవ జీవితోద్దేశ్యం ఏమిటో తెలుసుకోవాలనే బలీయమైన తృష్ణలోపల్నించి వెల్లుబికి వచ్చింది. తాను ఇచ్చిన మాట ప్రకారం యశోధరను, రాహులుని చూడ్డానికి సిద్ధార్థుడు ఆమె గదికి వెళ్ళాడు. రాహులుని ముఖం మీద చేయివేసి, యశోధర నిద్రపోతోంది. రాహులుని ముఖం చూడాలంటే, ఆమె చేయి తదపాలి. ఆమె మేల్కొంటే, అంతా గందరగోళమౌతుంది. అందుచేత సిద్ధార్థుడు ఆమె శయ్యకు దూరంగా నిలబడి - తన రెండు చేతుల్ని గట్టిగా జోడించి - హృదయానికి హత్తుకుని, తలవొంచాడు. కొంత దూరం

వెళ్ళి - మళ్ళా వెనక్కి తిరిగి ఆమె, గది దగ్గరకు వచ్చాడు. ఆ విఫలంగా మూడుసార్లు అటూ ఇటూ తిరిగాడు. మూడోసారి, మంచం పైనున్న తెరతొలగించి, నిద్రిస్తున్న యశోధరను చూసి, "ఇప్పుడు నేను ఏ కార్యార్థం వెడుతున్నానో - ఆ కార్యం నెరవేరితే, ఆ ఫలితంతో తిరిగి నీ దగ్గరకు వస్తాను" అనుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

యశోధరమీద అమితమైన ప్రేమచేత సిద్ధార్థుని పెదవులు ఒకక్షణం బిగుసుకున్నాయి - నీళ్ళతో నిండిన కళ్ళుపైకెత్తి - శూన్య ఆకాశంవంక చూశాడు. తర్వాత తలకిందికిదించి - భూమాతకు నమస్కరించి, "భూమాతా, సమయమైనది. దుఃఖమయమైన ఈ ప్రపంచాన్ని రక్షించాలని గట్టిగా ప్రయత్నిస్తున్నాను. దుఃఖ నివృత్తి మార్గాన్వేషినై బయలుదేరుతున్నాను. ఈ నా సర్వసంగ పరిత్యాగంతో - నేను ఆశించేదీ ప్రయత్నించేదీ లభ్యమైతే, - అప్పుడు లోకోద్ధరణకు పూనుకుంటాను. ఓ భూమాతా, ఒక్క నీ కోసమే బయలుదేరుతున్నాను. నా యవ్వనాన్ని — రాజ్యాన్ని - భార్య - బిడ్డని - తల్లి తండ్రుల్ని - సర్వస్వాన్ని - సంతోషాన్ని, సుఖాన్ని - ఐశ్వర్యాన్ని - ప్రశాంతమైన పగటి వేళల్ని - ఆహ్లాద కరమైన వెన్నెల రాత్రుల్ని - సుందరమైన జీవనాన్ని పక్కకు నెట్టేసి, ఒక్క నీ కోసమే బయలుదేరుతున్నాను. నేను అన్వేషించేది - లభ్యమయ్యే వరకు నేను తిరిగి ఇక్కడికిరాను" అనుకుంటూ సిద్ధార్థుడు రాజభవనం దాటాడు.

* * *

భవనం ముందు సర్వభోగాదివతి మారుడు ప్రత్యక్షమై సిద్ధార్థా, వెళ్ళకు. వెనక్కి తిరుగు. అన్నీ వదలిపోవద్దు. త్వరలో నువ్వు రారాజువు అవుతావు. సిద్ధార్థా చూడు! నువ్వు వెదికేది నువ్వు అనుకున్నంత తేలికగా లభ్యమయ్యేదికాదు, దైవం,

మానవుణ్ని సృష్టించి అతని వెనక అతని అంతానికి మృత్యువును ఏర్పాటు చేశాడు. బ్రతికివున్నంత కాలం తిని - తాగి - హాయిగా సుఖాలు అనుభవిస్తూ జీవించు" అన్నాడు. సిద్ధార్థుడు అతని మాటలు లక్ష్యపెట్టలేదు. దానితో అతనికి కోపం వచ్చి-సిద్ధార్థునిలో ఏ క్షణంలో కోపం, అసూయ, వాంఛ, లోభం ప్రవేశిస్తుందోనని సమయం కోసం కాచుకుని వున్నాడు. అతన్ని పతనం చేయడానికి.

ధర్మార్థాల మధ్య ఘర్షణ ఏర్పడక ముందే, ధర్మానికై అర్థాన్ని-అర్థాంగిని అన్నింటినీ త్యజించిన సిద్ధార్థుడు నిద్రపోతున్న చెన్నుని లేపి, తన ప్రేమాస్పదమైన గుర్రం-కాంతకను సిద్ధం చేయమన్నాడు. చెన్నుడు మొదట కంగారుపడినా, సిద్ధార్థుని మాటకు ఎదురు చెప్పక "ప్రభూ! ఇంత రాత్రివేళ..." అంటూ ఆగిపోతే, "అవును, అవ్యక్తమైన కాంతిని వెదకడానికి వెడుతున్నాను" అని, "నువ్వొ ఒక గుర్రాన్ని తెచ్చుకో. కొంతదూరం నన్ను అనుసరించు" అన్నాడు.

చెన్నుడు నిశ్చేష్టుడై నిలబడటం చూసి, "ప్రియమైనచెన్నా, మార్గం అంధకారమే కావచ్చు. అగాధాలే వుండవచ్చు. బ్రతుకు దుర్భరం కావచ్చు. కావలసినవారు ఏడ్పులు, అభ్యర్థనలు, నిట్టూర్పులు పెట్టవచ్చు. ప్రేమించేవారు బాధపడవచ్చు కాని, నేను వెళ్ళి తీరాలి" అన్నాడు.

దానికి చెన్నుడు, "ప్రభూ, మీరు హృదయ పూర్వకంగా, స్థిర నిశ్చయంతో వున్నారు. కనుక కాంతకను తప్పక తీసుకొస్తాను. మీరు అన్వేషించేదాన్ని మీరు తప్పక పొందగలరు. మీ పాదాలు మిమ్మల్ని సురక్షితంగా వెనక్కి- మా వద్దకు తీసుకురావాలని కోరుతున్నాను" అన్నాడు.

చెన్నుడు వెళ్ళి రెండు గుర్రాల్ని తీసుకొచ్చాడు. అతన్ని చూసి "ఏందుకంటావా? సంసార జీవితం పూర్తిగా బంధమయం. అనుక్షణం తృష్ణచే తరుముబడుతూ జీవితం సాగించవలసి వుంటుంది. కారణంలేని కార్యం వుండదు. దుఃఖానికీ ఓ కారణం వుంటుంది. ఆ కారణం, తృష్ణ. తృష్ణవలన చింతలు వృద్ధి అవుతాయి. మనసు చంచలమై భ్రాంతితో వుంటుంది. అది ఎంతటివారినీ ఒనికిమాలిన వారిగా మారుస్తుంది. దానికి వివేకం కావాలి. అనుకూల భావన అయిన సుఖాన్ని కోరితే, అది స్వల్ప సుఖాన్ని, అధిక దుఃఖాన్ని ఇస్తాయని తెలుసుకున్నవాడు, తృష్ణను నాశనం చేయడంమీదే మనసు పెడతాడు. ఒనిటివాన కురిసినా, తృష్ణతీరదు. తృష్ణ, పునర్జన్మకు దారితీస్తుంది. భోగాల కోసం - సుఖాల కోసం - ఉనికి కోసం పురోభి వృద్ధి కోసం తృష్ణఎప్పుడూ ఎదురుచూస్తుంది. అది, అనర్థదాయ కము. అటువంటి భయంకరమైన తృష్ణ అంతం కావాలన్నా, ఇంక ఎటువంటి వాంఛ, కోర్కె కలగకుండా వుండాలన్నా దానికి దూరంగా వుండటమే మార్గం, దాన్నుంచి విముక్తి పొందటమే, ఇప్పుడు నా లక్ష్యం. దానికి సాధుజీవనం అవసరం. అది స్వేచ్ఛా మయం. ఈ బంగారు పంజరంలో నా జీవితం బందీయై, ఇన్నాళ్ళూ వుంది. సత్యాన్ని తెలుసుకునేందుకు నేను ఈ రాత్రి బయలుదేరు తున్నాను. దాన్ని తెలుసుకునే వరకు నేను తిరిగిరాను" అన్నాడు సిద్ధార్థుడు.

గౌతముని మాటలు విన్న చెన్నుడు ఖిన్నుడైనాడు. చాలా బాధపడ్డాడు. శుద్ధోధనుని తలచుకుని భయపడ్డాడు. మహా మేధా వంతుడు-సర్వగుణ సంపన్నుడు అయిన సిద్ధార్థుని వంక నిదానంగా తీక్షణంగా చూసి, కన్నీరు పెట్టుకుని, "ప్రభూ! రాకుమారుడివై రాజ్యమేలాలి కాని, దేశదిమ్మరి సన్యాసివై, భిక్షాటన చేస్తూ జీవిం చడం ధర్మంకాదు. సర్వసౌఖ్యాలూ వదలుకుని, అడవులపాలు కావద్దు" అని ప్రాధేయపడ్డాడు.

"చెన్నా, నేను కోరుకునే సామ్రాజ్యం, అన్ని రాజ్యాల కన్నా గొప్పది. నువ్వేమీ దిగులుపడకు, గొడవపడకు. నేను ఆ రాజ్యంలో అడుగుపెట్టడానికి వెడుతున్నాను" అన్నాడు సిద్ధార్థుడు.

"తల్లి-తండ్రుల బాధ, యశోధర దుఃఖం, యోచించారా, ప్రభూ?" అన్నాడు చెన్నుడు. "వారి ప్రేమలో స్వార్థం వుంది. అందుచేత ఆ ప్రేమ, అసత్యం. నేను వెతికేది, అందరి కోసం. యావత్ ప్రపంచాన్ని దుఃఖం నుంచి విముక్తి పరచడం కోసం బయలుదేరుతున్నాను" అని, మోహజాల సంభరితమైన ఈ ప్రపంచ కూపం నుంచి బైటపడ్డాడు సిద్ధార్థుడు. దానితో అతని ఉద్వేగచిత్తం, సంపూర్ణ ప్రశాంత స్థితిని చేరుకుంది.

ఆ పరిత్యాగమే-సిద్ధార్థుని జీవితంలో గొప్ప మలుపు. ఆ పరిత్యాగానికి ముఖ్యంగా మానసిక పరివర్తన-ఆంతరంగిక ప్రేరణ కావాలేకాని, బైట ఎటువంటి సంగతులు, కారణాలు కారాదు. ఆ ప్రేరణ, క్రమంగా బలపడి, అర్థరాత్రికి రూపుదిద్దుకుంది. కడసారిగా యశోధరను, రాహులుని చూడాలనీ, చూడ్డం ధర్మమనీ అనుకోవడమే అతనిలో చివరి ప్రేరణ. ఆ ప్రేరణలో ఆకర్షణ-ఆసక్తి వుంది ఆ తర్వాత సిద్ధార్థుని జీవితంలో ఎటువంటి ప్రేరణ కలగలేదు.

సిద్ధార్థుని మాటలన్నీ శ్రద్ధగా విన్న కాంతక-ఒక ప్రత్యేకమైన సకిలింపు సకిలించింది. సిద్ధార్థుడు దాని మెడమీద ప్రేమగా తట్టి ప్రియమైన కాంతకా, నిశ్శబ్దంగా వుండు. ఏ రౌతూ, ఏనాడూ ప్రయాణం చేయనంత దూరానికి నన్ను తీసుకువెళ్ళు. ఈ రాత్రి, చివరిసారిగా, నాకు సహాయంగా నేను నిన్ను తీసుకువెడుతున్నాను. నా దాహంతీరే చోటేదో, నాకు తెలియదు. సత్యాన్ని తెలుసుకునే వరకూ నా యాత్ర అంతం కాదు. అందుచేత నువ్వు ఈ రాత్రి

చాలా వేగంగా పరిగెత్తవలసి వుంది. ధైర్యంగా వుండు. ఇక్కడా, ఎక్కడా-ఏదీ నన్ను ఆపలేదు. నీ యజమానితో నువ్వూ భాగ స్వామివి కమ్ము. నేను వెళ్ళేది-వెతికేది ఒక్క మనుష్యుల కోసమే కాదు-మాట్లాడలేని ప్రాణికోటి సహాయం కోసం కూడా వెదు తున్నాను. కనుక నువ్వు ఈ రాత్రి నీ యజమానిని భరించి తీసుకో"అని, కాంతకను అధిరోహించాడు. చెన్నుడూ తన గుర్రాన్ని ఎక్కాడు. ఆ గుర్రాలు మెరుపుల్లాగ దౌడు తీశాయి. వారు అరోమా నదివైపుకు వెళ్ళారు, ఎవరికంటా పడకుండా. వెన్నెట్లో నిద్రిస్తున్న కపిలవస్తును దాటారు.

— ★ —

సిద్ధార్థుడు "అనోమా లేక, అనోమానదీ తీరానికి వెళ్ళేప్ప టికి ఉదయతార దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది. ఆ నది మగధ రాజ్యానికి-శాఖ్య రాజ్యానికి మధ్య వుంది. ఆ నది ఒడ్డున సిద్ధార్థుడు గుర్రం దిగి, దాన్ని ముద్దుపెట్టుకుని, ప్రేమగా నిమురుతూ "ప్రియ మైన కాంతకా, నువ్వు నా మాట విని, నన్ను తీసుకొచ్చావు. నీకు మేలు జరుగుతుంది. త్వరలో అన్ని జీవరాసులకు శుభం కలుగు తుంది. నీ ప్రేమకు నేను ఎప్పటికీ కృతజ్ఞుడను" అని - చెన్నుని వైపు తిరిగి, "చెన్నా, నా దుస్తుల్ని-ఆభరణాల్ని-కాంతకను రాజ ధానికి తీసుకువెళ్ళు. నా కోసం వెదకవద్దని, బాధపడవద్దని, చింతించవద్దని నా తల్లిదండ్రులకు, యశోధరకు అందరికీ చెప్పు. నన్ను క్షమించమనీ చెప్పు" అని- ధూమాతవంక చూసి, "మృత్యు రహితమైన సత్య సామ్రాజ్యం చేరుకునేందుకు నా మనసు ఆరాట పడుతోంది. నా హృదయం పవ్వకతో విలవిలలాడుతోంది. నామ రూపాతీతమైన దానిమీద, నా మనసు లగ్నమైవుంది. ఇన్నాళ్ళూ నా ముందు మూసుకుని వున్న ద్వారాలు ఇప్పుడు పూర్తిగా తెరుచుకున్నాయి. ఇవన్నీ నా జీవిత ఔన్నత్యానికి సాక్షులు. మనిషి లోని వ్యతిరేక శక్తుల్ని అధిగమించడానికి- వాటితో తీవ్రంగా పోరాడటానికి నేను సిద్ధంగా వున్నాను. మనుష్యులు సుఖలాలస పరులై - ధనకాంక్షపరులై - స్త్రీలోలురై వున్నారు. వారికి దుఃఖ నివృత్తి కలిగించాలంటే-బహు కష్టమైన పని. అందుచేత ముందుగా నేను దుఃఖ నివృత్తి మార్గాన్ని తెలుసుకుని, దాన్ని అందరికీ తెలియజేయాలను కుంటున్నాను" అని, మళ్ళా చెన్నునితో "చెన్నా, రాజభవనానికివెళ్ళి-నాకూ, మా నాన్నగారికి మధ్యకల సంబంధానికి గుర్తుగావున్న ఈ రత్నాల హారాన్ని వారికి అందజెయ్యి. నా కోసం బాధపడవద్దని ఆయనకు మరొకసారి చెప్పు. జనన- మరణ వలయం నుంచి తప్పించుకునేందుకు నేను కీకారణ్యాల్లో కఠోర తపస్సుకు ఉపక్రమిస్తున్నాననీ, చెప్పు. జన్మ - జరాఘోరాన్ని, దుఃఖఘోరాన్ని వదిలించుకోవాలని చూస్తున్నాను. అవి ఎప్పటికీ తిరిగి తలెత్త కుండా పోగొట్టాలనేదే నా యత్నం.

"సూర్యచంద్రాదులు గతులు తప్పినా, నక్షత్రాలు నేల కూలినా-మేరుపర్వతం, మరోముఖం పట్టినా, నేను నా నిశ్చయాన్ని మార్చుకోను."

"చూడు, చెన్నూ! ఈ కపిలవస్తు ఏమిటి, ఈనాటి నుంచి ఈ భూమంతా నాదే. ఆ సంగతి నీకు తర్వాత తెలుస్తుంది" అని, రాజవస్త్రాలు - ఆభరణాలు తీసేసి - ఇటువంటివి సన్యాసికి సరైనవికావు, "అని వాటిని చెన్నునికిచ్చి - ఒరలోంచి కత్తి తీసి- అందమైన తన జునపాలజుట్టు తెగ్గోశారు" దృఢమైన భావం "అనే ఖడ్గంతో, ఇంద్రియాలను - మనో బుద్ధులను - కామ క్రోదాదులను నరికి, నేను దుఃఖనివృత్తి మార్గాన్వేషకుడనై - వెళ్ళానని చెప్పు. అంతిమ సత్యాన్ని తెలుసుకున్న తర్వాత, కపిలవస్తు వచ్చి- ఆ సత్యాన్ని అందరికీ తెలియపరుస్తాను. దాన్ని గ్రహించి, వారూ శాంతిగా, సుఖంగా, ఆనందంగా, సంతోషంగా వుంటారు, "అన్నాడు. నిశ్చేష్టుడై నిలబడ్డ చెన్నుణ్ని ప్రేమగా తట్టి" -నేను ఇప్పుడు చెప్పేది-సర్వజన ఆమోదయోగ్యమైన సంగతి. అది విన్న వారందరూ మంచిగా మారతారు.

"మా నాన్నగారు మంచి మనసుగలవారు. కాని, పుట్టుక-ముసలితనం - రోగం - మృత్యువు - వంటి విషయాలు, ఆయన దృష్టిలో అల్పమైనవి. ఆ విషయాలే, ఆయన ఔచిత్యాన్ని ఔదార్యాన్ని-ప్రేమని - దయని - గొప్పతనాన్ని కప్పేస్తున్నాయి. అవే, నన్ను ఆయన పరంగా ఆవిధేయుణ్ని - ఉపేక్షాపరునిగా మార్చాయి. ఏ మార్గాన్ని అనుసరించేవారికైనా, జీవితంలో తప్పని సరిగా-కొందరితో సంబంధం ఏర్పడుతుంది: జన్మవల్లనో - ప్రేమ వల్లనో, కలయికవల్లనో-ఎట్లానో- ఒక విధంగా, ఆ సంబంధాల్లోని అసందర్భాన్ని, అసంగతాన్ని-అసత్యాన్ని ఎవరైతే గుర్తిస్తారో-వారు వియోగ సమయంలో విచారించరు, బాధపడరు. దుఃఖించరు.

"జీవుల జీవనకాలంలో సంయోగ, వియోగాలు- ఆకాశంలో మబ్బులు గాలికి కలిసినట్లే కలుస్తాయి. మళ్ళా ఆ గాలికే విడిపో

తాయి. ఆ మధ్యకాలంలో— ఏదీ "ఇది-నాది" అనడానికి అవకాశం లేదు. ఇదంతా ఒక పెద్ద కల.

ఎవరైతే వర్తమాన జీవిత విషయమై సరైన ఆలోచన—విచారణ చేయక ఉపేక్షచేస్తారో, వారు తప్పనిసరిగా మృత్యువును ఎదుర్కోవలసి వుంటుంది. ఆ మృత్యువు ఎక్కడో దాగిలేదు. అది-కాలమంతా నిండి వుంది. ఆ కాలంతో సంబంధమున్నవన్నీ నాశనమయ్యేవే! కనుక, ముందు మృత్యు రహస్యం తెలుసుకుని, దాన్నించి బైటపడాలి. ఆ తర్వాత కాలం, దానంతట అదే ఎగిరిపోతుంది. ఆ విధంగా కాలాతీతులు కావాలి.

"కపిలవస్తులో నాకు ఏర్పాటు చేయబడ్డ ఆ మూడు మహాసౌధాలూ మంటలతో నిండివున్నట్లు తోచాయి నాకు. పంచభక్ష్య భోజనాదుల్లో - వినాశకరమైన విషం కలిసినట్లుగా అనిపించింది.

అందమైన కొలనులో అపురూపమైన పద్మంచుట్టూ లెక్కలేనన్ని కీటకాలు చేరి, గోలచేస్తున్నట్లుగా, ఆ సౌధాల్లో కేంద్రీకృతమైన భూలోక సంపద అంతా, దురదృష్టకరమైనదిగా గ్రహించాను.

"నాయందుండే ప్రేమాభిమానాల చేత, నువ్వు నన్ను తిరిగి వెనక్కి రమ్మని కోరుతున్నావు, కాని, నా మనసు గట్టి నిశ్చయం చేసుకున్నది. అందుకే అన్నీ వదిలేశాను. ఒకతని ఇంటికి నిప్పు అంటుకుని—చుట్టూ మంటలు లేచాయి. చివరికి, బైటికి పారిపోవడానికి ఒక దారి కనుక్కున్నాడు. అతడు ఆ మంటల్లోంచి పారిపోక, అందుపడి, అవివేకంగా కాలిపోతాడా? కాలి, చనిపోవడం అవమానకరం, అగౌరవం-అవివేకం. నేనూ అలాగే దుర్మార్గాన్నీ-చెడునీ-జనన, మరణ వలయాన్నీ-రోగాల్ని-ముసలితనాన్నీ-తప్పించుకుని-సన్యాసినయ్యాను. తిరిగి దుఃఖ భూయిష్టమైన ఆ జీవితంలోకి ఎట్లా వస్తాను? అన్నీ తెలిసిన తర్వాత, మూర్ఖుని మాదిరిగా, మళ్ళా వాటిల్లో చొరబడతానా?" అన్నాడు సిద్ధార్థుడు.

వైరాగ్యభావంతో సిద్ధార్థుడు, నైష్కర్మ్య రూపమగు పరమస్థితిని పొందాడు సిద్ధార్థుని మాటా, తీరు, చూపు- అంతా ఒక్క

రాత్రి కాలంలో ఊహాతీతంగా మారిపోయాయి. సిద్ధార్థుని, తన ముందు సాక్షాత్కరించిన సర్వేశ్వరునిగా భావించి, "ప్రభూ, నన్నూ మిమ్మల్ని అనుసరించనివ్వండి. ఇన్నాళ్ళూ మీతో వున్నాను ఈ క్షణంలో కూడా నేను మీతో వున్నాను. మీరు గొప్ప స్థితిలో వుండి, నా సమక్షం నుంచి నిష్క్రమిస్తో వుంటే, చూస్తో, నేను తిరిగి మామూలు లోకంలోకి-మీరులేని ప్రపంచంలోకి వెళ్ళి మిమ్మల్ని తలచుకుంటూ బ్రతకలేను. ఇప్పుడు మిమ్మల్ని వదలి వెనక్కి వెళ్ళడమంటే-నామీద నాకే అసహ్యంగా వుంది. మీరులేని కపిలవస్తు, నాకు శూన్యంగా వుంటుంది. మీరు లేకుండా నేను ఏ ముఖం పెట్టు కుని మహారాజు ముందు నిలబడను?" అన్నాడు.

దానికి సిద్ధార్థుడు, "సన్యసించడానికి-జ్ఞానార్జనకూ నీకు ఇంకా సమయం రాలేదు" అన్నాడు.

కాంతక పరిస్థితి కూడా హృదయ విదారకంగా వుంది. సిద్ధార్థుడు దాన్ని విపరీతంగా ముద్దుపెట్టుకోగానే- దానికి ఏదో అర్థమైనది గావును, ఇంక ఈ జన్మలో నా ప్రభువును చూసే భాగ్యం లేదని. అది ఆయనచుట్టూ మువ్మారు ప్రదక్షిణం చేసి, కంట తడి పెట్టింది. ఛన్నుడితో-వెనక్కి వెళ్ళడానికి కాంతక ఇష్టపడక, మారాంచేసి-సిద్ధార్థుని కళ్ళల్లోకి సూటిగాచూసి-తలవంచి-కన్నీళ్ళతో యాంత్రికంగా-యజమాని ఆజ్ఞానుసారం ఛన్నుని అనుసరించింది. సిద్ధార్థుడు కనుమరుగు అయ్యేవరకు, అది వెనక్కి తిరిగి - తిరిగి చూస్తూనే వెళ్ళింది.

త్వరలోనే కాంతక చనిపోయింది.

*　　　*　　　*

ధీరచిత్తులు-స్థిరచిత్తులు మాత్రమే చేయగల మహాత్యాగాన్ని సిద్ధార్థుడు మనఃపూర్వకంగా చేశాడు. జీవిత పరిపూర్ణత్వం కోసం సర్వసంగపరిత్యాగం చేసి-మహాభినిష్క్రమణ చేశాడు. లక్ష్యసిద్ధి కోసం, వైరాగ్యం పూనాడు. దుఃఖవిమోచన మార్గాన్వేషియై-సర్వ

స్వాన్ని తృణప్రాయంగా ఎంచి, బయలుదేరాడు బాధా తప్తమైన అతని హృదయమే, అతన్ని పరిత్యాగంవైపు మళ్ళించింది. "బాధ-దుఃఖం" అనే వాటికి అతడు పూర్తి ఎరుకలో వుండి-పరివ్రాజక జీవన విధానం అవలంభించవలిచాడు. అంతేకాని, ఏకపక్షంగా గుడ్డిగా-మూర్ఖంగా-అవివేకంగా-ఏ ఒక్క-దాన్నో నమ్మి- అనుస రించలేదు. ఆ విషయంలో అతడు అమాయకంగా-అజ్ఞానంగా ప్రవ ర్తించనూ లేదు.

సిద్ధార్థునిలో అకస్మాత్తుగా అసంతృప్తి-జ్ఞానకాంక్ష ఒక్క-సారే పుట్టాయి. భౌతికంగా దేహస్ఫురణ-ఆధ్యాత్మికంగా ఆత్మ స్ఫురణే జీవితం. అటువంటి జీవిత వాస్తవత్వం తెలుసుకోవలిచాడు. సరైన ఆలోచనా, ఆరోగ్యవంతమైన దేహం వున్నప్పుడే ఏదైనా సాధించడానికి అవకాశం వుంటనే సంగతి సిద్ధార్థునికి బాగా తెలుసు. దుఃఖం నుంచి శాశ్వతంగా స్వేచ్ఛ పొందాలనీ, దుఃఖాతీతుడుకావా లనీ, సిద్ధార్థుడు ఆకాంక్షించాడు. ఆ లక్ష్యసాధన కోసమే, నిర్గమిం చాడు. అర్ధరాత్రి గాఢ నిద్రలో వున్నప్పుడు- పడుకున్న ఇంటికి నిప్పు అంటుకుంటే, ఎట్లా కంగారుపడి ఆతృతతో - ఆవేదనతో లేస్తారో, అట్లా మేల్కొని బైటికి వెళ్ళిపోయాడు.

జీవితంయొక్క- క్షణ భంగురత్వం-అనిత్యత్వం స్వానుభవంతో తెలుసుకున్నాడు. అజ్ఞానవశులై - పాపకర్మపరులై — దుఃఖాంధ కూపంలో పడి, నలిగి, నశించిపోతున్న మానవజాతిని చూసి - జాలి పడి, దయతలచి, తరుణోపాయం చూపే కరుణాంత రంగంతో నిత్య-సత్య-వస్తుతత్వం తెలుసుకోవడానికి, తపోనిరతుడయ్యాడు, సిద్ధార్థుడు. అదే ఆయన అన్వేషణలో మొదటి మెట్టు. ఆ తృష్ణే సత్యం, ప్రియతముని కోసం, ప్రేయసిపడే వేదనవంటిది ఆయన తృష్ణ. అంతే! మనసులోని మాలిన్యాల్ని భస్మం చేయడానికే తపస్సు స్వానుభవనిష్ఠే తపస్సు. చిత్తశుద్ధికై ధన-దార-పుత్ర-పశు-మంది రాల యందు మమకారం నిర్మూలించుటే-తపోదీక్ష. విషయాలన్నీ నిశ్శేషంగా విసర్జించిన బుద్ధి వైభవమే, తపస్సు. అటువంటి తపస్సు

చేత, ప్రారబ్ధ కర్మను సహితం నాశనంచేయవచ్చునంటారు పెద్దలు. నిష్క్రియత్వంచే నూతనకర్మ విరతిని సాధించవచ్చుననీ అంటారు.

ప్రాపంచిక విషయ తృష్ణను - హింసా ప్రవృత్తిని - మనో మాంద్యాన్ని-మానసోద్వేగ వేదనలను- చిత్తచాంచల్యాన్ని — ఈ ఐదింటినీ సిద్ధార్థుడు పరిత్యజించి, మోహదూరుడైనాడు. దుఃఖ విమోచనకు ఏ మాత్రం సహకరించని క్షత్రియ ధర్మాల్ని వేద వాక్కుల్ని, గృహస్థ విధుల్ని - బాధ్యతల్ని అధిగమించి, సర్వ బంధాల్ని, ఒక్క వేటుతో తెంచేసుకుని, సత్యాన్వేషకుడై అర్ధాంగిని, అంతఃపురాన్ని-అన్నిటినీ వదలి-అర్ధరాత్రి వేళ వెళ్ళిపోయాడు. విశ్వమానవ శ్రేయస్సు కోసం, భిక్షాపాత్ర చేతబట్టాడు. కాళ్ళకు చెప్పులు లేకుండా, ఎండకీ-వానకీ ఓర్చి, ఒంటరిగా-దేశదిమ్మరిగా, సన్యాసిగా దొరికినచోట తిని, రాళ్ళల్లో-ముళ్ళల్లో నిద్రిస్తూ ఎక్కువ కాలం ధ్యానంతో గడుపుతో-స్థిర నిశ్చయంతో అనేకచోట్లకు తిరి గాడు, పరివ్రాజక వృత్తి నవలంభించి.

ఆ రోజుల్లో వేదధర్మం - అనంత కర్మకాండలతో నిండి వుంది. ఉపనిషత్తులలోని అతీత ఆధ్యాత్మిక నియమనిష్ఠలు, జన సామాన్యానికి అందుబాటులో లేవు. కొంపరు తీవ్రవాదులు-అన్ని కులాలకూ, వర్గాలకు, మతాలకు చెందినవారు, అరణ్యాలలోకి-కొండ గుహల్లోకి వెళ్ళి- కఠోర తపస్సు ఆచరించి, విశ్వకీకారణాన్నీ- ప్రకృతినీ దర్శింప యత్నించేవారు. అటువంటివారిని, "శ్రమణులు" అనేవారు. వారికి ఇచ్ఛావృష్టి- లోభవృష్టి వుండదు. సిద్ధార్థుడు అటువంటి పరివ్రాజకుల-సన్యాసుల-శ్రమణుల జీవన విధానాన్నే ఎన్నుకున్నాడు. మనసులోని ముడులు విప్పుకున్నాడు. హృదయ కవాటాన్ని పూర్తిగా తెరిచాడు. తనకు ధర్మం-న్యాయం-యోగ్యం-సమ్మతం-అనుకూలం-అనుకున్న ప్రతిసాధననూ శ్రద్ధగా చేశాడు. అంతే- సత్య, ధర్మ-సదాచార-శమదమాదులతో కూడిన సాధన చతుష్టయాన్ని పాటించాడు. ఆ విధంగా తీవ్రసాధనచేసి-అఖండ

విజ్ఞాన రూపం ధరించి, నిరంతర తపస్వరూపుడై - ప్రకాశిస్తున్న ఆ సత్యశాలి, క్రమంగా-శ్రేయోదాయకమైన మార్గంలో పరమ పథానికి చేరువ అవుతున్నాడు.

అనుప్రియ అనే మామిడి తోటలో కొన్నాళ్ళు వుండి, అది సాధనకు అనువైన ప్రదేశమని నిర్ధారణ చేసుకున్నాడు. అక్కడ కొన్నాళ్ళు వుండి వైశాలి నగరంవైపు వెళ్ళాడు. వైశాలిలో బ్రాహ్మణ పండితులు శ్రమణులు వున్నారని, అది సాధనకు ఇంకా యోగ్యమైనదని భావించి వెళ్ళాడు. అక్కడ కొన్నాళ్ళు వుండి రాజ గృహంవైపుకు బయలుదేరాడు.

మగధ రాజధాని రాజగృహ-వైవదర-వరహ-ఋషభ - ఋషి కొండ-చైతన్య అనే ఐదుపర్వతాల మధ్య నున్న అందమైనపట్టణం. రాజగృహకు దగ్గరలో సరస్వతీ నది వుంది. ఆ దేశమంతా పురాతన వృక్షాలమయం. ఆ ప్రాంతంలో చాలా మంది శ్రమణులు తపస్సు చేసుకుంటూ వుండేవారు. గొప్ప తత్వవేత్తలు-భావుక శ్రేష్టులు ఎందరో వున్న ప్రదేశమది. అటువంటి ప్రాంతానికి వెళ్ళాడు. సిద్ధార్థుడు. దివ్య తేజస్సుతో వెలిగిపోయే ఒక సాధువు-యువకుడు. కొత్తగావచ్చి-పాండవ దిబ్బమీద వున్నారనీ, అతను కేవలం భిక్షాన్నమే తిని వుంటున్నారన్న సంగతి రాజగృహం అంతటా వ్యాపించింది. పైలోకాల నుంచి దిగి వచ్చిన అమరుడన్నారు, కొందరు. ఆయన భిక్షకు నగరంలోకి వెళ్ళగానే-గృహిణులు ఆయనకు ఆప్యాయతతో భిక్షపెట్టడానికి ఎదురు చూసేవారు. పిల్లలు ఆయన పాదాలమీద పడి ముద్దులు పెట్టుకునేవారు. ప్రజలు పళ్ళు - ఫలహారాలు ప్రేమతో సమర్పించేవారు. పదహారు వన్నెల బంగారు ఛాయతో, తళతళలాడే-అద్భుత వర్చస్సుతో, ఆకర్షణీయంగా-సర్వాంగ సుందరంగా-సకలజనరంజకంగా వుండి- నమ్రతతో తల వొంచి నడుస్తున్న సిద్ధార్థుని చూచి-అబ్బురపడి-అసలు ఆయన ఎవరో-ఏమిటో తెలియకుండానే-తెలుసుకోకుండానే, ఆ నగరవాసులు ఆయనకు ఆకర్షితులై-ప్రేమతో ప్రణమిల్లారు. చివరికి అతనిసంగతి

బింబిసార చక్రవర్తి వరకు వెళ్ళింది. తన మిత్రుడైన శుద్ధోధన మహా రాజు ఏకైక కుమారుడు- సిద్ధార్థుడు-భార్యని, బిడ్డని, సమస్తాన్ని పరిత్యజించి-మహా నిర్వాణం కోసం-సర్వసంగ పరిత్యాగియై ఇల్లు వదలి వెళ్ళిన సంగతి బింబిసారుడు ముందుగా వినియుండుట చేత కొత్తగా తన రాజధానికి వచ్చిన యువ యతీంద్రుడు అతడేమోనను కుని-చూడ్డానికి స్వయంగా బయలుదేరాడు. అక్కడ అతనికి సిద్ధా ర్థుడే ప్రత్యక్షమయ్యాడు. విషయం తెలుసుకుని, "నాయనా సిద్ధార్థా! ఏమిటీ యతివేషం? ఎక్కడికి బయలుదేరావు? అసలు ఎందుకు బయలుదేరావు? తండ్రితో తగాదాపడి వచ్చావా? అయితే- నా రాజ్యంలో సగభాగం నీకు ఇస్తాను. నీ ఇష్టానుసారంగా రాజ్యపాలన చేసుకో-సన్యాసం విరమించు. చూడు నాయనా! క్షత్రియులకు ఒక ధర్మం వుంది. అది-రాజ్యపాలన, ప్రజాక్షేమంకోరడం. నేను నీకు తండ్రివంటివాడిని-నా మాట విను. మమ్మంపర్చి మన్నించు" అని ఎంతో బ్రతిమాలి చెప్పాడు, బింబిసారుడు, సిద్ధార్థుడు సహజ విన యంతో తలవొంచాడు. పరిపూర్ణ ప్రశాంత చిత్తంతో బింబిసారుని అభిమానానికి, ప్రేమకు కృతజ్ఞతలు చెపుతూ, "నా ఉద్దేశ్యం-సత్యా న్వేషణ చేయడం. ప్రాపంచిక విషయాలపై నాకు ఎటువంటి ఆసక్తి లేదు. నేను సుఖాలను కోరడంలేదు. అజ్ఞానంతో మూర్ఖుడనై అవి వేకినై ఇల్లు-ఇల్లాలిని వదలిరాలేదు. సంపూర్ణ ఎరుకతో - అవగాహ నతో బయలుదేరాను. అన్నింటికీ అతీతమైన ఆశయసాధన కోసమే బయలుదేరి వచ్చాను" అన్నాడు.

అతని మాటలకు బింబిసారుడు చాలా సంతోషించి, "మంచిది నువ్వు అన్వేషించేది, నీకు లభ్యమైన తర్వాత, తిరిగి రాజ గృహకు వచ్చి-ఆ సత్యాన్ని నాకూ-నాదేశ ప్రజలకు బోధించి-మమ్మందర్నీ నీ శిష్యులుగా తీసుకో" అని కోరాడు. దానికి అతడు అంగీకరిం చాడు.

★ ★ ★

సిద్ధార్థునికి చిన్నప్పుడు జోస్యం చెప్పిన బ్రాహ్మణ పండితులు—కౌండిన్యులవారు-ఆయన నలుగురు శిష్యులు-అశ్వజిత్-కాశ్యపుడు—మహానాముడు- భద్రికుడు. ఆ ఐదుగుర్నీ పంచవర్గీయులంటారు. వారు- తాము చెప్పినట్లుగానే సిద్ధార్థుడు సర్వసంగ పరిత్యాగంచేసి, సన్యాసియై తమకు చేరువలో తిరుగుతున్నాడని తెలుసుకుని- అతన్ని వెతుకుతూ, చివరికి కనుక్కున్నారు. ఆ ఆరుగురూ కలసి గురువును వెతుక్కుంటూ, ఆ ప్రాంతాల మహర్షుల్ని-మహాత్ముల్ని-యోగుల్ని, పండితుల్ని-సాధువుల్ని దర్శించారు.

ఆ రోజుల్లో-ఆ ప్రాంతంలో అనేక విధాలైన ఆధ్యాత్మిక సాధనా మార్గాలు వుండేవి. సిద్ధార్థుడు మొదట ఇంద్రియాల్ని అదుపులో వుంచడం-దేహాన్ని శుష్కింపజేయడం—వంటి కఠోర సాధనలు ప్రారంభించాడు. శాస్త్రానుకూల కర్మలయందు సదా మనసును నిగ్రహించి సాధన చేశాడు. ఎన్నో నియమాలు-నిష్ఠగా పాటించాడు. కొన్నాళ్ళ తర్వాత తాను చేస్తున్న సాధన-ఆచరణ-తాను అన్వేషించే లక్ష్యసిద్ధికి ఏ మాత్రం సంబంధంలేదని గ్రహించి, సత్య సందర్శనానికి గల అవసరమైన, సరైన - అసలైన మార్గాన్ని తెలుసుకుని, ఆచరించాలనుకున్నాడు. అక్కడనుంచి భృగుమని ఆశ్రమం చేరాడు. అక్కడ బ్రాహ్మణులు చేసే యోగసాధనా విధానాలు సిద్ధార్థుని ఆకర్షించాయి. ఆ గురువుగారూ ఎన్నో విషయాలూ-సాధనా మార్గాలూ చెప్పారు. సిద్ధార్థుడు చాలా శ్రద్ధగా చేశాడు. కాని భవిష్యత్తులో స్వర్గసుఖాలు ఆశించి చేసే ఆ బ్రాహ్మణుల కఠోర తపస్సు సిద్ధార్థుడికి నచ్చక, అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత హఠయోగ, రాజయోగాలలో సిద్ధహస్తులైన రాజర్షి వేగరుని ఆశ్రమానికి వెళ్ళాడు, సిద్ధార్థుడు. అక్కడ ఒక కుటీరం నిర్మించుకుని కఠోర తపస్సు చేశాడు. వైరాగ్యం అవలంభించాడు. కొన్నాళ్ళు కుండలినీయోగం చేశాడు. కుండలిని అంతే,

మనిషిలోని భావనాశక్తి—విపరీత కల్పనాశక్తి—విచారణశక్తి. ఆ శక్తి వాస్తవకార్యకలాపాల్ని చేపట్టడం. మనిషి పనిచేయడం మానేసి కలలు కనేప్పుడు కలిగే భావన-భ్రాంతి-కల్పనే కుండలిని. ఆ శక్తి నిద్రపోతూ వుంటుందని, తీవ్ర సాధనవల్ల మేల్కొని, పైకి లేస్తుందని చెపుతారు శాస్త్రకారులు. మనలో ప్రవహించు ఆ క్రియాశక్తినే, కుండలిని అంటారు. యోగులకు మాత్రమే సుషుమ్న ద్వారం తెరచుకుంటుందని, కుండలిని ఊర్ధ్వముఖంగా ప్రయాణించే సమయంలో అతీంద్రియ జ్ఞానం కలుగుతుందని చెప్పగా, సిద్ధార్థుడు ఆ యోగం చేశాడు. ఆ తర్వాత యోగాలన్నింటిలోకి జ్ఞాన, అష్టాంగ యోగాలు ఉచితమైనవని-స్వానుభవంతో తెలుసుకుని వాటిని చేపట్టాడు. అవి ఎనిమిది రాజయోగాలు.

యమము : దేహేంద్రియాదులందు వైరాగ్యం. అది ఐదు రకాలు—అహింస-సత్యం—అస్తేయం—బ్రహ్మచర్యం-అపరిగ్రహం. వాటివల్ల చిత్తశుద్ధి కలుగుతుంది.

నియమం : సదాబ్రహ్మయందు ప్రియంగా వుండటం. అవి ఐదు విధాలు - శౌచం - సంతోషం - తపస్సు - స్వాధ్యాయం ఈశ్వర ప్రణిదానం.

ఆసనం : స్థిరంగా, సుఖంగా, ఒకే విధంగా, ఒకే స్థలంలో ఆసీనులై వుండుట.

ప్రాణాయామం : ఒక మాత్రాకాలం శ్వాసపీల్చి (పూరకం) నాలుగు మాత్రాకాలం ప్రాణ నిరోధంచేసి (కుంభకం) ఒక మాత్రాకాలం శ్వాసను విడిచి (రేచకం) నట్లయితే ప్రాణనాడులు శుద్ధి అగును.

ప్రత్యాహారం : చిత్తమును బాహ్య వ్యాపారము లందు పోనివ్వక అంతర్ముఖం చేయడం.

ధారణ : చిత్తమును చలింపనీయక నిశ్చలంగా నిలుపుట

ధ్యానం : సత్యజ్ఞానానందమయమై-సర్వసాక్షిగా వుండు పర బ్రహ్మముపై ధ్యానం.

సమాధి : తలంపులను, సకల దృశ్యాల్ని అధిగమించి తాను తానై-కేవలం సాక్షీమాత్రంగా వుండుట.

సిద్ధార్థుడు వాటిని కడు శ్రద్ధగా, నిష్ఠగా చేసేప్పటికి అతని శరీరం పూర్తిగా చిక్కి శల్యమైనది. ఆ సందర్భంలో శుద్ధోధన మహారాజుకు ఒక వార్త చేరింది. "మీ కుమారుడు-గౌతముడు కఠోర తపస్సుచేసి, మరణించాడు" అని ఆయన ఆ మాటలు నమ్మక "అసిత మహర్షి మాటలు వృథాపోవు" అన్నాడు.

* * *

సిద్ధార్థుడు అక్కడ నుంచి "భార్గవ" అనే ముని దగ్గరకు వెళ్ళాడు. కొన్నాళ్ళు ఆయన సూచించిన సాధనా మార్గాన్ని అనుస రించాడు. క్రమంగా ఆ మార్గమూ నమ్మతంకాక, "అలారకలాము" అనే మహాత్ముని దర్శించాడు. ఆయన మోక్షవాది. ఆ బ్రాహ్మణ సన్యాసి ఆశ్రమం వైశాలిలో వుంది. తనకు జ్ఞానమార్గం తెలుప మని సిద్ధార్థుడు ఆయన్ని అర్థించాడు. ఆయన సాంఖ్య సిద్ధాంత సూత్రాల్ని-సమాధి-ప్రాణాయామం మొదలైన సాధనలు చెప్పారు. సిద్ధార్థుడు వాటిని తీవ్రంగా ఆచరించాడు.

ఒకరోజున సిద్ధార్థుడు గురువుగారిని సమీపించి, "నేను చిన్న ప్పుడు ఒక చెట్టుకింద కూర్చుని, నాకు తెలియకుండానే, అప్రయ త్నంగానే ధ్యాన నిమగ్నుడనయ్యాను. క్రమంగా సమాధి స్థితికి వెళ్ళాను. ఆ స్థితి నాకెంతో నచ్చింది. అటువంటి స్థితిలో ప్రవేశించే మార్గమేదో అది నాకు చెప్పండి" అని కోరాడు. దానికి ఆయన "అది సహజంగా యోగులకు, మహర్షులకు బాల్యంలో తటస్థపడటం ఏమంత అబ్బురం కాదు. విశేషమూ కాదు" అన్నాడు. అయినా ఆయన పర్యవేక్షణలో యోగాభ్యాసం చేసి, సాంఖ్య దర్శనం చేసి,

త్వరలోనే ఎంతో ఉన్నత స్థితిని అందుకున్నాడు. గురువుగారు సంతోషించి, "సిద్ధార్థా! నువ్వు నా అంతటి వాడవు అయ్యావు. నేను, నీకు చెప్పగలిగింది ఇంతేమిలేదు, నువ్వు నాతో వుండితక్కిన నా శిష్యులకు బోధించు" అన్నాడు. దానికి అతను, "స్వామీ మీరు బోధించగలిగింది ఇంతేనా? ముసలితనం, రోగం, మృత్యువు - వాటి నుంచి తప్పించుకునే మార్గం చూపలేరా?" అని అడగగా, "అది నా వల్లకాదు. అది నాకు తెలియని సంగతి. ఇంకదాన్ని నీకెట్లా బోధించగలను? ప్రపంచంలో ఎవరూ మృత్యువును జయించిన వారు లేరు. మృత్యువు, ఒక నిగూఢ సత్యం. అది పునర్జన్మకు - విరామ సమయం. అంతే-దాన్ని తెలుసుకున్నవాడు, మహాజ్ఞాని. అది ఒక అనుభవం దాన్ని మాటల్లో వర్ణించి చెప్పడం, ఎంతటి వారికీ అసాధ్యం" అన్నాడు.

సిద్ధార్థుడు ఆయన సమాధానం విని, వారి సాధనా విధానం నిర్వాణస్థితికి తీసుకుపోలేదని గ్రహించి అసంతృప్తి చెంది, అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. అతనితోపాటు తక్కిన ఐదుగురూ సిద్ధార్థుని అనుసరించారు. వారంతా కలసి "ఉద్దారక రామపుత్ర" అనే గురువును చేరి, "మీ సన్నిధిలో దివ్యజీవనం గడుపుతూ, సాధన చేయాలనుకుంటున్నాం" అన్నారు.

ఆయన వారికి హఠయోగం, రాజయోగం చెప్పారు. ఆయన వద్ద సిద్ధార్థుడు ధ్యానంలో సమాధిస్థితి వరకు వెళ్ళాడు. సత్యాన్ని విడవకుండా పట్టుకోవడమే, సమాధి. ఎరుకతో చైతన్యస్థానం ప్రవేశించినప్పటి స్థితే, సమాధి. కర్మ చేస్తున్నా నిశ్చలంగా, ప్రశాంతంగా వుండుటే సహజ సమాధి. ఆ స్థితిలో మనసు సంశయ రహితంగా వుంటుంది. ఆ స్థితికి చేరుకున్న సిద్ధార్థుని చూసి, "నాయనా, సిద్ధార్థా! నువ్వు నా ఆశ్రమంలో వుండి, తక్కిన నా శిష్యులకు విషయాలు బోధించు" అన్నారు. వారి మాటలతో సిద్ధార్థుడు, అసంతృప్తి చెంది, అక్కడనుంచి వెళ్ళిపోయాడు. తక్కిన మిత్రులతో కలసి.

ఆ ఐదుగురూ "ఉరువేల" అనేచోట ఆగారు. అది ఎంతో అందమైన ప్రదేశం. అక్కడ నిరంజర - లేక, నైరంజరా-అనే నది ప్రవహిస్తోంది. సిద్ధార్థుడు అక్కడ స్వతంత్రంగా సాధన చేయాలనుకున్నాడు. చిత్తశుద్ధి-నిత్య నిరీక్షణవల్లనే సాధ్యంకాని, నిశిత తర్కోప తర్కాలతో చిత్తశాంతి లభించదని ఏకాంతంగా ఘోర తపస్సుకు పూనుకున్నాడు. భిక్షాటనకు దగ్గరలో ఒక పల్లె వుంది. నిరంజర నది ఒడ్డున ఒక కుటీరం నిర్మించుకొని, గురువు లేకుండా అనేక కఠిన యోగ సాధనలు చేశాడు. సిద్ధిని, శాంతిని, శాశ్వత సుఖాన్ని ప్రసాదించేది యోగమొక్కటేనని రకరకాల యోగ సాధనలు చేస్తారు, చాలా మంది, ఆధ్యాత్మిక సాధకులు. ఆ సందర్భంలో వారు మనోశిక్షణ-దేహశిక్షణ-ఇంద్రియశిక్షణ నియమంగా పాటిస్తారు. వాటి ఉద్దేశ్యం - ప్రపంచ విషయాల నుంచి ఇంద్రియాల్ని తిప్పడం. కాని, మనస్సును, దాని వృత్తులను వశపరచుకొనుటకు తోడ్పడునదే నిజమైన యోగం-ఆ ప్రకారం యోగమార్గం, అంతఃపథం. అంటే, అంతర్భాగంలో మనోధారణే, యోగం. యోగద్వారం హృదయం. యోగ గమ్యం, పరబ్రహ్మం అంటే, హృదయ మందు శాశ్వత జీవనం. సిద్ధార్థుడు ఆ విధంగా దేహాన్ని శుష్కింపజేశాడు. కొన్నాళ్ళు తీవ్రంగా ప్రాణాయామం చేశాడు. మొదట్లో రోజుకు ఒకపూట చొప్పున, తర్వాత రెండు రోజులకో పూట చొప్పున భోజనంచేసి, క్రమంగా భిక్షాటన మానేసి, ఎండిరాలిన పళ్ళూ, ఆకులూ, మూలికలూ, కందమూలాదులూ తిని సాధన చేశాడు. అతని దేహం పూర్తిగా శుష్కించిపోయింది. కళ్ళు గుంటలు పడ్డాయి. అయినా సాధన మానలేదు. రకరకాల యోగ సాధనలతో పాటు-అఘోర పద్ధతివంటి సాధనలు కూడా చేశాడు. మతాల్ని-శాస్త్రాల్ని పూర్తిగా పరిశీలించాడు. ఉపవాసాలుచేసి, దేహాన్ని మరింత శుష్కింపజేశాడు. అతనికి పంచవర్గీయులు శ్రద్ధగా శుశ్రూష చేశారు, సిద్ధార్థుడు తప్పక బుద్ధత్వం పొందుతాడనే దృఢ నిశ్చ

యంతో. ఆ తర్వాత కొన్నాళ్ళు వాయు స్తంభన, ప్రాణాయామం, హఠయోగం చేశాడు.

ఆ సందర్భంలో సిద్ధార్థుని విషయంలో ఒక కథ ప్రచారంలో వుంది. సిద్ధార్థుడు గుర్రంమీద రెండు వారాలు ప్రయాణం చేసి-హిమాలయ పర్వత ప్రాంతాల్లో ఒక నిర్జరారణ్యం చేరి, అక్కడ నుంచి—ఒక సన్నని బాట వెంట ఏడు రోజులు నడచి-ఒక కుటీరం చేరుకున్నాడు. అక్కడ ఒక వృద్ధుడు వున్నాడు. ఆయన సిద్ధార్థుని కొరకు ఎదురు చూస్తున్నాడు. వారిద్దరూ చిరకాల మిత్రులవలె ప్రేమగా పలకరించుకున్నారు.

మర్నాడు సూర్యోదయం వేళ, హిమాలయాలమీద మంచు మెరిసేవేళ-సిద్ధార్థుడు కొంచెం తేనె తాగాడు. ఆ తర్వాత వారిద్దరూ కొంతదూరం వెళ్ళి-మధ్యాహ్నానికి ఒక నది ఒడ్డుకు చేరుకున్నారు. ఆ ముసలాయన నది అవతలి ఒడ్డుకు ఒక బాణం విడిచాడు. దానికి సమాధానంగా, ఒక చిన్న పడవలోంచి ఒక పొడుగాటి ఆయన-పెద్ద బొచ్చుకోటు వేసుకుని-వాళ్ళ దగ్గరకు వచ్చి-సిద్ధార్థుని తనతో రమ్మని సౌంజ్ఞ చేశాడు. సిద్ధార్థుడు తన ఒంటిమీది బట్టలు తీసేసి, కొల్లాయి కట్టుకుని- ఆయనతో అవతలి ఒడ్డుకు వెళ్ళాడు సిద్ధార్థుడు తీసేసిన ఆ బట్టల్ని. ఆ ముసలాయన విసిరి నదిలో పారేశారు.

సిద్ధార్థుడు ఆయనతో కలసి అవతలి ఒడ్డుకు వెళ్ళాడు-అక్కడ వారి కోసం రెండు గుర్రాలు సిద్ధంగా వున్నాయి. వారు ఆ గుర్రాలు ఎక్కి-మంచుబాగా కప్పిన హిమవత్పర్వతాలను అధిరోహించి—మర్నాడు తెల్లవారు జామున సిద్ధ పురుషుల ఆశ్రమం చేరుకున్నారు. ఆ ఆశ్రమంలో సిద్ధార్థుడు కొన్నాళ్ళు వుండి—అనేక విశ్వ రహస్యాలు తెలుసుకుని- తిరిగివచ్చి-పాత మిత్రులను కలుసుకున్నాడు. అదీ కథ.

* * *

అత్యంత దుర్భరము-దుఃఖదాయకము-దుస్సహము - అయిన శరీర సాధన ఆరేళ్ళు చేసినప్పటికీ-తనలో ఎటువంటి మార్పు

రాలేదని గ్రహించాడు సిద్ధార్థుడు. అతని సమస్యలేవీ పరిష్కారం కాలేదు. మనస్సును నిశ్చలం-నిర్మలం చేసుకుని అదుపులో వుంచుకోవడం ముఖ్యంకాని, శరీరాన్ని యాతనలుపెట్టి ప్రయోజనం లేదని గ్రహించాడు. ఆ తర్వాత చాలా తీవ్రంగా మనోమథనం సాగించాడు. ఒకరోజున సిద్ధార్థుడు స్పృహ తప్పి పడిపోతే-ఆ దారిని పోయే ఒక పల్లె అతను చూసి, జాలిపడి-పళ్ళు-పాలు ఇచ్చి, తేరుకున్న తర్వాత తన రక్షణకింద కొన్నాళ్ళు వుంచి, ఉపచారాలు చేశాడు.

అప్పటివరకు చేసిన కఠోర సాధనవల్ల సిద్ధార్థుడు ఏమీ సాధించలేకపోవడమే కాక, ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. అనారోగ్యం వల్ల మనసు మందకొడిగా తయారైనది. అటువంటి మనసుతో సాధనచేసి, సత్యాన్ని తెలుసుకోలేననే సంగతి గ్రహించాడు. అజరామరమైన, తపోనిష్ఠాగరిష్ఠుడై గౌతముడు ఆత్మాహుతిని నిష్ప్రయోజనమని గుర్తించి, మధ్యమార్గాన్ని అవలంభించాడు. ఆ విధమైన కఠోర తపస్సువల్ల ఫలం శూన్యమని, ఉపవాసాలు చేయడం కేవలం తెలివితక్కువపని అని, భిక్షాటనకు బయలుదేరాడు. జీవితానికి మానసిక ఆరోగ్యం-శక్తివంతమైన శరీరం ముఖ్యమన్న సంగతి అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు ఆరోగ్యంగా వున్ననాడే మనసూ దృఢంగా-నిర్మలంగా-నిశ్చలంగా వుండగలదనీ గ్రహించాడు. వివేకంతో కూడిన విచారణ ద్వారానే సత్యాన్ని తెలుసుకోగలమనే నిర్ణయానికి వచ్చాడు.

ఆహారం-నిద్ర-పనులు పరిమితంగా వుండాలనుకున్నాడు. ఆ సందర్భంలో ఒక నర్తన బాలిక పాడిన పాట అతని కళ్ళు తెరిపించింది. "వీణాతంత్రులు గట్టిగా బిగిస్తే- ఆ తీగలు తెగుతాయి. నాదం పోతుంది. వదులుగా వుంచితే- నాదం నశిస్తుంది. మధ్యస్తంగా-సమశృతిలో-వుంటే-బిరడాలు తీగలు-సరిగ్గా వుంటే-చక్కని సంగీతం వస్తుంది. కనుక మధ్యేమార్గాన్ని అనుసరించవలసి వుంది" అని ఆ పాట అర్థం.

పూర్వాశ్రమంలో సిద్ధార్థుడు ఏనాడూ బాధ-కష్టం - దుఃఖం అనుభవించలేదు. మొదటినుంచీ సుఖాన్నే అనుభవించాడు. వయసులో వున్నప్పుడు వైభవాల్ని అనుభవించాడు. పూల పాన్పులపై పవళించాడు. మహాసౌధాల్లో నివసించాడు. అందమైన సుందరాంగులమధ్య మసిలాడు. నచ్చిన కన్యను వివాహం చేసుకున్నాడు. కాలమూ, దేహమూ ఇచ్చిన సుఖాన్ని-సంతోషాన్ని, ఆనందాన్ని, అందాన్ని అన్నివిధాల-నిర్విఘ్నంగా- నిర్భయంగా, నిరాటంకంగా- అనుభవించాడు. ఆ విధంగా అతని వ్యక్తిగత జీవితం, మొదట అతి సుఖ, సంతోషాలతో ప్రారంభమై, హాయిగా గడిచింది. "అతి" విసుగు పుట్టించగా, బైట ప్రపంచం ఏ విధంగా వుందో స్వయంగా చూసి తెలుసుకోవాలని బయలుదేరాడు. అప్పుడు అతని వయస్సు ఇరవై తొమ్మిది సంవత్సరాలు. ఇల్లు వదలి-గంగానది పరివాహక ప్రదేశాల్లో సంచారం చేశాడు. "అలారకలాము-ఉద్దారక రామపుత్ర వంటి మహాత్ముల వద్ద యోగవిద్యలు అభ్యసించాడు. అయినా అతనికి తృప్తి కలగలేదు. శరీరాన్ని శుష్కింపచేసే కఠోర తపస్సు - "అతి"గా చేశాడు. అయినా ప్రయోజనం కనుపించలేదు. ఆ విధమైన "అతి" సరైన పద్ధతికాదని-నిష్ప్రయోజనమని గ్రహించి- మధ్యేమార్గం ఎన్నుకున్నాడు. "అతి సర్వత్రావర్జయేత్" అనే సత్యాన్ని తెలుసుకున్నాడు, "అతి" అనేది అతని జీవితంలో రెండు సార్లు చోటు చేసుకుని, ఆ జీవితాన్నే నిష్ఫలం చేసింది. అప్పుడు అతనికి "అతి" విషయం అనుభవానికి వచ్చి- "అతి" అసహ్యకరమైనది, బాధాకరమైనది, హానికరమైనది, భరించరానిది- అని, అది సత్యాన్వేషణకు అడ్డు, అవరోధమని తెలుసుకున్నాడు.

పల్లెవాని రక్షణక్రింద సిద్ధార్థుడు బాగా కోలుకున్నాడు. దేహానికి బలం పట్టింది. దేహేంద్రియాలు శాంతించి, బాధించడం మానేశాయి. సంపూర్ణ ఆరోగ్యం సిద్ధించాక, కౌండిన్యుల వారి దగ్గరకు వెళ్ళాడు. సిద్ధార్థుడు దేహదారుఢ్యంతో- నవనవలాడుతో-నవ్వుతో- ఉత్సాహంతో రావడం చూసి, సిద్ధార్థుడు సాధన విరమించి, సుఖజీవితం గడుపుతు, భ్రష్టుడైనాడని భ్రమపడి- ఆ ఐదుగురూ అతన్ని

కలుసుకుని మాట్లాడటానికి నిరాకరించారు మనస్సుల్లో. అయినా సిద్ధార్థుడు వారి దగ్గరకు వెళ్ళగా-వారు అతన్ని చూడనట్లు - అసలు అతనెవరో ఎరగనట్లు-తెలియనట్లు నటించి-తాము కూర్చున్న చోటు నుంచి లేచి దూరంగా వెళ్ళిపోయారు.

*　　　*　　　*

సిద్ధార్థుడు నీరంజర నది ఒడ్డున ఒక రావిచెట్టు కింద ఆత్మ నిష్ఠుడై శిలా ప్రతిమలాగ కూర్చున్నాడు. ఆ ప్రాంతంలో "సేనాని" అనే గ్రామం వుంది. ఆ గ్రామపెద్ద పేరు కూడా సేనానే అతని కుమార్తె సుజాత-తపోనిష్ఠలో వున్న సిద్ధార్థుని దూరం నుంచి చూసి, దైవ విగ్రహమని భావించి-తన గర్భాన మగ శిశువు జన్మిస్తే, ఆ స్వామికి క్షీరాన్నం నైవేద్యంగా సమర్పించుకుంటాననుకున్నది. అప్పటికి ఆమె గర్భవతిగా వుంది. నెలలు నిండి, మగ బిడ్డనే ప్రసవించింది. మాట ప్రకారం సుజాత క్షీరాన్నం వండి, ఓ పళ్ళెంలో పెట్టుకుని-పరిచారిక పూర్ణతో - తాను మొక్కుకున్న విగ్రహానికి సమర్పించడానికి వెళ్ళింది. అది శిలాప్రతిమ కాదని-సజీవంగా ఉన్న స్వామియేనని తెలుసుకుని, "స్వామీ, ఈ ప్రసాదం స్వీకరించండి. తమరుకోరే ముక్తిని త్వరలోనే తప్పక పొందగలరు" అన్నది అమాయకంగా.

సిద్ధార్థుడు కళ్ళు తెరచి చూశాడు. ఎదురుగా ఒకామె పళ్ళెంలో క్షీరాన్నంతో నిలబడివుంది. అతడు ఆమె అభ్యర్థనను అంగీకరించి-నిరంజన నదిలో స్నానం చేసి-క్షీరాన్నం తిని - ఉప వాసం విరమించాడు. నలభయ్ తొమ్మిది రోజుల తర్వాత. ఆ రోజంతా ఆ నది ఒడ్డున ధ్యానంలో గడిపాడు. ఆ రోజునుంచి సిద్ధార్థుడు ప్రక్క పల్లెకు భిక్షాటనకు వెళ్ళేవాడు. తిరిగి ఆ చెట్టు దగ్గరకు వచ్చి-దాని క్రింద కూసా గడ్డిపరచి - తూర్పు ముఖంగా పద్మాసనంలో కూర్చుని-కొన్నాళ్ళు ధ్యానం చేశాడు.

సిద్ధార్థుని జీవితంలో సర్వసంగ పరిత్యాగం మొదటి మెట్టు అయితే, కఠిన నియమ నిష్ఠలతో చేసిన సాధన రెండవ మెట్టు.

అలా రకరకాల-ఉద్ధాకరరామపుత్ర వంటి మహాత్ముల ఉపదేశాల్ని విని-శ్రద్ధగా పాటించడం మూడవమెట్టు. ఉరువేల ప్రాంతంలో సాధన చేయడం నాల్గవమెట్టు.

*  *  *

సిద్ధార్థుడు ఉరువేల ప్రాంతం నుంచి గయవెళ్ళాడు. అక్కడ ఒక అశ్వత్థ వృక్షం క్రింద కూర్చుని ధ్యాన నిమగ్నుడయ్యాడు. ఒక రోజున ఒక వ్యక్తి వచ్చి-సిద్ధార్థుని విడవకుండా దూషించ నారంభించాడు. సిద్ధార్థుడు మారుపలకలేదు. అతను దూషించి అలసి పోయిన తర్వాత, "నాయనా నీ ఇంటికి అతిథి వచ్చినప్పుడు అతన్ని ఎవరూ లక్ష్యపెట్టక, మాట్లాడకపోతే, అతనేం చేస్తాడు?" అని అడి గితే, "ఏం చేస్తాడు, వచ్చిన దారినేపోతాడు" అన్నాడా వ్యక్తి. "నీవు నన్నెంతో దూలనాడావు. నేను వాటిని స్వీకరించలేదు. కాబట్టి అవన్నీ తిరిగి నిన్నే చేరతాయి. నేను వాటిని తీసుకున్నట్ల యితే-అవి నన్ను బాధించి వుండేవి. కాని నేను అట్లా చేయలేదు. నీ సొత్తును నీకే సమర్పించాను," అనేప్పటికి అతడు తెలివి తెచ్చు కుని, తన దారిని తాను వెళ్ళిపోయాడు.

"తాను కోరే- అన్వేషించే-నిజంగా, శ్రద్ధగా ఆశించి-ప్రయ త్నించే సత్య సంపర్కసం కలిగేంత వరకు కూర్చున్న చోటు నుంచి కదలను" అని ప్రతిజ్ఞ చేశాడు సిద్ధార్థుడు కండలు కరిగి - నరాలు బలహీనమై, దేహం క్షీణించి, నాశనమైనా- జీవనసారం ఎండినా - రక్తం ఉడిగినా-ఎముకలు నేలరాలినా - ఏమైనాసరే, తాను కోరే పరమసత్యం తెలిసేవరకు కూర్చున్న చోటునుంచి కదలకూడదను కున్నాడు. ఆ సమయంలో ఆయనకు ఎన్నో అనుభవాలతో పాటు మనసు నిరాశ, నిస్పృహలకు చోటు చేసుకుంటూనే వుంది. ఆలోచ నలు కలుగుతూనే వున్నాయి. నల్లని చీకట్లు, మనసును కప్పడం వంటి ఎన్నో సంగతులు తటస్థ పడ్డాయి. ఎన్ని సంగతులు జరుగు తున్నా, సిద్ధార్థుడు లక్ష్యం చెదరకుండా ఏకాగ్ర చిత్తంతో, జాగ్ర త్తగా-నిదానంగా-నెమ్మదిగా-ఓర్పుగా వాటన్నింటినీ తోసేస్తే-పరి

క్షీస్తో పరిశీలిస్తో పరిశోధిస్తో సాధన సాగించాడు. క్రమంగా దేహంలో రక్తం హీనమైనది. ఎముకలు బయటపడ్డాయి. అయినా సాధన విరమించలేదు.

*　　*　　*

దీర్ఘకాల కఠిన తపస్సు వల్ల సిద్ధార్థుని అంతఃకరణం శుద్ధి అయింది. ఏడు వారాల అనంతరం అతని మనసు నిర్మలం-నిశ్చలం, ప్రశాంతవంతం అయింది. చెడు, పాపం, దుర్మార్గం, దుఃఖకరం, పరస్పృష్టకరం, హానికరం, స్వార్థపర్వతం మొదలయిన విషయాల నుంచి ఆయన మనసు దూరమై ఒక రకమైన ఆనందం-శాంతి అనుభవంలోకి వచ్చాయి.

ఒకరోజు రాత్రి ఏం జరిగిందంటే-గతంలో అతడు ఎంతో పట్టుదలతో సమస్తాన్ని వర్జించినట్లే, అప్పటికి చేస్తున్న సత్యసాధన అన్వేషణా పూర్తిగా- ఏ చాయా, ఏమీలేకుండా అప్రయత్నంగా ఆగిపోయింది. లోపల నుంచి—పూర్తిగా అంతా వదలిపోయింది. అంటే, అతడు తనలో తాను మునిగి-ఆశ - కోర్కె - ప్రయత్నం అంటూ ఏమీ లేకుండా, నిర్వికారంగా-నిశ్చలంగా-అన్వేషణా రహితంగా-ప్రశాంతంగా వున్నాడు, ఆ రాత్రి సిద్ధార్థుడు. ఒక చెట్టుకింద హాయిగా పడుకున్నాడు, గత భారరహితంగా- ఆలోచనా రహితంగా-నిర్మలంగా-నిశ్చింతగా నిద్రపోయాడు అదే బోధి వృక్షం. చాలా కాలం తర్వాత కలతలేని సుఖనిద్రపోయాడు. అతనిలో శారీరకంగా-మానసికంగా ఎటువంటి బంధం-ఆపేక్ష లేవు. దేనికోసమూ ఎదురుచూడ్డం తెలియని దానికోసం అన్వేషించడం-ఏదో కావాలని ఆశించి, ప్రయత్నించడం-కలలు కనడం-అంటూ ఏమీ లేకుండా-మనో చలనమే లేకుండా, హాయిగా నిద్రపోయాడు. అంత హాయిగా సుఖంగా నిద్రపోవడానికి కారణం, అతని మనసులో ఒక చిన్న కోర్కె అయినా కూడా లేకపోవడం. అతనిలోంచి భౌతిక ప్రపంచం పూర్తిగా తొలగిపోయింది. అంటే, గతం—ఏమీ మిగలకుండా

పోయింది. భవిష్యత్తు లేదు. ఏమీలేదు. నిరామయంగా వున్నాడు. చివరికి అతనిలో ఆధ్యాత్మిక—లౌకిక ప్రపంచానికి చోటు లేకుండా పోయింది-అంటే-దేహం, మనసు నిద్రావస్థలో-సుఖావస్థలో-సహజావస్థలో వున్నాయి. అంటే "నేను" అనే స్ఫురణ-చైతన్యం—ప్రజ్ఞ-మెలుకువ వుంది. తాను నిద్రపోతున్నా-పక్కలోవున్న బిడ్డపై తల్లి దృష్టి వుంచుతుంది. ఏ క్షణంలోనైనా బిడ్డను వెంటనే తీసుకునేందుకు. అటువంటి నిద్రావస్థగా, జాగ్రదావస్థగా సిద్ధార్థుడు ఎరుకలో వున్నాడు-ఏ క్షణంలోనైనా పూర్తిగా మేల్కొనేందుకు - సిద్ధార్థుడు వున్నాడు. అదీ ఆ రాత్రి సిద్ధార్థుని స్థితి.

సిద్ధార్థుడు అంతకు ముందు ఆరేళ్ళ నుండి తెలియని సంగతి మీదా, అనుభవంలేని విషయంమీదా-ఏకాగ్ర దృష్టితో, కఠిన తపస్సులో కాలం గడవడంతో, లౌకికమైన ప్రపంచం మరుగున పడిపోయింది. అంటే, అతడు సహజ జీవనం-భౌతిక-జీవితం విస్మరించాడు. ఆ అన్వేషణ క్రమంగా ఒక నల్లతెరగా తయారై అసలు సత్యాన్ని-సహజత్వాన్ని-సమస్తాన్ని కప్పేసింది.

కాని, ఏమీ ఆశించనప్పుడు, వాంఛించనప్పుడు-ఏదీ అన్వేషించనప్పుడు- అప్పుడు మాత్రమే సహజమైన, నిజమైన జీవితం వుంటుంది. అదే—సత్యం, శాంతి, కాంతి, ఆనందం, శాశ్వతం. అదే అసలు వున్నది. వుండేది. ఉనికి అన్నా అదే. దాన్నే బౌద్ధులు నిర్వాణ మన్నారు. దాన్నే ఆత్మ సాక్షాత్కారం-ఈశ్వర దర్శనం-సత్య సందర్శనం అంటారు మరికొందరు. అసలు ఎప్పుడూ వున్న దాని గురించి గౌతముడు ఆరేళ్ళు తీవ్రంగా అన్వేషించి శారీరకంగా మానసికంగా అలసిపోయాడు. కాని, ఆ రోజు రాత్రి అదంతా పూర్తిగా-లోపల నుంచి అప్రయత్నంగా ఆగిపోయింది. అన్వేషణ లేదు. ఆశలేదు. ప్రయత్నం లేదు. ఏమీలేదు.

ఆ రాత్రి మొదటిజామున గత జీవితం జ్ఞప్తికి వచ్చింది అంతే పూర్వజన్మ జ్ఞానం కలిగింది. అంతే, పూర్వ నివేశాను జ్ఞానం కలిగింది. సంపూర్ణ ఎరుకతో సాధన చేయగా, అజ్ఞానం తొలగింది.

రెండో జామున-జనన, మరణ రహస్యం గోచరమైంది. అంటే, సంశయం అనేది తొలగింది. దివ్య చక్షువును పొందాడు. మూడో జామున-దివ్యకాంతి దర్శనమైంది. అంటే, ప్రత్యక్ష సముత్పాద సత్యం అవగతమైనది.

నాల్గో జామున - ఉషోదయవేళకు ముందు-ఉదయతార - వేగుచుక్క-పొడిచేవేళ—గౌతముడు కళ్ళు తెరిచాడు. అసాధారణమైన, అద్భుతమైన, అనన్యమైన, అతిలోకమైన, అపురూపమైన దివ్య కాంతి-ఎప్పుడూ, ఎక్కడా చూడనటువంటి కాంతి-దేనితోనూ పోల్చలేని-కాంతిని చూశాడు సిద్ధార్థుడు ఆ దర్శనంతో అతనికి అసాధారణమైన అనుభవం కలిగింది.

ఆ తర్వాత ఏం చేయడానికీ, ఏం ఆలోచించడానికీ, ఏం చూడ్డానికీ అతనిలో విషయం-సంగతి-గతం-సంకల్పం-ఆశ, కోరిక, వాంఛ, తృష్ణ, ప్రయత్నం—ఏమీలేదు. పూరేకులు విచ్చుకున్నట్లు, అతని కనురెప్పలు ఉదయకాంతికి, తెరుచుకున్నాయి; దేహధర్మం ప్రకారం. అంతే. అతని కళ్ళ ముందు అనంత ఆకాశం. అతని చూపులో ఆశ-ప్రయత్నం, ప్రయాస ఏమీలేదు, ఆ క్షణాన ప్రపంచ విషయాలకు కళ్ళు వాటంతటఅవే మూసుకుంటే ఇంకమిగిలేది శాంతి, విశ్రాంతి, ప్రశాంతత మాత్రమే. అది కలతలేని స్థితి-నిశ్చల మనో స్థితి-సహజ స్థితి.

అటువంటి నిశ్చల, నిర్మల, ప్రశాంతత కల కళ్ళ ఎదురుగా ఆకాశంలో ఉదయతార ప్రకాశిస్తోంది. అది క్రమంగా పగటికాంతికి కరిగి-చివరి కాంతిని ప్రకాశిస్తో-ప్రసరిస్తో హీనమౌతోంది. మరు క్షణంలో, ఆ తార అదృశ్యమైంది. ఆ కాంతి, విశ్వకాంతిలో కలిసి పోయింది, ఏ ప్రత్యేకతా లేకుండా అదే సిద్ధార్థునిలోని చివరిగుర్తు-గతం తాలూకు ఆనవాలు. అన్నీ, ఆ తారతోపాటు అదృశ్య మైనాయి. ఆ క్షణం నుంచి అతడు సిద్ధార్థుడు కాదు. అసలు ఏమీ కాదు. ఆ క్షణంలో అతడు ఏమీకాని, ఏమీలేని-పవిత్రమైన పూర్ణ

డుగా మిగిలిపోయాడు. అదే Contentless Consciousness అంటే అతనిలోని చివరికో రెక్క-సత్యాన్వేషణ - విమోచన - వంటి ఆశలు - కోరికలు - ప్రయత్నాలు - వాటికి సంబంధించిన ఆలోచనలు అన్నీ మనసులోంచి జారిపోయాయి. నిశ్చలంగా, నిర్మలంగా, ప్రశాంతంగా ఆశ-ప్రయత్నమంటూ లేకుండా-అసలు తానుగా వున్నాడు-సిద్ధార్థుడు, ఆ ఉదయం బోధివృక్షం క్రింద.

ఆ తెల్లవారుజామున ఉదయతారను చూసి-దాన్ని గుర్తించిన క్షణంవరకు-సిద్ధార్థునిలో లోకస్ఫురణ మిగిలివుంది. తార అదృశ్యమయ్యే వరకు అతనిలో లోక దృష్టి వుంది. ఆ మరుక్షణం ఏమీ లేదు-చూసి, గుర్తించి, నిల్వ వుంచుకునేందుకు. ద్రష్టలేదు కనుక, దృశ్యమూ లేదు. అతని భౌతిక జీవనంలో-అన్వేషణలో-సాధనలో-ఏకాగ్రదృష్టిలో-చివరికి మిగిలిన విషయం-వస్తువుసంగతి- ఆ తార ఒక్కటే. అది కూడా అంతర్థానమైనది. అది-అసలు కాంతిలోనామ రూపం లేకుండా కలిసిపోయింది. అప్పుడు జరిగింది అంతే!

ఆ సంఘటనతో సిద్ధార్థునికి గొప్ప అనుభవం కలిగింది. అతని జీవితంలో అది గొప్ప రాత్రి. అతన్ని మహోన్నత స్థితికి తీసుకు వెళ్ళిన అమృత రాత్రి. అంటే, అతడు-ఆ ఉదయం-సంసారదుఃఖోపశమనదాయకమైన పరమ సత్యాన్ని కనుక్కున్నాడు. కాని, ఆ అనుభవాన్ని గుర్తుపెట్టుకునేందుకు-జ్ఞాపకం పెట్టుకునేందుకు, గౌతముడులేడు. తారతోపాటు సిద్ధార్థుడూ అదృశ్యమైనాడు. అంటే, అతని గతమంతా-ఏమీ మిగలకుండా పూర్తిగా కాలిబూడిద అయింది. అతడు గాలి అంత తేలికగా, కాంతి అంత తేజోమయంగా-ఆకాశమంత నిరామయంగా, నిర్వికారంగా, పవిత్రంగా, స్వేచ్ఛగా, స్వచ్ఛంగా-అన్ని బంధాలు తొలగి వున్నాడు. తృప్తిపడి, సంతోష పడటానికి, ఆనందించడానికి బైట- తనకు అన్యంగా, భిన్నంగా, విడిగా, దూరంగా ఒక సంగతి-ఒక విషయం ఒక వస్తువు ఏమీలేదు. అసలు గౌతముడే లేడు. కాని, బోధి వృక్షం క్రింద సిద్ధార్థుడు భౌతికంగా వున్నాడు, సమస్తానికి సాక్షిగా గతించి

పోయేవాటికి ఎరుకలో-ప్రామాణికంగా, నిజంగా, యథార్థంగా- ఆ క్షణంలో మొదటిసారిగా సాక్షిగా వున్నాడు. "నేను" అనే ప్రత్యేక వ్యక్తిత్వ భావం-అహంకారంతో మాత్రం లేదు.

ఆ క్షణంలో అతనిలో అనుభవంకాని, జ్ఞానానుభవంగాని కలగాలనిలేదు. కాని, "అనుభవం కలిగింది" అనేది లేని స్థితిలో వున్నాడు సిద్ధార్థుడు. ఆ క్షణంలో వున్నాడు. అంతే లోపలనుంచి గతమంతా పూర్తిగా ఊడ్చుకుపోవడంతో, హాయిగా, సుఖంగా, శాంతంగా- నిర్మలంగా, నిశ్చలంగా, ఆనందంగా వున్నాడు. ఏ ఆలోచన, ఆసక్తి, బంధం, అత్యాశ ఏమీలేవు అతనిలో, ఆ క్షణంలో బంధవిముక్తుడయ్యాడు. మరపులేని ఎరుకలో నిలిచి పోయాడు. అది-అజ్ఞానాన్ని అతిక్రమించిన స్థితి. అదే అసలైన జ్ఞానం. ఆ స్థితిలో గ్రహించేందుకు ఏమీ వుండడానికి వీలులేదు.

అతడు భౌతికంగా దర్శించింది ఉదయాకాశాన్ని. ఆంతర్యంలో దర్శించింది-హృదయాకాశాన్ని- నిర్మలం-స్వచ్ఛం- శూన్యం అయినదాన్ని దర్శించాడు. అతని చూపులో గతం-దోషం- కల్మషం- వాంఛ-ఆశ-తృష్ణ-ఏమీలేవు. ఎంత స్వల్పమైన లోకానురక్తి- విషయ వాసన-వున్నా-అది అనంత ఆకాశంలో వివిధ నామ - రూపాలతో వ్యక్తమై వుండేది. అతని లోపల ఏమీలేదు కనుక, స్వచ్ఛమైన- శుభ్రమైన-ఆకాశమే దర్శనమైంది. ఆ స్థితిలో చివరివరకు సిద్ధార్థుడు నిలిచాడు. అటువంటి దృష్టికలవాడే, నిజమైన ద్రష్ట. సిద్ధార్థుని జీవితం చూస్తే అన్వేషణ- ఆరాధన-ఆసక్తి ద్వారా ఎవరూ, ఏదీ ఎప్పటికీ కనుక్కోలేరనే సంగతి స్పష్టమౌతుంది.

మనిషి సహజంగా కష్టాల్లో - బాధల్లో-దుఃఖాల్లో వున్నప్పుడు ప్రపంచాన్ని పరిత్యజిస్తాడు. కాని సిద్ధార్థుని విషయంలో తద్భిన్నంగా జరిగింది. అతని పరిత్యాగానికి "అతి సుఖమే" కారణమైనది. అతని జీవితంలో అదే చిత్రం. అతడు ఏనాడూ కష్టం- బాధ- దుఃఖం అనుభవించలేదు. అయినప్పటికీ-అతడు అందరూ కోరుకునే

సుఖాన్నే త్యజించాడు. ఐశ్వర్యం-సుఖం—ఇతరులు చూపే దయ-ప్రేమ-అతన్ని బంధించాయి-బాధించాయి. సుఖంగా వున్నప్పుడు సమస్తం పరిత్యజించడమంటే-చాలామందికి విపరీతంగా తోస్తుంది. కాని సిద్ధార్థుని విషయంలో పరిత్యాగం భిన్నంగా జరిగింది - అతని పరిత్యాగానికి అంతఃప్రేరణ తప్ప-బాహ్య దోహదము ఏదీ కాదు. అంత కఠోర తపస్సుచేసి అతడు తెలుసుకున్నదీ — "అసలు ఏమున్నదో-అదే వున్నదని" తెలుసుకున్నాడు.

*                    *                    *

తాను అనుభవిస్తున్న ఆనందం మరింత లోతుకు ఇంకి-ఎక్కువకాలం నిలవడంతో, అతని వ్యక్తిత్వం, అహంభావం పూర్తిగా నశించాయి. ద్వంద్వ భావం అంతరించింది. అజ్ఞానం - అంధకారం తొలగాయి. దివ్యకాంతి దర్శనమైనది. పరమశాంతి లభించింది. జ్ఞానోదయమైనది. సిద్ధార్థుని మనసుపై జ్ఞాన కాంతి ప్రసరించింది. దానితో అతని మేధస్సు- ప్రజ్ఞ - తెలివి - స్ఫురణ ప్రస్ఫుటమైనది. జనన, మరణరహస్యం తెలిసింది. అనంతవిశ్వంలో తన ఉనికి గుర్తించాడు. ఆ తర్వాత అతని ఆలోచనలు-సంకల్పాలు శాంతంగా, పవిత్రంగా, నిర్మలంగా, నిశ్చలంగా—పరిశుభ్రంగా సాగాయి.

ఆ తర్వాత అతడు స్థిరంగా వుండిపోయాడు. మనసు చలించలేదు. ఇంద్రియాలు విజృంభించలేదు. క్రమంగా అతనికి ఒక విధమైన దివ్యదృష్టి కలిగింది. వైరాగ్యంతో కూడిన ముముక్షుత్వం, తీవ్రంగా వుండుటచేత, శమ- దయాదులు త్వరలో సత్ఫలితాల్ని ఇచ్చాయి.

ఆ అనుభవజ్ఞానంతో, సిద్ధార్థుడు మొదట దుఃఖకారణాన్ని వెదికాడు. ఆ కారణాన్ని విభజనచేసి, దాన్ని తొలగించే మార్గాన్ని పద్ధతిని యోచించాడు. దుఃఖనివృత్తి మార్గానికి-అవగాహన స్థిరమైన యత్నం అవసరమని గ్రహించాడు. ఆ సాధనలో అతడు చాలా

పురోభివృద్ధి సాధించాడు. అతనికి చతుస్సత్య జ్ఞానం కలిగింది. అవి-దుఃఖం-దుఃఖ సముదాయం-దుఃఖనిరోధం-దుఃఖ నివారణో పాయం. దుఃఖకారణం, తృష్ణ. తృష్ణలేనిదే భవం (జన్మ) లేదు. అదే, నిర్వాణం. అది-దీపం ఆరిపోవునట్లు ఒక్కసారిగా ఆరిపోవుట వంటిది. ఆ సత్యం సిద్ధార్థునికి అవగతమైనది. సమ్యక్ సంబోధి కలిగిన సిద్ధార్థుడు. బుద్ధుడైనాడు. సమస్త జీవుల దుఃఖోపశమనం కోసం-బుద్ధత్వాన్ని సాధించాడు. ఆ క్షణాన ఆయనలోంచి- ఈ మాటలు అప్రయత్నంగా వెలువడ్డాయి. "దేహమనే గృహాన్ని నిర్మి స్తున్న- నిర్మాత ఎవరో తెలుసుకోవాలని-అన్వేషణ సాగించాను. ఆ నిర్మాత ఎవరో తెలుసుకోగల బుద్ధి (జ్ఞానం) కలగనందువల్ల లెక్కలేనన్ని జన్మలు ఎత్తుతూ-సంసారంలో ఇన్నాళ్ళూ పరిభ్రమించాను. మళ్ళా-మళ్ళా జన్మలు ఎత్తుతూ వుండటం, ఎంత దుర్భరం? ఓయీ, గృహ నిర్మాతా! నిన్ను కనుక్కున్నాను. ఇక నీవు నాకు ఇల్లు కట్టలేవు. నీ వాసాలన్నీ విరిగిపోయాయి. నీ మూలాలన్నీ నాశనమై నాయి. ఇల్లంతా ధ్వంసమైంది. నా చిత్తం- నిర్వాణం పొందింది. అర్హత ఫలాన్ని నేను అందుకున్నాను" అని.

"నా చిత్తం నిర్వాణం పొందింది" అంటే అవిద్య నశించిం దని అర్థం. అవిద్య కారణంగా, సంస్కారం ఏర్పడుతుంది. సంస్కార కారణంగా, విజ్ఞానం కలుగుతుంది. విజ్ఞాన కారణంగా, నామ, రూపాలు ఏర్పడతాయి. వాటి కారణంగా, ఆరు ఆయతనాలు అంటే-స్పర్శ, వేదన తృష్ణ, ఉపాదానం (సంతుష్టి) భవము (సంసారం), జాతి (జన్మ) కలుగుతాయి. ఆ విధంగా ఈ జగం దుఃఖమయం. దానికి తరుణోపాయం — విరాగం. తత్ఫలితంగా అవిద్య పూర్తిగా నశిస్తుంది. అవిద్య నశిస్తే, సంస్కారం నశిస్తుంది. సంస్కారం నశిస్తే, విజ్ఞానం నశిస్తుంది. ఆ తర్వాత నామరూపాలు నశిస్తాయి. ఆ పిదప- ఆరు ఆయతనాలూ నశిస్తాయి. ఆపై- జరా, మరణ, శోక, దుఃఖ చిత్త వికారాలు నశిస్తాయి.

ఈ సందర్భంలో జ్ఞానోదయం—సత్య సందర్శనం- ఈశ్వర

దర్శనం-ఆత్మసాక్షాత్కారం వంటి మాటలు అర్థం తెలుసుకోవడం కొంతవరకైనా మంచిది, అవసరం కూడాను.

జ్ఞానోదయమంటే మనల్ని చుట్టుకున్న-లేక అల్లుకున్న అజ్ఞానపు మాయ తెరలు తొలగిపోవడం. మాయ అంటే, లేనిది వున్నట్లు అనిపించడం, అగుపించడం. భ్రాంతులు తొలగిపోవుటే, జ్ఞానోదయం. ఎందుకంటే, భ్రాంతులు మనవికావు. అవి, అసత్యమైనవి. అటువంటి అసత్యపు అస్తిత్వాన్ని గుర్తించి, దానికి ఎరుకలో వుండటమే సత్య సందర్శనం. ఏ గుర్తూ, మచ్చా, మరకా, జాడలేకుండా గతమంతా తొలగిపోవడం. అది మృత్యువుతో సమానం. ఎవరికి వారు- ఎప్పటికప్పుడు తమ అంతాన్ని తాము చూసుకోవడం. అటువంటి మృత్యువును ఆహ్వానించడం. ఆ విధంగా మరణించి, పునర్జన్మ ఎత్తడం. అదే జీవన్ముక్త స్థితి. అప్పుడు సహజత్వం-శాశ్వత జీవనం నిత్య జీవితంలో ప్రకాశిస్తుంది.

జ్ఞానమంటే, అనేక విషయాలు తెలుసుకోవడం కాదు. మనసుకు దూరంగా వుండి, మళ్ళా దానికి సదా ఎరుకలో వుండటం, ఏ విషయంలోనూ మనో విజృంభణ లేకుండా వుండటం. అంతస్సు నుండి వెల్లువికే చైతన్య అవగాహనే, జ్ఞానం. ఊర్ధ్వం నుండి ప్రసరించే ఆధ్యాత్మిక జ్యోతి ప్రసరణమే, జ్ఞానంకాని, ఆధ్యాత్మిక విషయాల గురించిన భావసముదాయం మాత్రం కాదు. ఆ ఎరుక ఒక జ్వాలగా మారితే అది సమస్త బంధాల్ని క్షణంలో దగ్ధం చేస్తుంది. తాను కల్పించుకున్న భ్రాంతుల్ని, అల్లుకున్న మాయ తెరల్ని తెంచుకోవడమే, జ్ఞానం.

సత్య సందర్శనమే, అంతిమ జ్ఞానం కాదు-అది కేవలం వ్యక్తిగత ఎరుక మాత్రమే. వ్యక్తిత్వం అనేది ఎప్పుడూ రెండు గట్లమధ్య ప్రవహించే నది వంటిది. ఆ నది, సముద్రగర్భం చేరడంతో, ఇంక గట్ల ప్రసక్తి వుండదు. నది, సాగరగర్భ ప్రవేశంతో, ఆ గట్లూ అదృశ్యమౌతాయి. వ్యక్తి, నామ–రూపాలు లేకుండా అందులో లీనమైపోతాడు. అటువంటి స్థితే, నిజమైన, సహజమైన స్థితి. అది

పర్వత శిఖరాన్ని దాటిన సంగతి. సత్యం, పర్వతశిఖరం. దానికి అతీతమైన స్థితే, సహజస్థితి.

మనం అనుకునే, అనే-జ్ఞానోదయాన్ని మించిన సంగతి ఏదో అది కూడా ఈ ఉనికిలో వుంది. దాన్ని కూడా సాధించ వచ్చుననే సంగతి ప్రపంచానికి చాటి చెప్పాడు బుద్ధుడు.

పర్వతశిఖరం దాటి వెళ్ళినవారు అంటే, సహజ స్థితిలో నిలిచిన వారు. వారు తప్ప ఇతరులెవరూ దాని గురించి చెప్పలేదు. ఆ స్థితిని చేరినవారు, ఎప్పటికీ తిరిగి వెనక్కిరారు. వారు అందరి కంటే ఘనులు-యోధులు-మహోన్నతులు-వారు-తిరిగి వెనక్కివచ్చి సహజ స్వభావులై సామాన్య ప్రజానీకంతో కలసి-మెలసి జీవించడం గొప్పసంగతి.

శూన్యత, మనస్థితి, మన స్వభావం. అసలు అదే మనం అది సాధన - శ్రమశిక్షణ-ప్రయత్నంవల్ల కలిగేది, ఏర్పడేదీ కాదు. "శూన్యత" అది బహుముఖమైనది. ఏదో తీసేయగా, తొలగించగా ఏర్పడే స్థితికాదు, అది. అహంభావం నిర్మూలం కావడం అంటే, వ్యక్తిత్వ నిర్మూలన, శూన్యత. కాని, సిద్ధార్థునిలో ఇంకా- దయ, ప్రేమ, జాలి-కరుణ వంటి గుణాలు మిగిలి-పనిచేయడంతో, అది మహాశూన్యం కాలేదు. కాని, మహాపరి నిర్వాణంతో ఆయనకు ఆ స్థితి కలిగింది.

అనంతం-అగమ్యం-అగోచరం-అవ్యక్తం అయినదాని వైపు మనం పయనిస్తున్నామనే సంగతి, ఎప్పుడూ మరచిపోకూడదు. అది-దుష్కరమైన-ప్రయాసకరమైన-కఠినమైన యాత్ర. ప్రారంభంలో అన్వేషకుల సంఖ్య అధికంగా వున్నా, క్రమంగా సంఖ్య స్వల్పమౌతుంది. చివరికి మిగిలిన బహుకొద్దిమందిలోనూ, చాలామంది-అనేక కారణాలవల్ల తిరిగి మామూలు ప్రపంచంలో చేరిపోతారు. అంతంలో-గమ్యంలో - వారనుకునే-ఆశించే-జ్ఞానసత్యం ఈశ్వర సాక్షాత్కారం-వుందో—లేదో ఎవరికి తెలియదు, చివరికి సిద్ధార్థుడికి

కూడా. అన్వేషణలో- నిశ్చయంగా జ్ఞానం పొందుతాం, సత్యాన్ని దర్శిస్తాం అనే గ్యారంటీ లేదు. తీవ్ర అన్వేషకులు-కొందరు- తాము కల్పనచేసి-ఊహించి-భావించి - భవిష్యత్తులో విడిగా - దూరంగా ఏర్పరచుకున్న ఆత్మనో - ఈశ్వరుణ్ణో - జ్ఞానాన్నో-సత్యాన్నో-ఆ దూరం నుంచే దర్శించామనుకుంటారు కాని. వారు అసలు సత్యం తెలిసినవారని కాని, అంతిమజ్ఞానం పొందినవారని కాని అనడానికి వీలులేదు. ఎందుకంటే-వారు కూడా-అసలు మూలం-గమ్యం చేరిన వారు కాదు కనుక, వారు కేవలం-చీకటి లోయలో వుండి-దూరాన-పర్వత శిఖరాన-ప్రకాశించే కాంతిని దర్శించిన వారు మాత్రమే. శిఖరం చేరడం మరీ కష్టం. కాంతిలో ప్రకాశించే పర్వత శిఖర దర్శనం మాత్రం భ్రాంతికాదు, కల్పనాకాదు. కాని, ఒక సుగుణం ఏమిటంటే, అన్వేషకుని - ఆలోయలోంచి వెనక్కి మళ్ళించగల శక్తి ఏదీ ప్రపంచంలో లేదు-వుండదు-అటువంటి వారు కూడా, గొప్ప వ్యక్తులుగా ప్రపంచంలో పరిగణించబడతారు. తాను చీకటి లోయలోంచి, దర్శించిన కాంతిని, తనలో దర్శించుటే "నిర్వాణ" స్థితి.

పర్వతారోహణకు అతి బలాఢ్యులు—యోధులు కావాలి. పర్వత పాదంవద్దనే మిగిలిపోయి, అసత్య ప్రచారం చెయ్యడం ఆత్మవంచన, పరవంచన అవుతుంది. అన్వేషణ తీవ్రమయ్యేకొద్దీ - తాముఊహించి-భావించి కల్పించుకున్న దాని ఛాయలు-గుర్తులు—చిహ్నాలు కనిపిస్తాయి. దానితో వారు సంతృప్తి చెంది-సంతోషంతో సాధన మరింత తీవ్రం చేస్తారు. తాము ఆశించే ఆత్మ-ఈశ్వరుడు-జ్ఞానం-సత్యం-అది—అతి చేరువలో వున్నాయనే భ్రమతో-దాన్ని చేరుకోవడానికి ఆశతో మరింత గట్టి ప్రయత్నం చేస్తారు. ఆ విధంగా వారి కాలమంతా సాధనలకు—శోధనలకు గురి అవుతుంది. చివరికి శారీరకంగా, మానసికంగా బాగా అలసిపోతారు. ఎంతటి బలాఢ్యులు శక్తిహీనులౌతారు. వేల సంవత్సరాలలో-బహుకొద్దిమంది మాత్రమే పర్వత శిఖరం చేరి, తిరిగి స్వస్థలం వచ్చి-అన్ని విషయాల్లో లీనమై మళ్ళా దేనికీ అంటక—గతించిపోయే వాటన్నింటికీ అతీతంగాసాక్షిగా

వుంటారు. నిర్భయంగా వుంటారు. వారిలో ద్వంద్వ భావం పోవడంతో, అంతా ఒకటిగా - సమంగా చూస్తారు, అందే, వారిలో అహంభావం పూర్తిగా నాశనమౌతుంది. ఎటువంటి దురభిమానం— పక్షపాతం లేకుండా సమస్తాన్ని ప్రేమతో హృదయానికి హత్తుకుంటారు. తమకు అన్యంగా-భిన్నంగా-వేరుగా-దూరంగా-ఏదీ లేదని అనుభవ పూర్వకంగా తెలుసుకున్నవారు గనుక, హాయిగా - ఆనందంగా-సుఖంగా-సంతోషంగా - సహజంగా వుంటారు. అదే సిద్ధార్థుని స్థితి.

జన్మతః అందరూ జ్ఞానులే. జీవించేకొద్దీ, చాలా ఎక్కువ మంది అజ్ఞానులుగా మారతారు, జరిగేది అంతే! అజ్ఞానాన్ని గుర్తించి-ఆగి, ఆలోచించేవాడే నిజమైన అన్వేషకుడు. అతడే ముక్తి పొందగలడు. అటువంటి వారికి, ఏ క్షణంలోనైనా మాయతెర తొలగవచ్చు.

* * *

ఈ సృష్టిలో అనర్హుడు-అయోగ్యుడు అనేవాడు పుట్టడు. ఎందుకంటే, ఈ ఉనికి-అదే-ఈసత్ - పవిత్రమైనది- నిర్మలమైనది-స్వచ్ఛమైనది. అటువంటి దాన్నుంచి, అపవిత్రమైనది-అనర్హమైనది ఎట్లా పుడుతుంది? "అయోగ్యత" అంటామే-అదేమిటో గుర్తించి తెలుసుకోవాలి. సత్-అందరికీ సమానమే. దానికి విచక్షణ వుండదు. వివేకవంతులు, తాము అనర్హులం-అయోగ్యులం అనుకోరు.

ఎవరికి వారు-తమను తాము తెలుసుకుంటే-అటువంటి భావం కలగదు. అంటే, క్షణ క్షణానికి తాను, లోలోపలకు మునగడం-ఒక్కొక్క పొరే ఛేదించుకుంటూ-దాన్నంతా అవగాహన చేసుకుంటూ-లోతుకు వెళ్ళడం. ఆ మార్గంలో- ఆ పొరలు ఒలవడంలో—ఎదురయ్యే విషయాల్ని-సంగతుల్ని-సంఘటనల్ని పరిశీలనగా- పరీక్షగా-వివేక దృష్టితో చూడాలి. అవన్నీ ఉల్లిపాయ పొరల్లా వుంటాయి. ఒక్కొక్క పొరే, ఒలిచి చూడాలి. తీసేకొద్ది పొరలు

వస్తూ వుంటాయి. క్రమంగా శుభ్రమైన- స్వచ్ఛమయిన- నాజూకైన పొరలు బైట పడతాయి. ఇంకా-ఇంకా ఒలిచేకొద్దీ - చివరకు ఉల్లి పాయే మిగలదు. అపంతా వుత్త పొరలమయం. అలాగే, మాయ తెరలన్నింటినీ తొలగిస్తే-చివరకు మనలోనూ ఏమీ మిగలదు. మహా శూన్యమే వుంటుంది. అది ఏర్పడడానికి ఎంతకాలం పడుతుంది? అనే ప్రశ్న లేదు. అది కృషిపై ఆధారపడి వుంటుంది. దురాశ, ద్వంద్వం అస్పృశ్యమయిన స్థితి అది. ఆ స్థితిలోనే, జ్ఞానోదయం అవు తుంది. అప్పుడు నిశ్చలత్వం-మౌనం చోటు చేసుకుంటాయి. అందుకే చాలామంది తమలోకి తాము చూసుకోరు- అవన్నీ పోతాయనే భయంతో. ఆ మహా శూన్యమే, సత్యం- దైవం - జ్ఞానం - ఆత్మ- వాస్తవం-అన్నీను. దానికి ఏ పేరైనా ఒకటే.

అవగాహనానంతరమే-దురాశ, ద్వంద్వం పోతాయి. ఒకటి పోతే, అన్నీపోతాయి. ఒకటి వుంటే, అన్నీ వుంటాయి. ఆ విధా నంలో సమస్తాన్ని నిరాకరించి-తోసెయ్యాలి. అప్పుడే స్వేచ్ఛగా వుండగలం. ఉల్లిపాయ పొరల్ని-మాయ తెరల్ని- ఒలవగలుగుతాం, తొలగించగలుగుతాం. ఆ విధానంలో ధైర్యం- నిర్ణయం కావాలి. ధృఢంగా నిలవాలి. అంటే, మనలోకి మనం నిజంగా, లోతుగా, శ్రద్ధగా చూసుకున్న క్షణంలో, చైతన్యవంతమయిన వాస్తవాన్ని దర్శించగలం. అంటే, తాను ప్రత్యేకంగా ఏమీ కాకపోవడం గమ నిస్తాం-అహంకారాన్ని త్యాగం చేయడానికి సిద్ధమౌతాం. అహం భావం నాశనమే, పునర్జీవనం. అదే జీవన్ముక్తి. ప్రత్యేకమయిన వ్యక్తి త్వము నాశనమయి-అనంత విశ్వంగా రూపొందడం. కాలంలో మర ణించి, శాశ్వతత్వంలో-అమృతత్వంలో పునర్జీవనం పొందడం.

* * *

ఆ విధంగా సిద్ధార్థుడు పునర్జీవనం పొందాడు. అతని శారీ రక-మానసిక యాతనలు అంతమై, వాంఛలు నశించడంతో మనసు నిర్మలంగా, నిశ్చలంగా, స్వచ్ఛంగా, స్వేచ్ఛగా, శాంతంగా, ప్రశాం తంగా, శక్తివంతంగా, స్పష్టంగా మారింది. ఆ సందర్భంలో ఆయన

అన్నాడు- "నిర్వాణాన్ని పొందలేని ఈ దుర్బల దేహాన్ని నిర్మించిన వానిని వెదకి పట్టుకోలేని-తెలుసుకోలేని - కనుక్కోలేని- నేను, ఆరేళ్ళు అహోరాత్రులు అరణ్యాల్లోపడి అతన్ని వెదకి - వెదకి, చివరికి పట్టుకున్నాను. ఇంక అతను ఎప్పటికీ- ఎటువంటి గృహ నిర్మాణాన్ని చేయకుండా చేశాను, కట్టిన ఇల్లే పూర్తిగా కూలింది. నా మనసు నిర్నిబంధమైన స్థితికి చేరుకుంది" అన్వేషణ అంతంలో లక్ష్యం సిద్ధించింది. అప్పటికి అతని వయసు ముప్పై ఐదేళ్ళు.

సిద్ధార్థునిలో శూన్యత్వం ఏర్పడటంతో, జ్ఞాననేత్రం తెరచుకుంది. ఆ మహా జ్ఞానంతో అంతిమ సత్యాన్ని అవగాహన చేసుకునే ప్రజ్ఞ లభించింది. అంటే, అంధకారాన్ని తరిమే జ్ఞానజ్యోతి దర్శనమైనది. సిద్ధార్థుడు బుద్ధుడైనాడు. అంటే, సత్పదార్థంతో ఏకమయ్యాడు అని అర్థం- బుద్ధుడనేది ఒక పేరు కాదు. బుద్ధుడంటే, జ్ఞానోదయమైనవాడు. జ్ఞానమంటే — అర్హత కలగడం. అంటే - మనలో ఎంత జ్ఞానముందోనని కాక, ఎంత అజ్ఞానం వుందో తెలుసుకోవడం. ఆ తర్వాత సిద్ధార్థుని దృష్టికి సమస్త విశ్వం, ఒకే ఒక చిత్రూపంగా గోచరించింది. ఆ రోజు వైశాఖ పూర్ణిమ.

మనన శీలుడు-మౌనశీలుడు కావడంవల్ల, సిద్ధార్థుని - "గౌతమ ముని" "అన్నారు. ప్రపంచం దుఃఖమయం. దాన్ని నివృత్తి గావించాలి" అనే రెండు సమస్యల్ని సహేతుకమైన సమాధానాలతో సిద్ధార్థుడు పరిష్కరించడంచేత, దాన్ని "సమబోధి" అన్నారు. సరైన జ్ఞానం ద్వారా పరిష్కరించడమే-సమబోధి. అందుకే ఆ వట వృక్షానికి "బోధివృక్షం" అని పేరు వచ్చింది.

బుద్ధుడు కాగోరువారినే బోధిసత్వులంటారు. కనుక సిద్ధార్థుణ్ణి బోధిసత్వుడన్నారు. బోధిసత్వులు పది జీవన దశలలో జీవించవలసి వుంది. అవి- 1. తనలోని మాలిన్యాల్ని పోగొట్టుకోవడం, 2. ప్రజా శ్రేయస్సు కోరడం, 3. పరిశుద్ధత, కామవాంఛలు వుండకపోవడం, 4. దయకలిగి వుండటం, 5. మేధస్సు స్పష్టంగా - స్ఫటికం మాదిరి

రిగా-తేటగా వుండటం, 6. వివేకజ్ఞానం కలిగివుండటం, 7. అభిముఖుడై అనంత విశ్వాన్ని అవలోకించటం, 8. ఎటువంటి పరిస్థితులలోను సాధన నుంచి దృష్టి మరల్చకపోవడం, 9. దేనికి చలించకపోవటం, 10. సాధుమతికావడం అప్పుడతనికి అనంతమైన దివ్య దృష్టి కలుగుతుంది. సిద్ధార్థుడు అవన్నీ దాటి బుద్ధుడయ్యాడు.

* * *

సిద్ధార్థుడు సిద్ధాత్ముడైనాడు. హిత వర్తనుడైనాడు. ధర్మ జీవనంలో-నీతి వర్తనతో-నిర్మల చిత్తంతో - ఆత్మనిష్ఠుడై - అంతిమ సత్యాన్ని తెలుసుకుని-బుద్ధుడయ్యాడన్న సంగతి తెలిసి-సర్వేంద్రియ భోగాధిపతి- "మారుడు" ఆయన్ని మరోకసారి శోధించడానికి ఉద్యుక్తుడయ్యాడు. బుద్ధుని పరిపూర్ణత్వాన్ని భంగం చేయాలని ఎన్నో పరీక్షలు చేశాడు. ఆయనలో వ్యామోహాన్ని రేకెత్తించ ప్రయత్నించాడు. ఆ సమయంలో సిద్ధార్థుని హృదయాంతరాళమున పరస్పర భావ ఘర్షణ రూపంలో అనేక మోహతరంగాలు లేచాయి. సంశయాత్ముడైనాడు. మారుడు ఒక వార్తాహరుడుగా వచ్చి - కపిల వస్తు నగరం-శుద్ధోధనుడు-యశోధర- రాహులుడు - కష్టాల్లో, ప్రమాదాల్లో వున్నారనీ, కపిలవస్తులో ప్రజలు తిరుగుబాటు చేశారనీ అసత్య వార్తలు చెప్పాడు. సిద్ధార్థుడు చలించలేదు. ఆ మాటల్ని లక్ష్యపెట్టలేదు. మారునికి కోపం వచ్చి-తన సైన్యమైన కామం-తృష్ణ-వాంఛ-అయిష్టత-ఆకలి-దప్పిక-పిరికితనం - సోమరితనం - బద్ధకం-సంశయం-నటన-అవివేకం-కీర్తి-లోభం-గౌరవం-దురాశ -అసహ్యం-ఈర్ష్య మొదలైనవాటిని సిద్ధార్థుని మీదకు పంపించినా - అతడు చలించలేదు. దానితో మారుడు మరింత కోపోద్రిక్తుడై తన ప్రత్యేక పరివారాన్ని-సుడిగాలి-తుఫాను-ఉప్పెన-భూకంపం - పిడుగుల వంటి వాటిని పంపించినా-ఆతడు భయపడక-కలత చెందక- స్థిరంగా నిశ్చలంగా, నిర్మలంగా-శాంతంగా వున్నాడు.

ఎన్ని చేసినా, ఏం చేసినా సిద్ధార్థుడు చలించలేదని, మారుడు

స్వయంగా వచ్చి-నానా మాటలూ అన్నా, అతను తన్నెత్తి చూడ లేదు. చెవి ఇచ్చి వినలేదు. దానితో మారునికి మరింత కోపంవచ్చి- "నువ్వు నిజమైన సత్యసంపన్నుడవైతే, దానికి సాక్ష్యంగా ఏమైనా నిరూపించు" అన్నాడు. దానికి సిద్ధార్థుడు తన అరచేతితో నెమ్మదిగా భూమిని తాకాడు. దానికి సమాధానంగా భూమి పిడుగు వంటి శబ్దం చేసింది. "నేను ఇతనికి సాక్షిని" అన్నట్లుగా. అయినా మారుని మనసు మారలేదు. తన కుమార్తెలైన ఆహ్లాద-ఆనంద-వాంఛ-తృష్ణ మొదలైన వారిని సిద్ధార్థుని దగ్గరకు పంపించి- ఏ విధంగానైనా సరే, అతనిని వంచించి-మనసు మార్చి-తన మార్గం వైపు తిప్పమన్నాడు. వారు శతవిధాల ప్రయత్నించారు. ప్రయోజనం లేకపోయేప్పటికి- మారుడు మళ్ళా అతని దగ్గరకు వెళ్ళి "నా మాట వింటే- ప్రపంచాన్నంతా నీ అధీనంలో వుంచుతాను" అని ఆశ చూపాడు. అయినా సిద్ధార్థుడు చలించలేదు.

చివరికి మారుడు పంపించిన మహాపు సేనుగు సహితం సిద్ధార్థుని ముందు మోకరిల్లి-వెనుదిరిగి-వెళ్ళిపోయింది. చివరికి మారుడే ఓడిపోయాడు. సిద్ధార్థుణ్ణి హింసించడం మానేసి-ఆయన విజయాన్ని నిస్సంశయంగా అంగీకరించాడు. అంటే, సిద్ధార్థుడు అనాది వాసనా వృత్తులను, రాగాది శత్రువులను జయించి-నిర్వాణ స్థితిని అందు కున్నాడు. అంటే, అన్ని మోహాలను, భ్రాంతులను - అవిద్యను జయించాడని అర్థం. అతని మనసులో కలిగిన భావ సంకులసమరం తాలూకు ప్రచండ మారుతమే మారుడు. ఆ పరీక్షలో సిద్ధార్థుడు కృతార్థుడయ్యాడు. మారుడు మాయమయ్యాడు. హృదయ సంస్క రణ జరిగేప్పుడు, గతంలో పేరుకున్న వికారాలన్నీ చింపర వంప రగా కోలాహలంగా—నానా హంగామా చేస్తాయి, ప్రారంభంలో. అంతంలో అంతా సర్దుమణిగి, కళ్యాణప్రదమౌతాయి.

సర్వ కామములు హరించినప్పుడు-మానవుడు అమృతు డగును. అంటే, అతడు బ్రహ్మమే అవుతాడు. సిద్ధార్థుని మనసు ధ్యాన భూమికలను ఆరోహించి, పరమజ్ఞానం అంటే, సంబోధి కలిగి

నిర్వాణ స్థితిని చేరింది అంటే, చిత్తవృత్తులన్నీ లయించి, సర్వో త్తమమైన ఆనందం- విశ్రాంతి లభించాయి. అప్పుడతడు సమ్యక్ సంబుద్ధుడయ్యాడు.

సిద్ధార్థుడు పొందిన సంబోధిజ్ఞానం, అది కేవలం విరాట్ స్వరూప దర్శనం. ఆ తర్వాత ఆయన దేహం, దివ్యతేజ ప్రసా రంలో పునీతమైనది. దీప్తి శిఖరాన్ని దర్శించాడు. ఆ సందర్భంలో బుద్ధుడు అన్నాడు :

"ఓ మనసా, నిలకడలేక భావాలతో-ఆలోచనలతో-ఆశలతో- ప్రయత్నాలతో ఆనాటి నుంచి ఈనాటి వరకు-ఆ చివరనుంచి- ఈ చివర వరకు పరుగులు తీశావు. ఇప్పుడు నిన్ను తెలుసుకున్నాను. ప్రపంచ నిర్మాణానికి కావలసిన సామగ్రి అంతా ధ్వంసమైపోయింది. గతమంతా కాలి-బూడిద అయింది! అంటే, సంస్కారాల నుంచి సిద్ధార్థుని చిత్తం విముక్తమైనది. తృష్ణ నశించింది. ద్వంద్వ విషయ ప్రపంచ ప్రవృత్తి నుంచి చిత్తం నివృత్తమైనది. అదే నిర్వాణం. పరమార్థద్రష్టులగు బుద్ధులు, ఆ స్థితిలోనే వుంటారు. వారికి స్వయంజ్యోతి దర్శనభాగ్యం కలుగుతుంది.

నిర్వాణం గురించి నికాయ గ్రంథంలో ఇలా వర్ణించబడింది— "నిర్వాణం-అజాతం, అనుత్తరం, అజరం, అవ్యాధిరూపం, అమృతం- అశోకం-అసంక్లిష్టం - గంభీరం - దుర్దర్శనం- దురనుబోధం—శాంతి రూపం" అని.

పరమ సుఖాత్మకమైన ప్రశాంత స్థితిని పొందిన నాటినుంచి సిద్ధార్థుడు-తథాగతుడుగా-అర్హతుడుగా- మహా పురుషుడుగా- సత్య నాముడుగా- భగవానుడుగా ప్రసిద్ధి పొందాడు.

* * *

తనకు కలిగిన విముక్తి ఆనందాన్ని అనుభవిస్తూ సిద్ధార్థుడు బోధివృక్షం క్రింద ఏడు వారాలు వున్నాడు. దీక్షతో గడిపిన ఆ ఏడు వారాలకాలం—

మొదటివారం — బోధివృక్షం క్రింద కూర్చుని తాను దర్శించిన సత్యాన్ని - పొందిన జ్ఞానాన్ని గమనిస్తో-గుర్తిస్తో ఎరుకతో వున్నాడు.

రెండవవారం - బోధివృక్షం క్రింద నుంచి లేచి ధ్యానానంద ప్రశాంతతతో పరిసరాలు తిరిగాడు.

మూడవవారం — ఆ ఏడురోజులూ, నిర్వాణ స్థితిని పొందిన విధం స్మరిస్తో—బోధివృక్షాన్ని చూస్తో—ఒకేచోట అటూ, ఇటూ పచార్లు చేశాడు.

నాల్గవవారం — దగ్గరలో వున్న మండపంలో కూర్చుని-ధర్మస్మరణ చేశాడు. సాలవనంలో తిరిగాడు.

ఐదవవారం - "ముచికుందుడు" అను నాగరాజు ఇంట్లో వున్నాడు, నిర్మాణ పథాన్ని ధ్యానిస్తో.

ఆరవవారం — కార్య—కారణాల గురించి యోచించాడు.

ఏడవవారం - కిరిపాలు అరణ్యంలో ఒక రాతిపై పడుకుని విమోచన పొందిన తన్మయత్వంతో- పరమానందంతో వున్నాడు. ఆ విధంగా ఏడువారాలు గడిచాయి.

నలభై తొమ్మిదవరోజున స్నానం చేసిన తర్వాత, భోజనం చేయాలనే కోర్కె కలిగింది. అంతలో ఇద్దరు ఒరిస్సా వ్యాపారస్తులు తపస్యుడు, భల్లుకుడు-అనువారు బుద్ధుణి చూసి, దయతో, ప్రేమతో అతనికి తమవద్ద నున్న తేనె—పళ్ళు-పిండిజావ ఇచ్చారు. అవి తిని, బుద్ధుడు మళ్ళా బోధివృక్షం క్రింద కూర్చున్నాడు. వారి కోర్కెపై వారికి చతుస్సత్యాలు చెప్పాడు. అది విని వారు ఆయన శిష్యులైనారు. వారే ప్రథమ బౌద్ధోపాసకులు. వారు బుద్ధం-ధర్మం శరణు జొచ్చారు. వారికి కొన్ని నియమాలు బోధించి—వారిని ఉపాసకులుగా చేశాడు బుద్ధుడు.

* * *

ఆ వర్తకుల అభ్యర్థనపై బుద్ధుడు చాలా మాట్లాడాడు.

చరిత్ర పొడవునా మానవ జీవితం, దుఃఖమయంగా వుంది.

ప్రతి ఒక్కరూ ఏదో ఒక కారణంగా బాధలు—కష్టాలు—యాతనలు పడుతున్నారు. శారీరక—మానసిక అశాంతితో కొట్టుకుంటున్నారు. కాని, ఆనాటినుంచే, ఈనాటివరకు—శాశ్వతానందం కోసం—సంతోషం కోసం—సుఖం కోసం—శాంతికోసం—ఎందరో అనేక మార్గాల అన్వేషణ చేస్తూనే ఉన్నారు.

మానవ జీవితం, కన్నీళ్ళ లోయ. ఆ జీవితానికి కారణం, జన్మ. దాని ఫలితం— ముసలితనం—రోగం— అశాంతి—అసంతృప్తి—మృత్యుభీతి — మొదలైనవి. జనన, మరణాల మధ్య జరిగే యావత్ కర్మకాండ, దుఃఖమయం, అల తాను సముద్రం కంటే భిన్నమని భావించినట్లు సిద్ధాంత రూపమైన అవిద్య వలన, మానవుడు తానొక ప్రత్యేక వ్యక్తిననుకోవడం జరుగుతుంది. భేద దర్శనమే, దుఃఖ కారణం. ప్రాపంచిక సుఖాపేక్షలతో పోగుచేసుకున్న విషయాల వల్లనే, దుఃఖం ప్రాప్తిస్తుంది. ఆశ—రాగ—ద్వేషం-భ్రాంతి-అసూయ-ఆసక్తి-తికమక వల్ల అది మరింత తెగబలుస్తుంది. భావ బంధాల్లో చిక్కుకుని, అవే సంతోషకరమైనవని భావించి-మురిసేవాడు, దుఃఖం నుంచి తప్పించుకోలేడు.

దుఃఖానికి కారణం, కోర్కె, వ్యక్తియొక్క దురాశా పూరితమైన కోర్కెలవల్ల-అశాంతి, దుఃఖం. తృష్ణ అణగిపోనిది, దుఃఖం అంతం కాదు. దానికితోడు-కోర్కెతో అల్లుకున్న బంధాలు- వాంఛ- సుఖాపేక్ష. అంతులేని కోర్కె. జన్మకు కారణం. ఆ జన్మ దుఃఖ కారణం. కోర్కె, చాలావరకు సుఖాపేక్షతో ముడిపడి వుంటుంది. అది జీవితాన్ని నడుపుతోంది. కోరుకున్న సుఖమో, సంతోషమో, ఆనందమో, శాంతో-అది కలగనప్పుడు, అసంతృప్తి, బాధ, దుఃఖం కలుగుతుంది. ఒకవేళ-అవి కలిగినా, అవి పోతాయేమోనని అనుమానం, భయం, బాధ, ఆందోళన. ఎటు చూసినా చివరికి మనిషికి మిగిలేది దుఃఖం-ఏ విధంగా చూసినా దుఃఖమే సంప్రాప్తమౌతోంది, మనిషికి. దాన్నించి తప్పించుకునేందుకు యత్నం. ఆ

ప్రయత్నం వెనక, ఆశతో కూడిన కోర్కె, అట్లా ఆ వలయం అంతం కాకుండా సాగుతుంది. కోర్కెవల్లనే జీవితానికి అశాంతి. అయినా మనిషి మనసు కోర్కెను వదలదు. సత్యాన్ని తెలుసుకోవా లనే కోర్కె కూడా బంధహేతువే. అదీ, దుఃఖ కారణమే. కాని, ఏదో ఒక కోర్కె కలగడం సహజం. కోర్కె కలగడంలో దోషం, పాపం, తప్పు, పొరపాటు ఏమీలేదు. దాని గురించి ఆశ్చర్యపడవల సిన పనీలేదు. వివేకవంతులు, జ్ఞానవంతులు-మహాత్ములు- అంతిమ జ్ఞానాన్ని పొంది- ఆ జ్ఞానకాంతిలో సమస్త జీవకోటికీ శాంతిని, కాంతిని ప్రసాదించాలనుకోవడం కూడా ఒక కోర్కె అయినా- అది సత్కర్మ గనుక, అనర్థాలకు దారితీయదు. దుఃఖరహితంగా జీవించా లంటే, విషయలోలత్వం, కోర్కె-స్వార్థ చింతనా పూర్తిగా నాశనం కావాలి. కోర్కె లేకుండా జీవించే మార్గం-అది- అష్టాంగ మార్గం. అది దుఃఖనిరోధక మార్గం. అందు ఎనిమిది సూత్రాలున్నాయి. 1) సరైన ఆలోచన, 2) సదవగాహన, 3) నిర్మల మనస్సు, 4) సత్కర్మ, 5) సరైన యత్నం, 6) సత్ప్రవర్తన, 7) బుద్ధి సూక్ష్మత, 8) ఏకాగ్రత-పరిశుద్ధమైన వాంఛ.

జీవితంలో మోహాన్నీ-తృష్ణనీ-కామాన్ని-భోగాల్ని- అధమం, అల్పం, స్వల్పం, తుచ్ఛం, నీచం, అసభ్యం, క్షుద్రం అయిన వాటినీ పనికిమాలిన, అక్కరకురానివాటినీ - అలాగే దేహాన్ని బాధించి, హింసించి, శుష్కింపజేసే కఠోర నియమ నిష్ఠల్ని వదలడమే కాక, దేహేంద్రియ పరమైన మార్గాలలోని "అతి"ని కూడా తొలగించి— నిర్వాణ స్థితిని పొందాలి. అదే, దానికి మార్గం. అది మధ్యేమార్గం. అది-బుద్ధి-జ్ఞానమార్గం. అది అవగాహనతో కూడిన విషయం. ఆ మార్గం భయంకరమైన-క్రూరమైన తృష్ణను, కోర్కెను ఆపి, అణచి, అంతమొందిస్తుంది. అదే దుఃఖనివృత్తి మార్గం.

ముఖ్య విషయం ఏమిటంటే-సత్య సందర్శనం పొందగోరు వారు-"అతి"ని, తప్పనిసరిగా వర్జించాలి. ఆ విధానం, అంతర దృష్టిని-అంతిమ జ్ఞానాన్ని-సూక్ష్మబుద్ధినీ ఇచ్చి, జీవితాన్ని ప్రశాం

తంగా, నిర్మలంగా, నిశ్చలంగా వుంచుతుంది. దేహాన్ని శుష్కింప జేసే పద్ధతి, బాధాకరమైనది, నీచమైనది, నిష్ఫలమైనది, అగౌరవమైనది. అలాగే ఇంద్రియలోలత్వంలో కూడా-అంటే-కోర్కెల విషయంలో కూడా అంతే! కోర్కెలవల్ల, వ్యామోహం కలుగుతుంది. వ్యామోహంవల్ల అంతులేని జనన మరణాలు సంభవిస్తాయి. అవన్నీ సుఖాపేక్షకు చెందినవే. ఆ రెండు మార్గాలూ, ఒకటి-దేహాన్ని, మరొకటి బుద్ధిని హీనపరుస్తాయి. కనుక చేయవలసింది, మనసును అంతర్ముఖం చేయడం. ఎందుకంటే, మనసు స్వభావం చంచలం.

"మనసు అనేది వుంది, లేదు. అయినా, అది వుంది" అనే సత్యం, స్పష్టంగా అవగాహన అయితే-నిశ్చలత్వం ఏర్పడుతుంది. నిశ్చలత్వంలో వున్న మనసు, పూర్ణ ఎరుకలో వుంటుంది. ఆ మనో నిశ్చలత్వమే, జ్ఞానం. అంటే—ఏ విషయంలోనూ మనసు ముందుగా, దేనితోనూ ఆక్రమించబడకుండా వున్న క్షణంలో-మనిషి ముక్తుడు అవుతాడు. దాన్నే శూన్య మనసు అంటారు. అది మనసులేని స్థితి. అక్కడ ఆశీర్వాదంకాని, అనుగ్రహంకాని ప్రతిఫలంకాని-స్వీకరించే వారుగాని లేని స్థితి. అదే తాను లేని స్థితి. వెనుక ఏ గుర్తూ-జాడా-వదలని కల మాదిరిగా అయిపోతుంది మనసు. గతం లేనివానికి, భవిష్యత్తు ఎక్కడ వుంటుంది? అంటే ద్వంద్వ భావం నశించి, అంతా, అన్నీ ఒకటిగా గోచరిస్తుంది.

జన్మరహితం-నాశనరహితం- అంతకూ అతీతం అయినటువంటిది ఒకటి వుంది. దాన్ని చేరుకోవడమే, నిర్వాణం. దానికి అష్టాంగ మార్గం శరణ్యం. ఆ స్థితి, వాచామగోచరం. కనుక దాన్ని మాటలో నిర్వచించలేము-అంటే, చివరికి జగత్సత్య స్వరూపమైన సత్పదార్థంలో కలసిపోవడమే, నిర్వాణం. అటువంటి నిర్వాణ స్థితిని పొందాలంటే, కోర్కె వుండరాదు.

ప్రతి ఒక్కరూ సహజంగానే పుడతారు. కాని, అజ్ఞానంతో పెరిగి-అవివేకులుగా మరణిస్తారు. దానికి కారణం- జీవితకాలంలో

వారిని మతం-విశ్వ-సంస్కృతి-సాంప్రదాయం-నాగరికత-పరిసరాలు జాతీయత-కులం-వర్గం-వర్ణం—మొదలైనవి. మురికి-ఇరుకు చేస్తాయి. ఆ అజ్ఞానాన్ని కప్పుకుని-అనేక కారణాలు చూపుకుని- దాన్నే వికాసం-విజ్ఞానం అనుకుని, జీవిస్తారు. అలా అనుకునేవారు ఎప్పుడూ అధిక సంఖ్యలో వుంటారు. సత్య సందర్శనమైన బహు కొద్దిమంది, ఆ గుంపు వెనక, ఎక్కడో దూరాన ఒంటరిగా నిలబడి వుంటారు. వారి కదలికలు సహజంగా అమాయకంగా-చిన్నపిల్లల స్థితి మాదిరిగా వుంటాయి కనుక-ఎవరూ వారిని లక్ష్యపెట్టరు. పైగా, తమ స్వయం కల్పితరొదలో-గొడవలతో వారిని తమ శత్రువులుగానో, సంఘానికి ప్రమాదకరమైన వారిగానో భావిస్తారు. వారియెడల వ్యతిరేక భావంతో ప్రవర్తిస్తారు. సహజ స్థితిలో వున్నవారు. అసహజ స్థితిలో జీవించేవారిని మేల్కొల్పే యత్నంలో వుంటారు. కనుక వారు అటువంటి మహాత్ముల నుంచి తామూ తమ సంతతీ దూరంగా వుండాలని చూస్తారు. వీలైతే, వారినే తమకు దూరంగా తరిమెయ్యాలని చూస్తారు. కొందర్ని చంపుతారు. ఎక్కువ మందిమీద దుష్ప్రచారం చేస్తారు. తమ మనో మాలిన్యంతో, చాలామందిని హింసన చేస్తారు.

బైటికి వెళ్ళడానికి అంఘుడే ద్వారం ఎక్కడ వుందో వెతుక్కుంటాడు. అతడు ఇతరుల నుంచి సహాయం కోసం ఎప్పుడూ ఎదురుచూస్తాడు. నిజంగా-అవసరమైనప్పుడు సహాయం చేయమని, చేయి అందించమని లోపల్నించి గట్టిగా అరచి, పిలుస్తాడు.

చూడనంతకాలం భావిస్తాం, ఊహిస్తాం, యోచిస్తాం, ఆరాటపడతాం-ఆవేదన చెందుతాం. అది-ఏదో-ఏమిటో తెలిసిన తర్వాత ఆ యాతనలన్నీ ఆగిపోతాయి. వాటితోపాటు ఆలోచనా ఆగిపోతుంది. అదీ అసలు జరిగే సంగతి. ఆ సందర్భంలో బుద్ధుడు తన అనుభవాల్ని చెప్పాడు :

"నన్ను నేను వెదకి తెలుసుకోవాలని బయలుదేరాను. కాని, ఏదో చిత్రమైనది-అనూహ్యమైనది-నాకు తెలియనిది-జరిగింది. అది

చాలా వింత అయిన సంగతి. దాన్ని మాటల్లో వర్ణించి మీకు చెప్పలేను. నన్ను నేను తెలుసుకోవడానికి బయలు-అది జరిగింది. అది జరగడంతో-నేను అదృశ్యమయ్యాను. నేను లేను. ఎట్లా నంటే-మహా సాగరంలో మంచుబిందువు నామరూపం లేకుండా కలిసిపోయి నట్లు-నేనంటూ ఏమీ విడిగా, ప్రత్యేకంగా మిగలలేదు సముద్రంలో కలిసిపోయిన మంచు బిందువును తిరిగి విడిగా, ప్రత్యేకంగా కనుక్కోవడం కష్టం. మంచు బిందువుతో పాటు సాగరము కూడా అదృశ్యమైంది. అదీ జరిగిన సంగతి. ముందు మంచుబిందువు సాగరంలో కలిసిపోతే, సాగరం కూడా మంచు బిందువుతో కలిసి పోతుంది. చిత్రమైన సంగతి జరిగింది," అన్నాడు.

బుద్ధుడు చెప్పింది వారిద్దరూ శ్రద్ధగా విని-ఆయన శిష్యులై వారి నుంచి శెలవు తీసుకుని వెడుతూ, బుద్ధుని జ్ఞాపకార్థంగా ఆయన తల వెంట్రుకలు-ఒక పెట్టెలో పెట్టుకుని తీసుకువెళ్ళారు. వారు అక్కడ నుంచి సింహళం (శ్రీలంక) వెళ్ళి-ఆ పెట్టె ఒక చోట వుంచి-తమ వ్యాపారం చూచుకున్నారు. ఆ తర్వాత ఆ పెట్టె పెట్టిన చోటుకు "గిరిహింస విహారం" అని పేరు వచ్చింది.

* * *

ఒకరోజు మధ్యాహ్న వేళ బుద్ధుడు పెద్ద పచ్చిక మైదానం దాటి వెడుతున్నాడు. ఒకచోట రాళ్ళగుట్ట వెనక, ఒక మేకపిల్ల ఆర్తనాదం వినిపించింది. ఆ అరుపు బాధాకరంగా, దీనంగా వుంది. ఇంకొక పెద్దమేక-తల్లిగావును-కంగారుగా, ఆతృతగా అరుస్తోంది. ఆ మేక వెనక, తక్కిన మేకలు అరుస్తున్నాయి. మైదానమంతా మేకల అరుపులతో మారుమ్రోగుతోంది. ఆ అరుపుల వెనక, మేకల కాపరి గోల, అదలింపు. బుద్ధుడు వడివడిగా ఆ చోటుకు వెళ్ళాడు. అక్కడ ఒక మేకపిల్ల, రాళ్ళగుట్టలో పడిపోయింది. లేవలేక కూల బడి అరుస్తోంది. బుద్ధుడు దగ్గరకు వెళ్ళి చూడగా, దాని కాలువిరిగి, రక్తం కారుతోంది. ఆయన వెంటనే ఆ మేకపిల్లను రాళ్ళలోంచి

బైటికితీసి, రక్తం తుడిచి-భుజాన వేసుకుని-మైదానం మధ్యకు వచ్చాడు. అతని చుట్టూ మేకపిల్లలు చేరాయి. అంతలో ఆ కాపరి వచ్చి, "అయ్యా! ఆ మేకపిల్లను నాకివ్వండి. ఈ రోజు, రాజుగారు పెద్ద యజ్ఞం తలపెట్టి, నా వంతు వంద మేకల్ని బలిపశువులుగా తీసుకు రమ్మన్నారు. వీటిని రాజధానికి తోలుకువెడుతున్నాను" అన్నాడు. అది విని, "అయితే నేనూ నీతో అక్కడకు వస్తాను, పద" అని మేకపిల్లను భుజాన వేసుకుని, యజ్ఞశాలకు వెళ్ళాడు.

యజ్ఞవేదిక చేరేప్పటికి, కాస్త పొద్దు తిరిగింది. సమయం మించిందని రాజుగారు మేకల కాపరిపై గట్టిగా అరుస్తున్నారు. హోమగుండం నుంచి అగ్నిజ్వాలలు భయోత్పాతం కలిగిస్తూ, పైకి ఎగురుతున్నాయి. ఋత్విజులు గంభీర స్వరాలతో, మంత్రాలుపఠిస్తు న్నారు. యజ్ఞపశువు నొకదాన్ని, స్తంభానికి కట్టి, వధించడానికి సిద్ధంగా వున్నారు. ఆ ఘోర దృశ్యం చూసి, నిలవలేక యజ్ఞవేదిక దగ్గరకు వెళ్ళి- "మహారాజా! నోరులేని ఈ మూగజీవాలను దేవతల ప్రీత్యర్థం బలి ఇచ్చి, ముక్తి ఫలాలనుకోరడం, అజ్ఞానం, మూర్ఖం, అన్యాయం. ప్రాణిహింస మహాపాపం. దాన్ని కాపాడండి" అని బుద్ధుడు గట్టిగా అరిచాడు. అది విని అందరూ నిశ్చేష్టులైనారు. "రాజా! జీవయాత్ర పూర్తికాకుండా, ఏ కారణానికీ, ఏ ప్రాణినీ చంపడం మహాపాపం. అహింసయే, అన్ని ధర్మాలలోకీ ఉత్కృష్టమైనది. హింసవలన, మోక్షం చేకూరదు. ఈ విధంగా లంచంపెట్టి, దేవతల మెప్పు పొందాలనుకోవడం, అవివేకం" అన్నాడు బుద్ధుడు.

అక్కడ చేరిన వారంతా బుద్ధుని ధైర్యానికి - దివ్యత్వానికీ- వాచకు-వర్చస్సుకు అబ్బురపడ్డారు. రాజు వేరు మాట-ఆలోచన లేక-మంత్రింపబడ్డట్లు "బలి ఆపండి" అన్నాడు, అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేస్తూ.

ఆ తర్వాత బుద్ధుడు అక్కడ చేరిన వారందర్నీ ఉద్దేశించి యజ్ఞ పరమార్థాన్ని చెప్పాడు :

"యజ్ఞ మంటే, త్యాగమని అర్థం-తన అహంకారాన్ని-స్వార్థాన్ని-తన పాశవిక ప్రవృత్తిని-తన దేహ భావాన్ని బలి చేయడమే, యజ్ఞం. సర్వ ప్రాపంచిక దృష్టినీ, బ్రహ్మాగ్నికుండంలో ఆహుతి చేయడమే యజ్ఞం. మానవునిలోని అరిషడ్వర్గములనే పశువులను, సంహరించి, తాను పరిశుద్ధుడు అగుటే, యజ్ఞం. సత్యాన్ని పునః ప్రబుద్ధం చేయడమే, యజ్ఞం. నియత కర్మలన్నీ, ధర్మ భావంతో చేస్తే-అదే యజ్ఞం స్వార్థరహితంగా చేసే కర్మలన్నీ, యజ్ఞమే. రాగరహితులై కర్మాచరణ గావించుటే, యజ్ఞార్థం. సర్వ వ్యాపకమైన సత్యం, సర్వదా అట్టి యజ్ఞమందు వుండును. నోరు లేని పశువులను బలిచేయడం కాదు-అజ్ఞాన పశువును జ్ఞాన వేదికపై బలిచేయడమే, నిజమైన యజ్ఞం" అని-అటువంటి మహత్తరకార్యాన్ని, హత్యాకాండగా మార్చిన కర్మకాండను, సత్య యజ్ఞంగా మార్చి లోక సంగ్రహం చేశాడు.

సమస్త లౌకిక విషయాలనూ, స్వార్థాన్నీ, సంపూర్ణంగా ఆహుతిచేసి- బుద్ధత్వానంపరసమానముత్తుడు కావడమే యజ్ఞ పర మార్థమని బోధించాడు బుద్ధుడు, ఆనాడు. లౌకికంకాని, ఆధ్యాత్మికం కాని ప్రతిఫలాపేక్ష లేకుండా, ఇతరుల శ్రేయస్సు కోసం చేసే కర్మే, యజ్ఞం. కర్మ అంటే, మనోవాక్కాయ కర్మలన్నీ అందులోకి వస్తాయి. ఇతరులు అంటే, ఒక్క-మానవులే కాదు, సమస్త జీవకోటి అని అర్థం. ఆ యజ్ఞంలో ఒక భాగం భక్తి, ఒక భాగం జ్ఞానం. ఆదిలో ద్వంద్వంగా వుండి, అంతంలో జ్ఞానంలో లీనమయ్యేది, భక్తి. నిజమైన భక్తికి నిదర్శనం- సమదృష్టి సర్వత్రా స్వస్వరూప దర్శనం కలగడం.

★ ★ ★

నిరంతరం-మన ప్రవృత్తికి - మన ప్రకృతికి - మన పరిస్థితికి అనుకూలమైన కర్మలను యజ్ఞ భావంతో ఆచరించాలి! కర్తృత్వాహంకారం లేకుండా, ఫలాసక్తి లేకుండా, కర్మలు ఆచరించడంతో మనుష్యుడు చిత్తశుద్ధిని పొంది, తద్వారా మోక్షాన్ని బడయగలడు. అంటే, మోక్షసిద్ధికి, విషయ వైరాగ్య, సత్య-ధర్మజ్ఞానం అవసరం:

విషయవాసనలను జయించలేనివాడు, వస్త్ర విసర్జన - జటామండల ధారణ-యజ్ఞయాగాది క్రతునిర్వహణ-ఉపవాసదీక్ష-వరిసశయ్య - ఇవి ఏవీ పవిత్ర మొనర్చజాలవు.

“యజ్ఞ కర్మకాండవల్ల భవచక్రం అంటే—జనన, మరణ వలయం నుండి విముక్తి కలగదు” అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. యజ్ఞాలు జ్ఞానోపలబ్ధికి సాధనాలుకావని, అవి హింసా పరంపరను ప్రోత్సహిస్తాయని-వాటిని ఏవగించి - అనుకంపాదృష్టితో యజ్ఞాన్ని నిరసించాడు. శీలవంతుడై — ధ్యాననిమగ్నుడై - సమాధి యందుండుట, మహా మహిమగల యజ్ఞమన్నాడు. అది విని, రాజు ఆయన శరణుజొచ్చి-యజ్ఞ పశువులను, స్వేచ్ఛగా విడిచిపెట్టి-తాను ఉపాసకుడుగా మారిపోయాడు.

* * *

ఆనాడు వైదిక ధర్మంలో ప్రబల ప్రచారంలోవున్న హింసా పూరిత యజ్ఞ కర్మకాండనే బుద్ధుడు నిరసించాడు. యజ్ఞాలకు ఆలంబనంగా వున్న వైదిక జ్ఞానాధిక్యతనూ ఆయన ఆమోదించలేదు. వేదం నాలుగు విధాలుగా చెప్పబడుతోంది. సంహిత - బ్రాహ్మణ- ఆరణ్యక-ఉపనిషత్తులు-అని. సంహిత — బ్రాహ్మణాలు ధర్మాన్ని, ఆరణ్యక-ఉపనిషత్తులు బ్రాహ్మమును చెప్పినా, వేదాలు త్రైగుణ్య విషయాలేకాని నివృత్తి విషయాలు కావు.

సత్యం, జ్ఞానం, తపోమౌనం, ధృతాధర్మం, తితీక్షణ, ఉత్సాహం, నిశ్చలం, ధైర్యం-ఇవి మనోమయ పురుషుని సాత్త్విక గుణ లక్షణాలు. గర్వం, క్రోధం అహంకారం, సతీసంగం, ప్రలాపనం, అప్రియం, దంభం, మాత్సర్యం- ఇవి ప్రాణమయ పురుషుని రాజసగుణ లక్షణాలు. అజ్ఞానం, మోహం, నిద్ర, చాపల్యం, బుద్ధి-హీనత, పరపీడత్వం ఇవి అన్నమయ పురుషుని తామస గుణ లక్షణాలుగా- చెపుతారు. ధర్మభ్రష్టయగు గౌతముని సర్వేంద్రియాలు-

ఏకమై, హృదయంద్వారా పని చేయడంతో త్రిగుణాలు శుద్ధసత్త్వమై నిశ్చితానందానుభూతితో వెలిగాయి. ఆయన కల్మషరహితులు. గుణాతీత స్థితి యందున్న విజ్ఞానమయ పురుషుడు. కనుక, ఆనాడు వేదాలు భోగాలపరంపరతో మైమరపించేవిగా వుండటంచేత బుద్ధుడు వాటిని పరిగణలోకి తీసుకోలేదనిపిస్తుంది.

* * *

సిద్ధార్థుడు ముప్పైఐదవ ఏట దివ్యజ్ఞానాన్ని పొంది, బుద్ధుడైనాడు. తానొక ప్రత్యేక వ్యక్తిననే భావం, అహంకారం — అవిద్యల నుంచి విముక్తుడైనాడు. అంటే అతనిలో విషయవాసనలు అంతరించాయి, అప్పటినుంచీ అతడు నిరంతరం ధ్యానంలో వుండేవాడు. ఎవరైతే ప్రాణికోటికి హాని, అపకారం, అన్యాయం చేయరో, ఎవరైతే తప్పు-పొరపాటు, అక్రమాన్ని దాటి, అతిక్రమిస్తారో — ఎవరైతే జీవితంలో తృష్ణ—కామం, వాంఛ, కోర్కె, లోభత్వం, దురాశల నుంచి విముక్తి పొందుతారో, స్వార్థచింతనా, అహంకారం లేకుండా ఎవరు వుంటారో-వారు మాత్రమే, జనన—మరణ వలయం నుంచి బైట పడతారనే సత్యాన్ని సిద్ధార్థుడు అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు. అనుభవం నిత్యజీవితానికే, అదీ—వర్తమానానికే ఉపయోగపడుతుంది. అంతే! ఏ జ్ఞానీ, ఏ మహాత్ముడు తీరిగ్గా కూర్చుని అల్పమూ, దుర్బలమూ అయిన మాటల్ని సృష్టించడు, కల్పించడు, తయారుచేయడు. చీకటి లోకంలో—అజ్ఞానాంధకారంలో జీవించే అంధులు మాత్రమే ఏర్పరచిన, కల్పించిన—తయారు చేసిన—సృష్టించిన—ఈ మాటలు అల్పం, అర్థవిహీనం, అజ్ఞాన మయం. అయినా అటువంటి మాటలతో అసలు సత్యాన్ని-జ్ఞానాన్ని తెలియచెప్పాలనుకోవడం, మూర్ఖం—హాస్యాస్పదం, అసాధ్యం అని తెలిసినా, "అసలు ఏముంది బోధించడానికి? నేనేం దర్శించానో—నేనేం తెలుసుకున్నానో, దాన్ని తెలియపరచడానికి మాటలులేవు మాటలు అల్పమైనవి, దుర్బలమైనవి, శక్తిహీనమైనవి. అనుభవం ఒక్కటే అపారమైనది, బ్రహ్మాండమైనది.

"నేను దర్శించిన సత్యాన్ని ఏదో విధంగా ప్రజలకు తెలియ జెప్పాలనుకుంటే, వాటిని శ్రద్ధగా, నిజంగా, ప్రేమతో వినేదెవరు? ప్రజలకు కావలసినవి, సంపద, కీర్తి, అధికారం, సంసారం. అటు వంటివారు నేను చెప్పేది ఎట్లా వింటారు? అసలు ఎందుకు వింటారు? ఒకవేళ నేనే వారి దగ్గరకు వెళ్ళి చెపితే, నిజంగా చెవి ఇచ్చి వినే దెవరు?

"అయినా అసలు నేనెవర్ని బోధించడానికి? ఒకరికి సత్యాన్ని తెలియచెప్పడం చాలా కష్టం. వినేవారిని వెదికి పట్టుకోవడం మరీ కష్టం. ఎందుకంటే, వినడమంటే, ఆలోచించకుండా, ప్రశ్నించ కుండా, ఆశించకుండా, వినాలనే ప్రయత్నం లేకుండా- ఆ క్షణంలో పూర్తి ఎరుకలో వుండి వినడం, మనసు పక్కనపెట్టి వినడం. గత చాయ లేకుండా వినడం. అటువంటి వినడంలో, ఆ క్షణంలోనే- అసలు సత్యం అవగతమౌతుంది. విస్పష్ట అవగాహన అవుతుంది" అనుకున్నాడు బుద్ధుడు. అలా అనుకోవడం ఒక సంకల్పంగా మారింది.

అటువంటి ఆలోచనలతో బుద్ధుడు వారంరోజులు తీవ్రంగా యోచించాడు. ఏడవ రోజున "గతంలో ఎందరో మహానుభావులు, ఎంతో బోధించారు. ఏం జరిగింది? ప్రజలు ఎప్పటి మాదిరిగా తమ తమ పాత నమ్మకాలతో- పద్ధతులతో-సిద్ధాంతాలతో-సూత్రాలతో- సాంప్రదాయాలతో జీవిస్తూ అశాంతిగా బ్రతుకుతున్నారు.

ఈ ప్రపంచం యావత్తూ, ఒక దుర్భల దుఃఖాలయంగా వుంది. కేంద్రీకృత తృష్ణ-వాంఛ-కామం- కోర్కె- కారణంగా మానవునికి దుఃఖం సంప్రాప్తమౌతోంది" అనే సంగతి తెలుసుకో లేకుండా వున్నారు ప్రజలు. జన్మే దుఃఖం. జీవన విధానమంతా దుఃఖ మయం. రోగం, ముసలితనం, అసంతృప్తి, అశాంతి, మృత్యుభీతి- అన్నీ దుఃఖ కారణాలే. అందులో మొదటి కారణం కోర్కె. అది పుట్టేది- పెరిగేది మనసులో-కాబట్టి మనిషి ముందుగా-తప్పనిసరిగా

కోరికలను తీసేసుకోవాలి. వాటిని పూర్తిగా తొలగించి, తోసె య్యాలి. అంటే, వాస్తవాన్ని గూర్చిన సత్యం తెలుసుకోవడంద్వారా, కోరికల్ని నిర్మూలించ వచ్చుననే సంగతి ప్రతి ఒక్కరూ గమనించ వలసి వుంది.

సిద్ధార్థుడు జీవితార్థాన్ని పూర్తిగా, స్పష్టంగా తెలుసు కున్నాడు. సర్వకామములను జయించి, పరిపూర్ణ జ్ఞానవంతుడైనాడు. ప్రపంచం అనేక విధాల బాధలతో, దుఃఖాలతో, భయాలతో, ఆందో ళనలతో, ఆరాటాలతో, ఆవేదనలతో, యాతనలతో ఎందుకు నిండి వుందో అవగాహన చేసుకున్నాడు. వాటిని అధిగమించి, పరమ శాంతిని పొందే మార్గం స్వానుభవంతో తెలుసుకున్నాడు. తాను తెలుసుకున్న సత్యాన్ని, ప్రపంచానికి చాటి చెప్పడానికీ, ఒక కార్య రూపం ధరింప చేయడానికి బుద్ధుడు భారత జగత్తులో ప్రవేశించదలి చాడు. తాను తెలుసుకున్న సత్యాన్ని ప్రజలకు తెలియజెప్పి, ధర్మం బోధించాలనుకున్నాడేకాని, సత్యాన్ని నిర్వచించ యత్నించ లేదు. ప్రజలు, జనన-మరణ వలయంనుంచి తప్పించుకుని సుఖంగా, శాంతిగా, ఆనందంగా, హాయిగా బ్రతికేమార్గం చూప దలిచాడు' అంతే.

ప్రజలకు కార్య-కారణ సిద్ధాంతం అర్థంకావడం కష్టమనీ బుద్ధునికి తెలుసు. ప్రజలు ఎంతకీ తమ కోరికల్ని వదలుకోలేరు. విషయ వాసనల నుంచి తప్పుకోరు. నిర్వాణ పథం చేరుకోవాలనీ నిజంగా చూడరు. ఆ సంగతులన్నీ ఆయనకు ఎరుకే. అయినా అణచుకోలేని ప్రేమవల్ల-తాను తెలుసుకున్న సత్యం-బోధించడానికి- తెలియజెప్పడానికి చాలా తీవ్రంగా ఉపక్రమించాడు. సామాన్యంగా చాలామంది కళ్ళు, దుమ్ముతో కప్పబడి వుంటాయి. ప్రయత్నిస్తే, ఆ దుమ్ము తుడుపుకుని-కళ్ళుతెరచి-కాంతిని దర్శించగలరని బుద్ధుని భావన, ఆశ కూడా. కాని అది అసాధ్యమైన విషయమని కూడా అతనికి తెలుసు. అయినా ప్రయత్నం మానలేదు.

మనసు శుద్ధమై-స్పష్టమైన వాళ్ళకు ఏ బోధా అవసరంలేదు- వారు ఏ సాధనా చేయనవసరం లేదు. మకిలిపట్టి-కళ్ళు కానక-

బోధించినా వినక- చెడతిరిగే వారికి బోధ అవసరం. కాని, కొందరు అటూ, ఇటూ కానివారు వుంటారు. వారికి సహాయం-బోధ అవసరం. అటువంటి వారి కోసమే ద్వంద్వ భూయిష్టమైన లోకం మధ్యకు వెళ్ళదలిచాడు బుద్ధుడు. ప్రజల బాధ- కష్టం- దుఃఖం- యాతన చూసి, అపారమైన ప్రేమ, దయ, జాలి, కరుణతో వాళ్ళను ఉద్ధరించడానికి పూనుకున్నాడు. పొదుగునిండా పాలువుండి, వాటిని తాగేందుకు ప్రేమాస్పదమైన తన బిడ్డ కానరాక- మధుర వేదనకు గురై-బిడ్డను వెతుక్కుంటూ తిరిగే గోమాతవలె, బుద్ధుడు వేదన పడ్డాడు. నిస్వార్థులైన అనుచరులతో కలిసి-దేశం తిరిగి, ధర్మ ప్రచారం చేయదలిచాడు. సత్కర్మ వ్యర్థంకానట్లే, శుద్ధాంత రంగం నుండి వెలువడిన సత్యవాక్కు, నిష్ఫలం కాదు. ప్రజల్ని అజ్ఞానాంధ కారంలోంచి-జ్ఞానకాంతిలోకి తీసుకు రావడమే బుద్ధుడు తన జీవితాశ యంగా పెట్టుకుని, "సిద్ధి పొందగోరువారికి, నేను రక్షకుడను. ముక్తి కోరువారికి, నేను మార్గదర్శకుడను. దుర్వార సంసార సాగ రాన్ని దాటి తలచిన వారికి, నేను సేతు బంధనమును....నిర్లక్ష్యం చేయబడ్డవారికి నేను విశ్రమించు పాన్పును, నా సన్నిధి కోరువారికి, నేను మిత్రుడను-అని అనుకుని-సమ్యక్ సంబుద్ధి-నిర్వాణ పథం బోధకు పాదయాత్ర ప్రారంభించాడు.

* * *

మహా జ్ఞాని అయిన బుద్ధుడు, జగద్విమోచనం కోసం జ్ఞానోప దేశం చేయాలని సంకల్పించడంలో, "నేను-ఇతరులు" అనే ద్వంద్వ భావాన్ని వ్యక్తపరచినట్లు తోస్తుంది. "ఇతరులు" అనేవారు- కష్టాల్లో-బాధల్లో-దుఃఖాల్లో వున్నారని తలచి, వారికి దుఃఖనివృత్తి మార్గం చూపాలని యత్నించడంలో ఆయన ద్వంద్వ భావాన్ని వ్యక్తపరచినా, ఆయన అప్పటికే పూర్తిగా - తానంటూ ఏమీ మిగల కుండా, ఏ ప్రత్యేకతా లేకుండా- అనంతత్వంలో, శాశ్వతత్వంలో విడదీయశక్యం కాకుండా లీనమైపోయాడు. కామాగ్ని చల్లారి- పున ర్జన్మ హేతువగు ఎటువంటి కర్మ చేయనివాడుగా వున్నాడు బుద్ధుడు.

జ్ఞాని-బాహ్యాంతరాలను పరికించగల ద్రష్ట- సర్వావస్థలయందూ, ప్రారబ్ధం అనుభవించేప్పుడూ, అప్రయత్న - అనాలోచిత కార్యాలయందూ, కామ సంకల్పరహితులై - సమచిత్తులై-యథా ప్రాప్తములగు వాటిని అనుభవిస్తూ జీవిస్తారు జ్ఞానులు. వారిని ఏ కర్మా బంధించదు-బాధించదు. వారు తామరాకులపై నీటి బిందువువలె వుంటారు. అట్టివారు, ఉపేక్షా-శాంతి-సంతుష్టమైన మనసుతో అవిద్యను ఛేదిస్తారు. సతతం నిశ్చల మనస్కులై, గతించిపోయే వాటికి ఎరుకలో వుంటూ-దోష సాగరాన్ని సులభంగా దాటగల యోధులు-జ్ఞానులు. శుభాశుభ కర్మానుసారం, వర్తించే సమస్త జీవకోటిని, ఒకటిగా చూడగల దృష్టి కలగడమే, జ్ఞాని స్థితి. అటువంటి స్థితిలో వున్నవాడు, గౌతమబుద్ధుడు.

సత్య సంపర్కానానంతరం గౌతమునిలో పూర్తి మార్పు వచ్చింది. ఆయన మనోస్థితి ఎట్లా వున్నదంటే- చాలా కాలానికిగాని, స్వల్పకాలంలోగాని-ఎక్కడికో వెళ్ళి- తిరిగి తిరిగి స్వస్థలం చేరి, అక్కడి పూర్వపు సంబంధాన్ని తిరిగి ప్రేమతో ఏర్పరచుకున్నట్లు వుంది.

ప్రజలు ఆధ్యాత్మికంగా ఉన్నతిపొందాలని బుద్ధుని ఆకాంక్ష. కోర్కెల దాహంతో కొట్టుకునే వారి దప్పిక తీర్చాలనీ, కోర్కెల బంధంలో చిక్కుకుని కొట్టుకునేవారిని విడిపించాలనీ యత్నించి, "నేను జ్ఞానాన్ని పొందినా-ప్రజలందరూ ఆ జ్ఞానాన్ని పొందేవరకు నేను సంపూర్ణుడను కాను. ఆ జ్ఞానకాంతి ప్రపంచమంతా విస్తరించే వరకు-నేను విశ్రమించను అని నిశ్చయించుకున్నాడు బుద్ధుడు. అతని అభిప్రాయాన్ని ఆనాటి మహాత్ముడు "సహమ్‌పాటి" సమర్థించాడు.

బుద్ధుని హృదయంలో దివ్యతేజస్సు, దేదీప్యమానంగా వెలుగుతోంది. తన ముందున్న కార్యక్రమం-ఆ కాంతిలో స్పష్టంగా తెలియడం వల్ల-నిర్వాణ ద్వారాలు పూర్తిగా తెరుచుకున్నాయి. "చెవులు వుండి వినేవారు వినవచ్చు. వినడానికి-మీ పాతనమ్మకాల్ని దూరంగా

పెట్టింది" అంటూ ప్రజలకు ధర్మం బోధించడమా? లేక-తాను, తన స్వస్వరూపానందంలో లీనమై కాలం గడపడమా?" అనే సమస్య, బుద్ధుణ్ణి కొంతకాలం గట్టిగా ఆలోచింపజేసింది. ఎందుకంటే-ప్రపంచంలోకి వెళ్ళి-తాను తెలుసుకున్న సత్యం-ప్రజలకు బోధించి-వారిని ఉద్ధరించాలంటే, తాను శారీరకంగా బాధలు, కష్టాలు, యాతనలు పడవలసి వుంటుందనే సంగతి తెలిసినా, తాను పొందిన శాంతిని, పట్టించిన దివ్యకాంతిని- అనుభవిస్తోన్న ఆనందాన్ని- తోటి మానవులు- అనుభవించాలనే దృఢ నిశ్చయానికీ, వారితో కలసి పంచుకోవాలనే-నిర్ణయానికి వచ్చాడు బుద్ధుడు.

ఆ నిర్ణయంతోనే మిత్రుల్ని వెతికాడు. కాని, విషయలోలురైన మానవులు-ప్రాకృత బుద్ధులు-అసలు సత్యాన్ని, నిర్వాణ పథాన్ని అర్థం చేసుకోలేరు. కారణధర్మం తెలుసుకుని, సర్వ సంస్కారాలను నశింపజేసి- తృష్ణను సంపూర్ణంగా క్షయింపజేసి, నిర్వాణం పొందుట దుస్సాధ్యమని అనుకున్నా, చివరికి ప్రజలపై గొప్ప ప్రేమతో ధర్మబోధ చేయడానికే బుద్ధుడు స్థిర నిశ్చయంతో బయలుదేరాడు. తాను బోధించే ధర్మం, చెప్పే సత్యం గ్రహించగలిగిన వారు అలారకాలాముడు, ఉద్దారక రామపుత్ర వంటి మహాత్ములే కాని, సామాన్యులకు సాధ్యంకాదని గ్రహించాడు బుద్ధుడు. కాని, వారు అప్పటికే పరమపదించారు. ఇంక మిగిలింది-తనతో పాటు కొన్నాళ్ళు సాధనచేసిన కౌండిన్య పండితులు- ఆయన నలుగురు శిష్యులు. కాని వారు కూడా ఆ సమయానికి వారణాసి ప్రాంతములో-సారనాథ్ (మృగదావనం) అనే చోట వున్నారని విని— అక్కడకు బయలుదేరాడు. అక్కడకు కాశీ పంచమైళ్ళ దూరంలో వుంది.

దారిలో "ఉపాక" అనే అతను ఎదురై-బుద్ధుని తేజస్సుకు— వర్చస్సుకు-నమ్రతకు విస్మయం చెంది "అయ్యా! మీరు పరమ పవిత్రులుగా—శాంత స్వరూపులుగా, నిశ్చల-నిర్మల మనస్కులుగా,

సాధు పుంగవులుగా తోస్తున్నారు. మీ గురువు ఎవరో తెలుసుకో గోరుతున్నాను" అన్నాడు.

దానికి బుద్ధుడు, "నాకు నామ—రూపధారి అయిన గురువు ఎవరూ లేరు. సర్వరాగ ద్వేషములను- జయించుటచేత, తృష్ణా—దుఃఖాలు నాకు లేవు. నేను జినుడను. ఉత్తమమైన అర్హత స్థితి పొంది-ధర్మ చక్ర ప్రవర్తనకై కాశీపురం వెడుతున్నాను. నేను సమ్యక్ సంబోధకుడను. నేను అన్నింటినీ అధిగమించి, ఈ స్థితికి వచ్చాను. అన్నింటినీ అవగాహన చేసుకున్నాను. అన్ని విషయాలకు అనాసక్తతతో వున్నాను. ఉన్నవన్నీ పరిత్యజించాను. బైట పడ్డాను. చతుర్సత్యాల్ని తెలుసుకున్నాను. అటువంటి నాకు-ఎవరిని గురువుగా చూపి చెప్పగలను?" అన్నాడు—దానికతడు— "నేను జైనమతస్థుడను. వర్ధమానమహావీరుని శిష్యుడను-నా పేరు ఉపాక" అన్నాడు.

మగధ మహారాజు ద్వితీయ పుత్రుడే వర్ధమానుడు. అతడు వైశాలి నగరంలో జన్మించాడు. బుద్ధునికి సమకాలికుడు. క్షత్రియుడు. కాని, మగధరాజుకు - కపిలవస్తురాజుకు మధ్య సంబంధాలు లేవు. వర్ధమానుడు, ఇరవై ఎనిమిదవ ఏట ఇల్లు వదలి సత్యాన్వేషణకు వెళ్ళాడు. పన్నెండేళ్ళ కఠోర తపస్సు చేశాడు. ఆయనంటారు, "సత్యాన్ని తెలుసుకోవాలి" అంటే అది ప్రేమ వ్యవహారం కాదు. అదొక సమరం. ఆ యుద్ధంలో జయం పొందాలి" అన్నాడు. ఆయన ఆ విధంగా సత్యాన్ని తెలుసుకోవడం చేత అందరూ ఆయన్ని మహావీరుడు అన్నారు. ఆయన నలభై ఒకటవ ఏట పూర్ణ దిగంబరు డయ్యాడు. సత్యాన్ని తెలుసుకున్నప్పటి నుంచి, ఆయన్ని "జినుడు" అన్నారు. ఆయన అనుచరుల్ని "జైనులు" అన్నారు. ఆయన దిగంబరిగా వుండటమనేది-అది ఆయనలో-లోపలి నుంచి- అంతరాళాల్లోంచి వచ్చిన గొప్ప మార్పు. అది ఒక క్రియ కాదు. తనకు కలిగిన సత్యజ్ఞానంతో, వచ్చిన మార్పు అది. తత్ఫలితంగా ఆయనకు వస్త్రధారణ అవసరం లేకుండా పోయింది.

అది- సహజంగా జరిగిన సంగతి. అందు- ఆయన ఆలోచన-ఆశ-ప్రయత్నం ఏమీలేదు. ఆయనకు వస్త్రప్రస్తావన లేదు — దాచుకోవలసిందీ - కప్పుకోవలసిందీ-మూసుకోవలసిందీ — రహస్యం, అసహ్యం, అసభ్యం అంటూ ఏమీలేదు, ఆయనకు. జ్ఞానోదయంతో బాహ్యంగా కలిగిన మార్పు అది. సహజం—స్వచ్ఛం—అమాయకత్వం — పసితనం వంటిస్థితి- వారిది. ఆ పసితనం- అమాయకత్వం-సాధుత్వం ఆయనకు ఒకగుణం అయిపోయింది. ఆయన, జీవితాన్ని పూర్తిగా తెరిచారు. అందుకే సమస్తప్రాణి 'కోటిపై' అపారమైన ప్రేమ-దయ - కరుణ ఏర్పడ్డాయి. తాను దర్శించిన సత్యాన్ని బోధిస్తూ— స్థిరనివాసమంటూ లేకుండా—దేశం తిరిగి - ప్రచారజీవితం గడిపారు. ఒక్క చాతుర్మాసంలోనే స్థిరంగా ఒకచోట వుండేవారు. సత్యం—ధర్మం గురించే బోధించేవారు. అందుచే ఆయనకు బహు స్వల్పశిష్యగణం వుండేది.

ఆయన్ని ఒక ప్రవక్తగా - మహావీరుడుగా చెప్పుకుంటారు. ఆయన ముప్పైసంవత్సరాలు ప్రచారం చేసి బోధించారు. వారిది, జైనమతం. సన్యాసవర్గాన్ని నిర్మాణం చేశారు. ఆ వర్గం వారిలో కొంతమంది—పూర్ణదిగంబరులు. తక్కినవారు - వస్త్రధారణ అవసరమంటారు. సవస్త్ర—వివస్త్ర విభాగులైన జైనులు— శ్వేతాంబరులని—దిగంబరులని రెండు శాఖలుగా ఏర్పడ్డారు. "నేను-నాది" అనేది వున్నంతవరకు నిర్వాణం లభించదని, స్త్రీలకు మోక్షం కష్టసాధ్యమని దిగంబరులంటారు.

*　　*　　*

బుద్ధుడు కాశీపట్నం చేరుకున్నాడు. ఆ పట్నం అనాదిగా పుణ్యక్షేత్రం. భక్తుల - యాత్రికుల- సాధువుల - సన్యాసుల-సాధకుల- జిజ్ఞాసువుల-యోగుల - మహాత్ముల - జ్ఞానుల నిలయమది- అక్కడ ఏ ఒక్కరూ బుద్ధుని గుర్తించలేదు. అయినా, తనను గుర్తించాలని ఏ మహాత్మ్యం చేయలేదు. మహిమలూ చూపలేదు. ఏ ప్రకటనా చేయలేదు. కాని, కౌండిన్యుల వారికోసం వెతుకుతూ తిరిగాడు.

ఆ రోజుల్లో వేదాలూ, బ్రాహ్మణాలూ రెండే ప్రజలకు ప్రమాణాలు. ఆ రెండింటినీ కలిపి- "శృతులు" అని పేరు. వేదాల్ని కులవ్యవస్థనీ- కర్మసిద్ధాంతాన్ని పునర్జన్మనీ- బ్రాహ్మణాధిక్యతనీ- యజ్ఞయాగాది క్రతువుల్ని- ప్రజలు, ప్రభువులు ఆదరించి - ప్రోత్స హించేవారు. బుద్ధుడు వాటికి పూర్తిగా భిన్నం. కాని, ఆ రోజుల్లో దాదాపు అన్ని రాజ్యాల్లో- అన్నిరకాల ప్రజల్లో- తాత్త్విక చింతన వుండేది. అంటే, అవిద్యా, సంసార బంధంనుండి విముక్తికై - ఆవేదన పడేవారు వుండేవారు. బ్రాహ్మణిక సిద్ధాంతాన్ని వ్యతిరే కించే ఎన్నో సిద్ధాంతాలూ వున్నాయి- సిద్ధాంతమంటే, ఒకశక్తి. బలమైన భావాలతో-లోకాన్నంతా కట్టేయడం. అలాగే "కర్మయొక్క ప్రభావం ఆత్మమీద పనిచేయదు," అనే వర్గంవారూ వుండేవారు. ఏది ఎలా జరగవలసివుంటే, అది అలా జరుగుతుంది. "అనే వైరాగ్యభావమూ వుంది. కాని, బుద్ధుని ప్రకారం - సకల కార్య కలాపాలకు మనస్సే కేంద్రస్థానం - "పరిజ్ఞానం" అనేది, మనసు యొక్క గ్రహణ శక్తిమీద ఆధారపడి వుంటుంది. అది మనోపరిధి లోనే వుంటుంది. కనుక మనస్సే సర్వాధికారి.

బుద్ధుడు అరవైరోజులు తిరిగి- తిరిగి - కాశీ పట్నానికి సమీ పంలో వున్న సారనాద్‌కు దగ్గర - ఇసిపతనం - ఇసిపట్నం-లోని - మృగదావనంలో వారు వున్నట్లు తెలుసుకుని, అక్కడకు వెళ్ళాడు. అది సారనాద్‌లో ఒక భాగం. ఆ ప్రదేశానికి సంబంధించి ఒక కథ వుంది. పూర్వం "న్యగ్రోధుడు" అను హరిణరాజుగా బుద్ధుడు

జన్మించాడు. అతడు కాశీరాజుకు జీవకారుణ్యం బోధించాడు. సారంగనాథపేట- సారనాద్- అయింది. అంటారు. అది పురాతన శైవక్షేత్రం. అచ్చట చాలామంది ఋషులు తపస్సుచేసి సిద్ధిపొందిన సంగతులు వున్నాయి. అందుకే దాన్ని ఋషిపత్తనమని కూడా అంటారు. బుద్ధుడు అక్కడకు వెళ్ళాడు.

పంచవర్గీయులైన — కౌండిన్యులవారు - ఆయన నలుగురు శిష్యులూ సారనాద్‌లో బుద్ధుణ్ణి దూరం నుంచి చూసి "ఎవరో యతీంద్రులు తమ దగ్గరకు వస్తున్నారనుకుని, నిదానించి చూసి, శ్రమణగౌతముడు—పతితుడు భోగలాలసపరుడు — అగౌరవపరుడు" — అని నిశ్చయించుకుని-మనసులో నిరాకరించి, తమచెంతను వచ్చినా, తమలో ఎవరూ అతన్ని ఏమాత్రం లక్ష్యపెట్టకూడదని నిర్ణయించుకున్నారు. బుద్ధుడు వారికి మరింతదగ్గరగా సమీపించేప్పటికి - ఆయన ముఖవర్చస్సు - దివ్యతేజస్సు చూసి, తమకు తెలియకుండానే అందరూ ఒకేసారి లేచి నిలబడి, ఎదురేగి - పరిపూర్ణ భక్తి గౌరవ విశ్వాసాలతో ఆయన పాదాలమీద పడి సాష్టాంగ నమస్కారం చేశారు. అందర్నీ—అన్నింటినీ అధిగమించిన ఆయన ఔన్నత్యం, శక్తి చూసి- ఆశ్చర్యపోయి ఎంతో ఆనందపడ్డారు. అతనిలో మార్పు గుర్తించి, ఉన్నతాసనం వేశారు. వారు- అన్ని సంవత్సరాలలో అటువంటి మహాత్ముని చూడలేదు. ఆయన చుట్టూ గంభీరమూ, మహనీయమూ అయిన తేజస్సు చూసి తమ పశ్చాత్తాపాన్ని వెల్లడించుకుని, అర్ఘ్యపాద్యాలిచ్చి గౌరవించారు. వృద్ధులైన కౌండిన్యుల వారు. సిద్ధార్థునికి చిన్నప్పుడు జ్యోతిషం చెప్పిన పండితులు.

"సాధన భ్రష్టుడవైన నీవు, ఆర్యజ్ఞాన దర్శనపు పరాకాష్ఠ యగు ఉత్తమ మనుష్యధర్మం పొందావా?" అని ఆ పంచవర్గీయులు బుద్ధుణ్ణి అడిగితే "అవును. నేను జ్ఞానాన్ని పొందాను. నా విముక్తి నిశ్చలం," అన్నాడు. అని, "యదార్థ విశుద్ధ జ్ఞానదర్శనం కానంత వరకు, విముక్తి లేదు" అన్నాడు.

ఆ తర్వాత బుద్ధుడు పద్మాసనంలో కూర్చుని— చేతి బొటన వ్రేలు- చూపుడువ్రేలు కలిపి- ఉపదేశ ముద్రలో ఆ ఐదుగుర్నీ ఉద్దేశించి- ప్రియమైన మీ సన్యాసులారా! మీ హృదయాలు తెరవండి. వాటిని ఆనందంతో నింపుతాను. శాంతిమయం కాంతివంతం చేస్తాను. నేను మృత్యువునుంచి విమోచన పొందాను. దాన్ని ఎట్లా పొందానో మీకు చెపుతాను ఆ మార్గం కూడా చూపుతాను. మనం- మనమనోశక్తిని ఎంతగా ఉపయోగించినా, ఎంత కఠినసాధన చేసినా—మనసునీ, దేహాన్నీ ఎన్ని యాతనలు పెట్టినా, బాధలు- కష్టాలు పెట్టినా మోక్షద్వారాలు తెరువలేము. అవి ఏ విధంగానూ తెరువబడేవికావు. మనం సహజంగా, అన్నింటితో సఖ్యతగా, సౌమ్యంగా, సత్యవంతంగా, శక్తివంతంగా వుండి— "ఈ దేహం ఒక ఆలయం" అనే భావంతో వుండి, జీవితం సాగించడం ఉత్తమం. దేహమంటే- అనేక ధాతువుల, భూతాల భాగాల సమ్మేళనం. దేహ ధారణకు సంబంధించి- వచ్చే, పోయే ఈ భూతాలన్నీ అశాశ్వతం. పల్చని చర్మంతో కప్పబడ్డ ఈ ఎముకల గూడులో గర్వం-దంబం- అహంకారం-మోసం- కపటం-వంచన-రోగం-వృద్ధాప్యం- మృత్యువు మొదలైనవి ఎన్నో వున్నాయి. ఈ దేహం వున్నంతకాలం-వాటి- నుంచి ఎవరూ తప్పించుకోలేరు. "దేహం" అనే ఈ వాహనం, ఒక వాహనాధిపతి ఆధీనంలో వుంది. అతడే వ్యక్తి-జీవుడు. ఆ జీవుని ముఖ్యలక్షణం- చైతన్యం దాని రూపాలు- దర్శనం- విజ్ఞానం. విజ్ఞాన మంటే, ద్రష్టకు- దృశ్యానికీ కలసంబంధం. విషయంతో, సంబంధంతో ఏర్పడగానే భావన- కల్పన- ఊహ- సంకల్పం- శక్తి అదేమనసు- చిత్తం ఇవన్నీ పైకి తేస్తాయి. ఆ విజ్ఞానంమీద, భవననిర్మాణం జరుగుతుంది. విజ్ఞానం తీసేస్తే- సర్వం శూన్యం. భవనం కూలి పోతుంది. అందుచేత అసలు వున్నది విజ్ఞానం ఒక్కటేనని తెలుసు కోవాలి. అదే సత్యాభార్థం. అది పరిపూర్ణ జ్ఞానం. దానికి అది అంతంలేదు.

ఈ ప్రపంచ స్వరూపమే, విజ్ఞానం. ఆ విజ్ఞానానికి సంబంధించి నవే-సర్వవస్తు సముదాయం. వాటికి మూడు లక్షణాలు వుంటాయి. మూలసారం- గుణాలు- కర్మలు. అవి వరుసగా మట్టిపాత్ర రూపం ధరించి- నీళ్లతో నిండివుండటం. మూలం, అవినాశము. గుణాలు, కర్మలు జనన- మరణాలకు వశమైనవి. ప్రకృతిలోని సమస్త వస్తు జాలం- మహావిజ్ఞాన సాగరగర్భస్థ రూపాలే. విజ్ఞానమే, నామ, రూపాల్ని కల్పిస్తోంది. నామం-సూక్ష్మం. రూపం- స్థూలం. నామం, మానసికావస్థలకూ; రూపం, భౌతిక పదార్థాలకూ సంబంధించి వుంటాయి. ఆ రెండూ ఎప్పుడూ కలిసేవుంటాయి. ఒకదాని కొకటి- పరస్పర ఆధారాలై వుంటాయి.

ఏ వ్యక్తికైనా రెండు లక్షణాలుంటాయి : నామం, రూపం. మానవ వ్యక్తిత్వం — నామరూప కల్పితమైన మనోభావ సముచ్చయం. చివరికి పరిశుద్ధమైన నిర్గుణ పరబ్రహ్మకూడా - సగుణ సాకారమై నామ- రూపాల ద్వారానే ప్రవర్తితం కావలసివుంది. అందు చేత, మానవుడు మరణిస్తే - ఆ భౌతిక పదార్థాలు మూల పదార్థాలలో కలిసిపోతాయి. కనుక స్వర్గం, అమరత్వం అనే మాటలు అనవసరం.

దేహంలో చైతన్యం దేదీప్యమానంగా ప్రకాశిస్తోందని గుర్తించాలి. ఎందుకంటే, మనిషి మనసు, ఒక అద్దం వంటిది. అందు సమస్తం ప్రతిబింబిస్తుంది. అలాగే, ఈ విశ్వం కూడా ఒక దర్పణమే, ఈ విశ్వమంతా దర్పణమయం. అన్నీ దర్పణాలే! ఆ దర్పణాలు ఒకదానిలో ఒకటి ప్రతిబింబిస్తున్నాయి. ఆ సంగతి స్వానుభవంలో కాని బోధపడదు. మనోదర్పణంలో ప్రపంచం ప్రతిబింబిస్తుంది. అందుచేత ఈ ప్రపంచానికి నిశ్చలతకాని, ఏకత్వంకాని లేదు. అది ఒకశక్తి ప్రసరణ మాత్రమే. ఆ కారణానికే, పుట్టిన ప్రతి దాని గర్భమునందు దాని నాశన బీజం వుంటుంది. కనుకనే మరణం సర్వజీవ ధర్మమైంది. కాని, ఈ జీవనం అవిచ్ఛిన్న పరివర్తనం.

ఈ ప్రపంచం పంచస్కందాలకు మించి ఏమీలేదు. పంచ స్కందాలంటే, రూప, వేదన, దర్శనం, (భావం - జ్ఞానం) సంస్కారం - విజ్ఞానం. రథానికి అనేక భాగాలు వుంటాయి. అవన్నీ కలిస్తేనే రథం. ఏ ఒక్క భాగం రథంకాదు. ఆ రథం కూడా మనసులో కేవలం ఒక భ్రాంతి భావన మాత్రమే కాని, అసలు వున్నది, ఒక్కటే దర్శనం. అదే జ్ఞానం," అని బుద్ధుడు గంభీరంగా వుండిపోయాడు. ఆయన్ని అమితాశ్చర్యంతో వింటున్న ఆ పంచవర్గీయులు నిశ్చేష్టులైనారు. ఆయన ఉచ్చారణలో స్పష్టత వారిని విభ్రాంతి పరచింది. ఆ రోజు ప్రసంగం అంతటితో ముగిసింది.

*  *  *

మర్నాడు మళ్ళీ ప్రసంగం ప్రారంభించారు. ఆయన ఈ భూమికి చెందినవారు కానిపించింది వారికి. కౌండిన్యులవారు విస్మయంతో విన నారంభించారు : "ఈ భూమి మీద ఏదీ శాశ్వతం కాదు. శాశ్వతంగా కనిపించినా, అనిపించినా అది నశిస్తుంది. ప్రతీదీ - చివరికి నశించి తీరుతుంది. బాగా పెరిగింది. పెరుగుతుంది. కలయిక జరిగితే, ఎప్పటికైనా వియోగం తప్పదు. ప్రాణం వున్న చోట, మృత్యువు వుంటుంది. ఆది వుంటే, అంతం వుంటుంది. ప్రతీదీ నిరంతరం మార్పుచెందుతూ వుంటుంది. అంటే, ఇంద్రియ గోచరమైన వన్నీ, క్షణ క్షణం మారుతూ వుంటాయి. ప్రతి మార్పుకూ ఒక కారణం వుంటుంది. ఆ కారణంవల్ల, ఒక కార్యం జరుగుతుంది. ఆ పనివల్ల ఒక ఫలితం కలుగుతుంది. అదే ధర్మం - అదే సత్యం - సూత్రం, నియమం, శాసనం. ఆ ధర్మమే, ఈ విశ్వాన్నంతా నడుపుతోంది. ప్రపంచం నిరంతరం మార్పుచెందుతూ వుంటుంది. ఈ క్షణం - క్షణంలో మరుక్షణంగా, - గతంగా మారుతుంది. ఏదీ శాశ్వతం కాదు. అది ఈ భూమి మీది లక్షణం. ప్రతీదీ గతిస్తుంది — నశిస్తుంది. ఆ సంగతి మనిషి బ్రతికివున్నంతకాలం

బాధిస్తుంది, భయపెడుతుంది, కలత చెందిస్తుంది. యాతనలు పాలు చేస్తుంది, దుఃఖపెడుతుంది. అదే దుఃఖకారణం.

ప్రతి దానికి కారణం, జన్మ. జన్మ లేకపోతే – రోగం, ముసలితనం, మృత్యువు, దుఃఖం - ఏమీ వుండవు అయితే, జన్మకు కారణం ఏమిటి? అదే - ఈ జీవిత ఉనికికి కారణం ఏమిటి? అని అంటే, అనురాగాలు - బంధాలు - మమకారాలు వాటికి కారణం- తృష్ణ, వేదన, నామ, రూపాదులవల్లనే ఇంద్రియాలు - ఆ నామ, రూపాదులకు కారణం - గ్రహించడం, తెలుసుకోవడం. అజ్ఞానం కలగడానికి కారణం - భావాలు, తలంపులు - వాటికి కారణం – అజ్ఞానం - కనుక ముసలి తనానికీ - రోగానికీ - మృత్యువుకీ - అన్నింటికీ కారణం అజ్ఞానం. ఆ అజ్ఞానం తొలగితే, సమస్త దుఃఖాలు, బాధలు, కష్టాలు తొలగుతాయి. ఆ విధంగా ప్రతిదానికి కారణాన్ని తెలుసుకోవాలి. మూలం చేరుకోవాలి. కారణం లేకపోతే, కార్యమూలేదు, - ఫలితమూలేదు.

ప్రతికారణం ఒక ఫలితాన్ని ఇస్తుంది. ఆ ఫలితం తిరిగి మరొక దానికి కారణమై - వేరొక ఫలితాన్ని ఇస్తుంది. ఆ విధంగా కార్య - కారణాలు తిరిగి, తిరిగి ఒకదానికొకటి పరస్పరాధారమై, మారుతూ వుంటాయి. ప్రతిదీ పరస్పరాధారం మీదే జరుగుతుంది. వాస్తవంగా జరిగేది అంతే! కాని, ఈ జగత్తుకు మూలకారణం - ఆది కారణం - "భగవంతుడు" అని సిద్ధాంతీకరించడంవల్ల, ముగింపులేక - అనంతంగా అల్లుకునే గొలుసుమాదిరిగా వుంటుందీ జగత్తు. అట్టి జగత్తుకు మూలకారణం, ఒకటి వుంటుందని - వుందని భావించడం పొరపాటు.

అసలు వున్నది అనంతమైన కదలిక మాత్రమే. ఇంకేంలేదు. ఆ కదలికవల్ల అనంతమైన ఈ ప్రపంచం వేరు వేరు రూపాలు ధరించి - వివిధ నామాలతో విలసిల్లుతోంది. ఆ విధంగా ఈ ప్రపంచం పరిణామం చెందుతోంది. మనిషి నుంచి మేరుపర్వతం

వరకు ఆ ధర్మమే పనిచేస్తుంది. ఆ సూత్రం మాత్రం ఎప్పుడూ మారదు. తనుక మార్పులోని ధర్మాన్ని చూడ్డమే, సత్యాన్ని తెలుసుకోవడం.

కాని, మనసు తన మనుగడకోసం అన్నింటినీ సృష్టించుకుంటుంది. తాను సృష్టించుకున్న - కల్పించుకున్న - భావించుకున్న - ఊహించుకున్న వాటినే వాస్తవమని — సత్యమని, నిజమని - నమ్మి - మనచేతనమ్మిస్తుంది. కాని, సృష్టిలో వ్యత్యాసమనేదేలేదు. అసలు వున్నది ఒక్కటే అయినా, ఈ వ్యత్యాసాలన్నింటినీ మనస్సే కల్పిస్తుంది. తనుక ఈ ద్వంద్వాలన్నీ మానసికం. మనిషే తనకు అనుకూలంగా ఈ విభాగాలన్నీ ఏర్పాటుచేసుకుంటాడు. నిజానికి అవన్నీలేవు, వున్నాయనే భ్రమ తప్ప. తాను కల్పించుకున్న నామరూపాలకు అతుక్కుని, వాటితో ఆడుకుంటాడు తనుకనే, ఈ దుఃఖం - బాధ - భ్రాంతి,'' అని ఆ ఉపయం ప్రసంగం పూర్తిచేశారు - బుద్ధ భగవానులు.

ప్రసంగానంతరం వారితో కలసి దినచర్య పూర్తి చేశారు. బుద్ధుడు, ఆయన తమమామూలు సిద్ధార్థుడుగా కలసినా, ఆయన్ని తమ గురువుగా, బుద్ధుడుగా తీసుకున్నారు, వారు.

ఈ ప్రపంచాన్నంతా బుద్ధుడు ఒక కదిలేమబ్బుగా చూశాడు. "శాశ్వతం - స్థిరం - నిశ్చయం'' అని మనం అనుకునేవన్నీ ఆయనకు భ్రాంతిగా తోచాయి. అందుకే ఆయన ఈ రూపాలన్నింటినీ అంత తేలికగా తోసేయగలిగారు. అన్నింటినీ చీల్చి, విభజించే ఆలోచననూ, దానికి మూలమైన మనసును కూడా తోసేశారు. అనంత విశ్వం మొదలుకొని, ఇసుకరేణువు వరకు ప్రతిదాన్ని మనసు విభజించి విడి-విడిగా చూడ్డం దాని సహజగుణం.

"ఈ ప్రపంచం ఒకదానికారణ ఫలితం. ఆ ప్రపంచం దుఃఖమయం,'' అంటూ ఒకరోజు సాయంత్రం ప్రసంగం ప్రారంభిం

చారు. దుఃఖానికి కారణం, కోర్కె, కార్య - కారణ సిద్ధాంతం ప్రకారం, కోర్కె కలగకపోతే. దుఃఖం ప్రాప్తించదు. కోర్కెకు కారణం, ఆలోచన. ఆలోచనకు మూలస్థానం- గతం. అదే-స్మృతి-జ్ఞాపకం. అదే మనసు. మనస్సంటే, ఆలోచనలతో కూడిన పెద్ద గిడ్డంగి. శాశ్వతమైనది ఏదీ లేనప్పుడు మనసూ, దాని కల్పన కూడా అశాశ్వతమే. ఆ మనస్సుకే మరోపేరు - "నేను-నాది" అది ఒక భ్రాంతి- లేక, కల. ఆ "నేను" అనేది అంతకన్నా ఏమీ కాదు. అందుచేత సమస్తం - అంటే - ఉనికి, వ్యాప్తి, సృష్టి, లయం అంతా - అన్నీ మనోకల్పనే. కొన్ని నిబంధనలకు మూలమైన ఆ మనసులోంచి పిలవకుండానే పుట్టేది — నేను. ఆ "నేను" క్రమంగా — ఒక బోధకుడు, మార్గదర్శి, ముఖ్యవక్త అవుతుంది. క్రమంగా అది మనస్ని పూర్తిగా మింగేసి, తానే మిగిలిపోతుంది. అది అన్ని మానసికావస్థల్ని నిలబెడుతుంది. వాటిని మోస్తుంది. అవి తిరిగి ఆ "నేను,ను నిలబెడతాయి. ప్రముఖంగా మోస్తాయి. ఆ విధంగా "నేను" బలాన్ని కూడబెట్టుకుంటుంది.

ఆరని ఒక మహాజ్వాలలోంచి నిరంతరం అనంతంగా అనేక కాంతికిరణాలు - వెలుగురవ్వలు పైకిలేచి - కొంతకాలం ఆకాశంలో నిలిచి ప్రకాశించి — తిరిగి ఆ మహాజ్వాలలో పడి - నామరూపం లేకుండా కలిసిపోతాయి. అవి-నిలిచి వెలిగిన క్షణాలే-వాటి జీవిత కాలం. అటువంటి కాంతి కిరణాల-వెలుగురవ్వల సమ్మేళనమే- మహా జ్వాల. కాని, అందుకొన్ని చిన్నవి - కొన్ని పెద్దవి; కొన్ని కాంతి హీనమైనవి— కొన్ని కాంతివంతమైనవి; కొన్ని బాగా పైకి లేస్తాయి- కొన్ని కొంతదూరమే వెడతాయి. ఆ క్షణంలో తప్ప వాటికి మరే విధంగానూ ఎటువంటి ప్రత్యేకతా లేదు.

అలాగే, మనిషిలో నిరంతరం మహావేగంతో - అనంతంగా— అవిరామంగా ఆలోచనలు- భావాలు - ఊహలు - కల్పనలు కలగడంతో, వాటిమూలంలో ఒక ప్రత్యేక వ్యక్తిత్వం వుంటుందంటున్నారు. ఆ మూలమే- "నేను". అదే "నేను-నాది" అనే అహం

భావం. ఆలోచనలకూ, భావాలకూ, అన్నింటికీ ఆ "నేనే" ఆధారం. ఆ "నేను" అనే దాంట్లో అనేక స్కంధాలు కలిసివుంటాయి. మల్లె పువ్వు పరిమళం కేవలం దాని ఆకుల, కాడల, తీగల— రంగు-పుష్పాదిల నుంచి రానట్లు, ఏ ఒక్క నామం, రూపం, స్కంధంనుంచీ ఆ "నేను" రాదు. ఆ "నేను" లేనివానికి, కోర్కెలేముంటాయి? కోర్కెలు లేకపోతే దుఃఖానికి చోటు ఎక్కడ వుంది?

దుఃఖమే కాదు, ఏమీవుండదు, కోర్కెలేనప్పుడు ఏమీలేదు. కోర్కె లేనివానిని, ఏదీ బంధించదు, బాధించదు, భయపెట్టదు. కనుక ఆ సంగతి ఎవరికివారు- ఎప్పటికప్పుడు- స్వానుభవంతో తెలుసుకోవాలి. తమలోపలా- బైటా- అన్ని విషయాలకు సదా— సంపూర్ణ ఎరుకలో వుండటమే, సత్యాన్ని తెలుసుకునే మార్గం. తమను తాము విమోచన పరచుకోవడానికీ, ఉద్ధరించుకోవడానికీ స్వానుభవం ఒక్కటే మార్గం. అప్పుడు ప్రతి ఒక్కరూ భ్రాంతుల నుంచి దూరంగా తొలగివుంటారు. అది "నేను" లేని స్థితి. ఆ స్థితిలో తమనుతాము మరచిపోగలుగుతారు. తనను తాను మరచి పోయిన మనిషి- మహా శాంతపురుషుడు— పరమ సుఖవంతుడు.

ఈ ప్రపంచం వాస్తవంగా కనుపించినా, అది వాస్తవం కాదు. అది అబద్ధంగా అసత్యంగా - అవాస్తవంగా కనుపించినా— అది అసత్యం కాదు. ప్రపంచం గురించిన అసలు సత్యాన్ని అజ్ఞానులు తెలుసుకోలేరు. సత్యం తెలుసుకున్నవారు— ప్రపంచాన్ని సత్యమని గాని, అసత్యమనిగాని అనరు. అది— మంచిదనిగాని, చెడ్డదనిగాని అనరు. కాని, వారు దాన్ని యథాతథంగా చూస్తారు," అని ఆ రోజు ప్రసంగం ముగించాడు.

* * *

ఆ మర్నాడు ఉదయం బుద్ధుడు ప్రసంగం ప్రారంభించాడు.

ఎప్పుడూ తప్పుడు ఆలోచనా విధానంవల్ల వ్యక్తపరచ శక్యం కాని- నిర్వచింప వీలుకాని- అసలు ఏమీలేని- ఏమీకాని అహం

కారంతో - "నేను"తో మనం, సంబంధం పెట్టుకోవడమే జరుగుతుంది. ఆ సంబంధాలవల్లనే, ఆ "నేను"కు అనుభవాలు కలుగుతాయి. ప్రతి అనుభవంలో- అనుభవించేవాడు, అనుభవించేది— అనుభవ విధానం- వుంటాయి. అవంతా అనుభవమయం. ఇంతేం లేదు, కాదు. అన్ని అనుభవాలు గతానికి చెందినవి. "నేను" అనేది కూడా గతమే. కాని, అనుభవం- క్షణికం. ఆ క్షణంలోనే అది సత్యం- వాస్తవం. మరుక్షణంలో ఆ అనుభవం అస్పృశ్యమైపోతుంది.

అవిద్యా జన్యమగు అహంకారం, అనిత్యరూపం. ఆ అహంభావమే సర్వదుఃఖ కారణం. అహంకారం పూర్తిగా అస్పృశ్యమైతే- నిర్వాణస్థితిని అందుకోవచ్చు. కాని, మోహసంగమంనుంచి జనించిన పంచరాసులు— దేహం, భావం, దర్శనం, సంకల్పం, హేతువు-వాటి వల్లనే దుఃఖం కలుగుతుంది.

మనం ముఖ్యంగా తెలుసుకోవలసింది, దుఃఖం గురించి. త్యజించవలసింది, దుఃఖకారణం. అదిచాలు. కాని, "ఇంకా ఏదో చేయాలనుకుంటే, దుఃఖకారణాలు నిర్మూలించుకుంటో, ఆ మార్గంలో జీవించడం. దుఃఖానికి కారణం, సంసారం. అంటే, అస్తిత్వం. అదే కర్మ. కర్మ అంటే, క్రియ—ప్రక్రియల సమన్వయం. కర్మ ఫలితం తప్పక అనుభవించవలసి వుంటుంది. కర్మకు కారణం- అజ్ఞానం. అజ్ఞానం, భ్రమ.

"పరిశుద్ధమైన, నిర్మలమైన పసిబిడ్డవంటిదైన, స్వచ్ఛమైన మనసు ఉత్తేజితమై, కర్మాచరణకు పూనుకుంటుంది. కాని, దృగ్గోచరమైన సర్వపదార్థాలూ, సమస్త వస్తు సముదాయం స్వభావసిద్ధంగా శూన్యమైనవే. కాని, కలతపూరిత భావన— సర్వభ్రమలకు— అంటే- అజ్ఞానానికి మూలాధారమౌతుంది.

"జీవితం పొడవునా బలవత్తరమైన శక్తిగా, అన్నింటికీ అడ్డుగా, అవరోధంగా నిలిచే శత్రువు కోర్కె. దాని నాశనాన్ని

తెలుసుకుని-అది ఎంతటి శత్రువో లోకానికి చూపాడు, బుద్ధుడు దాని శక్తి, సామర్థ్యాలు ఎంతటివారిపై కూడా ఎట్లా పనిచేస్తాయో వివరించి చెప్పాడు. ఎవరికివారు తమ అంతఃశత్రువైన కోర్కెను వజ్ర సంకల్పంతో జయించాలన్నాడు. ఎందుకంటే, అది చిత్త సంక్షోభానికి మూలం కనుక. కోర్కెకు కారణమైన ఆలోచన ఆగితే, అన్నీ అణగిపోతాయి. దానికి మార్గం, అష్టాంగమార్గం. ఆ మార్గాన్ని అనుసరించడమంటే, చీకటిగదిలో దీపంతో ప్రవేశించడం వంటిది. ఆ దీపకాంతి సహాయంతో ఇతరులకూ ఎన్నో చూపవచ్చు, ధర్మాన్నీ బోధించవచ్చు." అని-మళ్ళా చతుస్సత్యాల్ని వివరిస్తో- మొదటిది- ప్రపంచం, దుఃఖరూపం. రెండవది- దుఃఖకారణం- తృష్ణ. అది- మోహరాగాదులతో కూడిన ఇహ విషయానంద కాంక్షిణి. మూడవది- దుఃఖనిరోధం. అది- శాంతిరూపం తృష్ణనిశ్శేషంగా నశింపజేయడం. నాల్గవది- మధ్యేమార్గం. ఆ మార్గంలో ఎనిమిది అంగాలున్నాయి : 1. సమ్యక్‌దృష్టి. 2. సమ్యక్సంకల్పం. ఈ రెండూ ప్రజ్ఞ- జ్ఞానానికి సంబంధించిన శిక్షణ.

3. సమ్యగ్వచనం. 4. సమ్యక్కర్మ. 5. సమ్యక్ జీవనం : ఈ మూడూ నైతిక జీవనానికి సంబంధించిన శిక్షణ. అది శీలం.

6. సమ్యక్ ప్రయత్నం. 7. సమ్యక్‌స్మృతి. 8. సమ్యక్ సమాధి- ఈ మూడూ చిత్తము- మానసిక శిక్షణ. "సమ్యక్" అంటే "చక్కని" అని అర్థం.

అర్హత పొందేందుకు ఈ ఎనిమిది మానసిక, నైతిక శిక్షణలు అవసరం.

"చతుస్సత్యార్థాల్ని అవగాహన చేసుకుంటే, ఆశ- ప్రలోభం పోతాయి. దురాశపోతే, ఇంక ఈ ప్రపంచంలో ఎవరితోనూ, దేని తోనూ ఎటువంటి తగాదా, ఘర్షణ, గొడవ, పేచీ వుండదు. అలాగే హింస, దొంగతనం, మోసం, దోపిడి, అన్యాయం, నింద, ఖండన,

విమర్శ, శత్రుత్వం, హింస, ఉద్రేకం, విజృంభణ ఏమాత్రం వుండవు. ఈ ప్రపంచంలో చాలావరకు దుర్మార్గమైన పనులన్నీ కేవలం ఆసక్తివల్లనే జరుగుతాయి. అందుచేత ఆసక్తిని దగ్గరకు రానీయకూడదు.

* * *

"స్వార్థం, సందేహం-అనుమానం- కామం, ద్వేషం- దొంగ బుద్ధి- ఈ ఐదూ ఎప్పుడూ మన మంచం దగ్గరే నిలబడి వుంటాయి. వాటికి ఎరుకలో వుండాలి. ఈ ఐదూ గోచరమయ్యే ప్రమాదాలు. మనం కళ్ళు తెరవగానే అవి మనలో ఎట్లానో-చాలా త్వరగా, తెలివిగా, తేలికగా- ఎంతటి వారిలో కూడా ప్రవేశిస్తాయి. వాటి విషయంలో జాగ్రత్తగా వుండాలి.

"గోచరం కాని మరో ఐదు ప్రమాదాలున్నాయి- జీవితం కోసం కాంక్షను విడవలేక పోవడం- అహంకారం-గర్వం వ్యాకులత-కలత-అవిద్య. ఇవన్నీ నిరాకరించవలసినవి.

"కాని, జీవితంలో అహ్వానించ తగ్గవి ఐదు వున్నాయి. 1) విశ్వాసం— [అది నమ్మకం వంటిది కాదు] 2) జాగృతి. ఆ జాగృతిని భావాల్లోకి, క్రియల్లోకి, ఆలోచనల్లోకి తీసుకురావాలి. 3) శక్తి- 4) ధ్యానం [మనసు భారరహితం కావడానికి గతం పూర్తిగా తొలగడానికి] ఏమీ ఆలోచించక - నిశ్చలంగా వుండడమే ధ్యానం. అంటే, ఆలోచనలు ఆగిపోవడం. అదృశ్యం కావడం అదే స్వచ్ఛమైన దర్శనం. ధర్మనిష్ఠతో ధ్యానించువానికి, అపారమైన శాంతి లభించును. నిరంతరధ్యాన పరాయణులు చెదరని శాంతితో నిర్వాణంతో సంబంధం కలిగి నైష్కర్మ్యసిద్ధి, హొందుతారు. 5) జ్ఞానం. అది - స్వస్వరూపజ్ఞానం. అది మన అంతర్వాణి "ఉవాచ" కావాలి. అది - సరాసరి హృదయంలోంచి పెల్లుబికిరావాలి. అది

ధ్యానంలోనే సాధ్యం. హృదయం ప్రేమ జనితం కావడమే, జ్ఞానం-మనసులేనిస్థితే, జ్ఞానం. పూర్తి ఎరుకలో - మెలకువతో - జాగ్రదవస్థలో వున్నస్థితే, జ్ఞానం.

"జీవితాన్ని యధాతథంగా - వాస్తవంగా చూడాలి. ప్రకృతి ఉనికినీ, ప్రపంచ పరిస్థితిని గమనించాలి...తృష్ణ, క్రూరత్వం పనికిరావు. మనసు పవిత్రంగా, నిర్మలంగా వుండాలి. అబద్ధం, అవాచ్యం పనికిరావు. ఉబుసుపోక చెప్పుకునే కబుర్లు, మంచి సంగతి కాదు. అసహనం కూడదు. సత్కార్యాచరణే గావించాలి. నిత్య జీవితంలో అవసరమైన వాటిని సక్రమ పద్ధతిలో - సన్మార్గంతో పొందాలి.

మంచి ప్రయత్నాలే చేయాలి. బుద్ధి సూక్ష్మతతో కూడిన ఎరుక వుండాలి. నిజమైన శ్రద్ధతో కూడిన ఏకాగ్రత కావాలి. ఆ ఏకాగ్రతే, ధ్యానం.

"నీతి వర్తన యందు ప్రేమ, నిశితపరీక్ష, సమగ్ర, విధేయత పాటించి, గొప్పశక్తి, సామర్థ్యం కావాలి. నీతి వంతులు కావాలి. బానిసల, దీనుల, అనాథుల, దుఃఖితుల, పతితుల, పశు - పక్ష్యాదుల యెడ ప్రేమ - దయ వుండాలి. పెద్దల యెడ మర్యాద, గౌరవం, నమ్రత, విధేయత, వినయం కలిగి వుండాలి. అదే నీతి వర్తన.

"మితాహారం తీసుకుంటూ, పరిశుభ్రమైన వస్త్రాలు ధరిస్తో- దేహాన్ని ఆరోగ్య వంతంగా వుంచాలి. మన ఉనికి, దాని శాశ్వతత్వంకోసం మనం పడే వేదనే - వాంఛే - ఆకాంక్షే - దుఃఖం. వాంఛ అణగితే — దుఃఖం వుండదు. కనుక కోర్కె - ఆశ - లోభత్వం వుండకూడదు. అహంకారం — అదే "నేను" అనే భావం లేనప్పుడు తప్ప - ఆరాధనలద్వారా, జంతుబలుల ద్వారా ముక్తిపొందలేము. కామం నుంచి విముక్తి పొందినవారు ఇహపర లోక సుఖాపేక్షలేనివారు, వారే ముక్తిపొందగలరు.

"హీనము, అగ్రాహ్యము - అనార్యము - అనర్థాత్మకము అయిన కామ సుఖాను సరణము జీవితంలో మొదటిది. రెండవది - దుఃఖం. అది అనివార్యం, అనర్థదాయకము శారీరకనాశనం. కనుక ఆ రెంటింటినీ విడవాలి.

"జీవితంలో ఏ విషయంలోనైనా సరే "అతి"ని, వదలాలి. మధ్యేమార్గం అవలంభించాలి. ఆ మార్గం జ్ఞానవంతుల్ని చేస్తుంది. నిర్వాణ స్థితికి చేరుస్తుంది. ఆ మార్గం ఉపశాంతిని అభిజ్ఞతను, జ్ఞానాన్ని నిర్వాణ ప్రశాంతిని కలిగిస్తుంది. అటువంటిస్థితిని పొంద డానికి సాధకుడు పదిసంకెళ్ళను ఛేదించవలసివుంది.

1) అహాన్ని ఆత్మగా భావించరాదు. అది దుఃఖానికి దారి తీస్తుంది. 2) ధర్మం విషయంలో సంశయం పనికిరాదు. 3) కర్మా చరణ విషయంలో మూఢాచారాలు పోవాలి 4) విషయ వికారాల్ని జయించి బ్రహ్మచర్యాన్ని స్వీకరించి, సాత్వికాహారాన్నే తీసు కోవాలి. 5) సమత్వం వుండాలి. 6) విషయ వాసనల యెడ అనా సక్తత. 7) సుఖాపేక్ష వుండరాదు. 8) గర్వం వుండరాదు. 9) దంభం నశించాలి. 10) అజ్ఞానం తొలగాలి.

"ఈ పదింటినీ భవచక్రమంటారు. దాన్ని దాటితేనే మోక్షం- నిర్వాణం ప్రాప్తిస్తుంది. నిర్వాణమంటే, అశాశ్వతమైన వస్తు బైటికిపోయి, అదృశ్యం కావడం. అప్పుడే మనిషి తన చివరి బంధం నుంచి విడుదల, విమోచన పొందినస్థితిని చేరినట్లు. ఎందుకంటే, మనిషి ఎప్పుడూ ఒకటికాదు. అంతర్యంలో అనేకం. అందుచేత అతడు బైట అనేకం కల్పించుకుంటాడు. అవే బంధాలు.

"శారీరకంగా కోర్కెలనే బంధాలనుండి విముక్తి పొందటం, మానసికంగా "నేనే" అనే అహంభావం విసర్జించడం. నైతిక దృష్ట్యా కామ, క్రోధ, మోహాదులు, విద్రోహ విద్వేషాలు, అజ్ఞానం వదలడంతో - అంటే, పశుతుల్యమైన, అనాగరికమైన వాంఛలు,

అజ్ఞానం- నాశనం కావడం. అది శూన్యస్థితికాదు. అది, ఒక పవిత్రమైనస్థితి. అది రూపురేఖలు లేనిది, అదే నిర్వాణం, అది నిత్యం, సత్యం, శాశ్వతం. సుఖప్రదమైనది. దాన్ని జీవించి వుండగానే పొందాలి.

“అలాగే, మనిషిలో పదిదోషాలుంటాయి. అందులో మూడు మనసుకు చెందినవి : అవి - అసూయ, సంశయవాదం, ఆగ్రహం లేక, తీవ్రకోపం. మూడు దేహానికి చెందినవి : అవి - హింస, వ్యభిచారం, దొంగతనం, నాలుకకు చెందినవి : నాలుగు : అసత్య వాక్కు, వృథా మాటలు, ఉబుసుపోక చెప్పుకునే కబుర్లు, తిట్లు- అపవాదు, అపనింద, నిర్వాణపథం చేరుకునే లోపల సాధకుడు ఈ పదింటినీ తప్పనిసరిగా జయించాలి.

నిర్వాణమంటే, అపారమైన, అఖండమైన ఎరుక. బ్రహ్మాండమైన ప్రజ్ఞ. అదేముక్తి. కామ, ద్వేష, వాంఛ, తృష్ణ, మోహం, కోపం, అజ్ఞానం నిర్మూలం కావడం. మనసును శుద్ధిచేసి - స్వస్వరూపతేజో విలసిత మొనర్చుటే, నిర్వాణం. జగత్సత్య స్వరూపమైన సత్పదార్థంతో కలవడం. భారం, బంధంలేనిస్థితే, నిర్వాణం. సంసారిక కర్మసూత్ర బద్ధమైన వ్యవహారిక ప్రపంచానికి అతీతంగా వుండటం. సర్వావస్థాతీతమైన పదవిని అలంకరించడం. విఘాత వైరుధ్యాలులేని చిత్తశాంతే, నిర్వాణం. నిర్మలమనస్సు, విచక్షణా యుతమైన మేధస్సు నుంచి పుట్టిన సంపూర్ణ ఉద్దీపనమే- సర్వోత్కృష్టమైన సంబుద్ధత్వస్థితి. అదే, నిర్వాణం. అది - ఒక విశిష్ట జ్ఞాన దివ్యత్వం. ఆ స్థితిలో వ్యక్తిత్వంలేదు. ప్రత్యేక ఉనికిలేదు. అది చావు - పుట్టుకలులేనిస్థితి. ఆ సాధనా మార్గంలో మనసును నిర్మలంగా, నిశ్చలంగా, పవిత్రంగా, ఏకాగ్రంగా వుంచాలి. మనోనిగ్రహం, ఏకాగ్రత, శారీరక - మానసిక అనాసక్తతముఖ్యం, ఆ సాధనకు. సమస్త అనర్థాలకు మూలమైన కోర్కె నాశనం కావాలి.

క్షణ క్షణం మనోస్థితిని తెలుసుకోవడానికి లోతైన దృష్టి- కేంద్రీకృతమైన, తీవ్రమైన ఆలోచనా విధానం - అవసరం. ఆ మార్గంలో ఇంద్రియాల యొక్క, విషయాల, ఉద్దేశ్యాల, కల్పనల, అలవాట్ల, అభిప్రాయాలనుంచి చిత్తాన్ని తొలగించడం.

“లక్ష్యసిద్ధికి మోహం, కోపం, కామం, వాంఛ, తృష్ణ, మనో వికారం అయిష్టత అసహ్యం, తికమక, గందరగోళం - మొదలైనవి వినాశన కారకులు, అవి పూర్తిగా పోవాలి. అవి పోయిన స్థితినే, శూన్యం అంటాడు. అంటే, అంతా ఖాళీకావడం. అది - దేనివల్లా రాదు, జరగదు, దేనివల్లా కలగదు, ఏర్పడదు. అది ఒకదానితో కలిసేదికాదు. ఒకదానివల్ల తయారయ్యేదికాదు. అంటే, సర్వపదార్థాల, సర్వవిషయాల పరమార్థం-వాటిస్థితి-వాటిస్వభావం గురించిన సంపూర్ణ అవగాహనే శూన్యత. అదే, మనసు పనిచేసే విధం గురించిన అవగాహన అంటే, అహంకు విరుద్ధమైనదే శూన్యత అంతే కాదు. సర్వధర్మాల పరమార్థ నిజస్థితిని గూర్చిన జ్ఞానమే, శూన్యత. అంటే, “నేను” అనేదాన్ని కూలంకషంగా పరిశీలించుటే శూన్యత” అని ఆ రోజు ప్రసంగం పూర్తి చేశాడు.

* * *

ఆ రోజు ప్రసంగంతో గొప్ప ధర్మాన్ని - సత్యాన్ని - లోకంలోకి విడుదల చేశాడు, ఆయన గట్టిగా నొక్కి చెప్పింది - చతురార్యసత్యాలను - అష్టాంగ మార్గాన్ని. ఆధ్యాత్మిక, భౌతిక రంగాల మధ్యగల బ్రహ్మాండమైన అఖాతానికి ఒక చక్కని వారధి నిర్మించాడు బుద్ధభగవానుడు. అది అత్యున్నతమైన మార్గం. ఆ మార్గంలో, ప్రధానమైన అంశం- ఎవరికివారు, తమనుతాము తెలుసుకోవడం. ఆ పంథాను ఆచరించడం- అనుసరించడం. అపరిపూర్ణత్వ సాధన అంతరజ్ఞానానికి, అంతరీక్షణకు దారితీస్తుంది. అంతర్వీక్షణ- అంతరశుద్ధికి, హృదయ ప్రక్షాళనకి సహకరిస్తుంది. అందుకే బుద్ధుడు

క్షణ క్షణం మనోస్థితిని తెలుసుకోవడానికి లోతైన దృష్టి- కేంద్రీకృతమైన, తీవ్రమైన ఆలోచనా విధానం - అవసరం. ఆ మార్గంలో ఇంద్రియాల యొక్క, విషయాల, ఉద్దేశ్యాల, కల్పనల, అలవాట్ల, అభిప్రాయాలనుంచి చిత్తాన్ని తొలగించడం.

"లక్ష్యసిద్ధికి మోహం, కోపం, కామం, వాంఛ, తృష్ణ, మనోవికారం అయిష్టత అసహ్యం, తికమక, గందరగోళం - మొదలైనవి వినాశన కారులు, అవి పూర్తిగా పోవాలి. అవి పోయిన స్థితినే, శూన్యం అంటారు. అంటే, అంతా ఖాళీకావడం. అది - దేనివల్లా రాదు, జరగదు, దేనివల్లా కలగదు, ఏర్పడదు. అది ఒకదానితో కలిసేదికాదు. ఒకదానివల్ల తయారయ్యేదికాదు. అంటే, సర్వపదార్థాల, సర్వవిషయాల పరమార్థం-వాటిస్థితి-వాటిస్వభావం గురించిన సంపూర్ణ అవగాహనే శూన్యత. అదే, మనసు పనిచేసే విధం గురించిన అవగాహన అంటే, అహంకు విరుద్ధమైనదే శూన్యత అంతే కాదు. సర్వధర్మాల పరమార్థ నిజస్థితిని గూర్చిన జ్ఞానమే, శూన్యత. అంటే, "నేను" అనేదాన్ని కాలం క్రమంగా పరిశీలించుటే శూన్యత" అని ఆ రోజు ప్రసంగం పూర్తి చేశాడు.

* * *

ఆ రోజు ప్రసంగంతో గొప్ప ధర్మాన్ని - సత్యాన్ని - లోకంలోకి విడుదల చేశాడు, ఆయన గట్టిగా నొక్కి చెప్పింది - చతురార్యసత్యాలను - అష్టాంగ మార్గాన్ని. ఆధ్యాత్మిక, భౌతిక రంగాల మధ్యగల బ్రహ్మాండమైన అఖాతానికి ఒక చక్కని వారధి నిర్మించాడు బుద్ధభగవానుడు. అది అత్యున్నతమైన మార్గం. ఆ మార్గంలో, ప్రధానమైన అంశం- ఎవరికివారు, తమనుతాము తెలుసుకోవడం. ఆ పంథాను ఆచరించడం- అనుసరించడం. అపరిపూర్ణత్వ సాధన అంతరజ్ఞానానికి, అంతరీక్షణకు దారితీస్తుంది. అంతర్వీక్షణ- అంతరశుద్ధికి, హృదయ ప్రక్షాళానికి సహకరిస్తుంది. అందుకే బుద్ధుడు

కారణంగా దుఃఖంలో వున్నారనే సంగతి నేను స్వయంగా తెలుసుకున్నాను. ఆ సత్యం తెలుసుకుని, సమ్యక్ సంబుద్ధుడనయ్యాను. ఆ సత్యాన్ని అందరికీ తెలియపరచాలనే ఉద్దేశ్యంతో బయలు దేరాను.

"ధర్మమేదో-దాన్ని గ్రహించడం సామాన్యులకు సాధ్యం కాదు. అయినా వినదలచుకున్నవారు వినండి," అన్నారు.

మహాసముద్రం వంటి మానవజీవితం, దుఃఖమయంగా తోచి గొప్ప ప్రేమతో, దయతో - అపారమైన కరుణతో - ఆయన కూడా ఆ మహార్ణవంలో మునిగి - అందరితోపాటు - అన్నీ పంచుకో దలిచారు. అదీ ఆయన తీసుకున్న నిర్ణయం. ఆ నిర్ణయంతో ఆర్తులకూ, అజ్ఞానులకూ-అందరికీ ధర్మాన్ని బోధించారు. ఆ బోధ దుఃఖవినాశనాన్ని కలిగిస్తుందనే వాగ్దానాన్ని ఇస్తుంది- దుఃఖం వున్నంతకాలం, ఆయన బోధలూ సజీవంగా వుంటాయి.

బుద్ధుని అంతరాత్మ ప్రబోధమే ఆయన బోధ. అది ఆయన స్వానుభవం. ఆయన బోధలు విని, కౌండిన్యులవారు- ఆయన నలుగురు శిష్యులు విమలచక్షువులై - అర్హతస్థితి పొంది - నిర్వాణ ప్రశాంతి అనుభవించి - బుద్ధుణ్ణి అనుసరించడానికి ఒక సంఘంగా ఏర్పడి, వారి అనుమతికోరగా, అప్పుడు బుద్ధుడు — మొట్టమొదటి సారిగా, "ఓ భిక్షువులారా!" అని సంబోధించాడు. అప్పటినుంచి ఆ సంఘం వారికి, భిక్షువులనే నామకరణం జరిగింది.

* * *

పరబ్రహ్మ సంధానమగు తీవ్రనిష్ఠే అభ్యాసం. అటువంటి అభ్యాససిద్ధమైన అనుభవంతో నిశితమైన విషయాలు బోధించాలని సంఘాన్ని ఏర్పాటుచేశారేకాని, ప్రత్యేకంగా, ఒక సంఘాన్ని స్థాపించ యత్నించలేదు. పంచవర్గీయులతో ఏర్పడినదే భిక్షుక

సంఘం. వారే సంఘ ప్రథమ సభ్యులు. బుద్ధుడు వారికి ముఖ్యంగా- గట్టిగా నొక్కి-చెప్పింది, "పంచశీల" గురించి. జీవహింస కూడదు- అబద్ధం ఆడకూడదు- వ్యభిచారం కూడదు- దొంగతనం కూడదు- మత్తుపానీయాలు ముట్టరాదు.

బుద్ధుడు చేసిన ఆ మొదటి ప్రవచనాన్నే "ధర్మచక్రప్రవర్తన అంటారు- అది ధర్మబోధన. అంటే, విశ్వవ్యాప్తమైన నైతిక విలువల్ని- "Iam" వంటి జ్ఞానాన్ని ప్రబోధించారు. ఆయన బోధలకు మానవుడే వ్యక్తే కేంద్రబిందువు. ఆ బోధతోనే ఆయనకు ఆచార్యత్వం లభించింది. ఆ తర్వాత ఆయన్ని విని, అనుసరించిన వారంతా, ఆయన స్థాపించిన సంఘసభ్యులైనారు. ఆనాడు బుద్ధుడు ప్రేమతో- అతిసాహసంతో బౌద్ధధర్మం అనే చక్రానికి చలనశక్తిని ఇచ్చి ప్రపంచం మీదకు నెట్టారు. అది కదిలి-ముందుకు సాగి- భూభాగమంతా ఆక్రమించి, నేటికి నిర్విరామంగా తిరుగుతూనే వుంది.

* * *

బుద్ధునికి పూర్వమే కపిలుని సాంఖ్యయోగం- పతంజలి యోగ సూత్రాలూ వున్నాయని పండితుల అభిప్రాయం. ఏమైనా బౌద్ధం- హిందువులను పండితులను గట్టిగా ఆలోచింపజేసింది. తత్ఫలితంగా, షడ్దర్శనాలు- వేదాంత పద్ధతులు- సిద్ధాంతాలు వచ్చాయి. జీవితంలో ఈ జన్మలోనే అభివృద్ధి సాధించాలంటే- వేదప్రమాణమైన కర్మలు ఆచరించాలనేదాన్ని, జైమిని ఒక పద్ధతిలో- పూర్వమీమాంస సూత్రాలుగా వెలుగులోకి తెచ్చాడు. తర్వాత, ఉపనిషత్తులు వచ్చాయి. "ఆత్మ- విశ్వాత్మ; ఐక్యం- ఆనందం"- అంటూ. ఆ తర్వాత, చార్వాకులు వచ్చారు.

వేద, ఉపనిషత్-చార్వాకుల సిద్ధాంతాలూ, పద్ధతులూ, ఏవీ

అశాంతిగొన్న మనసుకు శాంతిని ఇవ్వలేకపోయాయి. నిజమైన సత్యాన్వేషికి, సరైనమార్గం చూపలేక పోయాయి, వేద కర్మకాండ యందు ఆసక్తిలేని ఆధ్యాత్మికవాదులు, మంచి మార్గంకోసం ఎదురు చూస్తున్నారు.

ఆ రోజుల్లో ఉత్తరభారతదేశంలో చాలావరకు ఆర్య సాంప్ర దాయంతోపాటు, సమానంగా, బలంగా హిందూమతం, సనాతన ధర్మంకూడా వుండేవి. సాంఖ్యయోగ పద్ధతులు బహుళవ్యాప్తిలో వుండేవి. బ్రాహ్మణులు, శ్రమణులు అను రెండు ప్రధానవర్గాలవారు వుండేవారు. బ్రాహ్మణులు వేదాల్ని, ఉపనిషత్తుల్ని అనుసరిస్తే- శ్రమణులు వారికి భిన్నంగా వుండేవారు. కాని, క్రమంగా ప్రజల్లో వైదికమతంమీద- బ్రాహ్మణ మతంమీద, సంశయం హెచ్చింది. ఆ కాలంలో ఎందరో విజ్ఞానవేత్తలు బయలుదేరారు. అందరిలో గౌతమబుద్ధుడు ఉన్నతుడుగా, యుగప్రతినిధిగా నిలిచాడు. జాజ్వల్య మానమైన బహుదేవతా ఆరాధనలతో వేదాలూ; సామాన్యప్రజల ఊహకు సయితం అందని తాత్త్వికభావ సంపదతో ఉపనిషత్తులూ ప్రజాజీవనంపై, పెత్తనం చెలాయిస్తున్న తరుణంలో, బుద్ధుడు అవత రించాడు.

బుద్ధుడు ఉపనిషత్తుల్ని - సమస్త శాస్త్రాల్ని, హిందూ గ్రంథాల్ని అధ్యయనం చేసిన మహానుభావుడే కాని, వేదాంతికాడు. మంచి మార్గదర్శకుడు, దార్శనికుడు. జీవితంలో అనేకవిధాల- బాగా విసుగుజెంది, అశాంతితో కొట్టుకుని, సత్యాన్వేషణకు సమస్తాన్ని పరిత్యజించి, అరణ్యాల్ని ఆశ్రయించి, ఆరేళ్ళు కఠోర తపస్సు గావించి, స్వానుభవంతో సత్యాన్ని కనుక్కున్నాడు.

తెలుసుకున్న అనుభవజ్ఞానంతో, ఇతరులకు బోధించి సహాయ పడాలని లోకంలోకి బయలుదేరినవాడు. అంతే! ఆయనబోధ, ఎవరికివారు తమ ఆలోచనా విధానాన్ని — ఏ విధంగా ఉపయో

గించుకోవాలో చెప్పాడు. కాలం, వ్యర్థాచేయక, సదా అంతర్వీక్షణ చేయమన్నాడు. గతంలో అనేక విధాల ఏర్పడివున్న పద్ధతుల్ని - సిద్ధాంతాల్ని - నమ్మకాల్ని తీసుకుని, సరిచేసి, విస్తృతపరచి —ఒక క్రమ పద్ధతిలో - హేతు బద్ధంగా ఏర్పాటు చేశాడు. ప్రాపంచిక సుఖాలతో- విజయాలతో విసుగుజెంది - నిరాశచెందివున్న వారికి బుద్ధుడు ఒక చక్కని ఆలోచనా విధానాన్ని - మార్గాన్ని సూచించాడు. చతుత్సత్యాలను చెప్పి - నివృత్తిమార్గంగా అష్టాంగ మార్గాన్ని సూచించాడు. ఆ మార్గం - పాత పద్ధతులకు — సాంప్రదాయాలకు విరుద్ధంగా వుండి, ప్రయోజనకరంగా వుండుటచేత, ప్రజలు - బుద్ధుని వైపు మళ్ళారు.

దేవతల దైవత్వాన్ని, వేదాల ప్రమాణాన్ని ఉపేక్షించి, వాటి నుంచి ముందు తన శిష్యుల్ని దూరం చేశాడు. నాస్తికుల సంశయం, అనుమానం, ఔదాసీన్యం, అవహేళనను వ్యతిరేకించి, వివేక కిరణాలతో జీవితాన్ని బహుముఖంగా పరికించమని - వారిని ప్రోత్సహించాడు. జగత్సత్య ధర్మాన్ని నిరూపించాడు. మిథ్యా భావాన్ని నమ్మడం మాని, అసలు సత్యాన్ని దర్శించమని హితవు చెప్పాడు. సత్యం తెలుసుకునేందుకు, పరీక్ష - పరిశోధన - పరిశీలన చాలా ముఖ్యమన్నాడు. ఎవరికివారు - అనుక్షణం తమను తాము తెలుసుకోమన్నాడు.

యజ్ఞయాగాది క్రతు నిర్వహణ, మనిషికి బంధ విముక్తి నొసంగవు. పరమ సత్య స్వరూపజ్ఞానమే, నిర్వాణాన్ని నిరూపించగలదు. అందుకే, నిత్య జీవితాన్ని శుద్ధి చేసుకునే నైతిక నియమాల్ని అభ్యసించి, ఆచరించమన్నాడు. నైతికానుష్ఠానమే జ్ఞానమని, బుద్ధుని బోధన భయంకరమైన, వికారమైన, ఆశ, లోభం, తృష్ణ, అత్యాశ, ఆగ్రహం, ద్వేషం, మోహం, బుద్ధి హీనత వంటి దుర్గుణాలను మానవ హృదయాలనుంచి శాశ్వతంగా తొలగించాలనేదే, బుద్ధుని నిశ్చితాభిప్రాయం.

బుద్ధుడు క్షత్రియ శాఖకు చెందినా, శ్రమణుల సాంప్ర దాయాల్ని తీసుకున్నా, ఆయన మార్గం - మధ్యే మార్గం. ఆ రెండు వర్గాల్ని ఆయన ఆచరణకు తీసుకోలేదు. వాటిని వ్యతి రేకించనూలేదు. కాని, ఆయన ఆయా ధర్మాలకు నిజంగా కట్టు బడ్డవారిని గౌరవించేవారు - బ్రాహ్మణ సాంప్రదాయ వాదులు వారసత్వాన్ని - ప్రభుభక్త పరాయణ తత్త్వాన్ని పాటిస్తే, శ్రమ ణులు సామ్యవాదాన్ని, సమానత్వాన్ని పాటించేవారు. అయినా ఆ రోజుల్లో బ్రాహ్మణాధిక్యత అధికంగా వుండుటచేత – ప్రజలు మూఢ నమ్మకాలతో వుండేవారు. కుల, మత, వర్గ, వర్ణ వివక్షతలు మెండుగా వుండేవి. బానిసల్ని యజమానులు హీనంగా, క్రూరంగా చూసేవారు. సమాజంలో స్త్రీలకు గుర్తింపులేదు. అవిద్య వల్ల – కామ, కామినీ ఆసక్తులై, ప్రజలు యజ్ఞయాగాది క్రతువులతో జంతుబలులతో, యుద్ధాలతో నిరంతరం సంఘర్షణతో బ్రతికేవారు, అటువంటి సమయంలో బుద్ధుడు అవతరించి - అందరికీ తన బోధా మృతాన్ని అందిస్తూ, సంచార జీవితం సాగించ నారంభించాడు. రాజధర్మాన్ని శాసించి, పాలించవలసిన చక్రవర్తి, ధర్మసంస్థాప నార్థం భిక్షా పాత్ర ధరించి, కఠోర తపస్సుగావించి - సముపార్జించిన సత్యాన్ని, జ్ఞానాన్ని సర్వమానవాళి సౌభాగ్యంకోసం - దుఃఖ విమోచన కోసం - యతివేషధారణలో దేశాలు, పల్లెలు, పట్నాలు తిరిగి ప్రబోధించాడు.

కుల, మత, వర్గ, వర్ణ వివక్షతల్ని వ్యతిరేకించాడు. బానిస త్వాన్ని అసమానత్వాన్ని ఖండించాడు. దేవతా ప్రీత్యర్థం యజ్ఞ యాగాది క్రతువుల్ని, జంతు బలుల్ని నిరసించాడు. యుద్ధాలు – హింసాకాండ కూడదన్నాడు. దుఃఖకారణం తెలుసుకుని, దాన్ని నిర్మూలించ యత్నించమన్నాడు. ఆ విధంగా జనసామాన్యానికి చెపుతూ, వారికి చేరువఅవుతూ, తనను అనుసరించేవారిని ఉద్దేశించి, "మీరు దేనిమీదా ఆధారపడక, మీ కాళ్ళమీద మీరు నిలబడండి. ప్రార్థించి- వేడమాడినంతమాత్రాన, పాపపరిహారం కాదు. శీలం,

సమాధి- ప్రజ్ఞ అనే మూడూ జీవితంలో ముఖ్యంగా కలిగివుండ వలసిన సంగతులని చెప్పారు. శీలమంటే, పవిత్ర ఆలోచనలు. సమాధి అంటే, సరైన ఏకాగ్రత. ప్రజ్ఞ అంటే, సంపూర్ణ ఎరుక. ఆ ఎరుకే, జ్ఞానప్రకాశం. శీలానికి-సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం- Livelihood సమాధికి- వుండాలి. సమ్యక్ ప్రయత్నం, సమ్యక్ స్మృతి, సమ్యక్ ఏకాగ్రత-వుండాలి.

ప్రజ్ఞకు-సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం వుండాలి.

కనుక శీల, సమాధి, ప్రజ్ఞ- లేనిచోట, ఆధ్యాత్మికత, ముము క్షత- సుఖేచ్ఛ వుండవు. సంసార దుఃఖనివారణకు ఉపాయంగా, మొదలు శీల సంపత్తి-[Morality], ఆపిమ్మట సమాధి [చిత్తైకాగ్రత] ఆ తర్వాత- ప్రజ్ఞ [wisdom] ఆ క్రమంలో సాధన చేయాలి. చిత్తైకాగ్రత- ప్రజ్ఞను, ఆవిష్కరింప జేయడానికేగాని, ఇతరములైన సిద్ధులు సంపాదించడానికి ఉద్దేశింపపడలేదు.

"శీల, సమాధి- ప్రజ్ఞ ఆ మూడింటికీ మూఢభక్తి, అంధ విశ్వాసాలు పనికిరావు. నిర్భయంగా, వాస్తవదృష్టితో - వివేక జ్ఞానంతో కూడిన సాధనే, నిర్వాణప్రాప్తికి సహాయపడుతుంది. సరైన దృక్పథం వున్నవాళ్ళు, జీవితంలో నిర్వాణపథాన్ని అందుకో గలరు" అన్నాడు.

బుద్ధుడు సూచించిన అష్టాంగమార్గం. అందరికీ అందు బాటులో వుండి, ఆచరణయోగ్యంగా వుండటంచేతా, బౌద్ధసంఘంలో అందరికీ ప్రవేశార్హత వుండటంచేత, బౌద్ధం త్వరలో నలుదిక్కు లకూ వ్యాపించింది. గౌతమబుద్ధుని కీర్తి దశదిశలా వ్యాపించింది. ఆయన ప్రజలమధ్య తిరుగుతూ, ప్రజాభాష అయిన పాళీ భాషలో ప్రసంగిస్తూ- అంతిమసత్యాన్ని- నిర్వాణపథాన్ని ధర్మాచరణాన్ని చక్కని కథలుగా బోధించడంచేత సామాన్యప్రజలు కూడా దీక్ష తీసుకుని ఆయన్ని అనుసరించారు. బుద్ధుని బోధలు వినడానికీ,

ఆయన్ని స్వయంగా దర్శించడానికి ప్రజలు మారుమూల ప్రాంతాల నుంచీ, తండోపతండాలుగా ఆయన ఎక్కడవుంటే అక్కడకు- అడవుల్లో, ఆలయాల్లో, మైదానాల్లో, పట్నాల్లో- పల్లెల్లో- పనిపాటలు మాని వెళ్ళేవారు. ఆయన్ని చూసి విస్మయం చెంది విని, తన్మయులై పరివర్తనం చెందేవారు.

కాని, కొందరు- పరమతస్థులు- పరమచాందసులు, చాదస్తులు- సనాతనులు- బ్రాహ్మణులు- సాంప్రదాయవాదులు బుద్ధుణ్ణి వ్యతిరేకించారు. అయినా ప్రతిఒక్కరూ ఆయన పవిత్ర- ప్రశాంత వదనం మీది విషాదరేఖల్ని చూసి విస్మయంచెంది- ప్రక్కకు తొలగేవారు. ఆ రోజుల్లో మతగురువులకూ, పీఠాధిపతులకు- తమ నివాసం వదలి బైటికి వెళ్ళవలసిన అవసరం లేదు. వారూ వెళ్ళేవారుకాదు. అది ఒక సాంప్రదాయకరమైనది వాళ్ళకు. కాని, ప్రజలమీద ప్రేమచేత బుద్ధుడు వారిదగ్గరకు వెళ్ళి- తనకుతెలిసిన సత్యాన్ని బోధించేవారు వర్షాకాలం నాలుగునెలలూ, పరివ్రాజకులంతా ఒకచోటచేరి, ప్రజలను చల్లని ధర్మామృత పూరమున దేల్చి, సంసార గ్రీష్మతాపమును తొలగించేవారు. దానినే చాతుర్మాసవిధి అనేవారు. ఆ నాలుగు నెలలూ, చాలావరకు ధ్యానంతో గడిపేవారు.

మనసులేని స్థితే, ధ్యానం. అది స్వచ్ఛమైన, నిర్మలమైన స్థితి. అదే చైతన్యం ప్రజ్ఞ. అంటే, ఇతరమైనది ఏదీ వుండని స్థితి. మన ప్రజ్ఞలో- చైతన్యంలో- జ్ఞానంలో- ఎంతో చెత్త, చెదారం, అంటే, ఆలోచనలు, కోర్కెలు, వాంఛలు, తృష్ణ- స్మృతులు, భయాలు, దురాశలు, దురభిమానాలు, ద్వేషాలు, తికమకలు, ఘర్షణలు, ఆతృతలు, ఆరాటాలు. వేదనలు, యాతనలు, పక్షపాతాలు- ఇట్లా ఎన్నింటితోనో మన మనసు నిరంతరం కదులుతూ వుంటుంది. అంటే, దర్పణం మకిలితో కప్పబడ్డట్లు వుంటుంది, ఏదీ స్పష్టంగా కనపడకుండా.

జాగ్రత్-సుషుప్తి- స్వప్న- మూడు అవస్థల్లో మనసు పని చేస్తూనే వుంటుంది. గతం, సాయంతో అది భవిష్యత్తుకు ప్లాన్ చేసుకుంటుంది. సదా భూతభవిష్యత్తుల్లో సంచరిస్తూ వుంటుంది. అటువంటి వికల్ప- వృత్తులవల్ల, మనసు అలసిపోవడం, శక్తి వృథా కావడం తప్ప మరి ఎటువంటి ప్రయోజనం లేదు. కాబట్టి, మనోకదలికను గమనించి, దాన్ని వర్తమానంలో నిలిపితే రాగ, ద్వేష, మోహ సంసారబంధాలు తెగిపోతాయి. అంటే, అది- ఆలోచనలు ఆగిన స్థితి. మనోకదలికలు లేనిస్థితి, అప్పుడు మనం పూర్తి నిశ్చలంగా, నిర్మలంగా, నిశ్శబ్దంగా వుంటాం. నిశ్చలమనస్సు అంటే, సాగే ఆలోచనలకు సాక్షిగా, చైతన్యవంతంగా వుండటం. ఆ మౌనావస్థే ధ్యానం. ఆ మహామౌనంలోనే సత్యం వ్యక్తమౌతుంది. ఇంక మరే విధంగానూ కాదు. మనసును తాత్కాలికంగా అణచినా, పక్కన పెట్టినా, అది సరైన ధ్యానం కాదు.

ధ్యానమంటే, గతించిపోయే వాటన్నింటికి సదా ఎరుకలో వుండటం. ఆ ఎరుక, స్థిరంగా నిలిచి, లోతుగా వెళ్ళేకొద్దీ, క్షణాలు గడిచేకొద్దీ- మనసు మరీ నిశ్చలమౌతుంది. అప్పుడు అసలు మనం ఏమిటో, మనకు తెలుస్తుంది. అప్పుడే ధ్యానం మన సహజస్థితిగా మిగులుతుంది. అప్పుడే నిజమైన అనుభూతి కలుగుతుంది. అదే జీవితంలో కనుక్కోవలసిన, ఆనందదాయకమైన సంగతి. అటువంటి ధ్యానం, జీవితంలో ఒకభాగం.

ధ్యానమంటే, సంకల్పరహితస్థితి. అకర్మస్థితి.

బంధరహితస్థితి- ఆ క్షణంలో నిర్నిబంధంగా వుండటం. ధ్యానమంటూ ఒకటి విడిగాలేదు. మనమే ధ్యానం. మన ఉనికే ధ్యానం. ధ్యానపద్ధతులన్నీ, మన సహజ సుఖజీవితాన్ని కలత చెందించేవే....ధ్యానం నిజజీవితంనుంచి పలాయనం కాదు.... నిజ జీవితంలోకి ప్రవేశం. ఎందుకంటే, దాన్నించి మనసు పలాయనం

పోతుంది. కోర్కె, జీవితంనుంచి పలాయన పోతుంది. కోర్కెల, వాంఛల, ఆలోచనల మనసునుంచి, పూర్తిగా బైటపడటమే, ధ్యానం నైష్కర్మ్య-ధ్యానంలో దృష్టి- అవగాహన సంతోషం- ఆనందం. అంటే, ఎరుకతో నిశ్శబ్దంలోకి, నిశ్చలత్వంలోకి జారుకోవడం-అటు వంటి ధ్యానంలో, సమస్యలు వుండవు. సమస్యలు అదృశ్యమౌతాయి.

వర్తమానంలో, అదీ ఆ క్షణంలో, జీవించడమే ధ్యానం. అంటే ధ్యానం కాలదూరాల్లో ప్రయాణంకాదు. ధ్యానం ఒక అనుభవంకాదు....ఆ క్షణంలో సాక్షికి ఎరుకలో వుండటం-దానికి ఎటు వంటి తొందరలు, ఆర్భాటాలూ లేవు.

విశ్వరహస్యాలకు ద్వారం తెరిచేందుకు, ఉపయోగించే తాళం చెవే, ధ్యానం. ధ్యానం తెలిసినవాడు, ఏ క్షణంలోనైనా ఆ స్థితికి వెళ్ళగలడు. బస్సులో ప్రయాణంచేస్తున్నా- తింటున్నా- పూరికే కూర్చున్నా- అంతర్యంలో ప్రవేశించడం, ధ్యానం. అంటే, జీవన మూలం చేరినట్లే. దానికి బాహ్యంగా ఎటువంటి విలువా, గుర్తింపూ వుండదు. అది ప్రకటనకు అందని సంగతి. దానివల్ల ఒక్కటే ప్రయోజనం- మనం స్వేచ్ఛగా-నిర్భయంగా వుండగలం.

ధ్యానమంటే, మనం పూర్తిగా లోపలా, బైటా ఒకేవిధంగా వుండటం. అటువంటి ధ్యానం, సుస్థిరమైనప్పుడు, ఇంక అది వదలిపోదు. మనం ఏ పనిలో నిమగ్నమైనా, ధ్యానం సాగిపోతూ వుంటుంది, అప్రయత్నంగా. నిద్రలో సైతం, అది కొనసాగుతూ వుంటుంది. సాధకునికి స్వాభావికమైపోయేటంతగా, ధ్యానం స్థిరమైపోవాలి.

మనసు చేసే పెద్ద సాహసమే, ధ్యానం. ధ్యానం, ఒక్క మనసును మాత్రమే చంపగలదు. మనసు ఎక్కడ, ఎప్పుడు అంతం అవుతుందో-అప్పుడు- అక్కడ ధ్యానం ఆరంభమౌతుంది.

మనో వ్యాపారంలేని ఆ ధ్యానమే మౌనం. అంటే, మనసును స్వాధీనం చేసుకునే యత్నమే ధ్యానం.

ధ్యానపద్ధతులు మొదట్లో నరకం, యాతన, కృంగిపోవడం, తికమక, ఆందోళన కలిగించినా, చివరికి ఆనందోత్సవంగా వుంటుంది. అటువంటి ధ్యానాన్ని చాలా మంది చేయలేరు. ధ్యానం, ఒక ఔషధం వంటిది. అది భవరోగనివారిణి.

ప్రేమ లేనిది ధ్యానం సాధ్యంకాదు. ప్రేమ కలిగినవాడు, నీళ్ళతో నిండిన నల్లని మేఘం వంటివాడు. విచక్షణారహితంగా అన్నింటిపై వర్షం కురుస్తుంది. తన భారాన్ని తగ్గించుకోవాలను కుంటుంది.

ధ్యానమనేది బౌద్ధులతో మరింత ప్రాపకంలోకి వచ్చింది. చాతుర్మాసం నాలుగు నెలలూ, బౌద్ధభిక్షువులంతా ఒకచోటచేరి-ధర్మం బోధిస్తో ధ్యానం చేసుకుంటో కాలం గడిపేవారు. అహాన్ని పూర్తిగా ఊడ్చి పారేసుకోవడానికీ, తానుగా తనను అధిగమించడానికీ ధ్యానమొక్కటే మార్గమని వారి భావన. ఆ నాలుగు నెలలూ వర్తకులు - ధనవంతులు - రాజులు - గృహస్థులు-బుద్ధునికీ, ఆయన అనుచరులకూ, శిష్యులకూ, భక్తజనానికి - అందరికీ ఆహార - వసతి సౌకర్యాలు భక్తి శ్రద్ధలతో తమ తమ పట్టణాలలో - పల్లెలలో ఏర్పాటు చేసేవారు.

*  *  *

ఎవరైనా నిత్యజీవితంలో ధర్మాన్ని అనుష్ఠించాలంటే, అలవాటైన ఆలోచనా విధానాన్ని లాగి, బైట పారెయ్యాలి. అలుపు లేకుండా ధర్మం కోసం అన్వేషించాలి. ఆ ధర్మాన్ని ఔదార్యంతో పంచుకోవాలి నిత్యజీవితంలో, భావాల్లో, తలంపుల్లో పవిత్రత, నమ్రత, నిగర్వం వుండాలి.

దుఃఖాన్ని నివృత్తి పరచడమే, ధర్మం. కరుణే ధర్మం. పరుల క్షేమం కోసం అన్నీ భరించడం ధర్మం. సమచిత్తమే, ధర్మం దానికి అయిష్టత, పక్షపాతం పూర్తిగా అంతంకావాలి. దారి తప్పకుండా నిష్కపటంగా వుండటమే, ధర్మం. ధ్యానమే ధర్మం. దయార్ద్రమైన ప్రేమే, ధర్మం. ఆనందమే ధర్మం. పూర్తి నిశ్చయంతో కూడిన సింహగర్జనే ధర్మం. సహజమైన మనసు కలిగివుండటమే, ధర్మం. అమనస్కస్థితే, ధర్మం. కదలిపోతున్న రూపాల ప్రమేయం లేకుండా వుండే దర్పణం వంటి మనసువున్నప్పుడు వున్నదే, ధర్మం. అది, అప్రమేయస్థితి. అన్నింటికీ కావలసిన రక్షణ, వసతి ఇచ్చే ఆకాశంవంటి మనోరహితస్థితే, ధర్మం ఒక్కమాటలో చెప్పాలంటే, అనంత ఆకాశం వంటిది ధర్మం.

* * *

బుద్ధుడు కాశీలో వుండగా "యశుడు – లేక - యాస - లేక జసు" అను ధనవంతుడైన యువకుడు - వర్తకుడు. బుద్ధుని దగ్గరకు వచ్చాడు. అతడు కామ భోగ పరాయణుడు. సుఖలాలసపరుడు. చివరికి కామ కలాపాల్లో విరక్తిచెంది. బుద్ధుని గురించివిని, ఆయన్ని ఒక అర్ధరాత్రివేళ దర్శించడానికి వెళ్ళి - "స్వామీ, జీవితంలో ధనం – సుఖలాలసత్వంకాక ఇంకా ఏదైనా - ముఖ్యమైనది వున్నదా?" అని అడిగాడు. అతనితీరు - వైఖరి, ప్రశ్నలోని పట్టు గమనించి, అతనికి కావలసిన ధర్మోపదేశం చేశాడు. బుద్ధుడు. దానితో అతనికి శాంతి లభించింది. "బ్రహ్మచర్యం పాటించకపోయినా, ధర్మంగా ధనం సంపాదించకపోయినా ప్రజలు నశింతురు" అని బుద్ధుడు చెప్పగా, యశుడు పరివర్తనంచెంది–బౌద్ధ సన్యాసియై, గుండుచేయించుకుని, కాషాయంకట్టి, భిక్షాపాత్ర ధరించి – ఇంటికి వెళ్ళక బుద్ధునితో వుండిపోయాడు. అతనికి కామవాసనల దుష్పరిణామం, నిష్కామతత్వ మహిమ, జరామరణాది దుఃఖాలకు మూలం - ప్రపంచ అశ్వరత్వం - నిర్మల నిత్యనిర్వాణానందం గూర్చి బోధించెను.

ఎన్నాళ్ళకు ఇంటికి తిరిగిరాని తమ కొడుకు యశుని వెతు క్కుంటూ అతని తల్లి - తండ్రులు — భార్య కాశివచ్చి — బుద్ధుని దగ్గరకువెళ్ళి - యశుని చూసి బుద్ధునితో మొరపెట్టుకున్నారు. దానికి బుద్ధుడు, "మీ కుమారుడు గతజీవితం గడపడం మీకు సమ్మతమా?" అని అడగ్గా, "వద్దు ఆ రకమైన జీవితం వద్దు," అన్నారు, ఏక కంఠంతో. దానికి బుద్ధుడు - "మీ కుమారుడు బౌద్ధ సన్యాసి అయ్యాడు." అని చెప్పి — వారికి కూడా బౌద్ధధర్మం బోధించాడు. అది విని, వారు కూడా బౌద్ధం స్వీకరించారు. బౌద్ధో పాసకులయ్యారు. వారితోపాటు యశుని మిత్రులు నలుగురు - సుబాహు, పుణ్ణజి, గార్బతి, విమల," అనే వారూ సంఘ సభ్యులై నారు. యశుని తల్లి - తండ్రులు బుద్ధుని తమ ఇంటికి భిక్షకు ఆహ్వా నించి తీసుకువెళ్ళారు. వారికి చతుస్సత్యాల్ని — సద్ధర్మమును చెప్పాడు.

యశుని తల్లి — భార్య సంఘంలో చేరడంతో — మొదటి భిక్షుకి సంఘం ఏర్పడింది. ఆ తర్వాత ఉగ్రసేనుడు అనే దొమ్మరి వానిని సంఘంలో చేర్చుకున్నాడు. వానితో కలసి సంఘ సభ్యుల సంఖ్య అరవైకి పెరిగింది. ఆ తర్వాత దీక్షతీసుకుని, భిక్షువులై సంఘంలో చేరినవారు నిర్వాణ ధర్మానికి — ఆ ధర్మాన్ని తెలుసు కుని లోకానికి తెలియజెప్పిన బుద్ధునికి— ఆ ధర్మాన్ని ఆశ్రయించి- అనుభవంలోకి తెచ్చుకుంటున్న భిక్షుక సంఘానికి శరణు జొచ్చ నారంభించారు. బౌద్ధ ధర్మప్రచారానికి బుద్ధుడు స్థాపించిన సంఘ మది.

బుద్ధుడు స్వయంగా శిష్యులకు దీక్ష ఇచ్చేవారు. ఆ సమ యంలో "ఓ భిక్షూ, రా!" అని పిలిచి, దీక్ష ఇచ్చేవారు. సంఘ సభ్యులందర్నీ లోకంలోకి వెళ్ళి ధర్మం బోధించమనేవారు.

సౌశీల్యంతో కూడిన జీవితం గడపమనేవారు. సంఘ సభ్యు లను ఉద్దేశించి— "మీరంతా కలసి, మెలసి, అన్యోన్యంగా —

ప్రేమగా జీవించండి. ఒకరికొకరు సహాయం చేసుకోండి. హాయిగా, ఆనందంగా వుండండి. అదే సౌభ్రాతృత్వం. అదే సంఘం. ఆ సంఘం అందరినీ ఒకటిగా చేరుస్తుంది - కూరుస్తుంది - కలుపుతుంది. ప్రేమ భావం, సోదరభావం — సమత్వం పెరుగుతుంది. బుద్ధునిలో — ధర్మంలో — సంఘంలో శరణు పొందండి." అన్నారు గొప్ప దయతో. ఆ విధంగా ఆయన తన హృదయాన్ని విశ్వ హృదయం ముందు తెరిచారు.

సంఘ సభ్యులు ధర్మం బోధించడంతో, ఎంతోమంది బౌద్ధ సంఘంలో చేరారు. బుద్ధుని ఆదేశానుసారం వారు, కొత్త వారికి దీక్ష ఇచ్చేవారు. దీక్ష తీసుకునేవారు — ముందు ముండనం చేయించుకుని, కాషాయం కట్టి —" బుద్ధం శరణం గచ్ఛామి- ధర్మం శరణం గచ్ఛామి - సంఘం శరణం గచ్ఛామి" అనే మంత్రాల్ని ముమ్మారు ఉచ్ఛరించాలి.

భిక్షువు అహింస, అసత్యభాషణ, వ్యభిచారం మద్యపానం మొదలైన దోషాలకు దూరంగా వుండాలి. బ్రహ్మచర్యం పాటిస్తూ మితాహారం తీసుకుంటూ విలాస వినోదాలకు దూరంగా వుండాలి. సుగంధ ద్రవ్యాలు, విలువైన వస్త్రధారణ - ఆభరణాలు, పూల మాలలు ధరించుట మొదలైన అలంకార ఆడంబర వస్తువులయెడ ఆసక్తి కూడదు. సుఖశయ్య, చిత్తనిరోధం. శరవేగంతో విషయాల మీదవాలే అలవాటు పోవడం - ఇవి భిక్షువు లక్షణాలు, సచ్ఛీలం- సత్యవాక్ పాలన, లేనివాడు ముండనం చేయించుకున్నంత మాత్రాన భిక్షువు కాలేడు. దేహేంద్రియాలు, మనసు అదుపులో పెట్టుకుని తననుతాను చక్కగా నియమించుకొనువాడు ప్రజ్ఞా సాధనాలైనా ధ్యానాది అభ్యాసములందు ఇష్టం చూపువాడు - శాంత చిత్తుడు - ఏకాకి - సంతుష్టుడు అట్టివానిని భిక్షువంటారు.

ధర్మమార్గం, సమదృష్టి, దృఢసంకల్పం, సత్కర్మాచరణ, మితభాషణ, సహజీవనం అవే సత్యప్రాప్తికి సాధనాలు. దానినే

"సమ్యక్ యత్నం" అంటారు. వర్తమానంలో నిలిచి, జీవించడం బాహ్యేంద్రియాల స్మృతి లేకుండా నిరోధం లేని ధ్యాననిష్ఠలో వుండుటయే 'సమ్యక్ సమాధి'. మనసు ప్రక్షాళనమైతే, ప్రతి ఒక్కడూ బుద్ధుడు అవుతాడు. సర్వక్లేశ ప్రక్షాళనమే ధర్మం. సర్వం పరిత్యజించినవాడే భిక్షువు. అటువంటి భిక్షువు, పాపపూరితమైన కోర్కెలు విసర్జించాలి. కఠోర నియమనిష్ఠలు మానాలి. వజ్రసంకల్పంతో కూడిన పరమలక్ష్యం వున్నవాడే దుష్కామములు పోతాయి. ఆ కామంతో చివరివరకు ద్వంద్వ యుద్ధం చేయాలి. సదా సంతృప్తులై వుండాలి. ఇతరుల సొమ్ము ఆశించకూడదు. వేళకానివేళ భిక్షకు వెళ్ళరాదు. జీవకారుణ్యం కలిగివుండాలి. భిక్షలో ఒకభాగం పశు పక్ష్యాదులకు, ఒకభాగం తాను తీసుకోవాలి.

* * *

ఆ వర్షాకాలానంతరం బుద్ధుడు నిరంజార నదీప్రాంతమైన ఉరువేల వైపు వెళ్ళారు. దారిలో ఒక చిట్టడవి మధ్య, ఒక చెట్టు కింద కూర్చున్నారు. ఆ ప్రదేశం అందమైనదని అక్కడకు దగ్గరలో వున్న ఒక పట్నంనుంచి ముప్పైమంది యువతీయువకులు- భార్యా-భర్తలు- ధనవంతులు విలాస, వినోద యాత్రకు వచ్చారు. వారిలో ఒకతనికి భార్యలేదు. అతను తనకు జంటగా ఒక వేశ్యను తీసుకొచ్చాడు. అందరూ ఆనందకేళీ విలాసాల్లో మునిగివుండగా, ఆ వేశ్య- అతని విలువైన సొత్తు అంతా అపహరించి పారిపోయింది. ఆ సంగతి తెలిసి- వారంతా కలసి- ఆమెకోసం అడవంతా గాలించి వెతుకుతూ వుండగా వారికి బుద్ధుడు కనుపించాడు. వారు ఆయన దగ్గరకు వెళ్ళి, "స్వామీ, ఇటు ఎవరైనా ఒక స్త్రీ వచ్చిందా? ఆమె మా సొమ్మంతా అపహరించి, పారిపోయింది" అన్నారు.

దానికి బుద్ధుడు, "నేను ఏ స్త్రీని చూడలేదు. కాని, కామినీ-కాంచనాలకోసం అన్వేషించడం కన్నా, తమనుతాము వెతుక్కొని

పట్టుకోవడం మంచిది కదా?" అన్నాడు. ఆయన మాటలు విని వారంతా నిర్ఘాంతపోయి- ఆయన చుట్టూ చతికిలపడ్డారు. ఆయన వారికి తత్త్వోపదేశం చేశాడు. ధర్మం బోధించాడు. వారిని అర్హతులను చేసి ధర్మప్రచారం చేయమన్నాడు. వారంతా బౌద్ధసంఘంలో చేరి- ఆయన్ని అనుసరించారు. వారితో ప్రచారకుల సంఖ్య—తొంభై రెండుకు పెరిగింది.

*  *  *

ఉరువేల ప్రాంతంలో ముగ్గురు కాశ్యపసోదరులు వుండేవారు. వారిది కాశ్యపగోత్రం. పెద్దవాని పేరు— ఉరువేల కాశ్యపుడు- రెండవ వాని పేరు-నాదికాశ్యపుడు- మూడవవాని పేరు- గయాకాశ్యపుడు. ఆ ముగ్గురూ సన్యాసులు, అగ్ని ఆరాధకులు- జడధారులు-బ్రాహ్మణ పండితులు- లోకవిఖ్యాతులైన సాధువులు- సర్వసంగపరిత్యాగులు- పరివ్రాజకులు. వారికి వెయ్యిమంది శిష్యులున్నారు. ఉరువేల కాశ్యపుడు జీవన్ముక్తుడని ఆ ప్రాంతంలో ప్రసిద్ధి. ఆ ముగ్గుర్నీ జటిల కాశ్యపులని పిలిచేవారు. అంతటి సాధకులూ-సమస్త సౌఖ్యాలతో ఓలలాడుతూ, సుఖజీవనం గడుపుతూ- "తామే అర్హతులం, ఉన్నతులం" అని చాటుకుంటూ ప్రజలమధ్య డాంబికంగా తిరుగుతున్న వారివద్దరకు ఒకరోజు సాయంత్రం బుద్ధుడు వెళ్ళాడు.

వారు బుద్ధుణ్ణి పరీక్షగా చూసి, అతన్ని పరీక్షించాలని - ఆ రాత్రికి అతనికి వసతిగా ఒక అగ్ని దేవాలయం ఏర్పాటు చేశారు. ఆ ప్రాంతంలో ఒక నాగుపాము వున్నది. దానికి యతులంటే, పరమద్వేషం. వారిని హతమార్చేవరకు అది నిద్రపోదు. "మనం అర్హతులం గనుక ఆ నాగుపాము మనల్ని- మన శిష్యుల్ని ఏమీ చేయదు. ఇటువంటివారిని అది తప్పక హతమార్చుతుంది," అని అనుకున్నారు కాశ్యపసోదరులు. వారి ఏర్పాటుప్రకారం బుద్ధుడు ఆ రాత్రి ఆ అగ్ని ఆలయానికి వెళ్ళాడు.

అర్ధరాత్రివేళ నాగరాజు వచ్చాడు. బుద్ధుణ్ణి చూశాడు. బుద్ధుడే దాని దగ్గరకు వెళ్ళి ధర్మం బోధించాడు. అది, శ్రద్ధగా విని, ఆయన్ని భక్తి–గౌరవాలతో అనుసరించింది. వినయంతో తల వొంచింది.

నాగరాజు బుద్ధుణ్ణి హతమార్చి వుంటాడనే దృఢ నిశ్చయంతో కాశ్యపసోదరులూ, వారి శిష్యులు ఆ ఉదయం అగ్ని ఆలయానికి వెళ్ళారు. బుద్ధుడు ధ్యాననిష్ఠలో ఉన్నాడు. ఆయన పక్కన నాగరాజు కూడా నిశ్చలంగా వున్నాడు. ఆ దృశ్యం చూసి, నిర్ఘాంతపోయి బుద్ధుడు సామాన్యుడు కాడని గ్రహించారు.

బుద్ధుడు వారికి అష్టాంగమార్గం, బౌద్ధధర్మం బోధించాడు. అది విని వారంతా ఆయన శిష్యులయ్యారు. బౌద్ధసంఘంలో చేరారు. బుద్ధుడు వారిని ఉద్దేశించి, "ప్రియమైన భిక్షువులారా, ముందుగా ప్రజ్ఞను సంపాదించండి. ప్రజ్ఞను సంపాదించకుండా, సిద్ధులను సంపాదించారంటే, పెడదారి పట్టినవారు అవుతారు. రాగం, ద్వేషం మోహం అనే క్లేశాలను తొలగించుకుని, సంసారంనుంచి బైట పడండి. సిద్ధులుపొంది, లోకానికి మేలు చేసేకన్నా, ముక్త పురుషుడుగా ఎంతో మేలు చేయగలుగుతారు. ఆ సందర్భంలో బుద్ధుడు ఇలా చెప్పాడు. "దేహమందున్న అశుచిత్వాన్ని భావన చేస్తూ, వైరాగ్యాన్ని పెంచుకుంటున్న వానిని, ఇంద్రియాలను చక్కగా అదుపులో పెట్టుకున్న వానిని, శ్రద్ధా వీర్యములు (ఉత్సాహం) కలవానిని మారుడు కదిలించలేడు. ఎంతపెద్దగాలి వచ్చినా పర్వతం కదలదు కదా?"

అలాగే, మరొక సంగతి చెప్పాడు: సాధకుడు మనసులేని స్థితిద్వారా అజాగ్రత్తను తొలగించుకుని, ప్రజ్ఞాప్రసాదాన్ని ఎక్కి, నిర్వాణసుఖాన్ని పొందుతాడు. ముక్తపురుషుడు నిర్వాణమనే భద్రమైనచోట నిలబడి, వరదలో కొట్టుకుపోయే, అంటే, సంసారదుఃఖితు

లను చూసి, "ఇటురండి, ఇటురండి" అని మహాకరుణతో పిలుస్తాడు," అని వివేకం బోధించాడు.

బుద్ధుడు అక్కడనుంచి "గయాశీర్ష" అనే పర్వతం దగ్గరకు వెళ్ళాడు. ఆయన వెంట కాశ్యపసోదరులు- వారి శిష్యులు - ఇంకా అనేకమంది బ్రాహ్మణ పండితులు- అనేక వర్గాల, వర్ణాల, తరగతుల వారూ వెళ్ళారు. అక్కడ వారందరికీ అగ్నిసూత్రం బోధించారు. అష్టాంగమార్గానికి అడ్డుతగిలేవి - కామాదులు, ఆకామాదులను జయించినవాడే అర్హతుడు - వాటిని జయించకుండా అగ్ని ఆరాధన అర్థంలేని సంగతి.

"అగ్ని" అంటే మామూలు అగ్నికాదు. మనసు, ఆలోచనలు, మానసిక చైతన్యం - మనోచిత్రాలు-ముద్రలు- సర్వేంద్రియ జ్ఞానం, మనసు గ్రహించి తెలుసుకునేవన్నీ "అగ్ని" మీద ఆధారపడి వున్నాయి. రాగ- ద్వేష- మోహాలే అగ్నిజ్వాలలు. విషయేంద్రియ సంయోగంవల్ల, అవి జనిస్తాయి. వాటివల్ల కలిగే ఆనందం, సుఖం, దుఃఖం- తదితర భావాలన్నీ జ్వాలామయములే! అవే - జన్మ-జరా, మృత్యువులవల్ల కలిగే సకల దుఃఖాలకు కారణాలు ఆ అగ్ని జ్వాలలు ఉపశమించాలంటే, విషయేంద్రియ ఆకర్షణలకు లోబడక, నిర్లిప్తులుగా వుండాలి. ఆ జ్వాలలు అణగుతే, నిర్వాణం" అన్నారు. అది విని ఉరువేల కాశ్యపుడు తాను ఆరాధించే అగ్నిహోత్రాన్ని- యజ్ఞయాగాదుల్ని, నిరర్థకములని గ్రహించి, బుద్ధుని శరణు జొచ్చాడు. అతనితోపాటు అతని సోదరులు, శిష్యులు వారిని ఆశ్రయించి శరణు పొందారు.

కాని, ఒకసారి కాశ్యప సోదరులు అతీంద్రియ శక్తుల సంపాదనలో మక్కువ కలిగి - పిప్పహలి కొండగుహల్లో సాధన ప్రారంభించారు. జ్ఞాన సంపన్నుడైన బుద్ధుని పరిచయ భాగ్యం కలిగినా, వారు అతీంద్రియ శక్తులు సంపాదించాలను కోవడం బుద్ధుడు గ్రహించి, అక్కడకు వెళ్ళి, వారిని మంచి మార్గంలో పెట్టాడు.

★ ★ ★

మగధరాజధాని రాజగృహకు కొంచెం దూరంలో "కోలితము-ఉపతిశ్యము" అను రెండు బ్రాహ్మణ అగ్రహారాలు ప్రక్క-ప్రక్కనే వుండేవి. ఉపతిశ్యంలో — సారి పుత్రుడు, కోలితములో మౌద్గల్యాయనుడు - అను ఇద్దరు బ్రాహ్మణ పండితులు వున్నారు. బహు చిత్రంగా వారిద్దరూ ఒకేరోజున జన్మించారు. వారిద్దరూ ధనవంతులు, సహృదయులు, మేధావంతులు, యువకులు. ఆ తర్వాత వారు మంచి స్నేహితులు అయ్యారు. వారు సకల శాస్త్ర పారంగతులు. తమ గ్రామాలలో ప్రసిద్ధులు. వారికి ప్రత్యేకవ్యక్తిత్వం, ఆచారత్వం, శిష్యబృందం వుంది. వారు అగ్ని ఆరాధకులు. వారిరువురు ఒకసారి తమకు చేరువలో ఇంద్రజాల ప్రదర్శన జరుగుతోందంటే వెళ్ళారు. ఆ ప్రదర్శన చూశాక, "ఈ ప్రపంచం కూడా ఒక ఇంద్రజాలం - వంటిదే" అనే స్థిర భావనకు వచ్చారు, అటువంటి భ్రమతో జీవితం గడపడం ఇష్టంలేక, ముక్తిమార్గం అన్వేషించాలని సంకల్పించు కున్నారు. ఆ స్థిర సంకల్పంతో రాజగృహకు చెందిన "సంజయుడు" అనే పరివ్రాజకుని దగ్గరకు వెళ్ళారు, శిష్యులుగా చేరడానికి ఆయన వారికి అజ్ఞేయవాదం బోధించారు. ఆ మార్గం తృప్తినివ్వలేదు. అక్కడనుంచి వెళ్ళి జంబూ ద్వీపమంతా తిరిగారు, గురు అన్వేషణలో, అక్కడా గురువు లభించలేదు. అక్కడనుంచి వెళ్ళి - భారతదేశమంతా తిరిగినా సరైన గురువు దొరకలేదు. వారు చివరికి విడిపోయి చెరొక దారిని వెడుతూ- "తమలో ఎవరు ముందుగా సరైన సత్యమార్గాన్ని తెలుసుకుంటారో-వారు తక్షణమే - రెండవ వారికి ఆ మార్గాన్ని తెలుపవలసివుంది," అనే ఒప్పందం చేసుకున్నారు.

సారి పుత్రుని 'సరస్వతీ పుత్ర' అని కూడా పిలిచేవారు. అతను రాజగృహంలో అస్సాజీ లేక అశ్వజిత్ అనే బౌద్ధభిక్షువును కలుసుకున్నాడు. అస్సాజీవీధి - వీధి తిరిగి బౌద్ధధర్మం బోధిస్తో-భిక్షాటన చేస్తో వుండగా, సారిపుత్ర ఆయన్ని అమితాశ్చర్యంతో చూశాడు. అతని వర్చస్సు - దివ్యతేజస్సు, ప్రసన్నవదనం, పరమ

శాంత గంభీరతకు విస్మయం చెంది - అతని వైఖరి, ప్రవర్తన చూసి అబ్బురపడి, తలవొంచుకుని నమ్రతగా నడచిపోతున్న ఆయన్ని సమీపించి - "ఇతను ఎవరి శిష్యుడై వుంటాడు?" అని అనుకుని- "స్వామీ, తమ గురువు ఎవరు? మీరు ఈ స్థితికి ఎట్లా వచ్చారు? మీ గురువు ఎక్కడ వున్నారు? ఆయన బోధించే ధర్మం ఏమిటి? ఆ మార్గమేదో నాకూ చెపుతారా?" అని అడిగాడు. ఆ అశ్వజిత్ - కౌండిన్యులవారి శిష్యవర్గంలోనివారు. పంచవర్గీయులలో ఒకరు- సారనాథ్‌లో గౌతమ బుద్ధుని బోధలువిని, దీక్ష తీసుకుని- సంచార జీవితం సాగిస్తున్న సమయంలో - సారిపుత్ర కలిశాడు. అస్సాజీసారి పుత్ర వంక ప్రేమగా చూసి, అతని ముముక్షుత్వానికి ముగ్ధుడై, "నేనూ నీలాగే ఒక మహాత్ముణ్ని అడిగితే," సమస్త రాగాది క్లేశాల్ని జయించిన, దుఃఖనిర్ముక్తికి అవసరమైన జ్ఞానాన్ని పొందిన కోరెక్క- రాగంలేని, తృష్ణాక్షయం ద్వారా ముక్తిని పొందిన - సత్యాన్ని స్వయంగా తెలుసుకున్న - నాకు గురువు ఎవరని చెప్పేది?" అన్న మహాత్ముడు గౌతమ బుద్ధుడు. ఇటీవలె ఆయన్ని దర్శించి, దీక్ష తీసుకున్నాను. సర్వజ్ఞుడైన అశాక్యమునిని అను సరించడంకోసం, ప్రపంచాన్ని పరిత్యజించాను. వారు బోధించే ధర్మానికి నేనింకా కొత్త వాడినే. నేను సామాన్య సాధకుడను. ఆయన బోధించిన ధర్మాన్ని నేను నీకు వివరంగా బోధించలేను. కాని, క్లుప్తంగా చెపుతాను. నా గురువైన గౌతమబుద్ధుడు నాకు కార్య-కారణ సిద్ధాంతం గురించి చెప్పారు.

దుఃఖాన్ని - దుఃఖకారణాన్ని- దుఃఖనాశనాన్ని తెలుసుకోలే పోవడమంటే, జన్మరాహిత్య మార్గాన్ని తెలుసుకోలేపోవడమే. అదే అవిద్య. అటువంటి అవిద్యనుంచి సంస్కారాలు– వాటినుంచి విజ్ఞానం- దాన్నించి, నామరూపాలు– వాటినుంచి షడాయాతనాలు అంటే, కళ్ళు-చెవులు– ముక్కు-నోరు- కాయం, మనసు. వాటి నుంచి స్పర్శ-దాన్నించి వేదన– దాన్నించి తృష్ణ- దాన్నించి జన్మ- దానివల్ల జరా- బాధ–మృత్యువు– విలాపాలు–మళ్ళీ జన్మ-

ఇవన్నీ దుఃఖకారణాలు. ఆ చక్రం అనంతంగా తిరుగుతూ వుంటుంది. దాన్నే "భవచక్రం" అంటారు. దృశ్య పదార్థాలు అశాశ్వతాలు దుఃఖరూపాలు. దుఃఖానికి కారణం, తృష్ణ. తృష్ణా నిరోధమే నిర్వాణం. ఈ విషయాలన్నీ మహాశ్రమణుడు, చెప్పాడు" అన్నాడు అసాజీ.

సారిపుత్ర శ్రద్ధగా విని- సంతృప్తి చెంది- తానూ ఆ ముక్తి మార్గదర్శకుణ్ణి దర్శించాలని, "స్వామీ, ఆయన ఇప్పుడు ఎక్కడ వున్నారు?" అని ఆతృతగా అడగగా, "ఆయన ప్రస్తుతం రాజ గృహ సమీపంలో వున్నారు" అన్నాడు.

వెంటనే సారిపుత్ర- తన ప్రియమిత్రుడైన మౌద్గల్యాయనుడు- అతన్నే మగ్గల్లాన- అని పిలిచేవారు- అతని దగ్గరకు పరుగు పరుగున వెళ్ళాడు. మగ్గల్లానా సారిపుత్రను చూసి, "సోదరా, సారిపుత్రా! ఈరోజున నీ ముఖం పవిత్రతతో- ప్రశాంతతతో, ప్రసన్నంగా వుంది. దివ్య తేజస్సుతో వెలిగిపోతోంది. నీవు అమృతసిద్ధి పొందావా? నీ మనసు-అలలు అణగిన మహాసాగరం మాదిరిగా ప్రశాంతంగా వుంది. ఏమిటి కారణం?" అని అడిగాడు. దానికి సారిపుత్ర జరిగిన సంగతి చెప్పాడు. ఆ ధర్మాన్ని విని- పరమ సంతోషాన్ని, శాంతిని పొందాడు మగ్గల్లాన కూడా. ఆ తర్వాత వారిద్దరూ తమ ప్రథమ గురువైన సంజయుని దగ్గరకు వెళ్ళి- నమస్కరించి- "గురూజీ, జరా- మరణముల నుంచి బైటపడే మార్గాన్ని బోధించే సద్గురువును మేము కనుక్కున్నాము. ఆయనే శాక్యముని గౌతమబుద్ధుడు, పావన చరితుడైన ఆ మహాత్ముని మేము దర్శించి, అనుసరించబోతున్నాం. మీరూ రండి" అని అడిగారు. ఆయన అందుకు అంగీకరించక- "చూడండి బాబూ, నేనూ వేలమందికి గురువుగా వున్నాను. అటు వంటి నేను, ఈనాడు మరొకరికి శిష్యుడు కావడమంటే- పెద్దబాన- తటాలున చిట్లి- చిన్నముంతగా మారిపోయినట్లు వుంటుంది," అని,

"లోకంలో వివేకులు బహుస్వల్ప సంఖ్యలో వుంటారు. వారంతర్నీ గౌతమబుద్ధుని చేరనివ్వండి. తక్కిన అవివేకుల్ని నావంటి గురువుల దగ్గర వుండనివ్వండి," అన్నారు వెటకారంగా. అయినా వారిద్దరూ బుద్ధుని దర్శించడానికి వెళ్ళారు. ఆ తర్వాత కొద్దికాలానికే సంజయుడు బుద్ధుణ్ణి దర్శించినట్లు కొందరు చరిత్రకారులు వ్రాసి వున్నారు.

తనను సమీపిస్తున్న సారిపుత్త-మగ్గల్లానలను బుద్ధుడు దూరంనుంచి చూసి, "వారు చాలా ఉన్నతులు. ఆధ్యాత్మిక సాధనలో చాలాముందుకు వెళ్ళినవారు" అన్నారు. అక్కడ చేరిన వారిలో కొందరు బుద్ధుని మాటలు విని, "వారిద్దరూ అనేక సిద్ధాంతాల్ని ఆదరిస్తారు- ఆచరిస్తారు- అనుసరిస్తారు—పాటిస్తారు. వారికి ఎన్నో నమ్మకాలున్నాయి. పాతపద్ధతులు అవలంభిస్తారు. సాంప్రదాయాల్ని పాటిస్తారు," అంటూ వారిద్దరిపై ఎన్నెన్నో ఫిర్యాదులుగా ఒకరికొకరు చెప్పుకోవడం బుద్ధుడు విని, "వారు నాకు కాబోయే ముఖ్య అనుచరులు. తప్పుగా ఆలోచించకండి. మంచి ఆలోచనలు కలిగివుండండి. హృదయాలు పవిత్రంగా వుంచుకోండి" అన్నారు.

సారిపుత్ర- మగ్గల్లానలు బుద్ధుని సమీపించి- సాష్టాంగ నమస్కారం చేసి- "బ్రాహ్మణుడైనవాడు హోమాగ్నిని ఆరాధించునట్లు- పరమధర్మాన్ని- ధర్మపథాన్ని చూసినవానిని గౌరవించునట్లు- నేను అస్సాజీని ప్రేమతో తలచుకుంటాను. ఆయన నాకు- ప్రియాతిప్రియమైన ప్రభువు దర్శనభాగ్యం కలగజేసినందుకు" అంటూ బుద్ధుని ముందు మౌనంగా ధ్యాననిమగ్నులయ్యారు."

సారిపుత్త- మగ్గల్లానలు బుద్ధుని అనుసరించడంలో సంజయుని తక్కిన రెండువందల యాభైమంది శిష్యులూ బుద్ధుని అనుసరించారు.

సారిపుత్త - మొగ్గల్లానలు త్వరలోనే అర్హతస్థానం పొందారు. క్రమంగా బుద్ధుని ప్రధాన శిష్యులుగాను, సంఘాధి పతులుగాను అయ్యారు. కొత్తగా బౌద్ధ సంఘంలో చేరదలచిన వారికి వారు దీక్ష ఇచ్చేవారు, దీక్ష ఇచ్చే అనుమతి బుద్ధుని నుంచి పొందారు. కొత్త సభ్యులకు తగిన శిక్షణ కూడా ఇవ్వమన్నారు వారిద్దరినీ, బుద్ధభగవానులు. మలిన మనస్కుల్ని — నిర్మల మనస్కులుగా చేయాలంటే, చాలా శ్రమ పడవలసివుంటుంది. లోకహితంకోసం సారిపుత్త ఆ భారాన్ని తన మీదవేసుకున్నారు. ఆయన తమను విడవక వెన్నంటి సాధన చేయించడం - కొందరికి ఇబ్బందిగావుండి — బుద్ధునితో ఆయనపై అబద్ధాల ఫిర్యాదులు చేసేవారు. సారిపుత్త సంగతి బాగా తెలిసిన వారు గనుక బుద్ధుడు వారి మాటల్ని నమ్మేవారుకాదు. సౌమ్యంగా, ప్రేమగా వారు తిరిగి సారిపుత్తను చేరేటట్లు చేసేవారు. ఆ సందర్భంలో బుద్ధుడు సారిపుత్తను దృష్టిలో పెట్టుకుని- "కోపం — మొదలగు వికారాలకు లోనుగాక, పృథ్వివలె క్షమాశీలుడైనవాడు, నిర్వికార చిత్తవ్రతుడు. అటువంటి అర్హతుడు తిరిగి సంసార చక్రంలో తగుల్కోడు," అన్నాడు.

సారిపుత్త కొత్త సభ్యులకు బౌద్ధధర్మం బోధిస్తో — "దృఢ నిశ్చయం - అహింసాతత్వం కలిగి వుండండి, - సత్యవాక్కు — సత్ప్రవర్తన - సౌశీల్యం కలిగి సక్రమ మార్గంలో నిత్యజీవితానికి అవసరమైన వాటిని ప్రకృతినుంచి సంపాదించడం — మంచి ప్రయత్నాలు చేయడం — మనసుచేత చురుకుగా పనిచేయించడం - మనోవాక్కాయ కర్మలయందు పరిశుద్ధంగా వుండటం - సరైన ఏకాగ్రత కలిగివుండటం అవసరం," అన్నాడు.

"ఈ మార్గం మనిషిని - నిర్మలత్వానికి - వివేక విజ్ఞానానికీ తీసుకుపోతుంది. ఎటువంటి వారికైనా ఈ మార్గం అనుసరణీయమే. ఇది స్థిర చిత్తంతో కూడిన శాంతి మార్గం. ఇదే సౌశీల్యమార్గం. ఈ మార్గాన్ని విడవకండి. మహాత్ముల జోలికి పోకండి. మహిమలు

చేయడం, మానవాతీతులమని తిరగడం, దివ్యదృశ్యాలు, అతిలోక దృశ్యాలు చూశామనీ, చూస్తున్నామనీ, చూపిస్తామని చాటడం పంటివి చేయకండి. నిజమైన సాధకులు సిద్ధిభావ ప్రకటన చేయరు. దేన్నీ నిగూఢంగా వుంచకండి. మీకు రహస్యాలంటూ వుండ కూడదు.

ధర్మబోధ సుస్పష్టంగా, క్లుప్తంగా వుంచక బహిరంగ పరచండి. జీవితంలోనే విమోచన, శాంతి వున్నాయి. కనుక, మీకు మీరే శ్రమ పడి-నిజంగా, శ్రద్ధగా సాధన చెయ్యండి. ఒకే లక్ష్యం మీద దృష్టి పెట్టి ధ్యానం చేయండి.

అసారమును సారమని, సారమును అసారమని భావించి భ్రాంతిలోపడినవారు ఎన్నడు సారవస్తువును పర్యించలేరు. వారు మిథ్యా సంకల్ప గోచరులు. సారా సార వివేకులను సత్యసంకల్ప వంతులే సార వస్తువును (నిర్వాణమును) గాంతురు" అని, తాము బుద్ధుని ద్వారా తెలుసుకున్న సంగతులు వారికి చెప్పాడు.

వారా విధంగా ఎన్నో సంగతులు చెప్పి, వారిని తిరిగి లోకం లోకి పంపించేముందు - "మీరు ప్రపంచంలోకి వెళ్ళి — పరిపూర్ణం, సంపూర్ణం, పవిత్రం, సత్యవంతం అయిన జీవితం గడపండి. ప్రజా క్షేమం కోసం పాటుపడండి. తలోదిక్కుగూ వెళ్ళండి. కాని, ఇద్దరు కలసి ఒకేదారిన, ఒకేచోటకు వెళ్ళకండి. త్రికరణ శుద్ధిగా ధర్మాన్ని బోధించండి. ఒకేచోట నివాసముంటూ లేకుండా, సదా సంచారం చేస్తూ, ధర్మం బోధించండి," అన్నారు.

బుద్ధుని బోధలో ఏయోగసాధనాలేదు. అది జీవితంనుంచి పలాయన విధానంకాదు. తన కాళ్ళమీద తాను నిలబడి, స్వానుభవంతో విచారణ చేస్తూ, అంతరాత్మ ఆజ్ఞ తు.చ తప్పకుండా పాటిస్తూ అనుక్షణం లోపలా, బైటా - ఏ అరమరికలూ లేకుండా తనను తాను పరీక్షగా చూసుకుంటూ, గతించిపోయే వాటికి సదా

సంపూర్ణ ఎరుకలో వుంటూ ముందుకు సాగడమే బుద్ధుని బోధలోని ముఖ్యాంశం.

*   *   *

"బుద్ధుడు వెయ్యిమంది శిష్యగణంతో, అనుచరులతో సామాన్య ప్రజానీకంతో రాజ గృహకు బయలుదేరి, దారిలో యష్టి వనంలో మకాం చేశాడు. ఆ బృందానికి ఉరువేల కాశ్యపుడు నాయకుడుగా నిలిచాడు. ఆ రోజుల్లో రాజగృహ అనేకమంది పరి వ్రాజకులతో, సంచార సాధువులతో, మహాత్ములతో విలసిల్లేది. గౌతముడు, సర్వసంగ పరిత్యాగియై- పరివ్రాజకుడై రాజగృహకు వచ్చినప్పుడు - బింబిసారుడు ఎంత బ్రతిమాలి చెప్పినా వినక," నా లక్ష్యం సిద్ధించిన తర్వాత రాజగృహకు తప్పకవచ్చి – నేను తెలుసుకున్న సత్యం - మీకు తెలియజేస్తానన్న సిద్ధార్థుడు, ఈనాడు బుద్ధుడై వచ్చాడు.

రాజగృహకు పన్నెండు మైళ్ళ దూరంలో వున్న యష్టి వనానికి బింబిసారుడు తన పరివారంతో వెళ్ళాడు, బుద్ధుణ్ణి ఆహ్వా నించి తీసుకురావడానికి. బుద్ధుని చెంత కాశ్యపసోదరులు వుండటం చూసి, బింబిసారుడు బిత్తరపోయాడు. కాశ్యపుడు గొప్పసిద్ధ పురుషుడని ఆ ప్రాంతంలో గొప్ప పేరు వుంది. అందుచేత, "బుద్ధుడు కాశ్యపునికి గురువా? లేక, కాశ్యపుడు - బుద్ధునికి గురువా?" అనే సంశయం కలిగింది. ఆ సందేహం అక్కడకు వెళ్ళిన వారందరికీ కలిగింది. కాశ్యపుడు వారి మనోస్థితి గమనించి, బుద్ధుని కాళ్ళమీద పడి "ఈయనే నా గురువు. బుద్ధుడు సూర్యుడైతే, నేను ఆయన ముందు మిణుగురు పురుగును," అన్నాడు. అది విని, బుద్ధుడు ఎంతటి మహాత్ముడో వారంతా గుర్తించారు.

ఆ తర్వాత కాశ్యపుడు అక్కడ చేరిన వారిని ఉద్దేశించి- "అగ్ని ఆరాధనలు - కఠిన తపస్సులు - జన్మపరం పరలకు కారణ

మైన తృష్ణను నశింపజేయలేవు. నిర్వాణ ప్రశాంతినికోరి, బుద్ధుని శరణుజొచ్చాను," అని, తథాగతుని పాదాలపై పుళ్ళాపడి, సాష్టాంగ నమస్కారం చేశాడు.

బుద్ధుడు సామాన్యుడు కాడని, ఎంతో విద్వత్తు, మహత్తుకల వాడని గ్రహించి - బుద్ధుణ్ణీ, అప్పటికి అక్కడవున్న వారందర్నీ రాజగృహకు దగ్గరలోవున్న వేలువనానికి ఆహ్వానించాడు, బింబిసారుడు. వేలువనం—బింబిసారుని ప్రత్యేక ఉద్యానవనం. తాను రోజూ బుద్ధుణ్ణి దర్శించాలంటే, పన్నెండు మైళ్ళు వెళ్ళవలసి వుండటంతో-ఆ ఏర్పాటు చేశాడు. ఆ వనంచుట్టూ వెదురు పొదలు వుండటంచేత, దానికి "వేలువనం" అని పేరు వచ్చింది. దాన్నే "వేణువనం" అని కూడా అంటారు. అది—రమణీయమైన ఉద్యాన వనం. బింబిసారుడు పదహారవ ఏట పట్టాభిషిక్తుడై ఇరవై తొమ్మిదవ ఏట బుద్ధుని శిష్యుడై, మరో ముప్పై ఆరు సంవత్సరాలు బౌద్ధ ధర్మం పాటించిన మహాత్ముడు.

కాశ్యప సోదరులు మహాపండితులు, విజ్ఞాన వేత్తలు - మేధా సంపన్నులు. ఎందరికో గురువులు - గొప్ప తపశ్శాలురు. బ్రాహ్మ ణోత్తములు - కావడంచేత ఆ ప్రాంతీయులందరికీ వారి యెడ పూజ్యభావం వుండేది. అంతటివారు బుద్ధునికి సాష్టాంగ నమస్కారం చేసి, అనుసరించారని రాజగృహలోని బ్రాహ్మణవర్గానికి బాధ కలిగింది. అంతేకాక - వారు బౌద్ధ సంఘానికి అధిపతులు కావడంతో కొందరు ఈర్ష్య పడ్డారు.

కాని, బుద్ధుని చూసి భయపడి, తమ బుద్ధులు మార్చు కున్నారు. కాని, బుద్ధుడు రాజగృహకు రావడం, కాశ్యపసోదరులు బౌద్ధం స్వీకరించడం — తమ ఆధిక్యత ఎక్కడ అంతరించుకు పోతుందోననే భయంతో, ఆందోళనతో బ్రాహ్మణులు కాశ్యప సోదరుల్ని వెలివేశారు. బౌద్ధాన్ని నిరాకరించారు. కాని, సారిపుత్త-

మొగ్గల్లానలు బౌద్ధ సంఘంలోచేరి, అందు ముఖ్యులు కావడంతో, బుద్ధుని పేరు మగధ రాజ్యంలో మారుమోగింది. ఏనోట, ఏచోట విన్నా, బుద్ధుని గురించిన కబుర్లే - కథలే - బౌద్ధధర్మాలే జటిలు లైన శ్రమణులు కూడా ధర్మదీక్ష తీసుకోవడం వంటి విశేషాలు ప్రధాన చర్చనీయాంశాలయ్యాయి, రాజగృహలో సనాతన ధర్మంలో గట్టిగా స్థిరపడ్డ కాశ్యప సోదరుల్ని మార్చడం, మహ నీయమైన విషయంగా చెప్పుకున్నారు, ప్రజలు.

బుద్ధుణ్ణి రాజభవనానికి ఆహ్వానించి తీసుకు రావడానికి బింబి సారుడు, పరివారంతో, బ్రాహ్మణ పండితులతో వెళ్ళాడు. బుద్ధుని పక్కన సారిపుత్త-మొగ్గల్లానలు వుండటంచూసి, "మీరు మీ అగ్ని ఆరాధన వదలి బుద్ధుని అనుసరిస్తున్నారా?" అని అడిగితే, "స్వర్గ సుఖాపేక్షతో. అగ్నిని ఆరాధించడం జరుగుతోంది. ఇప్పుడు మాకు అటువంటి వాంఛలేమీలేవు. బుద్ధుని బోధ మమ్మల్ని ఆకర్షించింది. మేము బౌద్ధ ధర్మాన్ని అనుసరిస్తున్నాం," అనగా బింబిసారునితో సహా, అందరూ బుద్ధుని అనుసరించారు.

బుద్ధునికి, ఆయన పరివారానికి ఆ రోజు రాజ భవనంలో గొప్ప భిక్ష ఏర్పాటు చేయబడింది. ఆ భిక్షకు దాదాపు వెయ్యి మందికిపైగా హాజరయ్యారు. భిక్షానంతరం బుద్ధుడు ధర్మోపదేశం చేశారు "మీరు తరచు ఎందుకు అశాంతిగా వుంటారో తెలుసా? తీరని కోర్కెలతో సతమతం కావడంవల్ల. తృష్ణ—వాంఛ - కోర్కె - ఆశ - మొదలైనవి మీలో తీరని దప్పికను కలిగిస్తాయి. కోరింది లభించినా, ఆ దాహం తీరదు. దానితో దుఃఖం - అశాంతి-కోరింది లభించకపోయినా, బాధ, దుఃఖం, అశాంతి తప్పవు. ఏదైనా - దుఃఖం తప్పదు. ఇంక మీ రెట్లా శాంతిగా జీవించగలరు? కనుక ముందు కోర్కెను విడవండి. కట్టెలు చేర్చకపోతే మంటలు అణగి, ఆరిపోవునట్లు కోర్కెలు పెంచకపోతే దుఃఖం అంతరిస్తుంది.

స్వార్థంతో కూడిన ఆశల్ని, అలవాట్లని వదులుకున్నప్పుడే నిజమైన శాంతిని ఆనందాన్ని అనుభవించగలుగుతారు.

ప్రతి ఒక్కరూ తమలో ఒక ఆత్మ వుందంటారు. అది, అతినిగూఢంగా మర్మంగా, అవ్యక్తంగా, అగోచరంగా, అతీతంగా, అంతు తెలీకుండా వుందంటారు. కాని, వారు దేనినైతే "ఆత్మ" అంటున్నారో అది ఆత్మ మాత్రం కాదు.

నామ, రూప ప్రపంచమంతా, రూప పరివర్తనం పొందుతుంది. ఆ ప్రపంచం అస్థిరం. ఆ ప్రపంచానికి ఏదైతే ఆధారభూతమో ఏదైతే మార్పు చెందకుండా స్వప్రకాశమై వుంటుందో – అదే ఆత్మ-అదే పరబ్రహ్మ అంటున్నారు. అవునా?

"ఆత్మ" అనేపదం వేదసంబంధమైనది. అది బ్రహ్మసూత్రాలలోనూ, భగవద్గీతలోనూ బాగా ఉపయోగించబడింది. ఆత్మ అన్నా, పరబ్రహ్మ అన్నా ఒకటే. దాని నిజస్వరూపం తెలుసుకోలేక పోవడమే, బంధం. తెలుసుకోవడమే మోక్షం," అంటుంది ఆధ్యాత్మిక–బ్రహ్మ విద్య.

బహుశా వారంతా అనుకునేది. రూప, వేదన, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానం అనే పంచస్కందాలవల్ల నిర్మాణమైన దాని సంగతి అయివుండాలి. మనిషంటే, భౌతిక శరీరం, భావనలు, స్పందనలు, జ్ఞానం, చైతన్యం మేలోక్కవడం ఉద్వేగ ప్రతి క్రియలు "అనే ఐదింటి మిశ్రమం, అని మరవకూడదు. కాని, ఆ ఐదింటిలో ఏ ఒక్కటీ శాశ్వతాత్మను ఏర్పాటు చేయలేవు, చేయజాలవు. అంటే, భావన, దర్శనం, స్వభావం, గుణం, ఇచ్ఛ, మనసు, విజ్ఞానం - ఏ ఒక్కటీ-లేదా, అవన్నీ శాశ్వత ఆత్మను కల్పించలేవు-ఏర్పరచలేవు. వాటికి భిన్నంగా, అన్యంగా, విడిగా, ఏమీ–ఏదీ లేదు. కనుక వారు అనుకునే "ఆత్మ" అటువంటి మనిషినుంచి పుట్టేది అయితే, అది అశాశ్వతం-అనిత్యం అయివుండవలె. అనిత్యమైనది-అశాశ్వత

మైనది ఆత్మకాదని అందరికీ తెలిసిన సంగతే అయినప్పటికీ" ప్రతి ఒక్కరిలో శాశ్వతాత్మ వుంది, "అనకూడదు," అన్నాడు.

అంతలో ఒకాయన లేచి, "బుద్ధుడు అగ్నిగురించి ఏమంటారు?" అన్నాడు, దానికి బుద్ధుడు, "మనోమాలిన్యాలైన అత్యాశ - దురాశ - ఈర్ష్య - ఆసక్తి — అనురాగం - మమకారం రాగం - మోహం - భ్రాంతి మొదలైనవి భోగేంద్రియాలవల్ల ఆ మాలిన్యాలు పైకిలేచి, విజృంభిస్తాయి. అవి నాశనం కావాలంటే, అగ్నిని ఆరాధించాలి. తద్వారా సంపూర్ణ జ్ఞానాన్ని పొందాలి," అని — అగ్నిని ఆరాధించేవారికి "ఆదిత్య ప్రియాయ" అనేది బోధించారు, ప్రతిదీ అగ్నిమీద ఆధారపడి వుంటుంది. అన్నీ అగ్ని లోంచే పుడతాయి. సమస్త- ఇంద్రియజ్ఞానం అగ్నిమీద ఆధారపడి వుంది. కన్ను - జ్వాలతో నిండివుంది. అలాగే కామాగ్ని నుంచి ఈర్ష్యాగ్ని-ద్వేషాగ్ని, మోహాగ్ని జనిస్తాయి. మనం కంటితోచూసే రూపాలన్నీ, అగ్నిజ్వాలలో వున్నాయన్నమాటే కదా? ఆ రూపానికి సంబంధించిన జ్ఞానం, జ్వాలావృతమే. ఆ రూపాలతో సంబంధం కూడా ఆ అగ్నిజ్వాలలోనే వుంది" అని చెప్పి గంభీరమౌనం వహించాడు బుద్ధుడు.

ఆ రోజు సత్సంగం ముగిసింది.

* * *

ఆ మర్నాడు కూడా భోజనానంతరం బుద్ధుని సత్సంగానికి అనేకమంది పండితులు - మేధావులు — విజ్ఞానవేత్తలు - సామాన్య ప్రజానీకం హాజరయ్యారు. క్రిందటిరోజున అగ్ని గురించి అడిగిన బ్రాహ్మణ పండితుడు మరల ముందుకు వచ్చి, బుద్ధుని తదేకంగా చూస్తూ నిలబడ్డాడు. బుద్ధుడు కూడా ఆయన్ని ప్రేమతో చూసి, "రూపసంబంధాలవల్ల ఆనందం — విషాదం - సంతోషం - దుఃఖం- నిరాశ- జన్మ - ముసలితనం - రోగం - మృత్యువు - ఇన్నీ కలుగుతాయి. అవన్నీ అగ్నిజ్వాలలోనే వున్నాయి. అలాగే, శ్రవణేంద్రి

యం కూడా జ్వాలావృతమే. సమస్త శబ్దతరంగాలూ అగ్నిమీద ఆధారపడి వున్నాయి. ముక్కు, నోరు, సమస్త జ్ఞానేంద్రియాలు అగ్నివల్లనే పనిచేస్తాయి. స్పర్శనీయమైన - ప్రత్యక్షమైన - వాస్తవమైన మనసు - భావాలూ- మనోస్థితి - మనసు తీసుకునే నిర్ణయాలు, ముద్రలు- తలంపులు-అన్నీ అగ్నిజ్వాలమీదే ఆధారపడి వున్నాయి. కనుక మీరు వాటిమీద క్రమంగా అయిష్టత, అసహ్యం-విముఖత తెచ్చుకోవాలి. అవే జీవితాన్ని ఘర్షణలోకీ తికమకలోకీ గందరగోళంలోకీ విషయవాసనలలోకీ ఈడ్చుకు పోతాయి. అందుచేత తీవ్రసాధనతో ఆ వాంఛల్ని పోగొట్టుకోవాలి. కోర్కెలు లేనివాడే, స్వేచ్ఛగా వుండగలడు. అతడే సుఖవంతుడు. అతడే పవిత్రజీవనం గడపగలడు. ఆ సంగతి గ్రహించి, రూప– దృశ్యాలకు ప్రాధాన్యంఇచ్చి-వాటికి లోబడకుండా-మానసిక ఆవేశాలనుంచి విముక్తి పొందండి. అప్పుడు మీరు తప్పక నిర్వాణపథాన్ని పొందగలరు.

నిర్వాణమంటే, జన్మరాహిత్యం. అంటే, జన్మపరంపరను ఛేదించడం. అదే మోక్షం. అది పరిపూర్ణ శాంతస్వరూపం. ఆ స్థితిని అందుకున్న వారిని "బుద్ధుడు" అంటారు.

నిర్వాణమంటే, కాలాతీతస్థితి. అందు నాశనం అనేదానికి చోటులేదు. ఉత్తమ క్రియాపరత్వమే వుంటుంది. నిర్వాణాన్ని పూర్తిగా అవగాహన చేసుకోలేకపోవడంవల్ల మనుష్యులు సూక్ష్మోపాయాలు వెదుకుతారు. అది మూర్ఖమైన సంగతి. దానితో విచిత్రమైన తత్వనిర్ణయాలు-వ్యర్థములైన ప్రసంగాలు తలెత్తుతాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే, తన నిజస్వరూపం తెలుసుకోవడమే, నిర్వాణం. అంటే - రాగ - ద్వేష- మోహరహితులే స్వేచ్ఛని — నిర్వాణాన్ని పొందగలరు. అటువంటివారి మనసు, ప్రేమతో, కరుణతో నిండి శాంతంగా వుంటుంది. నిర్వాణం వంటి కారుణ్యంలో మనసు, అజాతస్థితిలో విశ్రమిస్తుంది. అయినా ఆ మనసు దాచుకోకుండా అందరికీ అనంతంగా ప్రేమను ఇస్తూనే వుంటుంది.

క్షణంలో ఎగిరిపోయే ఈ అశాశ్వతమైనదాంట్లో "ఆరంభం" అంటూ ఏమీలేదు. ఆది లేదుకనుక, అంతమూ లేదు. ఆద్యంతాలు లేనిదే నిర్వాణం. అటువంటి నిర్వాణప్రాప్తికి, జీవితంకాక- తృష్ణ నశించాలి.

నిర్వాణం, అభావస్థితి. కాకపోతే, అది నిత్యసత్యవస్తువు అనే సంగతి అంగీకరించకతప్పదు. అటువంటప్పుడు పుట్టుకలేనిది- అలాగే కల్పించి, ఊహించి, భావించి చేయబడనిది- నిర్ధారింపబడ నిది- అయినటువంటిది, ఒకటి వుండివుండవలెకదా? అటువంటిది లేకపోతే, ఈ జన్మకు పరమార్థం- జీవితానికి తరుణోపాయం లేకుండా వుండేది.

ఐక్యమైపోవడమంటే, శూన్యమై పోవడం కాదు. ఏదీ, ఏమీ మిగలకుండా పోవడమూ కాదు. ఏమీ కాకుండాపోవడమూ కాదు. పూర్తిగా ఖాళీ కావడమూ కాదు. మౌనంలో, ధ్యానంలో తప్ప తెలుసుకోలేని అనుభూతి అది. అదే ఎరుక.

ఆలోచనాసృష్టి ఆగడమే, శూన్యత. అది అవగాహనలోకి వచ్చిందంటే, ఏదో కలిగిందంటూ ఏమీ వుండదు. అలాగే ఏదీ పోయిందంటూ ఏమీ వుండదు.

శూన్యత, బాహ్యరూపం కాదు. సహజస్థితి-శూన్యత-అంతా- సహజంగా శూన్యం. అది- ధర్మంనుంచి విడిగా, భిన్నంగా లేదు- అది ధర్మంనుంచి విడిగా వున్నదంటే- అప్పుడు ధర్మం శూన్యమే అవుతుంది. అది- ధర్మంతో తాదాత్మ్యం చెందింది అంటే, ధర్మం- శాశ్వతం అవుతుంది.

ఆంతర్యంలో అవగాహన అయ్యేదే శూన్యం. అది- ఒకరి నుంచి, మరొకరికి తెలిసే సంగతి కాదు. అది మాటల్లో వ్యక్తపరచ బడేదికాదు. అది పరిపూర్ణం. భావించ- ఊహించ- యోచించ-

కల్పించ శక్యంకానిది. అది అగోచరమైనది. అది వాదానికి అతీత మైనది. అందుచేత ఎంతటివారూ "శూన్యం" అనే పదాన్ని అనేక అర్థాల్లోకి తీసుకోవడమే, జరుగుతోంది. చాలావరకు తప్పుగానే అర్థం చేసుకుంటున్నారు" అంటూ ఆరోజు ప్రసంగం పూర్తిచేశాడు బుద్ధుడు.

ఆ రోజు ప్రసంగం విన్నవారందరూ హృదయభారం తగ్గి, తేలికపడ్డట్టు; పక్షుల్లాగ తేలిపోతున్నట్లు, నిశ్శబ్దంగా, నెమ్మదిగా-బుద్ధుణ్ణి మళ్ళా-మళ్ళా చూస్తూ నిష్క్రమించారు.

★ ★ ★ ★

మూడవరోజు సాయంత్రం- బుద్ధుడు మగధరాజ్య ప్రభుత్వోద్యోగులకు, పరివారానికి, ప్రజలకు అనేక విషయాలు వివరంగా చెప్పారు: ముఖ్యంగా- శీలం, దానం గురించి- ధర్మంయొక్క-సారం-నీతి వర్తన, మానవసంక్షేమం, సౌభ్రాతృత్వం- అందుచేత, మిరుమిట్లు జ్యోతులుగా వెలగాలి. ఇతర ఆధారాలను విడవాలి.

నీతికి మూలం, కరుణ. సమస్త ప్రాణికోటిని దుఃఖం- బాధ-కష్టంనుంచి తప్పించే తరుణోపాయమే నీతి. అదే కరుణ. ఆ కరుణ వల్లనే జీవితంలో పరివర్తనం కలుగుతుంది. పవిత్రత- సాధుత్వం-నిర్మలత్వం- శాంతం- కరుణ కలిగి- స్వార్థచింతన నుంచి బైట పడండి.

ప్రాణంతోవున్న జీవులపట్ల దయాభావం లేనంతవరకు, చేసే ప్రార్థన- ఉపవాసం- జప, తపాలు- యజ్ఞయాగాది క్రతువులు-అన్నీ వ్యర్థమైనవే అగును. కనుక, ధర్మజీవనంతో- వ్యక్తిత్వ-శారీరక- భావన విశ్రాంతిని పెరికేయ్యండి.

దైవంకోసం-దేవతానుగ్రహంకోసం ఎప్పుడూ ఎదురు చూడకుండా, బైటనుంచి ఎటువంటి సహాయం కోసం చూడకుండా-ఎప్పుడూ దేనికీ, ఎవరిమీద- దేనిమీద- దేనికోసం ఆధారపడకుండా

ప్రతిఒక్కరూ- ప్రతిక్షణం తమను తాము- ఏ అరమరికా లేకుండా- ఎటువంటి మరభిమానం, పక్షపాతం, స్వార్థం లేకుండా- లోపలా, బైటా పరిశీలించుకోవాలి- పరీక్షించుకోవాలి- పరిశోధించుకోవాలి. అర్థరహితమైన కర్మాచరణ విడవాలి. కోర్కెల్ని అదుపులో పెట్టుకోవాలి. పాపం, హింస, వాంఛ, మోహం, స్వార్థం మొదలైనవాటికి నిత్యజీవితంలో చోటులేకుండా చేసి, దయ, ప్రేమ, కరుణ, సమానత్వం కలిగి- అందరూ అంతా ఒకటే, సమానమే అనే ఏకత్వ భావంతో- దృఢ సంకల్పంతో- సాధనచేస్తూ- సన్మార్గవర్తనులై జీవించాలి.

అదే అంతర్వీక్షణ- అదే, లోదృష్టి- ఉచ్ఛ్వాస- నిశ్వాసల్ని గమనించడం- మనోకదలికల ప్రకారం, శ్వాస మారుతుంది. దాన్ని గమనిస్తే, ఆలోచనలు అణగి ఆగుతాయి, ఆలోచనలు ఆగితే, మనసు ఆగుతుంది. శ్వాసలో- వ్యవధి ఏర్పడటమే- అందులో ముఖ్యమైన సంగతి- ఆ కాలవ్యవధి- మొదట్లో బహుస్వల్పమైనా, క్రమంగా అధికమౌతుంది.

మనసు ఆగింపంటే అది కల్పించి-భావించి- ఊహించుకున్న ప్రపంచం ఆగుతుంది. అంటే, శ్వాసే జీవితమని తెలుస్తుంది. ఆ అనుభవం, మనల్ని ఎరుకలో వుంచుతుంది. ఆ ఎరుకే ఏకాగ్రత కాదు, మాపధ్యానమూ కాదు. అది కేవలం, సదా గమనిక. ఆ విధంగా సాధన చేస్తే- సత్ఫలితాలు కలుగుతాయి. కానిపక్షంలో, తద్భిన్నమైనవి- నిత్యజీవితంలో తటస్థపడతాయి. అందుచేత అంతర్వీక్షణ కన్నా, తాను కల్పించుకున్న ప్రపంచంలో విహరించడం మేలనుకుంటాడు సాధకుడు సహజంగా.

ఈ ప్రపంచాన్ని అట్లావుంచి- నువ్వు విడిగా, ఏకాంతంగా- ఒంటరిగా వుండు; గతించిపోయే వాటికి సాక్షిగా. దానితో పోరాడకు. దాన్ని ఉపేక్షించు. నిన్నునీవు లోపరుచుకో. ప్రతిదీ— "ఇది నేను కాదు- ఇదీ నేనుకాదు" అంటూ వుండు. అది వున్నా, అక్కున

దది సిలో ఒకభాగంకాక, విడిగా, అన్యంగా వుంటుంది. ఆ స్ఫురణే క్రమంగా వైరాగ్యభావాన్ని బలపరుస్తుంది" అంటూ ఆ రోజు ప్రసంగం ముగించారు.

దప్పికతో వున్నవారికి పవిత్రోదకం దొరికినట్లు- ఆకలితో వున్నవారికి శుచియైన ఆహారం దొరికినట్లు మగధదేశ ప్రజలు తరించేందుకు బుద్ధుడు దొరికాడు. ఆ తర్వాత బుద్ధుడు మగధరాజ్యమంతా తిరిగి, బౌద్ధధర్మం బోధించాడు. అది విన్నవారి అందరి మనసులు- మచ్చ, మరక, మకిలి, మురికి మాపులేని స్వచ్ఛమైన దర్పణాలు మాదిరిగా, ఉతికిన బట్టలు మాదిరిగా వున్నాయి.

బుద్ధుని బోధలు విని బింబిసారచక్రవర్తి బౌద్ధం స్వీకరించి- బుద్ధుని అనుసరించడమే కాక, దేశప్రజల్ని ప్రోత్సహించి- బౌద్ధంలో చేర్చాడు. ఆ శుభసంపర్కంలో వెదురువనాన్ని (వేలువనాన్ని) బుద్ధునికోసం, ఆయన శిష్యులకోసం ఇచ్చేశాడు. బుద్ధుడు దాన్ని తీసుకుంటూ, సముద్దేశ్యంతో ఎవరు- ఏది- ఎక్కడ, ఎప్పుడు ఇచ్చినా తీసుకోవలసిందిగా శిష్యులకు చెప్పాడు.

బుద్ధుడు కొన్నాళ్ళు వేలువనంలో వుండి-రాజగృహాలో వున్న పండితుల్ని, పెద్దల్ని, గురువుల్ని, సాధువుల్ని, సన్యాసుల్ని, మఠాధిపతుల్ని కలుసుకుని- అనేక విషయాలు చర్చించి- తెలుసుకున్నాడు.

బుద్ధుని బోధలు విని బింబిసార చక్రవర్తి ఆయన పరివారం, బంధు-మిత్రులు, దేశప్రజలు బౌద్ధం స్వీకరించడంతో బుద్ధుని కీర్తి త్వరలోనే దశదిశలూ వ్యాపించింది. బుద్ధుడు తమకు అందుబాటులో వుండాలనే ఉద్దేశ్యంతో వెదురువనం ప్రాంతంలో ఒక విహారాన్ని ఏర్పాటు చేశాడు బింబిసారుడు. దాన్నే "జేతవనవిహారం" అంటారు. వర్షాకాలం నాలుగునెలలూ బుద్ధుడు శిష్యులతో- అనుచరులతో ఆ విహారంలో వుండేవారు. అందు- అన్ని సౌకర్యాలూ సమకూర్చ

బడ్డాయి. ఆ సమయంలో అనేక విషయాలు చర్చించి, సంభాషించే వారు.

ఒక పౌర్ణమిరోజు రాత్రి వెన్నెల-వెలుగునీడల్లో బుద్ధుడు ఒక మర్రిచెట్టుకింద కూర్చుని, "ఎవరూ, ఎప్పుడూ, దేనికీ పాపాలు చేయకండి మనసు స్వాధీనంలో వుంచుకోండి. నీతివర్తనులై జీవించండి" అని శిష్యులకు చెప్పారు.

ఆ సమయంలో ఒక ధనవంతుడు బుద్ధునికి "అమరవనం" ఇచ్చాడు. కాని, మగధరాజ్యంలో అలజడి చెలరేగింది: బుద్ధుడు స్థిరపడటంతో, ఆయన శిష్యులు- అనుచరులూ- భక్తులూ- సాధకులూ తమ భార్యాబిడ్డల్ని, తల్లితండ్రుల్ని, సంసారాన్ని - సమస్తం వదలి సన్యాసిస్తున్నారనీ, యువకులు-వివాహాలు చేసుకోవడం లేదనీ, ఇల్లు వదలిపోతున్నారనీ చాలామంది గృహస్తులు బౌద్ధభిక్షువులుగా మారిపోతున్నారనీ, దానికంతకూ కారణం బుద్ధుడేననీ కొందరు దుష్ప్రచారం ప్రారంభించారు. కాని చక్రవర్తే బుద్ధుని శిష్యుడుగావుండగా, ఇంక దేశంలో ఎవరుమాత్రం ఏం చేయగలరు?

మగధదేశం దాదాపు బౌద్ధం స్వీకరించడం చేత, దేశమంతటా ఆరామాలు వెలిశాయి. బుద్ధుడు మగధలో చాలా కాలం వుండి, అక్కడ నుంచి మిథిల-కోసల మొదలైన రాజ్యాలు పర్యటించాడు. ఎందరో ఆయన్ని ఆహ్వానించి తమ తమ దేశాలకు, గ్రామాలకు గృహాలకు తీసుకు వెళ్ళారు. కొన్నిచోట్ల బుద్ధుడే ఆగిన సంగతులూ వున్నాయి. ఆగిన ప్రతిచోటా భవచక్ర సిద్ధాంతాన్ని అష్టాంగ మార్గాన్ని బోధించేవాడు. ఉపనిషత్తుల్లో చెప్పబడే భవచక్ర సిద్ధాంతం వంటిదే, అది కూడా ఎత్తైన పర్వతంమీద నుంచి దూకే జలపాతంవలె, మహాజ్వాలనుంచి లేచి-ప్రసరించే కాంతి కిరణంవలె, సమస్త ప్రజానీకాన్ని ప్రభావితం చేసింది భవచక్ర సిద్ధాంతం. అది ఒక శక్తి. బలమైన భావాలతో లోకాన్నంతా కట్టేసింది, ఆశక్తి.

* * *

ప్రేమ, దయ, ధర్మం, కరుణ, నీతి-మొదలైన విషయాల గురించే బోధిస్తున్నా కొందరు బుద్ధుణ్ణి వ్యతిరేకించారు; ముఖ్యం, బ్రాహ్మణులు - సనాతనులు - సాంప్రదాయవాదులు - మఠాధిపతులు తమ పద్ధతుల్ని, ఆచార వ్యవహారాల్ని, నియమనిష్ఠల్ని—యజ్ఞ యాగాదిక్రతువుల్ని, జంతుబలుల్ని అంగీకరించకపోగా, పైగా వాటిని వ్యతిరేకిస్తున్నాడని వారు గోల చేశారు.

బుద్ధుని సంగతివిని, ఒక దిగంబర సాధువు, "కసాపా" అనే ఆయన, "ప్రతి సన్యాసి గురించి మీరు తక్కువగా - విడ్డూరంగా మాట్లాడుతున్నారని వింటున్నాను, నిజమేనా?" అని బుద్ధుణ్ని అడిగాడు. దానికి ఆయన, "నేను కొన్ని సంగతులు అంగీకరిస్తు న్నాను. కొన్ని సంగతులు ఒప్పుకోలేకుండా వున్నాను. అధర్మంగా, అన్యాయంగా, అసభ్యంగా, అజ్ఞానంగా, అవివేకంగా, త్రికరణశుద్ధి లేకుండా, క్రమ శిక్షణా రహితంగా వున్నవారు - సన్యాసులుగా, శిష్యులుగా అనర్హులు. క్రోధం - ఈర్ష్య — స్వార్థం - మొదలైన గుణాలు లేకుండా, నిష్కామంగా - లోక క్షేమం కోరుతూ - సాధు జీవనం అవలంభించే వారే నిజమైన సన్యాసులు, శిష్యులు—అని నా అభిప్రాయం," అన్నాడు. సమస్తాన్ని ప్రేమతో హృదయానికి హత్తుకోవడమే సన్యాసమనే దానికి సరైన అర్థం. ప్రాపంచిక జీవితాన్ని వదిలేసినప్పుడే, సన్యాసం సాధ్యం. ఆ విసర్జన, భయపడి కాకుండా, పరిపూర్ణ ప్రేమతో జరగాలి - ఆ ప్రేమ - ఏ ఒక్కదానికీ పరిమితం కాకూడదు. ప్రపంచంనుంచి నిష్క్రమించేవారు, సర్వసంగ పరిత్యాగం చేసేవారు - సాధనలో ఎదురయ్యే విరుద్ధాల, విపరీతాల జోలికి పోరాదు," అన్నాడు. అది విని, ఆ దిగంబర సాధువు - బుద్ధునికి ప్రణమిల్లి- "నిజమైన సన్యాసి, నిజమైన సన్యాసి," అనుకుంటూ వెళ్ళిపోయారు.

*   *   *

ఒకరోజున బుద్ధుడు శిష్యులతో కలిసి భిక్షకు వెడితే, ఒకచోట "సిగాలా" అనే ఒక గృహస్థు - భూమికి, ఆకాశానికి, నాలుగు దిక్కులకూ తిరిగి - తిరిగి ప్రదక్షిణ చేస్తూ, నమస్కారాలు చేయడం బుద్ధుడు చూసి, "అయ్యా, తమరు ఆ విధంగా తిరుగుతూ, నమస్కారాలు చేస్తూ ఎందుకు ఆరాధిస్తున్నారు?" అని అడిగితే- "చనిపోయే ముందు, నా తండ్రి నన్ను ఈ విధంగా ఆరాధించమన్నాడు. అందుచేత నేను ఆ విధంగా చేస్తున్నాను-" అన్నాడు స్పష్టంగా. దానికి బుద్ధుడు, "నిజమైన ధర్మంలో - మతంలో జీవించేవారు, ఈ విధంగా చేయనవసరం లేదు," అన్నాడు. "ఎందుకు అవసరంలేదు. అయితే నేనేం చెయ్యాలి?" అని అతడు అడిగాడు. "దుష్ప్రవర్తనను హరించేదే నిజమైన మతం. శీలంలేని, ప్రార్థన నిష్ప్రయోజనం. ఈ సందర్భంలో నువ్వు గమనించవలసిన రెండు విషయాలున్నాయి. ఒకటి - మిత్రులనిపించే శత్రువులు - దోచుకునేవాడు - ప్రగల్భాలు పలికేవాడు - పొగిడేవాడు — వృథా ఖర్చుచేసేవాడు. రెండు- హృదయమున్న నిజమైన మిత్రులు - సహాయకుడు, సుఖ - దుఃఖాల్లో సముడు - చక్కని సలహాదారుడు-సానుభూతి పరుడు.

నువ్వు చేయవలసింది- దుర్గుణాలను వదలడం. అవి: హత్య, దొంగతనం, కామవాంఛ, మోహం. అసత్యం-చెడు- మొదలైనవి. సత్కార్యాచరణ గావిస్తూ సంకల్పశుద్ధి యొక్క అప్రతిమాన ప్రాధాన్యం గ్రహించడం. చివరివరకు పవిత్రం- పరిశుద్ధం అయిన జీవితం గడపడం. మోక్షమనేది- సచ్ఛీలం- సత్కార్యాచరణపై ఆధారపడి వుంది. స్వార్థం విడిస్తే, సమస్తం సంపన్నంగా, సంపూర్ణంగా- కళ్యాణప్రదంగా వుంటుంది. ఏంచేసినా, నిండుమనసుతో చేయాలి. దేనికైనా ప్రయత్నం ముఖ్యం. భావోద్రేకాలు పనికిరావు. సరైన ప్రయత్నం- సరైన ఆలోచనకు దారి తీస్తుంది. పాపకార్యం చేయకపోవడమే, మంచి జీవితం గడపడానికి అవకాశం వుంటుంది. మనసు నిర్మలంగా వుంటే, ధర్మనియమాలతో సాధన అప్రయత్నంగా

సాగుతుంది. అప్పుడు సమస్త ప్రపంచాన్ని ప్రేమతో హృదయానికి హత్తుకుని, ఆనందంగా వుండగలరు" అన్నాడు బుద్ధుడు.

*　　　*　　　*

మగధదేశంలో మహాతీర్థ బ్రాహ్మణుల గ్రామవాసి- పిప్పలీ మాణవకుడు- అతనికి ఇరువదేండ్ల వయసురాగానే తల్లితండ్రులు వివాహం చేయ నిశ్చయిస్తే- వారు జీవించి ఉన్నంతకాలం వారికి సేవచేయడం. తదనంతరం సన్యాసం స్వీకరించడం జీవితలక్ష్యంగా పెట్టుకుని- నిరాకరించాడు. వారు పదే- పదే అడిగేప్పటికి- అతిలోక సౌందర్యవతి లభించినచో వివాహం చేసుకుంటాను అన్నాడు- సాగలనగరంలో "భద్రకాపిలాయని" అనే ఆమె కూడా తల్లి- తండ్రులు వివాహ ప్రస్తావన తెస్తే- తల్లి- తండ్రులకు సేవచేసి వారి అనంతరం సన్యాసిని కావాలనుకుంటున్న సంగతి చెప్పింది. అయినా వాళ్లూ వివాహప్రయత్నాలు చేశారు. చివరికి పిప్పలీమాణవకునికి- భద్రపిలాయనికి వివాహం నిశ్చయం చేశారు. వారిరువురు తమ తమ అభిప్రాయాల్ని ఒకరికొకరు లేఖలద్వారా పంపుకున్నారు. కాని, ఆ లేఖలు తీసుకువెళ్ళినవారు— ఇద్దరు ఒకచోట కలుసుకోవడం జరిగింది, విషయాలు తెలుసుకుని- అనుకూలమైన ఉత్తరాలు రాసి, వివాహం జరిపించారు. వధూవరులిద్దరూ ధనవంతులు. వారు ఒకరికొకరు తమ జీవితోద్దేశ్యాలను చెప్పుకుని, తమ తమ తల్లి- తండ్రులు జీవించి వున్నంతకాలం- లోకులెవరికీ తెలియకుండా అసిధారావ్రతం పాటించి- తర్వాత జుట్టు కత్తిరించుకుని, కాషాయం కట్టి- గ్రామాంతరం వెళ్ళి- చీలిన బాటదగ్గర చెరిఒకదారిని వెళ్ళి- చివరికి బుద్ధుని చేరారు. ఆయన వారికి ధర్మం బోధించాడు. ఆ మాణవకుడే- మహాకాశ్యపుడు.

*　　　*　　　*

ఏడేళ్ళక్రితం ఇంటిని, ఇల్లాలిని, తల్లిని, తండ్రిని- ఏకైక కుమారుణ్ణి, రాజ్యాన్ని, సమస్తాన్ని వదలి వెళ్ళి సిద్ధార్థుడు మగధ

రాజ్యంలో-రాజగృహ సమీపంలో గల వేలువనంలో వున్నాడని తెలుసుకుని, అతన్ని ఏదైనంతత్వరగా చూడాలని శుద్ధోధన మహారాజు ఆతృత పడ్డాడు. వెంటనే కొందరు పెద్దల్ని పంపించి - తాను పెద్దవాడినయ్యానని- చనిపోయేముందు సిద్ధార్థుని ఒకసారి చూడాలని కోరుతున్నానని నా మాటగా చెప్పి, అతన్ని కపిలవస్తు తీసుకురమ్మన్నాడు. అంతేకాదు - స్వదేశవాసులకు తాను తెలుసుకున్న ధర్మం బోధించవలసినదనీ కోరి - ఆహ్వానించి తీసుకురమ్మన్నాడు. వారిలో, రాజపురోహితుని కుమారుడైన ఉదాయుని - చెన్నుడుకూడా వున్నారు. వారంతా వేలువనానికి వెళ్ళి-బుద్ధుని దర్శించి - ఆయన, బోధలు విని- విస్మయం చెంది- కర్తవ్యం మరచి-బౌద్ధం స్వీకరించి సంఘసభ్యులై బుద్ధునితో వుండిపోయారు. ఎంతకీ తిరిగిరాని రాయబారవర్గం సంగతి తెలుసుకుని, శుద్ధోధనుడు మరి కొంతమంది మేధావుల్ని- పండితుల్ని - మంత్రుల్ని పంపించాడు. వారూ వెళ్ళి-బుద్ధుని విని - ఆకర్షితులై - అనుచరులై అక్కడే వుండిపోయారు. వెళ్ళిన ప్రతివారూ పరివర్తనం చెంది - అక్కడే వుండిపోవడంతో, శుద్ధోధనుడు చివరికి బుద్ధుని చిన్ననాటి స్నేహితుడైన "కాలుదాయి"ని పంపించాడు. బుద్ధుడు అతని అభ్యర్థనను - తండ్రి ఆహ్వానాన్ని, ప్రజల కోర్కెను ప్రేమతో తీసుకుని- కపిలవస్తు వెళ్ళడానికి అంగీకరించి- ముందు తనమాటగా కొన్ని విషయాలు చెప్పి పంపించాడు, శుద్ధోధన మహారాజుకు.

తండ్రీ! మీరు మహారాజులు. నిజం. నేను ఇప్పుడు సన్యాసిని. మీది మహారాజ పరంపర నాదిభిక్షుక పరంపర. ఎవరిదారి వారిదే! ఈ జన్మంలో మనం — తండ్రీ - కొడుకు సంబంధంతో కలుసుకున్నాం. ఈ కలయిక ఎక్కువ కాలం వుండదు - మరణానంతరం— ఎవరిదారి వారిదే. నదీప్రవాహంలో అనేక వస్తువులు- చెత్త, చెదారం అంతా, అన్నీ కొట్టుకుపోతాయి. ఏవో రెండు వస్తువులు - ఆ ప్రవాహంలో క్షణకాలం - కలుసుకుని- కొంతదూరం కలిసి ప్రయాణించి— ప్రవాహతాకిడికి- ఎక్కడో విడిపోతాయి. సంసారంలో ఈ జీవుల

స్థితి ఆవిధంగానే వుంటుంది. గతంలో- ఎక్కడెక్కడ వున్నవారో- వచ్చి-ఒకచోట చేరి, ఒక కుటుంబంగా వుండి, కొంతకాలం నాటక మాడి- తిరిగి ఎవరిదారినవారు పోతారు. కాబట్టి విజ్ఞులగువారు ఇట్టి సంయోగ-వియోగాలకు ఏడ్వరు. తనను సిద్ధార్థునిగా తిరిగిరమ్మన్న తండ్రికి- "తండ్రీ! మీరు మరణమనేది సంభవించకుండా చేయ గలరా? ఆ శక్తి మీకు వుంటే, నన్ను ఆహ్వానించండి. పోనీ వ్యసనం— రోగం, ముసలితనం సంభవించకుండా చేయగల శక్తి మీకు వుంటే నన్ను ఆహ్వానించండి. అట్టి అలౌకికశక్తి మీకువుంటే, నేను రావడానికి ఎటువంటి అభ్యంతరం వుండదు. ఎటువంటి విపత్తు సంభ వించకుండా- సర్వకాల సర్వావస్థలలో — సంపదలయందే మునిగి వుండేలాగున చేయగల ధీమా మీకు వున్నదా? ఈ నా ప్రశ్నలకు సమాధానం ఇవ్వండి.

బుద్ధుని ప్రశ్నలు విన్న శుద్ధోధనుడు, తనకుతాను ప్రశ్నించు కున్నాడు. అన్నేళ్ళూ తాను భవిష్యత్తు గురించికాని; మరణం, రోగం, ముసలితనం, విపత్తులు వంటి వాటిగురించికాని యోచించ లేదు. సిద్ధార్థుడు దూరదృష్టితో భవిష్యత్తును సంస్మరించి - మరణం గురించి యోచించి-మృత్యువును జయించాడు.

రవికిరణాలకోసం నిరీక్షిస్తున్న తామరమొగ్గల్లాగ - కపిలవస్తు వాసులు బుద్ధుని దర్శనంకోసం ఆశతో, ఆతృతతో ఎదురుచూస్తు న్నారు. బుద్ధుడు అంగ, మగధ దేశాలకు చెందిన పదివేలమంది శిష్యగణంతో, అనుచరులతో - సాధుసన్యాసులతో, సంఘ సభ్యు లతో, సామాన్య జనసమూహంతో- భక్త - భిక్షుకజనంతో - రెండు మాసాలకు వచ్చి- కపిలవస్తునగర సమీపంలోగల "న్యగ్రోధవనం"లో మకాం చేశాడు. ఆ వనాన్ని శుద్ధోధనుడు ముందుగా బుద్ధుని విడిది కోసం శుభ్రంచేసి వుంచాడు.

అక్కడకు చేరిన మర్నాడు- బుద్ధుని ఆహ్వానించి రాజభవ నానికి తీసుకువెళ్ళడానికి రాజవంశీయులు, సామాన్య ప్రజానీకం -

న్యగ్రోధవనం వెళ్ళారు. వారివెంట శుద్ధోధన మహారాజు బయలు దేరేప్పటికి - ఆయనవెనక బంధు-మిత్రుల- పరివారం- అంతఃపురం అంతా కదిలింది. తమ ప్రియతమ గౌతమమునిని ఆహ్వానించడానికి. బుద్ధుని అద్భుత తేజస్సుకు, ఔన్నత్యానికి పరమానంద భరితు లయ్యారు, వారంతా - బుద్ధుడు వారందర్నీ ఉద్దేశించి, "నేటికి నేను బుద్ధుణ్ణి కాని, నేను- అసలు శాక్యవంశ గౌతముణ్ణి. పూర్వాశ్ర మంలో నా రాజధాని కపిలవస్తు, నాతండ్రి శుద్ధోధన మహారాజు. నా భార్య- యశోధర. నా కుమారుడు, రాహులుడు- ఇరవై తొమ్మి దేళ్ళు మహాసౌధాల్లో మసిలాను- ఆ తర్వాత సత్యాన్వేషణకు వెళ్ళి సత్యం తెలుసుకున్నాను," అన్నాడు.

తనయుని మహనీయతను, అతని నిరాడంబరతను— సమా నత్వాన్ని చూసి, శుద్ధోధనుడు తన్మయుడై, బుద్ధుని కాళ్ళమీద పడి, "నువ్వు- నా కొడుకుగా జన్మించినా, నువ్వు బుద్ధభగవానుడివి. ఇక నిన్ను నా కొడుకుగా భావించను." అన్నాడు.

బుద్ధుడు శిష్యగణంతో పెద్ద ఊరేగింపుగా కపిలవస్తు నగరం ప్రవేశించాడు. శుద్ధోధనుడు ముందుగా రాజభవనం చేరి- పై వరం డాలో నిలబడి- తనకు చేరువ అవుతున్నది తమ కుమారుడైన సిద్ధార్థుడు కాదు, పావనచరితుడు. పరమపవిత్రుడు, సత్యప్రదాత- యావత్ మానవాళికి ధర్మప్రబోధకుడు- బుద్ధుడు-" అని గ్రహిం చాడు. బుద్ధుని నగరప్రవేశం- ఒక పెద్ద శాంతిప్రవాహం మాదిరిగా వుంది. ఆ రోజు నగరమంతా అందంగా, వైభవంగా అలంకరిం చారు. ఇంటింటా- వీధివీధి- పచ్చని తోరణాలు, జెండాలు కట్టి, ముగ్గులు పెట్టారు. ప్రజలంతా సంతోషంతో ఉత్సవదినంగా జరుపు కున్నారు. బుద్ధుడు కాషాయంకట్టి- కర్రచేతబట్టి-భిక్షాపాత్ర ధరించి- తలవొంచి- నెమ్మదిగా- అతి సుకుమారంగా, నగరవీథుల్లో నడచి- రాజభవనానికి వెడుతున్నాడు. ఆయన ముఖం గొప్ప దయకల చిరు నవ్వుతో, దివ్యకాంతులతో వెలిగిపోతోంది.

దారిపొడవునా ప్రజలు- రైతులు- వర్తకులు- ప్రభుత్వోద్యోగులు-సిపాయిలు- గుర్రాలు- ఏనుగులు-బారులుతీరి- నిలబడి వున్నాయి. ఎటుచూసినా గుంపులు, గుంపులుగా జనం- మేడలపై- మిద్దెలపై- గోడలపై- చెట్లపై- గుట్లపై- పల్లెపల్లెల-వాడవాడల జనం తండోపతండాలుగా- ఆయనకుముందు- వెనక-ఇరుప్రక్కలా- గుమికూడి- జయ జయధ్వానాలు చేస్తో- పళ్ళు, పువ్వులు కానుకలుగా సమర్పిస్తో- హారతులిస్తో సాష్టాంగనమస్కారాలు చేస్తో, సంతోషంగా- చిరునవ్వులతో బాటకిరువైపులా బారులుతీరి– ఆనందంతో- అమితాశ్చర్యంతో-విస్తుపోయి తిలకిస్తూ నిలబడ్డారు. వారిలో కొత్తవారు-అపరిచయస్తులు "ఎవరీమహానుభావుడు? శుద్ధోధన మహారాజు కుమారుడు సిద్ధార్థుడేనా. ఇతడు? ఈబుద్ధుడు గౌతముడేనా?" అని అడిగేవారు.

బుద్ధుడు ఇంటింటా భిక్ష తీసుకుంటూ రావడం యశోధర చూసి చాలా బాధపడి- "మహారాజా, వారిని భిక్ష ఎత్తకుండా ఆపండి. వెళ్ళండి. అది చూసి నేను భరించలేను." అన్నది దీనంగా శుద్ధోధనునితో. అతడు గబగబా భవనం దిగి బుద్ధునికి ఎదురేగి, "నాయనా సిద్ధార్థా! నువ్వు నన్ను ఎందుకు ఈ విధంగా కించపరుస్తున్నావు? ఇక్ష్వాకు వంశీయుడవైన నీవు, భిక్ష ఎత్తడమా? ఒక్కనికే కాదు, నీ శిష్యగణానికే కాదు- ఇంకా పదివేలమందితో నువ్వు వచ్చినా- అందరికీ నేను భిక్ష ఇవ్వగలను. అసలు నువ్వు ఎందుకు భిక్షాపాత్ర ధరించావు? ఆభిక్ష ఏదో నువ్వు రాజభవనంలోనే ఎందుకు తీసుకోకూడదు. నువ్వు నన్ను నలుగురిలో, నవ్వులపాలు చేస్తున్నావు?" అన్నాడు.

"మహారాజా, నేను మిమ్మల్ని కించపరచుట లేదు- చిన్నబుచ్చుటా లేదు. అవమానపరచడమూ లేదు. భిక్ష ఎత్తడం, బౌద్ధుల ధర్మం. అదే వారి జీవనాధారం." అన్నాడు వినయంగా.

"అంటే, నీ ఉద్దేశ్యం ఏమిటి? బౌద్ధధర్మం- అనడంలో నీ అభిప్రాయం ఏమిటి? మన క్షత్రియవంశంలో ఎవరూ ఇంతవరకు

భిక్షవెత్తి జీవించలేము. భిక్ష పెట్టారు. అది మన సాంప్రదాయం. నువ్వు చేసేది తలవొంపులు తెచ్చే చర్య," అన్నాడు శుద్ధోధనుడు; జ్ఞానోదయంతో వారసత్వం- సమస్తం అంతరించిపోతాయనే సంగతి తెలియక.

"అవును. ఇది రాజసాంప్రదాయం కాదు. సాధు సాంప్ర దాయం- భిక్ష ఎత్తడం. సన్యాసులు ఆ విధంగానే ఆహారం సంపా దించుకోవాలి. బుద్ధులెవరూ రాజప్రసాదాల్లో నివసించలేరు. భిక్షా టనే చేశారు. మీరు, మీ కలనుంచి మేల్కొండి. లోక- మోహాలు జయించినవాడు, శోకభుజంగాలపాలు కాడు. అస్థిరచిత్తమున- రాగాదులు ప్రవేశించును," అన్నాడు బుద్ధుడు. అని," ఇంక జాగు చేయక- జాగరూకులై వుండండి. మీ మనసులు సత్యం వైపు మర ల్చండి. ధర్మసాధన చేయండి. ధర్మాచరణ పరునికి— ఈ లోకం లోనూ- పరలోకంలోనూ సుఖం వుంటుంది. శాశ్వతానందాన్ని పొందండి," అని నడివీధిలోనే చెప్పి- వారివెంట రాజభవనం వెళ్ళాడు, బుద్ధుడు.

సిద్ధార్థుడు బుద్ధుడై తిరిగి స్వదేశం వచ్చిన సందర్భంలో శుద్ధోధనుడు గొప్ప విందు ఏర్పాటు చేశాడు. భోజనానంతరం బుద్ధుని ముందు బంధు మిత్రులు - దేశప్రజలు, పరివారం - శిష్య గణం-అందరూ నిశ్చలంగా-నిశ్శబ్దంగా కూర్చున్నారు. యశోధర రాలేదు. శుద్ధోధనుడు కబురుపెట్టినా, ఆమె రాక- "నాలో ఏమైనా కించెత్తు ఔన్నత్యంవుంటే, బుద్ధ భగవానులే నా దగ్గరకు వస్తారు. ఆయన్ని నా హృదయ మంతటితో ఆహ్వానిస్తున్నాను," అని సమాధాన మిచ్చింది.

యశోధర సమాధానం విని, బుద్ధుడు, సారిపుత్త మగ్గల్లాను లతో కలసి యశోధర దగ్గరకు వెళ్ళాడు. ఆమె బుద్ధుణ్ణి చూడగానే- పాదాలమీదపడి నమస్కరించింది. ఆమె జుట్టు కత్తిరించుకుని — ధవళవస్త్రాలు ధరించివుంది. బుద్ధుడు ఆమెతో," నేను స్థిర నిశ్చ

యుడనై వున్నాను. మంచిని, శుభాన్ని కోరుతున్నాను. జ్ఞానార్థినై వున్నాను. ఇంక ఇది ఇంతే" అన్నాడు. ఆయన మాటల అంతర్యం ఆమెకు అర్థమైంది. ఆమె లోపలకువెళ్ళి-రాహులుని తీసుకొచ్చింది. అతడు బుద్ధునికి నమస్కరించాడు.

వారం రోజులు గడచిన తర్వాత, బుద్ధుణ్ణి శాశ్వతంగా కపిల వస్తులో వుంచెయ్యాలని ఆలోచనలు - ప్రయత్నాలు చేశారు, కొందరు. బుద్ధుడు ఆ సంగతి గమనించి, "సూర్యుడు నేలరాలవచ్చు నేమో-హిమాలయ పర్వతం దాని స్థిరత్వాన్ని కోల్పోవచ్చునేమో-కాని, నేను మాత్రం తిరిగి ప్రాపంచిక సుఖాలపై వాంఛ పెంచుకుని గృహోన్ముఖుడను కావడం జరగదు." అన్నాడు. అని- "అగ్ని జ్వాలల్లోనైనా ప్రవేశిస్తానుకాని, నా ధ్యేయాన్ని సాధించకుండా మరలడం అంటూ జరగదు," అన్నాడు.

శుద్ధోధనుడు బుద్ధునికీ అతని శిష్యులకూ న్యగ్రోధవనం శాశ్వతంగా ఏర్పాటు చేశాడు. బుద్ధుడు అక్కడవున్నన్నినాళ్ళూ, ఎందరో వచ్చి—దర్శించి, ఆయన బోధలువిని, శిష్యులై—సంఘ సభ్యులైనారు. కొందరు దీక్ష తీసుకున్నారు. మహా ప్రజాపతి-తన యుడు నందుడు - జనపదకళ్యాణిని వివాహం చేసుకున్న సమ యంలో, బుద్ధుడు న్యగ్రోధవనం నుంచి వివాహమహోత్సవానికి వెళ్ళి-ఆశీర్వదించి, "నిజమైన వివాహం అంటే ఏమిటో తెలుసా? తుచ్ఛమైన కోర్కెలను విసర్జించడం వాటిని నిర్మూలించడం, బ్రహ్మ చర్యం అవలంభించడం. చతుర్విధ సత్యాల్ని తెలుసుకుని, నిర్వాణ పథం చేరుకోవడం," అన్నాడు బుద్ధుడు.

వివాహవేదిక దగ్గరనుంచి వెడుతూ, తన భిక్షాపాత్ర నందుని చేతికిచ్చాడు, బుద్ధుడు. ఏమి చిత్రమోకాని, నందుడు భిక్షాపాత్ర అందుకున్న మరుక్షణం, పసుపు బట్టలతో బుద్ధుని అనుసరించాడు- ఏదీ గమనించకుండా, దేన్నీ లక్ష్యపెట్టకుండా, కొత్త పెళ్ళి కూతుర్ని—బంధుమిత్రుల్ని - తల్లితండ్రుల్ని వదలి, ఆ సంఘటన

చూసిన వారంతా ఆశ్చర్యపోయారు. ఎవరినోట మాటలేక నిశ్చేష్టులై ఎక్కడి వారక్కడ నిలబడిపోయారు. నందుని చూసి, జనపద కళ్యాణి ఏడ్చి— "మీ దారికి నేను అడ్డురాను. కాని, ఒకవేళ ఆ జీవితం అయిష్టంగా, కష్టంగా వుంటే, తక్షణం నేనున్నానని గుర్తు చేసుకుని నా దగ్గరకురండి," అన్నది వివేకవంతంగా-నందుడు, బుద్ధుని వెనక న్యగ్రోధవనం వెళ్ళాడు. అక్కడ అతనికి దీక్ష ఇప్పించాడు-బుద్ధుడు.

నందుడు బౌద్ధ సంఘంలో చేరాడేకాని, సాధు-సన్యాసి జీవితం గడపలేక నానా బాధలు, యాతనలూ పడ్డాడు, మొదట్లో కొన్నాళ్ళు. అతనికి తరచు తన అందమైన భార్య గుర్తుకువచ్చి- ఆ సంగతి తోటి సన్యాసులకు బాధగా చెప్పుకునేవాడు. తన మనసు వికలంగా, అశాంతిగా వుందని, ఇంటి మీద బెంగగా వుందోంటనే వాడు. సంఘ సభ్యుడుగా వుండి-విలువైన దుస్తులు ధరించి, ఖరీదైన భిక్షాపాత్రతో నగరంలోకి వెళ్ళేవాడు. భిక్షాన్నంతినలేక-కటిక నేల మీద పడుకోలేక-నృత్యగాన వినోదాలు లేక, విచారంగా వుండే వాడు. ఆ సంగతి భవరోగ రాజైన బుద్ధునికి తెలిసి, "ప్రాపంచిక దృష్టి- సుఖలాలస-విషయ వాసనలతో కూడిన జీవితం-బౌద్ధ ధర్మానికి విరుద్ధం -వ్యతిరేకం-బౌద్ధ భిక్షువులతో-సంఘంలో వుండతలచు కుంటే, భిక్షాన్నమే తినాలి. నేలమీదే పడుకోవాలి. కోర్కెలు వుండ కూడదు. ఆలోచనలు-ఆశలు-వాంఛలు-తృష్ణ-కోర్కె - ప్రయత్నం ఏమీ లేకుండా జీవించాలి," అన్నాడు. ఆ మాటలతో నందుడు దృష్టి మార్చుకున్నాడు. క్రమంగా అతనిలో మార్పు వచ్చింది. వైరాగ్యభావం స్థిరపడింది. హృదయం కరుణకు నిలయమైంది. శమ, దమాదులు-లో దృష్టి చోటు చేసుకున్నాయి-జీవితాంతం ఆదర్శ వంతుడైన భిక్షువుగా వున్నాడు. బుద్ధునికి సేవలు చేశాడు. ఒకసారి మాటల సందర్భంలో-సుగతుడు ప్రసన్నగంభీరస్వరంతో-నందుని దృష్టిలో పెట్టుకుని. "పై కప్పు సరిగ్గా లేని ఇంట్లోకి, వర్షం నీరు ప్రవేశించునట్లు శమ, దమాదులు-లోదృష్టి-ఎరుకలేని చిత్తంలోకి,

రాగం ప్రవేశిస్తుంది. ఇంటి కప్పు సరిగ్గావున్నా-చిత్తం స్థిరంగా వున్నా రాగం ప్రవేశించదు," అన్నాడు.

* * *

బుద్ధుడు కపిలవస్తులో మకాం చేసిన రోజుల్లో-ఒకనాడు "వశిష్టుడు-భరద్వాజుడు" అను ఇద్దరు బ్రాహ్మణ మత గురువులు బుద్ధుని దగ్గరకు వెళ్ళి, "అనేకరకాల గురువులు-బోధకులు విశ్వాత్మలో ఐక్యమయ్యేందుకు రకరకాల మార్గాలు చూపుతారు. అవన్నీ నిజంగా అక్కడకు చేరుస్తాయా?" అని అడిగారు. దానికి ఆయన, "ఆ గురువులు- ఆ శిష్యులు గ్రంథాలలో రాసివున్న సంగతులు చదివి, తెలుసుకున్న వారేకాని అసలు సత్యాన్ని - ముఖాముఖి దర్శించినవారుకాదు. అలా తెలుసుకున్నవారు ఎవరైనా వున్నారా? తమకు తెలియని-అనుభవంలో లేనిదాని గురించి ఇంక వారు ఎట్లా చెప్తారు? అది, ఎలా వుంటుందంటే కొంతమంది గ్రుడ్డివాళ్ళు వరసగా-ఒకరి వెనుక ఒకరు పోతున్నట్లు వుంటుంది. అందులో ఏ ఒక్కరికీ తాము ఎటుపోతున్నదీ-ఏ మాత్రం తెలియదు. నిజమైన గురువుకి ఎట్లాంటి గుణాలు వుండాలో, వారికి తెలియదు. అవి మినహాయించి- గ్రంథాలు చదువుతారు. దేవతల్ని ఆవాహనం చేస్తారు. పంచేంద్రియాల సంచలనం వల్ల కలిగే వాంఛలు మనిషిని మోహబంధంలో ముంచుతాయి.

భార్యా-పిల్లలతో, ఆస్తిపాస్తులతో, పెద్ద సంసారంతో సామాన్య మానవ జీవితం గడిపేవారూ, క్రోధం, అహంకారంతో అపవిత్రంగా, మనో నిగ్రహం ఏ మాత్రం లేకుండా బ్రతికేవారూ ఎట్లా సత్యాన్ని దర్శించగలరు?

"జ్ఞానులు అవసరమైనప్పుడల్లా అవతరిస్తూ వుంటారు. నిజమైన ఆర్తులను తమ మార్గాన నడిపి-నిర్వాణ పథం చేర్చేందుకు కొందరు రాస్తారు. కొందరు బోధిస్తారు, కొందరు ప్రచారంచేసి సత్యం తెలుపుతారు. గురువులో విశ్వాసం వున్నవారు-ఎవరైనా

నరే-సర్వసంగ పరిత్యాగం చేసి-భిక్షాపాత్ర స్వీకరించి- తమవంటూ ఏమీలేకుండా- మనోవాక్కాయ కర్మలందు సత్యంగా, ప్రేమగా, దయగా, నీతిగా వుండటమే నిర్వాణానికి మార్గం.

అది విని, ఆ ఇద్దరు బ్రాహ్మణ మత గురువులు బుద్ధుని అనుసరించారు. దానికి బుద్ధుడు, "మీరు బౌద్ధంలో చేరినందుకు మీ తోటి వారు మిమ్మల్ని కోప్పడి-నిందించి, దండించరా?" అని అడిగితే- "అవును-వాళ్ళు నిందిస్తారు. తిడతారు, తిరస్కరిస్తారు. వెలివేస్తారు. తాము, అన్ని విధాలా సృష్టిలో-మానవులలో అధికులం, ఉన్నతులం అనుకుంటారు. మేమే మిమ్మల్ని అనుసరించడం చూసి, "ఎందుకూ కొరగాని వాళ్ళతో- బైరాగులతో-పనికిమాలిన వాళ్ళతో చేరామనుకుంటారు," అన్నారు.

"గురువు ఎటువంటి వాడైనా, ఆయన బోధవల్ల ఎవరైనా ముక్తి పొందితే- ఆ గురువు నిందార్హుడుకాడు," అన్నారు బుద్ధుడు.

*　　　*　　　*

ఒకరోజున శుద్ధోధనుడు, యశోధర రాహులుని వెంటబెట్టుకుని బుద్ధుని దగ్గరకు వెళ్ళారు. బుద్ధుడు కపిలవస్తువచ్చి అప్పటికి ఏడు రోజులైంది. వారు వెళ్ళిన సమయానికి బుద్ధుడు అతిథుల-బౌద్ధ భిక్షువుల- శిష్యుల- అనుచరుల, సాధుసన్యాసులతో కలసి భిక్షాన్నం తింటున్నారు. యశోధర రాహులునితో- బుద్ధుని చూపిస్తూ, "నాయనా ఆయనెవరో నీకు తెలుసా?" అని అడిగింది. దానికతడు, "తెలియకేం, బుద్ధుడు, "అన్నాడు ఏమీ తడుముకోకుండా. ఆమె కన్నీరు పెట్టుకుని, "అవును బాబూ! మేలిమి బంగారు ఛాయతో నిగనిగలాడుతున్న- శిష్యులమధ్య కూర్చుని భోజనం చేస్తున్న ఆయనే నీ తండ్రి," అన్నది.

రాహులుడు బుద్ధునితో, "తండ్రీ! నేను రాకుమారుణ్ణి. నేను రాజునయ్యాక- రారాజు నౌతాను. నా సంపద ఏదో, అది నాకు

సంక్రమిస్తుంది. నేను- నిన్నేకాదు, నీ నీడను సైతం ప్రేమతో అను సరిస్తాను. నీ దగ్గర ఏవో గొప్ప నిధులున్నాయని అమ్మ చెప్పింది. వాటిని నాకు ఇస్తావా?'' అని అడిగాడు.

భోజనానంతరం బుద్ధుడు బైటికి వస్తుండగా, రాహులుడు ఆయన్ని వెంబడించి- ఏదో మాట్లాడుతుంటే, "నాయనా, రాహుల్! నా ఆస్తి, మరొకటి. అది ఇస్తాను,'' అని సారిపుత్తను పిలిచి, రాహుల్ కి దీక్ష ఇచ్చి-బౌద్ధ సన్యాసిని చేయండి,'' అన్నాడు.

ఆ మాట విని శుద్ధోధనుడు, "తల్లి-తండ్రి-సంరక్షకుల అను మతిలేనిదే ఏ బిడ్డకూ దీక్ష ఇవ్వకూడదు. వివాహ దుస్తుల్లోవున్న నందునికి దీక్ష ఇచ్చావు. అది చూసి నేను చాలా బాధపడ్డాను.'' అన్నాడు. శుద్ధోధనుని మాట ప్రకారం ఆ నాటినుంచి చిన్నవారికి దీక్ష ఇవ్వడం విరమించుకున్నారు, సంఘంవారు. కాని, ఎందరో- అనేక జాతుల, తెగల, కులాల, వర్గాల. వర్ణాలవారు దీక్ష తీసు కున్నారు. వారిలో శుద్ధోధనుని తమ్ముడైన అమితోదనుని కుమారుడు ఆనంద్ ముఖ్యుడు. స్త్రీలుకూడా బౌద్ధ సంఘంలో చేరారు.

"ఉపాలి'' అనే మంగలి, అనురుద్ధుడు శిష్యులుగా చేరారు. రాజవంశీయులు చాలా మంది చేరారు.

"స్త్రీలకు ప్రత్యేక ధర్మాలు చెప్పారు. భిక్షుకి సంఘం ఏర్పాటు చేశారు. అంతవరకు "స్త్రీ" ఎటువంటి త్యాగంచేసే ఆధ్యాత్మికంగా పరిపూర్ణురాలు కాజాలదు,'' అనే అభిప్రాయం లోకవ్యాప్తంగా వుంది. ఆ అభిప్రాయం ఆనాటితో తొలగిపోయింది. ఆ తర్వాత ప్రజాపతి గౌతమి వెళ్ళి- తనను భిక్షుకి సంఘంలో చేర్చుకోమంటే, బుద్ధుడు నిరాకరించాడు.

*   *   *

ఒకరోజున "కాశి భరద్వాజ" అనే బ్రాహ్మణ కృషీవలుడు బుద్ధుని దగ్గరకువెళ్ళి, "మీరు మావలె కృషిచేసి, ఫలితాన్ని అనుభవించి, అందరికీ ఇంత పెట్టవచ్చుకదా? సోమరిగా-పరాన్న భక్షులుగా జీవించడం కన్నా? అది మంచిదికదా?" అన్నాడు. దానికి బుద్ధుడు, "నేనూ కృషీవలుడనే! ధర్మక్షేత్రమే, నా కృషిక్షేత్రం. దాన్ని, జ్ఞానమనే నాగలితో దున్ని-"దుష్కాంక్షలు" అనే కలుపు మొక్కలు పీకి,- "శ్రద్ధ-పవిత్రత" అనే బీజాల్ని చల్లి—నియమాచరణ, క్రమం-కుశల కర్మలు అనే వర్షపుజలంతో పెంచి, సర్వ దుఃఖాల్ని హరింపజేయు నిర్వాణ ఫలాల్ని పండిస్తున్నాను," అని "మానవ హృదయక్షేత్రంలో రాగ, ద్వేష, మోహేచ్ఛలను తృష్ణా దోషాల్ని నశింపజేసి నిర్వాణం పొందేటట్లు చేయవలెను," అన్నాడు. అదివిని ఆ కర్షకుడు ఆనందపడి, బుద్ధుణ్ణి అనుసరించి, చివరికి అర్హతుడయ్యాడు.

* * *

బుద్ధుడు కపిలవస్తు నుంచి తిరిగి రాజగృహాకు బయలుదేరి వెడుతూ-దారిలో యామ్రవనం-అదే, అను ప్రియావనం-లో కొంత కాలం మకాం చేశాడు. అక్కడికి శుద్ధోధనుని తమ్ముడు శుక్లోధనుని కుమారులూ, శాక్యవంశ రాజకుమారులూ-దేవదత్తుడు-భృగుడు, కింబిలుడు, ఆనందుని అన్న అనిరుద్ధుడూ, శుద్ధోధనుని సోదరుడైన ద్రోణధనుని కుమారుడు భద్దియుడు-అనిరుద్ధుని మిత్రుడు చెన్నుడు, వెళ్ళారు. ఆ రాజ కుమారులంతా బుద్ధునితో, "మాకు అభిమానం ఎక్కువ-ఉపాలి మమ్మల్ని సేవించి బ్రతికేవాడు. మేము అతని పాదాలకు నమస్కారం చేయడంతో మా అహం అణగి, అభిమానం తొలగుతుంది," అన్నారు. అప్పుడు బుద్ధుడు ముందుగా ఉపాలికి దీక్ష ఇచ్చాడు. అతడు బుద్ధుని శరణు జొచ్చాడు.

అతడు త్వరలో గొప్ప ధర్మ బోధకుడైనాడు. ఆచార్యుడైనాడు. ఆనాటి ఆనందుడు ప్రథమ శిష్యుడైతే-దేవదత్తుడు ప్రబల విరోధి అయ్యాడు.

మహాపరి నిర్వాణానంతరం ఉపాలి "సప్తపర్ణిగుహ" యందు జరిగిన ప్రథమ సమావేశమందు "వినయ పిటకమునకు సంబంధించిన ఉపదేశసూక్తులు చెప్పాడు. అతని ధారణా వైభవానికి అందరూ ఆశ్చర్యపోయారు."

★ ★ ★ ★

ఒకసారి భద్దియుడు ఒంటరిగా వనంలో కూర్చుని, "ఆహా, ఎంత ఆనందంగావుంది! ఎంత సుఖంగా వుంది!!" అని తనలో తాను బిగ్గరగా సంతోషంతో అనుకోవడం కొందరు భిక్షువులు విని, బుద్ధునితో "భద్దియుడు, బ్రహ్మచర్యం-నిశ్చల మనస్సు పాటించినట్లు తోచదు. గృహస్థుగావుండి పొందిన సుఖమును తలచుకుని," "ఎంత సుఖం! ఎంత ఆనందం!! అంటున్నారు," అన్నారు. అది విని బుద్ధుడు.

భద్దియుని పిలిచి, "ఎంత సుఖంగా వుంది! ఎంత ఆనందంగా వుంది!!"

"అని అన్నావుట నిజమేనా?" అని అడిగాడు.

"అవును. అన్నాను," అన్నాడు.

"అయితే దేనిని ఉద్దేశించి అట్లా అన్నావు?" అని అడిగాడు బుద్ధుడు.

"ఇంతకాలం దేశంలోపల వెలుపల- అంతఃపురంలో-బైట ఎప్పుడూ నాకు రక్షణ వుండేది. అనుక్షణం బ్రతుకు భయంతో, అనుమానంతో గడిచేది. ఇప్పుడా భయంలేదు-అనుమానంలేదు. హాయిగా, ఆనందంగా వున్నాను - భిక్షాన్నంతింటూ — చెట్ల క్రింద నిద్రిస్తూ, ఈ జీవితాన్ని అనుభవిస్తూ ఆ సంతోషంలో అట్లా అనుకున్నాను. అంతే!" అన్నాడు.

"నిర్భయుని, సుఖిని తెలియుట కష్టం" అన్నాడు బుద్ధుడు. అని "భిక్షువైనవాడు మోహదూరుడు కావలె తలనరికిన తాటిచెట్టు

వలె ఒకసారి రాగద్వేషాలు నశించిన పిదప, అవి తిరిగి పుట్టవు, అన్నాడు.

* * *

సుప్రియుడు అను పరివ్రాజకుడు-బుద్ధుని, అతని ధర్మమును, సంఘమును నిందించగా అతని శిష్యుడు బ్రహ్మదత్తుడు బుద్ధుని, సంఘాన్ని-ధర్మాన్ని మెచ్చుకోవడం భిక్షువులు విని, ఆ సంగతి బుద్ధునికి చెప్పగా "ఎవరైనా నన్నుగాని, ధర్మాన్నిగాని, నిందించినచో మీరు అభిమానపడి కోపగించుట చేయరాదు. వారన్నమాటలోని సత్యా సత్యాల్ని వివేకంతో చూడాలి. వారి నిందలో నిజం వుంటే, మనం సరిదిద్దుకోవాలి. అది అసత్యమైతే, ఆ విషయం మనకు సంబంధంలేనిది. కనుక రెండింటి విషయంలో మనకు మనో విజృంభణ కూడదు. అదిమనోదాస్యం," అన్నాడు. అదివిని వారు మౌనంగా నిష్క్రమించారు!

* * *

కోసలదేశరాజధాని శ్రావస్తి. అది మహాజన పథాల్లో ఒకటి. ఆదేశపురాజు-ప్రసేనజిత్. అతన్నే పాసినాడి అనేవారు ఆరోజుల్లో కోసల, గొప్పదేశాల్లో ఒకటి. శ్రావస్తికి – రాజగృహకు మధ్య దూరం– నలభై ఐదు యోజనాలు. శ్రావస్తిలో అనాథపిండకుడు అనే కోటీశ్వరుడైన వర్తకుడు వుండేవాడు. అతన్నే సుదత్తుడు-లేక "అనే పీడుడు" అని కూడా పిలిచేవారు. అతడు సాధు - సజ్జనులకు, సన్యాసులకు-అనాథలకు నిరతాన్నదానం చేసేవాడు. అతని సోదరి, అత్తవారి ఊరు రాజగృహ. ఒకసారి అనాథ పిండకుడు-సోదరిని, బావగారిని చూడ్డానికి రాజగృహకు వెళ్ళాడు. ఆ సమయానికి అతని బావగారు ఒకగొప్ప విందు ఏర్పాటు చేశాడు. విశేషమేమిటని అనాథ పిండకుడు అడిగితే - "బుద్ధ భగవానునికి భిక్ష ఇస్తున్నాను," అని, బుద్ధుని గురించి తనకు తెలిసింది చెప్పాడు. మర్నాడు భిక్ష. ఆ తెల్లవారు జామున అనాథపిండకుడు బుద్ధుణ్ణి దర్శించడానికి వేలువనానికి వెళ్ళాడు.

అతడు ఇంకా దారిలో వుండగా - బుద్ధుడు ఎదురేగి, "సుదత్తా", అని పిలిచాడు. అది, తన చిన్ననాటి పేరు. బుద్ధుని నుంచి తనపేరు వినగానే, ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే ఆ పేరు ఎవరికీ తెలియదు. బుద్ధునికి తెలిసే అవకాశం లేదుకనుక, ఆయన అసామాన్యుడని గ్రహించి - ఆయన్ని ఆ సంవత్సరం - చాతుర్మాసం శ్రావస్తిలో గడపవలసినదిగా కోరి, ఆహ్వానించాడు.

బుద్ధుడు అతని ఆహ్వానాన్ని అంగీకరించగా - అనాధ పిండకుడు వారికి కావలసిన ప్రయాణ ఏర్పాట్లు అన్నీ చేశాడు. చక్రవర్తులు సహితం అసూయపడదగినంత ధనవంతుడతడు. అందుచేత దారిపొడవునా — నూటముప్పైమైళ్ళు - అనేక విశ్రాంతిశాలలు కట్టించాడు. ఆ శాలలలో బుద్ధుని పరివారానికి - అందరికీ మంచి భోజనం - వసతి ఏర్పాటుచేసి - జేతుడనే ఒక రాజకుమారునినుంచి- అతని ఉద్యానవనాన్ని-ఎంతోధనం వెచ్చించి- కొని అందు - సమస్త సౌకర్యాలతో అందమైన ఒక విహారం నిర్మించాడు. అదే "జేతవన విహారం. అనాథ పిండకునికి విక్రయించగా అమ్మగా మిగిలిన భూమిని- ఆ రాజకుమారుడు-బౌద్ధసంఘానికి ఉచితంగా ఇచ్చేశాడు. జేతవన విహారంలో ఎన్నోశాలలు మండపాలు, కొలనులు ఏర్పాటు చేశారు. సర్వాంగసుందరంగా తీర్చిదిద్దాడు. అది చాలా అందమైన విహారం. చాలా విలువైనది. విశాలమైనది. దాని నిర్మాణానికి విపరీతంగా ధనం వెచ్చించాడు.

బుద్ధుడు జేతవన విహారం చేరుకున్నాడు. మొదటిరోజు గోష్ఠిలో "ఈ సృష్టిలో గల ప్రతిదానికి ఒక మూలకారణం వుండి తీరవలె. అంతా అతని అధీనంలో వుండకపోతే, ఈశ్వరుడుగాని, స్వయంభవుడుగాని ఈ సృష్టికి మూలకారణం కాజాలడు. ఎందుకంటే- ప్రపంచంలో ప్రతిదానికి ఒక ప్రేరణశక్తి కారణమై వుంటుంది. మనం నిర్వర్తించే పనులబట్టే, వాటి ఫలితాలు కలుగుతాయనేది, విదితమౌతోంది కనుక; స్వార్థాన్ని విడిచిపెట్టి, మంచిపనులు చేస్తే- సత్ఫలితాలు కలుగుతాయి.

మనసులో లేచిన అగ్నిజ్వాల ఫలితమే, అమానుషకృత్యాలు- ఆ జ్వాల- అడవినంటి పూర్వాకృత పుణ్యాల్ని దహిస్తుంది. ధర్మ మార్గాన నడవదలచుకున్నవాడు, మనసును పవిత్రంగా వుంచు కోవాలి. మనసు పవిత్రంగా వున్నప్పుడే, భూమి పవిత్రంగా వుంటుంది. అప్పుడు సమస్త జీవకోటి పవిత్రంగా, సమానంగా వుంటుంది. సామాన్యం, సహజం అయిన మనసునుంచి, వచ్చే ఆలోచనలను విడిచిపెట్టనవసరం లేదు. ద్వంద్వాలతో మనసును అపవిత్రం చేయకుండావుంటే చాలు. మనసు నిశ్చలమైనప్పుడు- ధర్మనియమాల అవసరమేముంది? సత్ప్రవర్తన వున్ననాడు, ధ్యానంతో పనేముంది? అప్పుడు శాంతిలో, ప్రేమపూరితమైన కరుణలో- మనసు విజృంభించక విశ్రమిస్తుంది,” అన్నాడు బుద్ధుడు.

*    *    *

వేరొకరోజున అనాథపిండకుడు, బుద్ధునితో జరిపిన చర్చలో “దైవం” ప్రస్తావన వచ్చింది. దానికి బుద్ధుడు, ఈ ప్రపంచాన్ని ఈశ్వరుడు సృష్టించివుంటే, మార్పు- పరివర్తనం- నాశనం- కావ డానికీ, దుఃఖం- ప్రమాదాలు కలగడానికీ, వీల్లేదు. ఎందుకంటే, అన్నీ-అంతా ఆయన సృష్టేగనుక- అంతా ఆయన సృష్టే అయితే, మంచి- చెడు; తప్పు-ఒప్పు; స్వర్గం- నరకం; అనే భేదం వుండదు. అన్నీ- అంతా మనోసృష్టి కనుకే, ఈ వ్యత్యాసం, ద్వంద్వం, విజ్ఞాన జీవుల్లో సుఖ- దుఃఖాలు, రాగ- ద్వేషాలు వుంటే, అన్నింటికీ కర్త ఐన ఈశ్వరునిలోనూ అవి వుండవలె. అట్లా వున్ననాడు- అతడు ఎట్లా పరిపూర్ణుడు- గుణాతీతుడు కాగలడు? అతడే సర్వాధికారి అయితే- జీవుల ధర్మానుష్ఠానంతో పనేముంది? కర్త- ఈశ్వరుడైతే- సత్కర్మ, దుష్కర్మ ఒకటే. దుఃఖానికి మరొక కారణం వుంటే- ఆ కారణం ఈశ్వరునికి భిన్నంగా వున్నట్లే కదా? మనలోని గుణా లన్నీ- ఆయనలో వుంటే-అప్పుడు అన్నింటికీ ఆయనే బాధ్యుడు కదా? మనిషి దుఃఖానికి-సుఖానికి వేరే కారణం వున్నదంటే, ఆ

ఈశ్వరశక్తికి అతీతంగా- ఇంకా ఏదో వున్నట్టే కదా? ఇంతకూ ఈశ్వరుడు ఉద్దేశ్యపూర్వకంగా ప్రవర్తిస్తాడా? లేక, ఉద్దేశ్యరహితంగా ప్రవర్తిస్తాడా? ఉద్దేశ్యంతో కర్మచేస్తే- అతడు పరిపూర్ణుడు ఎట్లా అవుతాడు? ఉద్దేశ్యరహితంగా పనిచేస్తే- అతడు పిచ్చివాడో పిల్లవాడో అవుతాడు. నిర్గుణ పరబ్రహ్మ, సర్వవస్తువుల్ని- సమస్తాన్ని గుణ- గణాలతో నిండివుండేటట్లు ఎట్లా చేశాడు? ఆయన మార్పు లేనివాడైతే- ఆయన సృష్టి-సమస్త చరాచరం- మార్పు లేనిదై వుండివుండవలె. ఇంక మోక్షకాంక్ష ఏల?

ఈ సృష్టిలో ఏదీ ఉన్నతమైనది కాదు- హీనమైనదీ కాదు. అన్నీ- అంతా సమానమే, ఒక్కటే, మనం అనుకునే భగవంతునితో సహా. ఈ సృష్టికి- ఈ ప్రపంచానికి- ఈ ఉనికికి- ఈశ్వరుడు విడిగా-భిన్నంగా- అన్యంగా— వుండడానికి వీల్లేదు. ఈ దృశ్యమాన ప్రపంచాన్ని పరిశీలనకు అవధిగా తీసుకుని- అనుభవాన్ని పరిశీలించి- దాని సత్యస్వరూపం తెలుసుకోవడమే, ముఖ్యం పరోక్ష బ్రహ్మ విచారణ మాని, ప్రత్యక్షలోకరీతిని నిర్ణయించయత్నించడం- సమంజసం. రుజువు చేయడానికి అది సత్పదార్థం- జ్ఞానాతీత విషయం కనుక, దాని గురించిన అవివేక నిర్ణయంకంటే- మౌనం ఉత్తమం" అన్నాడు బుద్ధుడు. అని- "సుదత్తా, అష్టాంగమార్గాన్ని అనుసరించు. ధర్మజీవన ప్రసన్నత లభిస్తుంది. హృదయాన్ని పవిత్రంగా వుంచుకో. మనసు శుద్ధిచేసుకో. అదిచాలు;" అన్నాడు.

బుద్ధుని మాటలు విన్న అనాథ పిండకుడు ఆయన శిష్యుడై- "స్వామీ, నేను సర్వసంగపరిత్యాగం చేయాలా?" అని అడిగాడు. దానికి బుద్ధుడు, అవసరంలేదు. భోగ-భాగ్యాలపై- సుఖాలపై వాంఛ లేకుండా, మనోప్రక్షాళనం చేసుకుని— సద్ధర్మంలో పయనిస్తే చాలు. విషయాలు, విషం వంటివి. వాటినుంచి జాగ్రత్తపడు. ఆశా-పాశాల బరువు-భారంతో: అధికార దర్పంతో వ్యాపారం పెంచుకోకు. దుఃఖశిఖరాలు మనచుట్టూ ఎత్తుగా పెరిగివున్నాయి. జాగ్రత్తగా గమనించు. ప్రతిదీ నిస్వార్థంగా చెయ్యి" అన్నాడు.

అనాథపిండకుడు బుద్ధుని పేరుమీద జేతవన విహారంలో నిరతాన్నదానం ఏర్పాటు చేశాడు. అతనికి బీదలన్నా, బౌద్ధులన్నా అపరిమితమైన ప్రేమ, గౌరవం. రోజూ దాదాపు రెండువేలమంది భిక్షువులకు అన్నదానం చేసేవాడు. చివరికి అతడు బీదవాడైన తర్వాత కూడా బాధపడకుండా అన్నదానం చేశాడు.

జేతవన విహారం క్రమంగా బుద్ధుని అభిమాన ఆశ్రమం అయింది. అనాథపిండకుడు రోజుకు మూడుసార్లు బుద్ధుని దర్శించేవాడు. అతని ఆదరాభిమానాలవల్ల- అన్నదానంవల్ల శ్రావస్తిలో బౌద్ధం విశేషప్రజాదరణ పొందింది. బుద్ధుడు జేతవనంలో వున్న ప్రతిరోజూ ఉభయసంధ్యల్లో సత్సంగం జరిగేది— ఒకరోజు సత్సంగంలో, "దేనికోసమూ వెతకనివాడు, స్వేచ్ఛగా వుండగలడు. మహా సముద్రంవంటి సత్యం, ఎక్కడో దూరాన లేదు. దానిసారం- నిరంతరం గొప్ప ప్రవాహం మాదిరిగా, మనలోకి వస్తూ వుంటుంది. దాన్ని నిర్మాణం చేయడానికి ఎటువంటి ప్రయత్నం చేసినా, ఆ ప్రవాహానికి మధ్యలో పదివేల పర్వతాలు ఒక్కసారిగా పైకితేచినట్లు వుంటుంది." తెలుసుకుని- జ్ఞాపకం వుంచుకోవడం," అనేది లేనప్పుడు, సత్యం తనంతట—తానుగా వ్యక్తమౌతుంది. నిర్వాణం వంటి సత్యాన్ని- జ్ఞానాన్ని పొందాలనుకోవడం, అద్దంలో రాక్షస సమూహాన్ని జయించడం, కలలోలాగ ధర్మాన్ని ప్రబోధం చేయడం- సంసారంనుంచి- ఎండమావులవంటి సమస్త జీవకోటికి సహాయం చేయచూడ్డంవలె వుంటుంది," అన్నారు బుద్ధభగవానులు.

★ ★ ★

బౌద్ధభిక్షువుల్ని ఆహ్వానించి ఉపన్యాసాలు ఇప్పించేవాడు అనాథపిండకుడు. ఒకసారి మహాకాశ్యపుని, ఆహ్వానించి- ఆ సభకు పౌరులందర్నీ రావలసినదిగా కోరాడు. దానికి కాశ్యపుడు, "ఊరి జనమంతా దేనికి? ఒక్క మీ కుమారుడు చాలు," అన్నారు. అనాథపిండకుని కొడుకుపేరు- కాలనాథుడు. అతడు పోకిరి పిల్లలకు నాయ

కుడు. అతణ్ణి ఏమీ అడిగే సాహసం ఎవరూ చేయలేదు. అతనికి యువరాజు స్నేహం- ధనం విచ్చలవిడిగా ఖర్చుపెట్టేవాడు. రోజూ ఖర్చునిమిత్తం - తండ్రిని వందవరహాలు అడిగేవాడు. ఒకరోజున అనాథ పిండకుడు- "ఊరికే నేను ఎవ్వరికీ ధనం ఇవ్వను. నువ్వు, నా కుమారుడివి కనుక- నువ్వు రోజూ బౌద్ధవిహారానికి వెళ్ళి, వస్తే వందవరహాలు ఇస్తాను." అన్నాడు. అతడు అలాగే వెళ్ళి, తండ్రి దగ్గర ధనం గుంజేవాడు. ఓ రోజున "నువ్వు బౌద్ధవిహారానికి వెళ్ళిన గుర్తుగా-రోజుకొక బుద్ధుని ప్రవచనం ఒప్పజెప్పి అర్థం వివరించావంటే వందవరహాలుకాదు వేయివరహాలిస్తా"నన్నాడు. అతని తండ్రి ఓరోజు కాలనాథుడు బౌద్ధవిహారం వెళ్ళి- బుద్ధుని బోధను శ్రద్ధగా విని, దాన్ని మననం చేసుకుంటూ ఆ రాత్రి అక్కడే వుండిపోయాడు. ఆ మర్నాడు కాలనాథుడు భిక్షువులతో కలిసి నగరంలోకి భిక్షకు వెళ్ళాడు. ఆరోజు వారు అనాథపిండకుని ఇంటికి వెళ్ళారు. ఆ గుంపులో వున్న తన కుమారుణ్ణి చూసి, సంతసించి- వేయివరహాలు ఇవ్వబోతే "తండ్రీ, నాకేమీ వద్దు. నీ ఆస్తీ వద్దు. ఏ తండ్రీ. ఏ కొడుక్కి చేయని గొప్పమేలు మీరు నాకు చేశారు. అదే పదివేలు;" అన్నాడు సంతోషంతో.

★ ★ ★

కోసలరాజైన ప్రసేనజిత్- సోదరినే బింబిసారుడు వివాహం చేసుకున్నాడు. ఒకసారి తన సోదరిని చూడ్డానికి ప్రసేనజిత్ రాజగృహ వెళ్ళాడు. ఆ సమయానికి బుద్ధుడు రాజగృహలో వున్నాడు. బింబిసారుని ద్వారా బుద్ధుని సంగతి విన్నాడు ప్రసేనజిత్. ఒక రోజున బుద్ధుణ్ణి దర్శించి, ఆయన్ని విని-ఆకర్షితుడై బుద్ధుణ్ణి తన రాజ్యానికి ఆహ్వానించాడు. బుద్ధుడు వెళ్ళాడు, ఎంతోమంది బౌద్ధ భిక్షువులతో - అనుచరులతో, శిష్యులతో. వారందరికీ పాసినాడి గొప్ప భిక్ష ఇచ్చారు. ఆ సమయాన ఎందరో పెద్దల్ని ఆహ్వానించాడు. వచ్చినవారిలో అనేకరకాల మతస్థులు- మనస్తత్వం కలవారూ వున్నారు. వారిలో సనాతనులు, బ్రాహ్మణ పండితులు వున్నారు.

కొందరు బుద్ధుణ్ణి ప్రేమించారు- గుర్తించారు. కొందరు మనస్సుల్లో వ్యతిరేకించారు.

ఒకరోజున ప్రసేనజిత్ సమస్త పరివారంతో బుద్ధుని దగ్గరకు వెళ్ళి- ఆయన బోధలు శ్రద్ధగా విని — ఆనందపారవశ్యుడై, బౌద్ధం స్వీకరించాడు. అతడు పూర్వాశ్రమంలో సనాతన మతావలంబి. కాని అతని భార్య మల్లిక్, చెల్లెళ్ళు సోమ, సఖుల అంతకుపూర్వమే బౌద్ధం స్వీకరించారు. శ్రావస్తిలో బుద్ధుడు అంటరాని కులస్థుల అమ్మాయికి దీక్ష ఇచ్చారని తెలిసి - బ్రాహ్మణులలో అలజడి బయలు దేరింది. ఆ సంగతి రాజైన ప్రసేనజిత్‌కి ఫిర్యాదుగా చెప్పారు. రాజు స్వయంగా ఆ విషయం విచారించడానికి బుద్ధుని దగ్గరకు వెళ్ళి "అటువంటి అవివేకపు పని ఎందుకు చేశారు?" అని అడిగాడు. ఆ రోజుల్లో — సంఘంలో కులాధిక్యత అధికం — ముఖ్యం. అందులోనూ బ్రాహ్మణాధిక్యత ఎక్కువ. దానికి బుద్ధుడు ఈ విధంగా సమాధానం ఇచ్చాడు. తామరాకుపై నీటిబిందువువలె, రంపంకొననుండి ఆవగింజ జారిపోవునట్లు— ఎవడు—రాగ — ద్వేష— మోహ-గర్వ-దంబం- అహంకారం నుంచి నిర్లిప్తుడో - ఎవరు తమ తప్పు తాము తెలుసుకుంటారో- వారిని బ్రాహ్మణుడంటారు.

"చంద్రునివలె నిర్మలుని- పరిశుద్ధుని- దోషరహితుని - వాంఛా విముఖుణ్ణి నేను బ్రాహ్మణుడంటాను. అలాగే - త్రికరణ శుద్ధికల వానిని- త్రికరణ సంవృత్తుణ్ణి బ్రాహ్మణుడంటారు" అన్నారు.

ఒకరోజున ఒక బ్రాహ్మణుడు వచ్చి - "బ్రాహ్మణుడంటే ఎవరు?" అని అడిగితే, పాపాలు పారద్రోలు వానిని - పూర్వజన్మ జ్ఞానం కలవానిని అత్యవసరమైన ధర్మం గుర్తెరిగిన వానిని-పునర్జన్మ రహితుని—సంపూర్ణ జ్ఞానంచే నిర్వాణ పథమునకు చేరువనున్న ముని సత్తముని- సర్వవిధముల సంపూర్ణుడగువానిని బ్రాహ్మణుడంటారు" అన్నారు.

"పవిత్రతను- దివ్యజ్ఞానమును అవగాహన చేసుకున్నవాడు- అతన్ని బ్రాహ్మణుడంటారు."

"ప్రవృత్తిని విసర్జించిన వాడిని – అపవిత్రత నుండి బైటపడ్డ వానిని- ఇంద్రియ నిగ్రహం కలవానిని — బ్రాహ్మణుడంటారు" అన్నాడు బుద్ధుడు.

* * *

ఒకసారి ప్రసేనజిత్ జేతవనం వెళ్ళి - బుద్ధుని దర్శించి - "ఎందరో మహాత్ములు–మహాపీఠుని వంటిజ్ఞానులు వుండగా బుద్ధుణ్ణే ఎందుకు సమ్యక్సం బుద్ధుడు" అని అనవలసి వచ్చింది? అని బుద్ధుణ్ణి ప్రశ్నించి- మళ్ళా- "అనుత్తర సమ్యక్ సంబోధిని (సర్వోత్తమ పరమజ్ఞానం) తెలుసుకుని వున్నానని మీరు నిష్కర్షగా చెప్పగలరా?" అనికూడా ప్రశ్నించాడు. దానికి బుద్ధుడు "అవును- సమ్యక్సంబుద్ధుడని నన్నే అంటారు," అన్నాడు. దానికి "మహాత్మా! పూర్ణకశ్యపుడు-మస్కరీగోపాలుడు- మొదలైన శ్రమణ బ్రాహ్మణులను, గణాధిపతులను- ఆచార్యులను - తీర్థం కరులను మిమ్మల్ని అడిగినట్లే అడిగాను. వారు-తమకు సత్యం తెలిసినట్లుగా-ధైర్యంగా, నిశ్చయంగా చెప్పలేకపోయారు. మరి మీరు–చిన్నవారు - కొత్తగా సన్యసించినవారు- ఇలా సాహసించి చెప్పవచ్చునా?" అని మళ్ళా అడిగాడు. దానికి బుద్ధుడు–నాలుగింటిని చిన్నవని తలంచరాదు– అనుమానించరాదు-చులకనగా చూడరాదు.

1) కులీనుడు- కీర్తిమంతుడు - ప్రతాపి - అగుక్షత్రియుని చిన్నవాడని తిరస్కరించినచో, ముందు, ముందు ముప్పురాక తప్పదు.

2) పాము చిన్నదని విడిచిపెడితే, అది పెరిగి పెద్దదై ప్రమాదం తెస్తుంది.

3) అగ్ని చిన్నకణమని ఉపేక్షిస్తే - రాజుకుని ప్రళయం సృష్టిస్తుంది.

4) "అగ్ని కాల్చగా బూడిదైన చెట్లు చిగురించగలవేమోకాని, జ్ఞానతేజముతో వెలుగు వానికి జనన – మరణములు, వుండవు. భిక్షువు - సన్యాసి- జ్ఞాని— వయసుతో నిమిత్తం లేకుండా అందరికీ పూజార్హుడు" అన్నాడు అని – సౌశీల్యప్రవర్తన – ఆపదల సమయంలో ధైర్యం మహాత్ముల లక్షణం. జ్ఞాని - మహానీయత, జ్ఞానికే తెలియును. విషయానంద పరాయణులైన గృహస్థులు, దాన్ని గుర్తించలేరు" అన్నాడు.

అది విని త్రిశరణాల్ని అనుష్ఠించి- (బుద్ధంశరణం గచ్ఛామి - ధర్మం శరణం గచ్ఛామి – సంఘం శరణం గచ్ఛామి–) బుద్ధుని అనుసరించి, శిష్యుడయ్యాడు. ఆయన ఆజ్ఞానుసారం - ఏనాడో విడిచిపెట్టిన భార్యాబిడ్డల్ని తీసుకున్నాడు. యజ్ఞయాగాది క్రతువుల్ని చేయడం విరమించుకున్నాడు.

అతనిలోని పరివర్తనం చూసి, "మనం చేసే పనుల ఫలం నుంచి-మనం తప్పించుకోలేము. కనుక సుకృతాలను అలవరుచుకో. చెడుచేయకు. నీ ఆలోచనల్ని పరిశీలించుకో. జీవనచాపలతను అర్థం చేసుకో. అంతా, అన్నీ మనసుపై ఆధారపడి వుంటాయన్న సంగతి అవగాహన చేసుకో. హేతువాద దృక్పథంతో సద్ధర్మ ఔన్నత్యాన్ని గుర్తించి ప్రవర్తించు," అని చెప్పి ధర్మదీక్ష ఇచ్చాడు బుద్ధుడు. ఆ తర్వాత అతడు గొప్ప ఉపాసకుడుగా మారిపోయాడు.

* * *

ఒకరోజున ఒకతను వచ్చి - "స్వామీ, నేను శూద్రుడను. నేను ముట్టుకున్న పాలు మీరు తాగుతారా? "అని అడిగితే," అవసరం గమనించి ధర్మం చేయడం మనుష్యుల మధ్య సుహృద్భావాల్ని పెంచుతుంది. కులమనేది రక్తంలో - కన్నీళ్ళలో - వంటి రంగులో లేదు. అది పుట్టుకవల్ల కలిగేదికాదు. కులమంటే, విభూతి, కుంకుమ జంధ్యం వంటి గుర్తులకు చెందింది కాదు. సత్కార్యాచరణపరుడే

ద్వేషుడు. దుష్కర్మ చేసేవాడు - అల్పుడు, పాపాత్ముడు. కనుక నువ్వేమీ సంశయించక తాగడానికి నాకు పాలు ఇవ్వవచ్చు. సోదరా, నేను దప్పికతో వున్నాను. అదే నా ప్రస్తుత అవసరం," అన్నాడు బుద్ధుడు.

* * *

అంగదేశంలో భద్రి లేక భద్రియ అనే గ్రామంలో ధనం జయుడు అనే ధనవంతుడు వుండేవాడు. అతని తండ్రి— మేఘుడు. అతని భార్య - సయనా - సోదరి — చంద్రపద్మ - ఏకైక కుమార్తె విశాఖ ఆమె - సహజసౌందర్యానికి తోడు — చదువు, సంస్కారం కలిగి, ఆకర్షణీయంగా వుండేది. పైకి చాలా నాజూకుగా కను పించినా, శారీరకంగా పురుషులతో సమానబలం కలిగి-ధైర్య సాహ సాలతో వుండేది.

బుద్ధుడు తమ గ్రామం వచ్చారని విని, విశాఖ - అందరితో పాటు ఆయన్ని చూడ్డానికి వెళ్ళింది. బుద్ధుడు విశాఖను దూరం నుంచే చూసి, "ఆమె నా ప్రధాన శిష్యురాలై, అందరికీ తల్లిలాగ వుంటుంది," అనుకున్నాడు. ఆ మర్నాడు ఆమె తాతగారైన మేఘు నికి, బుద్ధుని గురించి గొప్పగా చెప్పి, దర్శించమని సలహా ఇచ్చింది. అతడు వెళ్ళి - దర్శించి—ఆయన బోధలు విని - బౌద్ధం స్వీకరించి, బుద్ధుని తమ ఇంటికి ఆహ్వానించాడు. ఆయన వచ్చి - వారి ఇంట రెండువారాలున్నాడు.

కోసలరాజపుత్రికను బింబిసారుడు వివాహం చేసుకున్నాడు. బింబిసారుని ఆజ్ఞాను సారమూ, కోసలరాజు ఆహ్వానం మేరకూ, విశాఖ-తండ్రి ధనంజయుడు - కోసలదేశ పరిసర ప్రాంతంలో "సాకేతు" అనే నగరం నిర్మించుకుని, — అందు పరివారంతో వుంటూ—దానికి తానే నాయకుడుగా వ్యవహరిస్తున్నాడు.

శ్రావస్తిలో మిగారుడు అనే వర్తకుడికి "పూర్ణవర్ధనుడు—లేక పుణ్యవర్ధనుడు" అనే కొడుకు వున్నాడు. అతడు తనకు కాబోయే

భార్య-పంచ కళ్యాణి అయిన కన్య అయివుండాలన్నాడు. పంచ కళ్యాణి అంటే- నిత్యయవ్వనం - నెమలి పించంవంటి పొడుగాటి- నల్లనిజుట్టు,- ఎర్రటి పెదవులు - చక్కని పళ్ళవరస-మేలిమి బంగారు ఛాయ — కలది అటువంటి కన్యకోసం తండ్రి దేశదేశాలు వెదికించాడు.

ఒక ఉత్సవ దినమున-విశాఖ, చెలికత్తెలతో కలసినదీ స్నానానికి వెడుతుండగా, దారిలో పెద్ద వర్షం వచ్చింది. విశాఖ తప్ప, తక్కిన స్నేహితురాండ్రందరూ పరిగెత్తి — దగ్గరలోవున్న ఒక మండపంలోకి వెళ్ళారు. విశాఖ—మామూలుగా నడచుకుంటూ వెళ్ళి- పూర్తిగా-తడచిపోయింది. అప్పటికే ఆ మండపంలో—తన స్నేహితురాండ్రతోపాటు మిగారుడు పంపిన బ్రాహ్మణ పండితులు వున్నారు-"పంచకళ్యాణి" అన్వేషణలో. వారు విశాఖ విషయంలో అనవసరంగా కల్పించుకుని, "చూడమ్మా, అలా వర్షంలో తడిసిరాక పోతే, తక్కిన వారితో కలసి పరిగెత్తుకుని రావచ్చుకదా?" అన్నారు. విశాఖ వారి మందలింపు మాటలకు వెరవక-బెదరక- చెదరక-ధైర్యంగా-సిగ్గుపడకుండా, "సభకు వస్తున్నరాజు, పరుగులు తీస్తూవస్తే అనుచితంగా వుంటుంది. సన్యాసి-పరిగెత్తడం సముచితం కాదు. స్త్రీ-పరిగెత్తడం అందంగా వుండదు. అదీకాక, పెళ్ళికాని పిల్ల-పరిగెత్తి, పడి-కాళ్ళు విరగొట్టుకోవడంకన్నా, వర్షంలో తడవడం నయంకాదా? ఆ సంగతులన్నీ మీకు తెలియవా? అని మర్యాదగా మందలించింది. విశాఖ, వివేకాన్ని, సమయస్ఫూర్తిని ప్రకటించడమే కాక, "నేను పరిగెత్తి వుంటే, మీరందరికన్నా ముందుగా ఇక్కడకు వచ్చివుండేదాన్ని," అన్నది. ఆమె మాట్లాడుతున్నంతసేపూ, ఆ బ్రాహ్మణ పండితులు ఆమెను నఖ-శిఖ పర్యంతం పరీక్షగా చూశారు. అంతేకాక - ఆమె శిరోజాలు- దంతాలవరస-పెదవులు- దేహ ఛాయ— యవ్వన సంపద-అంతా చూసి-ఆమెను పంచ కళ్యాణిగా నిర్ధారించుకున్నారు. ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు, వెదకుతున్న పంచకళ్యాణి కనుపించగానే-వారు చాలా ఆనందించి-

ఆమె తండ్రిని కలుసుకుని విషయం చెప్పి-వివాహం నిశ్చయం చేసుకున్నారు.

శుభముహూర్తానికి మిగారుని బంధుమిత్రులు, పరివారం-పరిసర ప్రాంతాల రాజులు,-ఇంకా ఎంతోమంది జనం హాజరయ్యారు. వివాహం రంగరంగ వైభవంగా జరిగింది. విశాఖ ఎనలేని సంపదలతో-పరివారంతో అత్తవారింటికి వెళ్ళింది. ఆ సందర్భంలో తండ్రి-విశాఖకు హితబోధ చేశాడు- "గృహ దేవతలవంటి అత్త-మామలను గౌరవించు-ఇంట్లోని, లోపాలు బైటపెట్టకు. ఇరుగు - పొరుగువారి గొడవలు-వినడానికి ఆసక్తి చూపకు. అర్థుల అవసరాలు తీర్చుచు-హాయిగా, ఆనందంగా జీవించు," అని హితవుమాటలెన్నో చెప్పాడు. కాని, త్వరలోనే విశాఖకు - మిగారునికి మధ్య మనస్పర్థలు-ఘర్షణలు తగాదాలు వచ్చాయి. మిగారుడు "నిఘంటుడు లేక నిర్గ్రంథనాథపుత్రుడు" అనే దిగంబర తీర్థక స్వామి శిష్యుడు. విశాఖను-ఆ స్వామి సన్నిధికి తీసుకువెళ్ళాలనుకుని, తన వెంట రమ్మన్నాడు, మామగారైన మిగారుడు. ఆమె నిరాకరించింది. ఆ సంగతి తెలిసి-తీర్థక స్వామికి కోపం వచ్చింది. ఆమెను ఇంట్లోంచి వెళ్ళగొట్టమని మిగారునికి ఆజ్ఞవేశాడు. దానికి అతను, "స్వామీ! ఆమె పసిది. క్షమించండి," అని బ్రతిమాలాడు.

ఒకరోజున ఒక బౌద్ధ భిక్షువు మిగారుని ఇంటికి భిక్షకు వస్తే, "ఇది ఎంగిలి కూడు-పాచిపోయిన అన్నంతినే యజమాని ఇల్లు. ఇంక మీకేం పెడతారు. వేరే ఇల్లు చూసుకోండి," అన్నది విశాఖ. ఆ మాటలు విన్న మిగారునికి కోపంవచ్చి విశాఖను ఇంట్లోంచి పొమ్మన్నాడు. ఇంటి యజమానిగా, మామగారుగా-తానన్నమాట అర్థం "జన్మపరం పరలలో చేసుకున్న కర్మఫలితం అనుభవిస్తున్నవారు," అనే అర్థంలో అన్నాను అన్నది విశాఖ. అంటే, "ఈనాడు మీరు తింటున్నది,- పూర్వజన్మలో మీరు చేసుకున్న పుణ్యకర్మ పరిపాకంకాదా? పూర్వ జన్మలో చేసుకున్న పుణ్య ఫలాన్ని

ఇప్పుడు అనుభవిస్తున్నారు. అంతే," అని మామగారికి వివరించి చెప్పింది. ఆమె మాటలలోని అంతరార్థం అతనికి అర్థమైంది. అతడు ఆమెను ఇంట్లో వుండమని— తానూ బౌద్ధం స్వీకరించి, బుద్ధుని అనుసరించ నిశ్చయించుకున్నాడు.

ఒకసారి విశాఖ పుట్టింటికి ప్రయాణమైతే, మిగారుడు ఆమెను బ్రతిమాలి, ప్రయాణం ఆపితే—దానికి ఆమె ఒక నిబంధన విధించింది. ధార్మిక విషయాల్లో తనకు పూర్తి స్వేచ్ఛ వుండాలన్నది- దానికి మిగారుడు అంగీకరించాడు. ఆ మర్నాడు ఆమె-బుద్ధుణ్ణి తన ఇంటికి భిక్షకు ఆహ్వానించింది. "బుద్ధుడు ఆమె ఇంటికి భిక్షకు వెళ్ళకుండా- ఏ విధంగానైనాసరే- ఆపండి" అని తన శిష్యుల్ని- పరివారాన్ని నియమించాడు- తీర్థక స్వామి. అంతేకాదు, మిగారుని పిలిచి, గట్టిగా చెప్పాడు, "బుద్ధుని మీ ఇంటికిరానివ్వవద్దు. ఒకవేళ వచ్చినా- నువ్వు మాత్రం ఆయన్ని చూడకు. చూసినా, ఆయన్ని వినకు, "అని బుద్ధుడు వారి ఇంటికి భిక్షకు వచ్చాడు. భోజనానంతరం అక్కడ చేరిన వారికి ధర్మోపదేశం చేశాడు. మిగారుడు భయపడుతూనే దూరంనుంచే ఆయన బోధలన్నీ శ్రద్ధగా విన్నాడు. అవి-అతన్ని బాగా ఆకర్షించడంతో- ఆయన్ని మనసులో అనుసరించాడు. చివరికి నిలవలేక-వెళ్ళి, ఆయన కాళ్ళమీదపడి, సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆయన శిష్యుడై-తనకున్న అపార సంపదను బుద్ధునికి కైంకర్యం చేశాడు. ఆనందం పట్టలేక- మిగారుడు విశాఖతో, "నువ్వు నా కోడలివే, కావు-నన్ను కాపాడిన తల్లివి," అని ఆమె పాదాలకు నమస్కరించడంతో అందరూ ఆమెను "మిగారుమాత" అని పిలవ నారంభించారు. ఆ సందర్భంలో ఆమె-బుద్ధుణ్ణి కొన్ని వరాలు కోరింది. "నేను బ్రతికివున్నంతకాలం- ప్రతి వర్షాకాలం- బౌద్ధ భిక్షువులందరికీ తిండి-బట్ట-వసతి- సమస్త సౌకర్యాలు సమకూర్చేందుకు నాకు అనుమతి ఇవ్వాలి" అని కోరింది. బుద్ధుడు అంగీకరించాడు. అనాటి నుండి ఆమె భిక్షుక

సంఘానికి కల్పవృక్షంలాగ— కన్నతల్లిలాగ నిలిచింది. క్రమంగా ఆమె- బుద్ధుని శిష్యురాళ్ళంపరకూ పెద్దదిక్కు— అయింది. బౌద్ధ భిక్షువులకు తన ధనాన్నంతా ధారపోసింది. ఆమెకు పదిమంది మగపిల్లలు- పదిమంది ఆడపిల్లలు- ఆ పిల్లలకు పిల్లలు కలిగారు. బుద్ధుడు శిష్యులతో వైశాలి వెళ్ళినప్పుడు-వారంతా మకాం చేసేందుకు "తూర్పు తోట" అదే పుబ్బారామ- లేక పూర్వారామమని అనే ఒక ఆరామాన్ని ఏర్పాటు చేసింది. బుద్ధుడు తన నలభై ఐదేళ్ళ సుదీర్ఘ కాలంలో ఆరు వర్ష ఋతువులు ఆ ఆరామంలోనే గడిపాడు.

ఆ ఆరామ అవతరణకు సంబంధించిన ఒక గాథ వుంది.

బుద్ధుని ధర్మోపదేశాలు వినడానికి అందరితోపాటు విశాఖ కూడా రోజూ వెళ్ళేది; తనకున్న ఆభరణాలన్నీ ధరించి- సభాస్థలికి వెళ్ళేముందు వాటిని తీసి- దాసికి ఇచ్చేది. ఓరోజు ఆ దాసి, ఆభరణాల్ని ఓ చోట పెట్టి, తీసి- విశాఖకు ఇవ్వడం మరచింది. ఇంటికి వెళ్ళినతర్వాత విశాఖ అడిగితే, తాను మరచిపోయినసంగతి చెప్పింది. అప్పటికే ఆనందుడు ఆ ఆభరణాలను చూసి, తీసి-బుద్ధునికి చెప్పి దాచాడు. ఆ తర్వాత విశాఖ- ఆమెదాసి అక్కడకు వెళ్ళి ఆభరణాలకోసం వెతకడం ఆనందుడు చూసి, విషయం తెలుసుకుని, ఆభరణాలు ఇవ్వబోతే, వాటిని విశాఖ తీసుకోవడానికి నిరాకరించి, "భిక్షువుతాకిన వస్తువులు తిరిగి తీసుకోరాదు" అని "వాటిని బుద్ధునికి ఇవ్వబోతే, దానికి బుద్ధుడు" వాటిని అమ్మగావచ్చిన సొమ్ముతో భిక్షువుల నివాసానికి ఒక నిర్మాణం చేయరాదా?" అన్నాడు. ఆ నిర్మాణమే పూర్వారామ ఆశ్రమం.

కొన్నేళ్ళతర్వాత ఒకనాటి సమావేశంలో - విశాఖ ప్రస్తావన వస్తే- "పూలమాల కట్టడంలో నేర్పరి, పూలరాశి నుండి చక్కని పూలమాలలు తయారుచేయునట్లు మానవుడైనవాడు- తమకు ప్రాప్తిం

చిన సంపదద్వారా ఎన్నో పుణ్యకుసుమమాలలను విశాఖవలె తయారు చేయవచ్చు" అన్నాడు బుద్ధుడు.

*  *  *

కురుదేశంలో, ఘుల్లకొట్టిత గ్రామంలో "రాష్ట్రపాలుడు" అనే యువకుడు - ఇంట బ్రహ్మచర్యం కష్టమనుకుని, తమ గ్రామంలో బుద్ధుడు భిక్షువులతో మకాం చేసి వున్నారని తెలిసి, ఆయన దగ్గరకు వెళ్ళి తనకు సన్యాసం స్వీకరించి - బౌద్ధభిక్షువు కావాలనే కోర్కె వుందని చెప్పాడు. కాని, అతనికి దీక్ష ఇవ్వడానికి తల్లితండ్రుల అనుమతి లేనికారణంగా, దీక్ష ఇవ్వలేదు. అతడు నిద్రహారాలుమాని ఆమరణదీక్ష పూనాడు. అతడు వారికి ఏకైక సంతానం కావడంతో, తల్లితండ్రులు ఒప్పుకోలేదు. అతని విషయం తెలిపి బంధుమిత్రులు అతని సన్యాస స్వీకరణకు ఒక షరతు పెట్టారు. దానిప్రకారం— సన్యాస స్వీకరణానంతరం, అతడు తల్లితండ్రులను చూసుకునేటట్లు అతడు అంగీకరించాడు. కాని, అతడు అప్పటికే గృహస్థు కావడం చేత, తల్లితండ్రులు అతన్ని మంచిమంచి మాటలతో ధనాన్ని - భార్యని ఎరగా చూపి, ఆశపెట్టారు. వంశాంకురం కావాలని పట్టుబట్టి సంసారంలోకి దింపారు. తత్కారణంగా వారికి ఒక మగబిడ్డ కలిగాడు. ఆ సంగతి తెలిసి అతన్ని భిక్షుక సంఘంనుంచి వెలివేశారు.

*  *  *

రాజగృహలో సునీత అనే పాకీ అతను వుండేవాడు. ఒక రోజున అతడు బుద్ధునికి ఎదురైతే, ఆయనకు ఏమనిపించిందో, ఏమో, "నువ్వు భిక్షుక సంఘంలో చేరతావా?" అని అడిగాడు. అతడు ఏమీ ఆలోచించకుండా చేస్తున్న పనిని తక్షణం అక్కడే వదిలేసి, బుద్ధుణ్ని అనుసరించాడు. బుద్ధుడు అతనికి ధర్మోపదేశం చేశాడు. పవిత్రజీవనంతో అతడు త్వరలోనే అర్హతుడయ్యాడు.

ఆ తర్వాత స్వపాక అనే చండాలునికీ, సుమంగళ అనే హీన జాతివానికీ సుప్రబుద్ధుడనే కుష్ఠు వానికీ, ఇంకా అనేకమంది అధమ కులస్థులకూ బౌనిసలకు బుద్ధుడు దీక్ష ఇచ్చి, సంఘంలో చేర్చు కున్నాడు.

★ ★ ★

బుద్ధుడు ప్రచారకాలంలో – జేతవన విహారంలో– వేణు వనంలో — పూర్వారామంలో – కూటగారాశాలలో - న్యగ్రోధా రామంలో - గృధ్రకూటంలో–అలవీ, బేలువా గ్రామాలలో - ఇంకా అనేకచోట్ల విభిన్న వ్యక్తులకు బోధించిన ధర్మోపదేశములే – ధర్మ పదం. అది–ధర్మపద రూపంలో వున్న బుద్ధుని అమృతవాణి. అది ఆచరణీయమైనది- ఆచరణీయమైనది. ధర్మపదం- "శీలం సదా చారం" అను అర్థంలో వాడబడింది. వాటిని చిత్తశుద్ధితో అనుష్టిం చినవారు తరించగలరు. ఆ సందర్భంలో బుద్ధుడు - భిక్షువులకోసం- దశశీలాలు, గృహస్థులకోసం పంచశీలాలూ చెప్పారు, శీలాన్ని అభ్య సించడానికి సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం అవసరమన్నారు. సచ్ఛీలం వల్ల క్రమంగా చిత్తఏకాగ్రత కలుగుతుంది. అదే సమ్యక్ ధ్యానం. అదే సమాధికి మార్గం. మనసు - హృదయంలో లీనమైన స్థితి, అది సమ్యక్‌దృష్టి-సమ్యక్ సంకల్ప - ఆ రెండింటినీ కలిపి – జ్ఞానమంటారు.

సమ్యక్ యత్నం– సమ్మక్‌స్మృతి – సమ్యక్ ధ్యానం– ఈ మూడింటినీ కలిపి యోగమంటారు. ఈ జ్ఞానయోగం సిద్ధించుటే, నిర్వాణం. అంటే, చిత్తాన్ని సదాహృదయంలో లగ్నం చేయడం. అందుచేత-ధర్మప్రచార కాలంలో భిక్షువులు అవినీతి, అకృత్యాలకు చోటు ఇవ్వలేదు. తమ ధర్మమును స్వీకరించమని ఎవరినీ-ఎప్పుడూ- ఎందుకూ ఒత్తిడి చేయలేదు. ప్రలోభపరచలేదు. తమశీలం, త్యాగం- ప్రవర్తన-పరోపకారంతో ధర్మాన్ని వ్యాప్తి చేశారు, భిక్షువులు.

బుద్ధుడు ధర్మప్రచారం చేస్తూ అంగరాజధాని "కాంప"లో వుండగా కూసవశెట్టి అనే వర్తకుడు బౌద్ధసంఘంలో చేరి- త్వరలో సన్యాసం స్వీకరించాడు. అలాగే అవంతిలో కొందరు, మల్లాలో కొందరు బౌద్ధం స్వీకరించారు.

బుద్ధుడు అనుభవజ్ఞానంతో- అధికారంతో మాట్లాడేప్పటికి, రాజాధిరాజులే సింహాసనాలు దిగివచ్చి బౌద్ధం స్వీకరించి, ఆయన్ని అనుసరిస్తే, ఇంక సామాన్యప్రజలు ఏపాటివారు? ప్రజావాహిని బుద్ధునివైపు విపరీతంగా తిరిగింది. అటువంటి ధర్మం మున్నెన్నడూ వినలేదన్నారు, విజ్ఞులు.

"పోతాపాదా" అనే ఒకతను, "ఈ ప్రపంచం శాశ్వతమా? కాదా? అది పరిమితమా? అపరిమితమా? ఆత్మ, ఈ దేహం వంటిదా? ఆత్మ- దేహానికి భిన్నమా? మరణించినతర్వాత, పునర్జన్మ వుందా?" అని అనేక క్లిష్ట ప్రశ్నలు వేశాడు. దానికి బుద్ధుడు, "ఈ విషయాల్లో నేను- నా అభిప్రాయాలంటూ ఏమీ వెల్లడించను. ఎందు కంటే అవి నాకు ముఖ్య విషయాలు కావు. అసలు సత్యంతో సంబంధం లేని సంగతులవి. సత్ప్రవర్తన- అనాసక్తత- పవిత్రత- ప్రశాంతత- శాంతి, ఆనందం, జ్ఞానం పొందేందుకు- ఆ విషయాలకు సంబంధించిన విషయజ్ఞానం ఏమీ ఉపయోగపడదు. అవి-వీటికి చెందినవీ కావు. అవి నిర్వాణపథానికి తీసుకునిపోవు. అందుకే నేను వాటికి ప్రాముఖ్యత ఇచ్చి-వాటిగురించి మాట్లాడను. అంతకన్నా నేను చెప్పిన చతుస్సత్యాలను- ధర్మసూత్రాలను అవలంభించండి. మనోవాక్కాయ కర్మలలో పరిశుద్ధులై జీవించండి.

"వివేకవంతులు జాగరూకులై, ఆనందానుభూతి పొందుతారు. వారు, నిరంతరం- ప్రశాంతతను, లోదృష్టిని, పరిజ్ఞానాన్ని వృద్ధి చేసుకుని- స్థిరచిత్తులుగా వుండి, నిర్వాణం పొందుతారు. వారు- కామభావం- అంటే, ఏదోగా మారాలనే దృష్టినుంచి- అవిద్యనుంచి దూరంగా వుంటారు. ఇక్కడ దృష్టి అంటే అసత్యం నుంచి- తప్పుడునమ్మకాలనుంచి దూరంగా వుండటం.

"లౌకిక-భౌతిక- ప్రాపంచిక- సాంసారిక ప్రవృత్తుల నుంచి మనస్సును మళ్ళించినట్లయితే, అది- నీటినుంచి తీసి- గట్టున వేసిన చేపవలె గిలాగిలా కొట్టుకుని, తిరిగి ఆ నీటిలో దూకాలని- చివరి వరకు గట్టి ప్రయత్నం చేస్తుంది. ఎందుకంటే మనసు సుఖలాలస పరురాలు కావడంవల్ల, అతివేగంగా సంసారంలో ప్రవేశించాలని చూస్తుంది. అటువంటి మనసును అదుపు- ఆజ్ఞల్లో పెట్టడం, బహు కష్టం. దానికి శిక్షణ అవసరం. శిక్షణ ఎక్కువయ్యేకొద్దీ శాంతిగా వుంటుంది. వివేకవంతులు అంతకన్నా గట్టిగా-స్థిరచిత్తులై-నిశ్చల మనస్కులై-నిర్వాణాన్ని సాధించ యత్నిస్తారు. నిరంతరం మనసు చెదరకుండా పరిశీలిస్తోవుంటారు." నిర్వాణ పథాన్ని ఆకాంక్షించు వారు- రాగా- మోహ-అజ్ఞానాల నుంచి దూరంగా వుంటారు. వారు ఎటువంటి చిక్కుల్లోనూ చిక్కుకోరు. ఎందుకంటే- రాగ, ద్వేష, మోహాలే దుఃఖ కారణాలని వారికి తెలుసు.

"విజ్ఞాన సముపార్జనలో - వ్యర్థ వాదాలు పెట్టుకోవద్దు. స్వేచ్ఛగా మీ అభిప్రాయాల్ని వెల్లడించి, ఎదుటివారి అభిప్రాయాలు వినండి. వివాదం తప్పనిసరి అయితే, మీ ప్రతికక్షిడి నుండి కూడా నేర్చుకోవడానికి చూడండి. ఎందుకంటే, కేవలం శ్రవణేంద్రియం తోనూ, తార్కిక బుద్ధితోనూ కాక, అవగాహనతో, ఎరుకతో విన గలిగితే—అవివేకి నుండి కూడా ఎంతో విజ్ఞానం సంపాదించగలరు.

ఒకతను "నేను ఒక అమ్మాయిని ప్రేమించాను."

అంటే, మీరు అతన్ని అడుగుతారు, "ఆ అమ్మాయి ఏకులస్థురాలు? ఆమె గోత్రం ఏమిటి? ఆమె రూపం ఎలా వుంటుంది? ఆమె ఒంటి రంగు, ఎత్తు, గురించి అడిగితే, "అవన్నీ నాకేం తెలియవు. ఆ సంగతులు నాకు పట్టలేదు. కాని, నేను ఆ అమ్మాయిని నా హృదయమంతటితో ప్రేమించాను," అంటాడు. అప్పుడు మీరు, "నువ్వు అసలు ఆ అమ్మాయినే చూడలేదు. వూరికే మాట్లాడు

తున్నావు," అంటారు. అపునా? అటువంటి వారితో వాదించి, లేక, వారికి బోధించి ఏం లాభం?

"అజ్ఞానంతో-అవివేకంతో పూర్వ జన్మ, స్వర్గం, ముక్తి మొదలైన వాటికోసం వెతికేవారి సంగతి ఎట్లా వుంటుందంటే, నిండు చూలాలు తన గర్భంలో వున్న బిడ్డ "ఆడా-మగా?" అని తెలుసుకోవాలని కత్తితో పొట్టలో పొడుచుకుంటే, తల్లి-బిడ్డ ఇద్దరూ చనిపోతారు. అట్లా వుంటుంది-వాటి కోసం ప్రయత్నించే వారి సంగతి" అన్నాడు బుద్ధుడు. అని, "తంబూరా తీగలు త్రెంపి, దాని బుర్ర బ్రద్దలు కొడితే, ఇంత దాంట్లోంచి నాదం ఎలా వస్తుంది?

సంసార దుఃఖంనుండి తప్పించుకుని శాశ్వత సౌఖ్యం పొందే మార్గం. మధ్యేమార్గం. అదే అష్టాంగ మార్గం. ప్రాపంచిక విషయా సక్తులందరూ వ్యసనపరులే. వారు జనన మరణాలకు లోబడవల సిందే! నిర్వాణం ఒక్కటే, పరమ సుఖం. దానికి అష్టాంగ మార్గమే శరణ్యం. సర్వసాంసారిక దుఃఖాలకు తృష్ణయే కారణం గనుక, ఇంద్రియ నిగ్రహం-ధ్యానం-వైరాగ్యాలచే ఆ తృష్ణను రూపుమాపి, భిక్షుక వృత్తి నవలంభించుట మంచిది.

"సత్యావలోకనం" అంటే, భావాల్ని కల్పించుకుని సంతో షించడం, వ్యర్థమైన ఊహాల్ని ప్రకటించడం, శుష్క-భావ విలాసం-అదంతా కేవలం అభిప్రాయాల్లో సంచారం చేయడమే అవుతుంది. లక్ష్యంకలమనోస్థితే, నిర్వాణం," అన్నాడు. అని, "సత్యాన్ని అనుభవ పూర్వకంగా తెలుసుకోవలసిందేనన్నాడు."

పండితులు ఆత్మ గురించి యోచించి, ఆలోచించి, ఊహించి, కల్పించి-ఎంతో చెప్పారు. కాని, దేహం, ఆత్మకాదు. ఆత్మ-దేహం వంటి జడ పదార్థమైతే- అదీ జబ్బు పడాలి. అలాగే-ఆత్మ భావనా కాదు. దాన్ని చూడలేం, వినలేం. స్ఫురణ-చైతన్యం-ఏదీ ఆత్మ

కాదు. కాని, సర్వకాల-సర్వావస్థల్లో సమస్తానికి సాక్షీభూతంగా వుండేస్థితి ఒకటి వుంది. అదే నిజమైన-సహజమైనస్థితి. అదే, నిర్వాణస్థితి. అది, శూన్యంకాదు. సంబంధ రహిత కర్మతే-నిజమైన శూన్యత. అనాసక్తతే శూన్యత.

ఆత్మ అంటూ ఒకటి విడిగాలేదు. జరగవలసింది-మనసు లేక పోవడం. ఆ స్థితి-స్వచ్ఛం, స్వేచ్ఛాయుతం. అది, దేనివల్లా మురికీ-మరకా, మచ్చాపడదు. ఏదీ ప్రతిబింబించని-ఏదీ ప్రతి స్పందించని-ఏదీ ప్రతి ఫలించని, అద్దం వంటిస్థితి-అది తెలియాలంటే, అగ్ని లోంచి నడవాలి. అన్నింటి మీదా-ముఖ్యం. గతించి, మురిగి, కంపు కొట్టే విషయాల, సంగతుల మీద పూర్తిగా, గట్టిగా తిరగబడాలి. అంటే, గతం మీద తిరగబడాలి. అటువంటిస్థితి తత్త్వచర్చచేగాక, చిత్తశాంతిచే లభిస్తుంది.

ఆత్మ-లేక, బ్రహ్మం—వాస్తవంకావనీ, అది కేవలం మిథ్య యని-ఆత్మానాత్మ విచారమున మనిషిశ్లేష్మములోని ఈగవలె కొట్టు కుంటూ కాలాన్ని వృథాచేస్తున్నాడు. ఆ కాలంలో వర్తమాన అను భవం, గతకర్మఫలం. వర్తమాన ప్రవర్తన-భవిష్యత్తులో తటస్థపడే దానికి సూచన. అంతే!

కర్మచేయకుండా ఎవరూ వుండరు, వుండలేరు. ప్రతి కర్మ-ఫలితాన్ని ఇవ్వడం మరచిపోదు. కర్మకు కారణం వున్నంత వరకు-దాని ప్రతి ఫలం అనుభవించక తప్పదు. కర్మలు మూడు విధాలుగా జరుగుతాయి: కాయక కర్మ-వాచక కర్మ-మానసిక కర్మ. కర్మ, బైటనుంచి వచ్చేదికాదు. ఏ దైవం చేతనో అది మన మీద విధింప బడేదికాదు. అది మన స్వభావం వల్లనే జరుగుతుంది. మన మాన సిక అలవాట్లు, అభ్యాసాలు, ఊహలు, భావాలు, అభిప్రాయాలు, ఆలోచనలు, సంబంధాలు, ఆపేక్షలు, కోర్కెలు, ఇష్టాలు-మొదలైన వాటి ఫలితమే, కర్మ—ఆ విధంగా చూస్తే, మనగతమంతా కర్మే-

కర్మ ఫలితమే- ఆ కర్మ, వర్తమానాన్ని ఏర్పాటు చేస్తుంది గనుక, వర్తమాన జీవితం కర్మలచేత బంధింపబడి వుంటుంది. వర్తమానంలో చేసే కర్మ ఫలితమే- భవిష్యత్తులో తటస్థపడుతుంది. ఆ ఫలితాలు భవిష్యత్తులో మనస్థితి-గతుల మీద తమ ప్రభావాన్ని చూపుతాయి.

కర్మల్లో వ్యత్యాసం వల్లనే మనుష్యులందరూ ఒకే విధంగా వుండరు. కొందరు దీర్ఘకాలం జీవిస్తారు. కొందరు తక్కువ కాలం జీవిస్తారు. కొందరు ఆరోగ్యంగా-కొందరు అనారోగ్యంగా- కొందరు జ్ఞానంతో-కొందరు అజ్ఞానంగా- అట్లా అట్లా వుంటారు. అవంతా గత ఫలితమే. కాని, నిర్వాణస్థితిని అందుకున్నవారు- ఎటువంటి కర్మచేసినా-దాని ప్రభావం వారిపై పనిచేయదు. ఎందుకంటే కర్మ-కాంక్షతో జరిగినప్పుడే ఫలితం అనుభవంలోకి వస్తుంది. నిష్కామకర్మ చేస్తే, ఆ ఫలితం వారిని బంధించదు- బాధించదు. కర్మ, కాంక్షతో చేసినప్పుడే అది బంధహేతువు అవుతుంది. అదే, భవిష్యత్తుకు దారితీస్తుంది. అది మనోభ్రమకు, దుష్కర్మకు దారి తీస్తుంది. దుష్కర్మఫలితమే దుఃఖం. అందుకే బుద్ధుడు అంటాడు, "చెడు చేయకు. హృదయాన్ని పరిశుభ్రం చేసుకో," అని కనుక మనం సదా సత్కర్మాచరణే గావించాలి.

ఈ కర్మ విధానం వ్యక్తికి ఒక ఓదార్పుగా పనిచేసి, నైతిక ధర్మాన్ని- విశ్వాసాన్ని, అన్నింటినీ మించి ఆదర్శాన్ని కలిగించి అతన్ని దయార్ధ్ర మూర్తిగా మారుస్తుంది. చెడునుంచి తప్పించుకునే నిగ్రహశక్తినిచ్చి, సహనాన్ని కలిగిస్తుంది.

చైతన్యస్థితి- నిత్యం-నిర్విరామంగా సాగిపోయే ఒక మహానది వంటిది. ఆ నదీ ప్రవాహపు తీవ్రతను- దాని శక్తిని మనం ఏ విధం గానూ ఆపలేము, తెలుసుకోలేము. మనలో ఒక భావం పుట్టింది అంటే, మనలో వేరొక భావం, గతంలో కలిగి- అది-పోయింది "అని అర్థం. జనన-మరణ విషయమూ అంతే భావం వున్నంత

కాలం, జీవి వుంటుంది. కాని, భావం, క్షణికం. కనుక జీవి, క్షణికమే! దానికి ఆధారమైనా శరీరమూ అంతే! భవిష్యత్తులో మనం ఏం కాబోయేదీ ఆ క్షణంలో మనలోవున్న భావమే నిర్ణయిస్తుంది. మరణ సమయంలో వున్న భావమే, మరో జన్మకు కారణమౌతుంది. ప్రాణం పోయిన తర్వాత, కర్మశక్తి వేరొక రూపంలో దర్శనమిస్తుంది. అది ఏ విధంగానైనా దర్శనమివ్వవచ్చు. లేదా, కనుపించకుండానూ వుండవచ్చు. అనుకూల పరిస్థితుల ప్రభావంతో అది దర్శనమిస్తుంది. దానికి కాలనిర్ణయంలేదు. ఒకానొక మానసిక-శారీరకస్థితి స్వరూపం సమున్నతం కావడమే, జన్మ. తాత్కాలికమైన ఆ స్థితి స్వరూపం, మారడమే మరణం.

ఏదైనా ఫలితం అంటూ వుంటే, దానికి ముందు ఒక కర్మ వుండి తీరవలె. ఆ కర్మకు కారణం దేవుడు అంటారు కొందరు. కాదంటారు మరికొందరు. దేవుడే కారణం అంటే, జీవితానికి ఒక ప్రారంభం అంటూ వుండాలి. ఫలితమే కర్మ అయితే, దానికి ప్రారంభం— ఆది—మూలం— అంటూ వుండదు.

జన్మ-ఒక అల. అది తిరిగి మహాసముద్రంలో కలసి, మరో అలగా పైకి లేస్తుంది, అవిరామంగా, అనంతంగా- జనన- మరణాలు రెండూ మానవజీవితంలో ఎడతెగకుండా- అలలు మాదిరిగా వస్తూ-పోతూ వుంటాయి. ఆ జీవన ప్రవాహం అవిచ్ఛిన్నంగా సాగిపోతూ వుంటుంది. "అజ్ఞానం- కోర్కె" అనే బురద, జీవితంలో పేరుకు పోయినంతకాలం జనన-మరణాలు తప్పవు. అవిపోతే, పునర్జన్మ వుండదు.

బుద్ధుడు జీవించి వున్న వారి సంగతే ప్రస్తావించాడు. వారిని సదా- సంక్షోభపరిచే నైతిక, ఆధ్యాత్మిక సమస్యలన్నింటినీ పూర్తిగా పరిష్కరించడానికి పూనుకున్నట్లు లేదు.

దుఃఖం- దాని నివారణ: బాధ- దానిని నిర్మూలన అంత వరకే శిష్యులకు, అనుచరులకు చెప్పాడు.

జనన మరణాలకు మూలకారణం, అజ్ఞానం. అజ్ఞానం పోయి, స్వస్వరూప జ్ఞానం కలిగితే, అంటే- సత్యసందర్శనమైతే - ఇంక జనన- మరణాలు వుండవు. "నేను" అనే అహంభావం వుంటే, కోర్కె కలగడం సహజం. ఆ కోర్కెవల్ల కర్మ జరుగుతుంది. కోర్కె ఆగి, స్వస్వరూప జ్ఞానం కలిగిన క్షణాన జీవనవాహినికి అంతరాయం- అడ్డు ఏర్పడుతుంది.

సముద్రజలాల్ని బంధించగలమా? గాలిని గుప్పెట్లో నిలప గలమా? సత్యాన్ని అంతే! సత్యం- దీపంవలె వుండి, నిర్వాణ మార్గాన్ని చూపి, నడిపిస్తుంది. ఆ సత్యం- పరిశోధన, పరిశీలన, పరీక్ష వలన తెలుస్తుంది. అటువంటి సత్యసందర్శనం- కార్య- కారణాల్ని తెలుపుతుంది, నేర్పుతుంది సత్యానికి స్వార్థాన్ని పూర్తిగా శరణాగతి గావిస్తే, చెడునుంచి విముక్తి కలుగుతుంది. పరమశాంతి లభిస్తుంది. అది కలిగినవాడు గురువుగా నిలుస్తాడు. బుద్ధుడు అవుతాడు. చెడుకి కారణం, నైతికపతనం. అది, స్వార్థానికి దారి తీస్తుంది. స్వార్థం, భ్రాంతికి దారితీస్తుంది. ఆ భ్రాంతి, సత్యసందర్శనంతో తొలగుతుంది.

★ ★ ★

ఒక గృహిణి భర్తతో చెప్పి, బౌద్ధ ఆశ్రమానికి వెళ్ళి, ఆ వాతావరణం ఇష్టపడి, భిక్షుణిగా చేరవలచినట్లు ఆశ్రమవాసులతో చెప్పగా, వారు ఆమెను దేవదత్తుని దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆమె అప్పటికే గర్భవతి- కావడంచేత, భిక్షుణిగా అనర్హురాలని, తిరిగివెళ్ళి, గృహస్త జీవితం గడపమని సలహా ఇచ్చాడు, దేవదత్తుడు.

ఆమె అక్కడనుంచి సరాసరి బుద్ధుని దగ్గరకు వెళ్ళి తన అభీష్టాన్ని చెప్పి- దేవదత్తుని, నిరాకరణ- ఆయన ఇచ్చిన సలహా కూడా విన్నవించింది. ఆ విషయాన్ని పరిష్కరించమని బుద్ధుడు ప్రసేనజిత్తుకు- విశాఖకు- అనాథపిండకునికి- అప్పగించాడు. ఆమె పూర్వాపరాలన్నీ తెలుసుకుని- గర్భవతి అనే సంగతి ఆమెకు తెలియ

దని- కాని, ఆమెకు భిక్షుణిగా చేరాలనే అభిలాష అధికంగా వుండని గ్రహించి- ఆమె ఆశ్రమంలో వుండవచ్చునని తీర్పుచెప్పారు.

త్వరలోనే ఆమె మగశిశువును ప్రసవించింది. ఆ పిల్లవాని పేరు- కుమార కాశ్యప. అతడు పెద్దవాడై- బుద్ధుని శ్రద్ధగా విని- వయసురాగానే- అరణ్యాలకు వెళ్ళి- తీవ్రతపస్సు చేశాడు. పన్నెండేళ్ళ తర్వాత ఆ తల్లి- కొడుకుకొరకు గొడవపడి- అతన్ని అన్వేషిస్తో- అరణ్యాల వెంబడి అరుస్తో తిరిగింది. ఒకచోట కుమార కాశ్యపుడు తల్లినిచూసి, "అమ్మా, నువ్వు ఇంకా ఈ భవబంధాలను త్రెంచుకోలేదా?" అని అడిగాడు. ఆ మాటతో ఆమెకు జ్ఞానోదయమై- బంధాలు త్రెంచుకుని, అర్హతురాలైనది. ఆ సంగతి తెలిసి- నిర్వాణపథాన్ని పొందడానికి ఇతరులెవరిపైనా ఆధారపడక తన కాళ్ళపైతాను నిలవాలి" అనిచెప్పాడు బుద్ధుడు. ఆనాడు దేవదత్తుడు ఆమెను సంఘంలో చేర్చుకోవడానికి నిరాకరించాడు. ఆమె అంత గట్టిపట్టుపట్టకపోతే-తల్లి, కొడుకు అంతటి మహాత్ములు అయ్యేవారు కాదు.

* * *

బుద్ధుడు జేతవనంలో వుండగా చక్షుపాలుడు అనే ఒక భిక్షువు బుద్ధుని దర్శనార్థం వచ్చాడు. ఒకరోజున ఆయన ఆశ్రమంలో అటూ ఇటూ పచార్లు చేస్తుండగా- ఆయన కాళ్ళకింద కొన్ని కీటకాలు పడి, నలిగి, చనిపోవడం తక్కిన భిక్షువులు చూసి- బుద్ధునితో ఫిర్యాదుగా చెప్పగా- "అతను అర్హతుడు. ముక్తపురుషుడు కీటకాల్ని చంపాలనే ఉద్దేశ్యం అతనిలో ఏమాత్రం లేదుకనుక, అతను నిర్దోషి, "అని-" ఎరుకలేకపోవడానికి అతని సంస్కారాలు అడ్డువచ్చాయి. బండిని లాగే ఎద్దుల పాదాలను చక్రాలు అనుసరించి- కదలినట్లు- సంస్కారాలు అతని వెనక వస్తున్నాయి" అన్నారు.

★ ★ ★ ★

అలాగే ఒకసారి భిక్షువుల మధ్య సిద్ధాంతపరమైన స్పర్థలు రావడం బుద్ధుడు గమనించి- వారిని ఉద్దేశించి, "ప్రాజ్ఞులైనవారు- తాము ఎప్పటికైనా మరణించువారమనే సత్యాన్ని గుర్తించి- అనవసర, అప్రస్తుత విషయాల్లోకి దిగి- ఘర్షణపడరు. ఉపశమన సంపన్నులుగా వుంటారు" అన్నాడు.

★ ★ ★

ఒక బౌద్ధభిక్షువుకు దీర్ఘకాల సాధనానంతరం జ్ఞానోదయ మైంది. అన్ని సంవత్సరాల సాధనాకాలంలో తనను అన్ని విధాల ఆదుకుని ఆదరించిన స్వగ్రామస్థులకు తానుతెలుసుకున్న సత్యాన్ని- బౌద్ధధర్మాన్ని బోధించాలని స్వగ్రామంవెళ్ళి-ఊరుబైట, గంగానది ఒడ్డున వున్న పెద్ద కొబ్బరితోటలో మకాం చేశాడు.

ఒకరోజున ఆ దేశపురాజు ఉదయనుడు అంతఃపుర పరివారంతో వినోద కాలక్షేపానికి ఆ కొబ్బరితోటకు వచ్చి—అందు నిశ్చల ధ్యాన సమాధిలో వున్న ఆ బౌద్ధభిక్షువును చూసి సంతోషించి, వెళ్ళి దూరంగా ఒక చెట్టుకింద విశ్రాంతిగా వున్నాడు. కొంతసేపటికి రాజుగారికి నిద్ర పట్టింది.

నిద్ర లేచి చూసేప్పటికి అంతఃపుర స్త్రీలు- పరివారం, అంతా ఆ భిక్షువుచుట్టూ కూర్చుని, ఆయన్ని తదేకంగా ఆరాధనతో చూస్తున్న దృశ్యం కనుపించింది. వారిదగ్గరకు వెళ్ళాడు. ఆ భిక్షు వారికి ఏదో చెపుతున్నారు. వారు శ్రద్ధగా వింటున్నారు. అది చూసి రాజుకు ఈర్ష్య కలిగి, "మీ వంటి పవిత్రులు- ఆడవాళ్ళ మధ్య కూర్చుని ముచ్చటించడం క్షమించరాని విషయం," అన్నాడు. దానికి ఆ భిక్షువు మౌనంగా వున్నాడు. దానితో రాజు కోపో ద్రిక్తుడై-కత్తితీసి చంపుతానని ముందుకుపోయి బెదిరించాడు. ఆయన భయపడలేదు. మౌనం వీడలేదు. ఏమాత్రం చలించలేదు. నిశ్చలంగా కూర్చున్నాడు, శిలాప్రతిమవలె. దానితో రాజుకు

మరింత కోపం వచ్చి- ఇంకా దగ్గరకు వెళ్ళి, చెరువలో వున్న చెదల పుట్ట తీసి, ఆయన ముఖంమీద వేశాడు. అయినా ఆయన కదల లేదు. మాట్లాడలేదు. దేనికీ చలించని ఆయన్ని చూసి, రాజు పశ్చాత్తాపపడి, తన తప్పు ఒప్పుకుని, సిగ్గుపడి, క్షమించమని ప్రార్థించాడు. అయినా ఆయననేమీ మాట్లాడలేదు.

ఆ తర్వాత ఆయన్ని అనుసరించి అర్థించి, ధర్మం తెలుసుకుని, సంఘసభ్యుడైనాడు. ఆ విధంగా బౌద్ధం మొదట ఆ దేశంలో అంతఃపురంలో ప్రవేశించింది. అక్కడనుంచి దేశమంతా విస్తరించింది.

* * *

వైశాలి నగరంలో "ఆమ్రపాలి- లేక- అంబాపాలి" అనే ఆమె వుండేది. ఆమె- ధనికుడైన ఒక వైశ్యుని కుమార్తె. సాటిలేని సుందరి- ఆమె అందానికి రాజకుమారులు ఆకర్షితులై- వివాహం చేసుకోవడానికి పోటీపడి- చివరకు ఆమెను వేశ్యగా మార్చారు. తత్ఫలితంగా ఆమె వైశాలిలో సుప్రసిద్ధ రాజనర్తకిగా జీవితం సాగించింది. ఆమె ఖ్యాతి దేశ విదేశాల్లో వ్యాపించింది. రాజగృహకు చెందిన ఒక ఉన్నతోద్యోగి వైశాలి వెళ్ళినప్పుడు, ఆమెను చూసి- అటువంటి రాజనర్తకి మగధదేశంలో కూడా వుండాలని బింబిసారునికి చెప్పి-సాలవతి" అనే అపురూప సుందరిని నియమించారు, రాజనర్తకిగా.

ఆ సాలావతిని-బింబిసారుని కుమారుడైన అభయుడు ప్రేమించాడు. ఆమె గర్భవతి అయింది. అనారోగ్యం నెపంతో-దర్బారుకు వెళ్ళి-నాట్యం చేయక, ఇంట్లోనే వుండి-ఒక మగ శిశువును ప్రసవించింది. ఆ బిడ్డను రహస్యంగా అడవిలో వదలి రమ్మని నౌకర్లతో చెప్పింది. వారా బిడ్డను అడవి మధ్య వదలి వచ్చారు. అదే రోజున-అభయుడు-అదే ప్రాంతానికి వేటకు వెళ్ళాడు. అతడా

బిడ్డను చూసి-దయతలచి-ఇంటికి తెచ్చి- "జీవకుడు" అని పేరుపెట్టి-పెద్దవాణ్ని చేశాడు.

మిత్రులు జీవకుణ్ణి హేళన చేయడంతో, తన జన్మవృత్తాంతం చెప్పమని తండ్రిని నిర్బంధించాడు. అతడు అంతా నిజం చెప్పాడు. పెంచాను కనుక నేను నీ తండ్రిని అన్నాడు అభయుడు. జీవకుడు వెంటనే తక్షశిలవెళ్ళి-ఏడు సంవత్సరాలు-వైద్యవిద్య అభ్యసించి-రాజగృహకు తిరిగి వచ్చి, ప్రజలకు వైద్య సేవలందించాడు. బింబిసారునికి వ్రణం వేస్తే-నయం చేశాడు. రాజు సంతోషించి-కొన్ని గ్రామాలు అతనికి దానం చేశాడు. ఇంకా అనేకమందికి వైద్యం చేసి-మంచి పేరు ప్రఖ్యాతులతో పాటు ధనం సంపాదించాడు. ఆ తర్వాత ఆస్థాన వైద్యుడుగా నియమితుడయ్యాడు. అతనికి బుద్ధుడంటే ఎంతో గౌరవం, ప్రేమ- ఒకసారి బుద్ధునికి కూడా వైద్యం చేశాడు. తాను బౌద్ధ భిక్షువు కావాలనుకుంటే, బుద్ధుడు అంగీకరించక, నువ్వు స్వేచ్ఛగా వుండి-సమస్త ప్రజానీకానికి వైద్యసేవలు అందించమని సలహా ఇచ్చాడు. బౌద్ధ ధర్మాన్ని ఆచరిస్తూ-తన తోటలో ఒక విహారం నిర్మించుకుని - అక్కడకు బుద్ధుని ఆహ్వానించి, తీసుకువెళ్ళాడు. బుద్ధుడు అక్కడ కొన్నాళ్ళు వున్నాడు.

బింబిసారుని అనంతరం అజాత శత్రువు రాజైన తర్వాత జీవకుడు అతనికి కూడా వైద్యం చేశాడు. అతని ఆదరణ కూడా పొందాడు. భిక్షువులు ఉన్ని బట్టలు ధరించడానికి బుద్ధుడు అంగీకరించేటట్లు చేశాడు.

★ ★ ★

ఒకసారి అంబాపాలి బుద్ధుణ్ణి దర్శించి-ఆయన్ని తన ఇంటికి భిక్షకు ఆహ్వానించింది. ఆయన అంగీకరించాడు. ఆ సంగతి తెలిసి నగర పెద్దలు- ప్రముఖులు-ముఖ్యం-బ్రాహ్మణులు - ఆమె ఇంటికి బుద్ధుడు భిక్షకు వెడితే ఆ సంగతి తమకు అవమానకరం- అగౌరవం -

అమర్యాదగా భావించి, గతిలేక ఆమెను ప్రతిమాలి, ఆ భిక్ష ఏదో మేమే ఇస్తామన్నారు. ఆమె అంగీకరించలేదు. బుద్ధుడు ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆమె ఆయన పక్కన కూర్చొని వంటలు స్వయంగా వడ్డిస్తో, ఆరాధనగా చూస్తో- తన్మయత్వంలో మునిగి పోయింది. భోజనా నంతరం-బుద్ధుడు- "ప్రపంచంలో ఈ అసమాన తలకు—ఎగుడు దిగుడులకు కారణం-ఏమిటి? ఎవరో-ఏదో ఒక అదృశ్య శక్తి-లేక వ్యక్తి-ఈ ప్రపంచాన్ని ఈ విధంగా నడిపిస్తున్నారంటే, అతణ్ని నిశ్చయంగా నిర్దయుడు - అన్యాయం చేసినవాడు అనక పోరు. ప్రతి సంఘటన-ప్రతి ఆలోచన—భావన-కోర్కె- ఇవన్నీ ఆయనవనే అయితే - అవి కలిగిన ఆయావ్యక్తులను బాధ్యులుగా ఎంచడం అధర్మం. కనుక-అసలు మూల పురుషుడే - ఆ శక్తిస్వరూపుడో బాధ్యుడు అంటారు కొందరు. తమకు జనన-మరణాల సంగతి తెలియక. కాని-దీనికంతకూ కారణం. పూర్వజన్మలో చేసిన ఈ జన్మలో చేస్తున్న కర్మల ఫలితమేననే సంగతి మరువకూడదు.

స్వయం కృతమైన కర్మకు తప్పకుండా ఫలితం వుంటుంది. కర్మను మన నెత్తిమీద రుద్దేవారు ఒకరు ఉన్నారను కోరాదు. దాని కదే ఒక శాసనం. కనుక మనం చేసే మంచి-చెడ్డ పనుల ఫలితంగా సుఖ-దుఃఖాలు ఏర్పడతాయి. నిజమైన సత్యాన్వేషకులు తనను కాపాడమని ఎవరినీ ఎప్పుడూ-ఎందుకూ అర్థించరు. తన ఉన్నతికి- స్వశక్తి మీద ఆధారపడి, కృషి చేస్తారు. నిర్విరామంగా, అది-వారి వ్యక్తిగతమైన బాధ్యత," అన్నారు.

ఒకసారి "సుభ" అనే అతను, "ఈ వైపరీత్యాలకు- విభేదాలకు-తేడాలకు- అసమానతలకు — ఎగుడు దిగుడులకు - కారణం ఏమిటి?" అని బుద్ధుణ్ణి అడిగితే,- "జీవించే ప్రతిదానికి గతజన్మలో చేసిన కర్మ ఒకటి వుంటుంది. తత్ఫలితంగా ఉన్నతులు - అధములు- అట్లావ్యత్యాసాలు ఏర్పడతాయి," అన్నారు.

త్వరలో అంబాపాలి బౌద్ధభిక్షుణిగామారి—తన మామిడితోటతో

పాటు, తన ఆస్తినంతా బౌద్ధ సంఘానికి దానంచేసి-చివరకు మిగి లిన తన రమ్య సౌధాన్ని కూడా సంఘానికి దానం చేసింది.

★ ★ ★

బుద్ధుని సంచార జీవితంలో తటస్థపడ్డ కొన్ని చిత్ర-విచిత్ర మైన సంఘటనల్ని-సంగతుల్ని-విషయాల్ని చరిత్రకారులు- పరిశో ధకులు తమకు వీలైన విధాల పదిలపరచి-ప్రచారంచేసి, తెలియ పరిచారు. వాటి వాస్తవా- అవాస్తవాలను ఈనాడు-ఇరవైఐదు వందల సంవత్సరాల తర్వాత నిర్ణయించి, నిర్ధారించ వీలుకాదు. ఆ సంగతులన్నీ చాలా వరకు ప్రచురణలో ప్రచారంలో వున్నాయి. నేను స్వీకరించిన కొన్ని సంగతుల్నికూడా ఇక్కడ పొందు పరు స్తున్నాను.

సుప్రియ అనే ఒక గురువుగారు-బుద్ధుణ్ణి ఏదో అంటున్నా రనీ, విమర్శిస్తున్నారనీ, నిందిస్తున్నారనీ ఒక శిష్యుడు బాధపడి బుద్ధునితో చెపితే, "చరిత్ర పొడవునా-పరిశీలించిచూస్తే-మనుష్యులు- ఎటువంటి వారినైనా-ఏ కారణానికైనా-ఒక్కొక్కసారి నిష్కారణంగా కూడా-విమర్శించడం జరుగుతూనే వుంది. ఏమీ చెప్పని-మాట్లాడని వాడు మరింత విమర్శకు గురి అవుతాడు. ఎంతో చెప్పిన వాడూ, విమర్శకు గురి అవుతాడు. ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కడూ విమర్శ లకూ, దూషణలకూ తప్పని సరిగా గురికావలసిందే" చివరికి రారాజులు సహితం విమర్శలకు గురికావలసిందే.

భూమినీ, సూర్య చంద్రాదుల్ని-నన్నూ-మీ మధ్య నేను కూర్చుని ఇట్లా మాట్లాడటాన్ని - అన్నింటినీ విమర్శిస్తారు. ఆ విమర్శల్ని కొందరు మెచ్చుకుంటారు. వివేక వంతుల దృష్టిలో దూషణ-భూషణలు ఒక్కటే. బుద్ధిహీనులైనవారు - అజ్ఞానులైన వారు-ఎక్కువగా విమర్శిస్తూ వుంటారు. విమర్శించడంవల్ల తమను తాము రక్షించుకుంటున్నామనుకుంటారు. దానికి కారణం-స్వార్థ

రక్షణ వాంఛ. దోషాలలోకెల్ల దోషం-అజ్ఞానం. దాన్ని మించిన దోషం మరిలేదు. భిక్షువులారా, ఆ దోషాన్ని దూరంగా త్రోసి-సుజ్ఞానులై సుఖించండి.

"ఇతరులను విమర్శించడం ద్వారా, తాము ఉన్నతులం అను కుంటారు-ఇతరుల దోషాల్ని ఎన్నుట ద్వారా-తాము ఉత్తములం అనుకుంటారు. అందుకే అంతటి విమర్శలకు దిగుతారు అది అహంకార జనితం.

కనుక ప్రతి ఒక్కరూ వివేకవంతులు కావాలి. అంటే, తమను తాము శ్రద్ధగా, నిజాయితీగా, పరిశీలించుకుంటో-పరీక్షించు కుంటో- పరిశోధించుకుంటో తెలుసుకోవాలి. అది అనుక్షణం జరగాలి. అంటే, దృశ్యా-దృశ్య స్వప్నాలనుంచి మేల్కోవాలి. ధర్మ జీవనంచేత వ్యక్తిత్వ-శారీరక భావ విభ్రాంతిని పెరికెయ్యాలి. స్వరూపజ్ఞాన జ్వాలలో - ఇంద్రియ వ్యామోహాలను భస్మం చెయ్యాలి.

"ఎవరో-ఏదో-ఎవరో అంటున్నారని మీరెందుకు గొడవ పడతారు? ఆవేశపడకండి. మనో విజృంభణతో అశాంతిగా వుండ కండి. శాంతంగా వుండండి. ఓర్పు కలిగివుండండి. ఇతరులు నన్నూ-నా పద్ధతినీ-నా నడవడినీ-నా చుట్టూవున్న మిమ్మల్ని-సంఘాన్ని—సన్యాసుల్ని- విమర్శిస్తున్నారని మీకు రోషం ఎందుకు? మీలో అటువంటి మనోవిజృంభణ- కోపం- ఆందోళన- అశాంతి వుంటే అది మీ సాధనకు అభ్యంతరం. మీ పురోభివృద్ధికి అవరోధం ఆటంకం. సహనం— అవగాహనా పటిమ లేనిది, మీరు-వారి మాట ల్లోని నిజాన్ని ఎట్లా అర్థం చేసుకోగలరు?

"అసలు వారు ఏమంటున్నారో ముందు దాన్ని అర్థం చేసు కోండి. పరీక్షించి చూడండి. వాళ్ళు మిమ్మల్ని సమర్థిస్తే- మెచ్చు కుంటే- ఇష్టపడితే- మీరు సంతోషిస్తారు. అవునా? అటువంటప్పుడు

వాళ్ళు మిమ్మల్ని ఎందుకు సమర్థించి- మెచ్చుకుంటున్నారో ఆ సంగతి కూడా పరిశీలించి- అవగాహన చేసుకోండి. మీ యెడల వారి మెప్పు- ఎంతవరకు సరైనదో— సమంజసమో— మీ వివేకంతో మీరు తెలుసుకోండి. ఈ ప్రపంచం ఎప్పుడూ- అనవసర విషయాలకూ, అల్పము- స్వల్పము— తుచ్ఛము—నీచము— అముఖ్యము— నిస్సారము అయిన సంగతులకు విలువ ఇస్తుంది. నిజమైన వాటికి- సత్యమైన దానికి-సరైన సంగతులకు— అంటే, ముఖ్యమైన వాటికి విలువ ఇవ్వదు" అన్నాడు బుద్ధుడు.

*   *   *

ఒకాయన బుద్ధుని యెడల చెడు తలపెట్టినా- బుద్ధుడు మంచే చేసినందుకు ఆయన రోషపడి— బుద్ధుని వద్దకు వెళ్ళి— ఆయన్ని నిందించాడు. బుద్ధుడు అతని అమాయకత్వానికి జాలిపడి "తన కోసం తయారై సిద్ధంగా వున్న బహుమానాన్ని స్వీకరించక-నిరాకరిస్తే— ఇంక ఆ బహుమానం ఎవరికి చెందేటట్లు?" అని బుద్ధుడు అతన్ని ఎదురుప్రశ్న వేశాడు. దానికతడు, "అది ఇవ్వబోయిన వానికే చెందుతుంది," అన్నాడు.

"అయితే- నేను నీ నిందను స్వీకరించడానికి నిరాకరిస్తున్నాను. అది నాకు అక్కర్లేదు. దాని అవసరమూ నాకు లేదు. దాన్ని నేను వద్దంటున్నాను. పైగా- నేను మిమ్మల్ని అర్థిస్తున్నాను- ఆ మీ నింద ఏదో- దాన్ని మీ దగ్గరే వుంచుకోండి అని అన్నాడు.

"శబ్దానికి ప్రతిధ్వని- వస్తువుకు నీడ వున్నట్లు—దుఃఖం, దౌర్భాగ్యం- దైన్యం- మొదలైనవి దుర్మార్గుని వదలక తరిమి-తరిమి చుట్టుకుంటాయి. గట్టిగా పట్టుకుంటాయి" అన్నాడు బుద్ధుడు.

బుద్ధుని మాటలు విని అతడు మౌనంగా నిలబడిపోయాడు. అతన్ని చూసి, "ఒక పాపిష్టివాడు- దుష్టుడు- దుర్మార్గుడు-మూర్ఖుడు-

అవివేకి— ఆకాశం వంక చూసి- దాని అద్భుత వైభవానికి, అందానికి ఈర్ష్యపడి- అసహ్యంగా దానిపై ఉమ్మేశాడు. అతను వేసిన ఉమ్మి- ఏమౌతుందో తెలుసా? అది వెనుతిరిగి, అతని ముఖంమీదే పడుతుంది కాని, ఆకాశం మీదపడదు. అలాగే దుష్టుడు- దుర్మార్గుడు పవిత్రుల యెడ- చేసిన పనుల ఫలితం- అతడే అనుభవించవలసి వుంటుంది" అన్నాడు బుద్ధుడు.

బుద్ధుని మాటలు శ్రద్ధగా విన్న అతడు- వివేకవంతుడై- తల వొంచి- పశ్చాత్తాపంతో వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన తర్వాత- "కోపం అనేది వట్టి మూర్ఖమైన సంగతి. ఇతరులు ఎవరో-ఏదో- ఎవరినో అన్నారని- లేదా- ఏదో చేశారని కోప్పడ్డం అవివేకం. అటువంటి మనోవిజృంభణతో- మీరు బానిసలు అవుతారు. అనడం, చేయడం వారి స్వేచ్ఛ.

"నన్ను నిందించడం నీకు ఆనందం- సంతోషం అయితే- నేను కోప్పడకుండా వుండటం నాకు ఆనందం- సంతోషం" అని మీరు అన్నప్పుడు, మీరు గురురూపంలో దర్శనమిచ్చి- ప్రవర్తించినట్లు అవుతుంది" అన్నాడు బుద్ధుడు శిష్యులతో.

* * *

"భద్దియ" అనే వికారాకారుడు జేతవన విహారంలో వుండేవాడు. పొట్టిగా వుండటంచేత అందరూ అతన్ని "లకుండక" అని పిలిచేవారు. అతడు చాలా మంచివాడు- సహృదయుడు. త్రిశరణాల్ని ఆశ్రయించి జీవించేవాడు. అందరియెడలా అణకువతో మసిలేవాడు. చిన్నవాళ్ళయిన భిక్షువులు అతన్ని ఆటలు పట్టించేవారు. అతని ముక్కుపీకి- చెవులుపిండి- సరదాగా మాట్లాడి- సంతోషంగా ఆతనితో కాలం గడిపేవారు. ఎన్నిచేసినా- ఏమనినా అతడేమీ బాధపడేవాడు కాదు. చలించేవాడుకాదు. కోపం తెచ్చుకునేవాడు కాదు. ఆ సంగతి తెలిసి "అర్హతుడు ఎప్పుడూ చలించడు. కనీసం ఇతరు

లను దేనికీ, ఎప్పుడూ కోప్పడడు. పర్వతమంత స్థిరస్వభావంతో వుంటాడు. దూషణ- భూషణలకు చలించడు" అన్నాడు బుద్ధుడు. పర్వతం గాలిచేత చలించదు. అలాగే సజ్జనులు నిందా- పొగడ్తలకు లోనుకారు." అన్నాడు మరొకసారి.

* * *

ఏకవిహారి అనే భిక్షువు ఎప్పుడూ ఒంటరిగా వుండేవాడు. ఎప్పుడూ, ఎవరితోనూ దేనికీ కలిసేవాడు కాదు. నిరంతరం ధ్యానంలో వుండేవాడు. అతని గురించి తక్కిన భిక్షువులు తప్పు అభిప్రాయంతో వుండటం గమనించి, "అతడు నిశ్చయంగా గొప్ప సాధకుడు. అతడు చేస్తున్నదే సరైనది. ఒంటరిగా, ఏకాంతంగా, సమస్త విషయాలకు దూరంగా వుంటున్నాడు," అన్నాడు బుద్ధుడు.

* * *

బుద్ధుడు పుబ్బరామ విహారంలో వుండగా కోసలరాజు ప్రసేనజిత్ ఆయన దర్శనార్థం వెళ్ళాడు. అప్పటికే కాలుదాయి కూడా వచ్చివున్నాడు. ఆరోజు పౌర్ణమి. అస్తమయసూర్యుడు వివిధ వర్ణాలతో శోభిల్లుతున్నాడు. పశ్చిమాకాశం తెలుపులోంచి క్రమంగా పసుపువర్ణంలోకి జారుకుని, నెమ్మదిగా నారింజరంగుగా మారి చివరికి రక్తవర్ణం దాల్చింది. ఆ వింతకాంతిలో పర్వతాలు- పక్షులు- చెట్లు సమస్తం వెలిగిపోతున్నాయి. ఆ కాంతి, ఏ ఒక్కదానివల్లా ఏర్పడ్డదికాదు. పరమపవిత్రుడైన బుద్ధునివల్ల ఆప్రదేశం నిశ్చలంగా, శాంతంగా వుంది. అప్పుడు బుద్ధుడు, "పగటిని సూర్యుడు, రాత్రిని చంద్రుడు, ప్రకాశింప జేస్తున్నారు. రాజసంతో రాజు ప్రకాశిస్తాడు. ధ్యానంలో అర్హతుడు ప్రకాశిస్తాడు. కాని, బుద్ధుడు సర్వకాల సర్వావస్థల్లో- రాత్రింబవళ్ళు ప్రకాశిస్తాడు" అన్నాడు.

* * *

ఒకసారి బుద్ధుడు కోసలదేశంలో "కేశపుత్రీయ" అనే గ్రామంలో మకాం చేసి, ధర్మబోధ చేస్తున్నాడు. ఆ సంగతి తెలిసి

"కాలామక్షత్రియులు" బుద్ధుని దర్శించి, "ఇక్కడకు ఎంతోమంది శ్రమణ- బ్రాహ్మణులు వస్తారు. అనేకం బోధిస్తారు. వెడతారు. తాము బోధించినదే అంతిమసత్యమని, తమ మతమే గొప్పదని ప్రశంసిస్తారు. ఇతరమతాల్ని ఖండిస్తారు, నిందిస్తారు, నిరసిస్తారు. ఇప్పుడు మీరు వచ్చి మీ ధర్మం బోధిస్తున్నారు. ఇంతమంది ధర్మ బోధకులలో ఎవరు నిజమైన సత్యం చెపుతున్నారో తెలియడంలేదు" అన్నారు.

దానికి బుద్ధుడు, "అవును. మీ సంశయం సరైనది- వాస్తవమైనది. "ఎవరు నిజం చెపుతున్నారో- ఎవరు అసత్యం చెప్పుతున్నారో," అని కాక, మీకు మీరు స్వయంగా విచారణ చేసి, ఏది సత్యమో తెలుసుకోండి. వారివారి ధర్మబోధల్లో దోషాలున్నా, ప్రాజ్ఞ సమ్మతం కాకపోయినా, హితకారం కాకపోయినా- అప్పుడు మీరు నాటిని విడిచిపెట్టగలుగుతారు. లోభం, ద్వేషం, మోహం వీడి మైత్రితో-కరుణతో- ప్రేమతో- సంతోషంతో వుండండి. అప్పుడే మీరు శాంతిపొంది, హాయిగా, ఆనందంగా వుండగలరు. ఈ జన్మ నందే శాంతి లభించును గనుక, రాగం, ద్వేషం, మోహం, దొంగ తనం మొదలైన వాటినుంచి విముక్తి పొందండి" అన్నాడు.

* * *

బుద్ధుడు సంచారసమయంలో- ఒకసారి కౌసంబిలో మకాం చేశాడు. అక్కడ ఒకాయన బుద్ధునిపై నిష్కారణ ద్వేషం పూని, కొంతమందికి లంచమిచ్చి, ఆ గ్రామంలో బుద్ధునిపై దుష్ప్రచారం చేయించాడు. తత్ఫలితంగా ఆ గ్రామస్తులెవరూ ఆయనకుగాని, శిష్యులకు గాని, భిక్షపెట్టలేదు. పైగా దూషించారు, నిందించారు, ఖండించారు. ఆ సంగతి ఆనందుడు బుద్ధునికి ఫిర్యాదుగా చెప్పి, "భగవాన్, ఇంక మనం ఈ గ్రామంలో వుండవద్దు. వుండటం మంచిదికాదు మనం త్వరగా ఈ ఊరు వదలి ఇంకో గ్రామం వెళ్ళి

పోదాం, "అని తొందరపెట్టాడు. దానికి బుద్ధుడు, "బహుశా ఆ గ్రామం కూడా ఇట్లానే వుంటే?" అన్నాడు. "మరోవూరు వెళ్ళిపోదాం" అన్నాడు ఆనంద్.

"ఆ విధంగా ఊళ్ళు వదిలి పోవడానికి అంతం వుండదు. మనం ఇప్పుడు ఇక్కడేవుండి, వారి దూషణలన్నీ భరిద్దాం ఓర్పుగా అవన్నీ అణగి, వారు అసలు సంగతి తెలుసుకునే వరకు ఇక్కడే వుందాం," అన్నాడు బుద్ధుడు.

అని, "చూడు, ఆనంద్! ఈ ప్రపంచంలో లాభనష్టాలు - దూషణ భూషణలు—కష్ట సుఖాలు-బాధా—సంతోషాలు ఎప్పుడూ వుండేవే! వివేకులు వాటిని నిగ్రహించుకోవాలి. అవి ఎట్లా వస్తాయో, అట్లానే పోతాయి" అన్నాడు.

*　　　　*　　　　*

ఒకసారి మాలుంక్యపుత్రుడు, బుద్ధునితో, "భగవాన్! లోకం శాశ్వతమా? అశాశ్వతమా? దానికి అంతు వుందా? లేదా? జీవుడు-శరీరం ఒకటా? కాదా? అవి వేరు, వేరా? చనిపోయిన తర్వాత తథాగతుడు వుండునా? వుండడా? ఈ విషయాల్లో మీరు ప్రతిసారి మౌనంగా వుంటుగాని, లేదా, అవి అనిర్వాచ్యములనిగాని చెప్పి వుండిపోతున్నారు. మీరు వాటి విషయంలో నాకు సంశయ నివృత్తి గావించకపోతే, నేను తిరిగి గృహస్థాశ్రమం స్వీకరించ వలసినదిగా అభిప్రాయ పడుతున్నాను. వాటి విషయం మీకు స్పష్టంగా తెలిస్తే-నాకు వివరించి చెప్పండి. తెలియకపోతే తెలియదని చెప్పండి. అంతేకాని, మౌనంగా వుండవద్దు. నన్ను సందిగ్ధంగా వుంచవద్దు," అని అడిగాడు.

"నీవు ఇక్కడకు వచ్చి బ్రహ్మచర్య వాసం చేయాలనుకుంటే, ఇక్కడవుండు. "లోకం శాశ్వతమా? కాదా?" అనే సంగ

తుల గురించి నీకు నేను చెపుతానని ఎప్పుడైనా చెప్పానా?" అన్నాడు బుద్ధుడు.

"లేదు, ప్రభు" అన్నాడు మాలుంక్య పుత్రుడు.

"అయితే ఇప్పుడు ఇట్లా ప్రశ్నిస్తున్నావేమిటి? ఒకతనికి విషపూరిత బాణం గుచ్చుకుంది. ఆ సంగతి తెలిసి బంధు - మిత్రులు వచ్చి-దాన్ని తీసి సహాయం చేయాలనుకుంటే-అతను వారితో- "ఆ బాణం ఏ కులస్థుడు వేశాడు? అది ఎటువంటి విషం? దాన్ని ఎవరు తయారుచేశారు? మొదలైన ప్రశ్నలకు ముందు సమాధానం కావాలని మొండిపట్టు పట్టి, చివరికి ప్రాణం మీదకు తెచ్చుకున్నాడు. నేనూ ఆ క్షణంలో- ఆ విషయాలు అనిర్వాచ్యములన్నాను. లోకం శాశ్వతమైనా, కాకపోయినా, బ్రహ్మచర్యం పాటించ వలసిందే. అది శాశ్వతమైతేనే, బ్రహ్మచర్యం ఆచరిస్తాననడానికి వీలులేదు. జన్మవుండనే వుంది. ముసలితనం వుంది. చావు తప్పదు. అలాగే దుఃఖంవున్న సంగతీ స్పష్టం. కనుక దాన్ని పోగొట్టుకునే మార్గం చెప్పి వున్నాను. అంతే! దానికి లోకం సంగతి-దాని ప్రస్తావన అనవసరం ఎందుకంటే, అవి బ్రహ్మచర్యానికి ఉపయోగించని సంగతులు కనుక అవి వైరాగ్యానికీ ఉపయోగపడవు. అవి శాంతికీ మార్గాలుకావు. జ్ఞానానికి, నిర్వాణానికి కూడా పనికిరాని విషయాలవి. కాబట్టి వాటిని అనిర్వాచ్యములన్నాను. దానికి నీ మనో విజృంభణ ఏల? దుఃఖం వుంది. దానికి కారణం వుంది. దాన్ని తప్పించుకో చూడాలి. అది ఎప్పుడోకాదు, ఆ క్షణంలో తప్పించుకోవడానికి మార్గాలూ ఉపాయాలూ వున్నాయి. అవి బ్రహ్మచర్యానికి, వైరాగ్యానికి, శాంతికి, జ్ఞానానికి నిర్వాణానికీ ఉపయోగపడతాయి. కాబట్టి వాటిని నిర్వాచ్యములుగా నిర్వచించాను. కనుక నువ్వూ వాటిని అట్లానే తెలుసుకో.

* * *

రాజగృహంలో "సిరిమా" అనే అందమైన నర్తకి వుండేది. ఆమె ప్రతిరోజూ ఎనమండుగురు బౌద్ధ భిక్షువులకు—ఖరీదైన, రుచైన వంటకాలతో భిక్షపెట్టేది-ఆ సంగతి ఒక భిక్షువు-మరో భిక్షువుకు చెప్పాడు—ముఖ్యం ఆమె అందం సంగతి. అది విన్న ఆ కొత్త యువక భిక్షు-ఆమెను చూడకుండానే-ప్రేమించాడు. ఓ రోజు అతనూ తక్కిన భిక్షువులతో కలసి భిక్షకు వెళ్ళాడు-సిరిమా-ఇంటికి. ఆ రోజు ఆమె ఆరోగ్యం బాగాలేక పోయినా భిక్షువులు వచ్చారని-పరిచారకుల సహాయంతో వంటకాలు తయారుచేసి- అందరికి భిక్ష పెట్టింది. అనారోగ్యంలో కూడా ఆమె అందంగా వుండడం గమనించిన ఆ కొత్త యువక భిక్షు - ఆమెను ఆ క్షణానే మనసారా వలచాడు.

ఆ రోజు రాత్రి సిరిమా మరణించింది. ఆమె మరణ వార్త బుద్ధునికి తెలిసింది. "ఆమె-శవాన్ని స్మశాన వాటికకు తీసుకుపోయి-అక్కడ మూడు రోజులు భద్రంగా వుంచండి-కాకులు, గ్రద్దలూ, రాబందులు, నక్కలు పాడుచేయకుండా కాపాడండి" అని బుద్ధుడు బింబిసారునికి కబురు పంపాడు. ఆయన మాట ప్రకారం సిరిమా శవాన్ని శ్మశానంలో వుంచారు.

నాల్గో నాటికి ఆ దేహం దుర్గంధ పూరితంగా వుంది. కుళ్ళి-అంత వికారంగా వుంది. అమె శవాన్ని చూడ్డానికి బుద్ధుడు శిష్యు లందర్నీ శ్మశాన వాటికకు తీసుకు వెళ్ళాడు. బింబిసారుడు కూడా తన పరివారంతో అప్పటికి చేరుకున్నాడు. ఆమె ఆకర్షణలో పడిన ఆ కొత్త యువక భిక్షువుకు-సిరిమా మరణించిన సంగతి తెలియదు. అతడూ అందరితో పాటు శ్మశానానికి వెళ్ళాడు. వెళ్ళిన వారంతా ఆమె శవంచుట్టూ నిలబడ్డారు. బుద్ధుడు, బింబిసారునితో-దండోరా వేసేవానిని రప్పించి, సౌందర్యవతియైన సిరిమా-ఒక రాత్రికి వేయి రూపాయలకు లభిస్తుంది," అని చాటించమన్నాడు. ఎవరూ ముందుకు రాలేదు. ఐదు వందల రూపాయలు, వందరూపాయలు-

చివరికి వూరికే ఆమెను తీసుకోవడానికి ఎవరూ సిద్ధపడలేదు. అక్కడ చేరిన వారిని ఉద్దేశించి-"చూడండి, ఆమె సజీవంగావున్నప్పుడు-ప్రతి ఒక్కరు ఆమెకు వెయ్యి వరహాలిచ్చి-ఒక రాత్రి ఆమెతో సుఖించడానికి ఇష్టపడేవారు. కాని, ఇప్పుడు-ధనం అవసరం లేకుండా కూడా ఎవరూ ఆమెను తీసుకోవడానికి ముందుకు రావడంలేదు. దేహం, శాశ్వతంకాదు. అది ఎముకల నిర్మాణం. ఆ ఎముకల్ని రక్త-మాంసాలు కప్పాయి. అది ఎప్పటికైనా-మరణించి కుళ్ళిపోతుంది," అన్నాడు బుద్ధుడు. ఆ కొత్త యువక భిక్షు అదంతా గమనించి, తన తప్పిదాన్ని తెలుసుకున్నాడు.

★ ★ ★

ఒక చాతుర్మాసం బుద్ధుడు జేతవనంలో వుండగా ఆనందునికి-కొన్ని సంశయాలు కలిగాయి. ఆ సందర్భంలో ఒక రోజున-బుద్ధుని సమీపించి, "స్వామీ, లెక్కలేనన్ని కల్పాలు గడిచాయి. బుద్ధులు అవతరించని కొన్ని కల్పాలు-అంధకార కల్పాలుగా వుంటే, కొన్ని కల్పాలు ఐదుగురు బుద్ధులు అవతరించిన మహా భద్ర కల్పాలుగా వున్నాయి. అటువంటి భద్రకల్పమే-ఇప్పటి కల్పమని పెద్దలంటారు. మీ ముందు అవతరించిన-మీ తర్వాత అవతరించే-బుద్ధులందరి ఉపదేశాలూ ఒకేతీరుగా వుంటాయా? భిన్నంగా వుంటాయా? అని అడిగితే- "పాపకర్మలు చేయకుండుట-పుణ్య కర్మలు ఆచరించుట-చిత్త శుద్ధిని సంపాదించుట-ఇదే బుద్ధులందరి ఉపదేశం. శాంతి—తితిక్ష కలిగివుండుటే, గొప్ప తపస్సు-పరమ నిర్వాణము-హింసించే స్వభావం వున్నవాడు, నిర్వాణాభిలాషికాదు. నిర్వాణమే పరమ పురుషార్థం నిర్వాణాభిలాషి, అహింసా శీలుడుగా వుంటాడు. బుద్ధులందరూ అహింసా శీలురే.

ఇతరుల్ని నిందించుట-అపకార మొనర్చుట - చేయనివాడు, భిక్షు నియమాలను పాటించుట ద్వారా తనను నియమించుకొనువాడు. మితాహార పరిమితిని ఉల్లంఘించనివాడు, ఏకాంతమున

శయనించువాడు- ఉన్నతమైన ధ్యాన భూమికలయందు మనసు పెట్టిన వాడు—భిక్షువనబడును. అదే భిక్షువులకు వారు ఇచ్చే ఉపదేశం," అన్నాడు బుద్ధుడు.

* * *

సిద్ధార్థుని పరిచారకుడైన చెన్నుడు, బౌద్ధభిక్షువై— క్రమంగా గర్వితుడై— అహంభావంతో "నా గురుదేవులు, ఇల్లువదలి అడవికి వెళ్ళేటప్పుడు ఆయన వెంట నేను ఒక్కడినే వున్నాను. కాని, చూడండి, ఇప్పుడు వచ్చిన సారిపుత్త-మగ్గల్లానాలు తామే అధికుల మనుకుంటూ డాంబికంగా, గర్వంగా, గొప్పగా తిరుగుతున్నారు," అంటూ వుండేవాడు. ఆ సంగతి తెలిసి, బుద్ధుడు మందలించినా- తాత్కాలికంగా ఆయనముందు వినయం నటించి, మళ్ళా తనధోరణి మానేవాడు కాదు. బుద్ధుడు మూడుసార్లు మందలించినా అతని ప్రవర్తనలో మార్పురాలేదు. ఇంకొకసారి చెన్నుణ్ణి పిలిచి, "చూడు, చెన్నా సారిపుత్త- మగ్గల్లానాలు ఇద్దరూ నీకు మంచి స్నేహితులు. వారితో స్నేహంగా వుండు. వారితో మంచిగా మసులుకో," అని హితవు చెప్పి, "ఎవరైతే చెడ్డస్నేహితులతో- నీచులతో కలవరో, వారు గౌరవనీయులతో, సహృదయులతో స్నేహం చేస్తారు," అన్నాడు.

బుద్ధుడు చెన్నుణ్ణి అన్నివిధాల దగ్గరగా తీసుకుని- బుజ్జగించి బ్రతిమాలి చెప్పినప్పటికీ అతడు వారిద్దర్నీ నిందించడం, అపవాదులు వేయడం మానలేదు. "బుద్ధుడు బ్రతికివుండగా అతడు మారడు. బుద్ధుడు మహాపరి నిర్వాణం పొందినతర్వాత అతడు మారతాడు," అన్నాడు బుద్ధుడు ఒకసారి, ఆనందునితో.

బుద్ధుడు మహాపరి నిర్వాణం చెందేరోజు సాయంత్రం బుద్ధుడు ఆనందుని పిలిచి— "చెన్నునికి బ్రహ్మదండ శిక్ష విధించు," అన్నారు. అంటే, అతన్ని నిర్లక్ష్యం చేసి- ఉపేక్షచేసి- వుంచడం. అతనికోసం ఏమీ చేయక— వూరక వుండటం. ఆ సంగతి తెలిసి, చెన్నుడు మళ్ళా

త్తాపం చెంది— ఆ పరితాపంతో మూడుసార్లు మూర్ఛపోయాడు. భిక్షు లంపరెముందూ తన తప్పు ఒప్పుకుని- అందరి క్షమాపణ కోరాడు. ఆ క్షణంనుంచి అతని దృష్టి— దృక్పథం మార్చుకున్నాడు. ధ్యాన నిమగ్నుడై త్వరలోనే అర్హతుడయ్యాడు.

★ ★ ★

రోహిణీనదికి ఇరుప్రక్కలా వున్న- శాఖ్య— కోలియాన్ ప్రజల మధ్య నీటి తగాదావచ్చి- ఉభయులూ గొడవపడి- తగాదాపడి- తల పడి- అశాంతిగా వుంటే- బుద్ధుడు అక్కడకు వెళ్ళి- వారి వ్యవ హారం సామరస్యంతో పరిష్కరించి- వారి మధ్య సంధి చేసి- సఖ్యత చేకూర్చి— ఐకమత్యం యొక్క గొప్పతనాన్ని వివరించి చెప్పి- ఒప్పించాడు. వైరాగ్ని జ్వాల విజృంభణతో వర్గాలలో వైషమ్యం పెరిగి- జాతిసాంకర్యం కలిగిస్తుంది. కనుక మొదట-పాపకార్యాల్ని విడిచిపెట్టి- తర్వాత లోకకళ్యాణం అంటే పరహిత కార్యక్రమం చేపట్టండి. దైహికదృష్టి- ధర్మదృష్టితో సాగండి. దానికి సత్ప్ర వర్తన కావాలి," అన్నాడు బుద్ధుడు.

ఆతర్వాత రెండుజాతులవారు బౌద్ధంలో చేరారు. అప్పటికే శుద్ధోధనుడు, మహాప్రజాపతి బౌద్ధం స్వీకరించారు. ఆతర్వాత ఎంతోమంది రాజవంశీయులు బౌద్ధసంఘంలో చేరారు. కొందరు సన్యాసం స్వీకరించారు. వారి భార్యలు ప్రజాపతి ద్వారా సన్యాస జీవితం గడపడానికి నిర్ణయించుకున్నారు.

★ ★ ★

"ఉగ్రోక- నేతభ్య" అనే పట్టణాలమధ్య- బుద్ధుడు మకాం చేసినప్పుడు ఒకాయన వెళ్ళి బుద్ధునికి ఎదురుగా నిలబడితే- "ఎవరు మీరు?" అని బుద్ధుడు అడిగాడు అతన్ని. దానికతడు, "నేను ద్రోణుడను. బ్రాహ్మణుడను," అని- "మీరు ఎవరు?" అని అడిగితే-

నేనా? నేను ఎవరినీ కాను. ప్రపంచ విషయాల్ని అధిగమించి-సత్యాన్వేషణలో వున్నవాణ్ణి బుద్ధుణ్ణి" అన్నాడు.

* * *

ఒకరోజున ఒకాయన బుద్ధుని దగ్గరకు వెళ్ళి, "మీరు నా ప్రశ్నలకు సమాధానాలు ఇస్తే, అవి నాకు సమ్మతంగా, సంతృప్తికరంగా వుంటే, నేను మిమ్మల్ని అనుసరిస్తాను," అన్నాడు.

దానికి బుద్ధుడు "నేను మిమ్మల్ని పిలిచి, నన్ను అనుసరించమన్నానా? ఈ విశ్వం శాశ్వతమా? అశాశ్వతమా?" అంటూ తర్కించుకుంటూ, కూర్చుంటే, అసలుసంగతి దూరమౌతుంది. పవిత్రజీవన మనేది ప్రశ్నలమీద, సమాధానాలమీద, తర్క-వితర్కాల మీద ఆధారపడి వుండదు. ఎటువంటివారైనా సరే, ఒక నిర్ణయం తీసుకున్న వారికి, జీవిత పరమసత్యాలైన జననం, మరణం, రోగం, ముసలితనం, బాధ, కష్టం, దుఃఖం, విచారం మొదలైనవన్నీ లేకుండా, రాకుండా పోవడం సాధ్యమా?" అనికాని– ప్రశ్నలు కలగవు. ఆ ప్రశ్నలు అతనికి అనవసరం అవి, అనాసక్తతకూ, ఆనందానికీ, నిర్వాణానికి ప్రేమకూ, శాంతికీ, వైరాగ్యానికీ-చివరికి దేనికీ పనికిరావు. అవి ఏ విధంగానూ మనిషికి ఉపయోగపడవు," అన్నాడు, బుద్ధుడు.

* * *

ఒకసారి బుద్ధుడు జేతవనంలో వుండగా సంగముడనే బ్రాహ్మణుడు భార్యా-పిల్లల్ని - ఇంటిని - సర్వస్వాన్ని త్యజించి బుద్ధునిచేరి, త్రిరత్నాల్ని–త్రిశరణాల్ని మనోవాక్కాయ కర్మలతో ఆచరించి-స్థిరచిత్తంతో వుండిపోతే, కొన్నాళ్ళ తర్వాత అతని భార్యా, పిల్లలు వెళ్ళి ఎంతబ్రతిమాలినా, ఏడ్చినా అతడు చలించక పోవుటచే వారు వెళ్ళిపోయారు. ఆ సంగతి తెలిసి "ఎవరు వాంఛా

విముఖులో ఎవరు సుఖ - దుఃఖాలకు అతీతులో అట్టివారిని నేను బ్రాహ్మణుడంటాను," అన్నాడు బుద్ధుడు.

★ ★ ★

బుద్ధుడు రాజగృహ నగర సమీపంలోగల గృధ్రకూట పర్వతాలవెనక వున్న "తుణ" అనే గ్రామం వెళ్ళారు - శిష్యులతో, అనుచరులతో - ఆ గ్రామం ఒక సామంతరాజు ఆధీనంలో వుంది. అతడు సనాతనుడు. ఆ గ్రామం, బ్రాహ్మణాధిక్యత కలది. బుద్ధుడు ఊరుచివర-నది ఒడ్డున - మర్రిచెట్ల మైదానంలో సపరివారంతో మకాం చేశాడు. బుద్ధుని దర్శనార్థం ఆ పరిసరప్రాంతాల నుంచి ప్రజలు తండోపతండాలుగా వచ్చి — ఆయన బోధలు విని వెళ్తున్నారు. కొందరు బౌద్ధం స్వీకరించారు. కొందరు సంఘ సభ్యులైనారు. కొందరు దీక్షలు తీసుకున్నారు. గ్రామంలో అంతా హడావిడి జరుగుతున్నా గ్రామస్థులేమీ పట్టించుకోలేదు. పైగా బుద్ధునిపై-అతని అనుచరులపై ఆగ్రహావేశంతో వున్నారు. వారిలో ముఖ్యం "కుంద" అనే ఒక బ్రాహ్మణ వితంతువు. ఆమె ధనవంతురాలు. వారిది సాంప్రదాయకుటుంబం. ఆమెకు ముగ్గురు కొడుకులు- ఒక కూతురు- ఆమె అందరికంటె చిన్నది- ఎంతో అందమైనది- పదహారేళ్ళ వయసుది.

కుందకొడుకులు ముగ్గురూ విద్యావంతులు పెద్దవాడు- విశ్వమిత్రుడు. అతడు సకలశాస్త్ర పారంగతుడు. ఉత్తముడు. బ్రహ్మవిద్యానిష్టాగరిష్టుడు. అతన్ని చూసుకుని కుందకు చాలా గర్వం. తన కొడుకును ఒక గురువుగా ఉన్నతస్థానంలో వుంచాలని ఆమె ఆశ- అతని వర్చస్సు — వాక్శుద్ధి — శాస్త్రవితరణ లక్షణాలన్నీ అందుకు అమరివున్నాయని ఆమె ఆశ. కాని, అతనికి అటువంటి యోచనేమీ లేదు. కొడుకులు-కూతురు ఆమె గీచిన గీటు దాటరు. ఆమె చెప్పిన పని- ఆడినమాట తు.చ. తప్పకుండా పాటిస్తారు. వ్యక్తిగతంగా వారి కెటువంటి ఆలోచనలు వుండవు. వినయ-విధేయ

తలతో తల్లిమాట పాటించడమే వారి జీవితాశయంగా బ్రతుకుతున్నారు. తల్లే వారికి సర్వస్వం. సమర్థులైన కొడుకుల్ని- చక్కని కూతుర్ని ఉన్నతస్థానంలో వుంచాలనేదే ఆమె జీవితాశయం. ఆ ఆశయసాధనకు సంఘంలో మంచి ప్రాపకం సంపాదించింది. రాజుగారు కూడా ఆమె అంటే గౌరవ, మర్యాద చూపేవారు. తన ఆశయ సాధనకు బుద్ధుడు గ్రామ ప్రవేశం చేయడం అడ్డు, అవరోధమని భావించి వారిపై విరోధం పెంచుకుంది.

ద్వేషాన్ని పెంచుకుంది. ఆ ద్వేషం క్రమంగా కోపంగా— కసిగా మారింది. ఆయన్ని దర్శించడానికి వెళ్ళే ప్రజల్ని చూసి- రోషం- పగ ఏర్పడ్డాయి. బుద్ధుణ్ణి వీలైనంత త్వరగా- ఏదో ఒక కారణంగా— గ్రామంనుంచి తరిమెయ్యకపోతే- తన కొడుకుకు వేయాలనుకున్న గురుపీఠం ఎగిరిపోయేటట్లు వుంది. అందుచేత కుంద గట్టి పట్టుపట్టి బ్రాహ్మణులందర్నీ రెచ్చగొట్టింది. తిరుగుబాటు బ్రాహ్మణులంతా ఒక సంఘంగా ఏర్పడ్డారు. దానికి విశ్వమిత్రుణ్ణి నాయకుణ్ణి చేయించింది, కుంద. ఆ సంఘం ప్రధాన ఉద్దేశ్యం—బుద్ధుణ్ణి గ్రామం నుంచి తరిమెయ్యడం.

విశ్వమిత్రుడు సహజంగా సౌమ్యుడు, మర్యాదస్తుడు, ఉత్తముడు. అటువంటి వానిలో-నిష్కారణంగా-ఒక మహాత్ముని విషయమై విషబీజాలు నాటింది. వాటిని తిరుగుబాటు సంఘం బాగా పెంచింది. కాని, విశ్వమిత్రుడు—ఎప్పటి కప్పుడు ఆ విషబీజాల్ని పీకేస్తూనే వున్నాడు. చివరకు పోరాట సమితి-తల్లి ఒత్తిడి-అతన్ని పూర్తిగా అణచేశాయి. బుద్ధుణ్ణి గట్టిగా ఎదుర్కోమని-అతన్ని గ్రామం నుంచి తరిమెయ్యమని - సనాతన ధర్మాన్ని బోధించమని- బ్రాహ్మణాధిక్యత నిలపమని - అవసరమైతే - ఏమైనా చెయ్యమని కొడుక్కి గట్టిగా ఆజ్ఞాపించింది, కుంద. అప్పటికింకా విశ్వమిత్రుడు బుద్ధుణ్ణి చూడలేదు-వినలేదు. ఆయన్ని కూడా, అందరు గురువులు- మఠాధిపతులు-పీఠాధిపతులు - మతగురువులు-సామాన్యసాధు—సన్యా

సులు మాదిరిగా అంచనా వేసి—తల్లి ఆజ్ఞానుసారం-ఆవేశంతో-అవివేకంతో-అజ్ఞానంతో బుద్ధుని సమీపించాడు, ఓ రోజు ఉదయం.

ఆ ఉదయ కాంతిలో బుద్ధుని వర్చస్సు, విశ్వామిత్రుని సమ్మోహ పరిచింది. దూరంనుంచి విన్న ఆయన కంఠస్వరానికి అతడు ముగ్ధుడయ్యాడు. సమీపించి-ఆయన సదోప్ప్రోధ విని దాసుడై, సమస్తాన్ని మరచి—ఆయన పక్కన కూర్చున్నాడు. క్రమంగా ధ్యాన నిమగ్నుడయ్యాడు.

ఎంతకీ తిరిగిరాని కొడుకు కొరకు కుంద, ఆమె తక్కిన ఇద్దరు కొడుకుల్ని ఒకరి తర్వాత ఒకర్ని మర్రిచెట్ల మైదానానికి పంపించింది.

వారూ అతను మాదిరిగానే బుద్ధునితో వుండిపోయారు. ఆ గ్రామంలో సనాతనుల-బ్రాహ్మణుల-పరమత ద్వేషుల మధ్య బౌద్ధ సన్యాసులు గొర్రె పిల్లల్లాగ తిరుగుతున్నారు, గ్రామస్థులెవరూ వారికి- ఆశ్రయంకాని - ఆదరణ కాని-భిక్ష కాని ఇచ్చిన పాపాన పోలేదు. "బుద్ధుడు, వట్టి పిచ్చివాడు-శాస్త్ర పరిజ్ఞానం లేకుండా-ఏవేవో చెప్పి-ప్రపంచాన్ని మోసం చేస్తున్నాడు. తనదే అంతిమ సత్యమనే అహంకారంతో తిరుగుతున్నాడు," అంటూ కొందరు రాజుగారితో ఫిర్యాదుగా చెప్పారు. కాని, ఆయనకు బుద్ధునిపై ఏ మాత్రం ద్వేషం-కోపం - అసూయ లేదు కనుక, ఆయనేమీ పట్టించుకోలేదు. కుంద పిల్లలు బుద్ధుని కారణంగా ఇంటిని-తల్లిని వదలి-ఆయన్ని అనుసరించారు. కనుక బుద్ధుణ్ణి రాజదర్బారుకు రప్పించి-విచారణచేసి తనను కాపాడి-బుద్ధునికి శిక్ష విధించవలసినదిగా కుంద రాజుగారితో మొరపెట్టుకుంది. ఆ విధంగానైనా బుద్ధుణ్ణి గ్రామ బహిష్కరణ చేయించి-ప్రపంచం ముందు నవ్వులపాలు చేయాలనుకుంది, కుంద అయినా రాజుగారు ప్రత్యేకశ్రద్ధ వహించకపోయేప్పటికి-తానే స్వయంగా బుద్ధునికి బుద్ధి చెప్పాలనుకుని-తన ముద్దుల

కుమార్తెకు వివాహం నిశ్చయించి- తన ఆస్తినంతా ఆమెకు వశ్చే-ట్లు చేసి- మహావైభవంగా వివాహం జరిపించి- ఆ వేడుకను బుద్ధునికి- తన కొడుకులకు చూపించాలని- పెద్ద ఊరేగింపుగా మైదానం వైపుకు వెళ్ళింది.

అదే సమయానికి బుద్ధుడు శిష్యులతో- అనుచరులతో-సన్యాసులతో గ్రామంలోకి భిక్షకు బయలుదేరాడు. మైదానందాటి రోడ్డు మీదకు వచ్చాడు. బుద్ధుడు ఆయన పక్కన కుంపముగ్గురు కొడుకులు వున్నారు. బుద్ధుడు తల వొంచి దారి పక్కన నిలబడ్డాడు. ఊరేగింపు బుద్ధుని దగ్గరకు వెళ్ళేప్పటికి, బహు చిత్రంగా మేళతాళాలు ఆగిపోయాయి. వెంటవస్తున్న జనసందోహం నిలిచి పోయింది. ఎక్కడి వారక్కడ నిశ్చలంగా-నిశ్శబ్దంగా వుండిపోయారు. ఆ దృశ్యం కుంపను కృంగ దీసింది. అందర్నీ కదలమని—మేళ- తాళాలు మోగించమని వెర్రిగా, ఆవేశంతో అరిచింది. ఎవరూ ఆమె మాట విన్నట్టు లేదు.

రోడ్డుకు ఒక వైపున బుద్ధుడు మరొక వైపున ఊరేగింపు-గుంపు రోడ్డు మధ్య కుంప. ఆమెలో అకస్మాత్తుగా ఆలోచనలు ఆగిపోయాయి. నిర్వీర్యంగా నిలబడివుంది. అంతలో వధువు పల్లకి లోంచి ఒక్క పూలకుండ కిందికిపూకి- బుద్ధుని పాదాలమీద పడింది. ఆ విడ్డూరంచూసి అందరూ నిశ్చేష్టులైనారు. ఆ తర్వాత కుంప కూడా బుద్ధుని పాదాలపైపడి, ప్రణమిల్లింది. బుద్ధుడు వారిని ఉద్దేశించి, "అధమ కార్యాలపట్ల ఆసక్తి పెంచుకున్నట్లయితే, మానవుడు అధో గతిపాలై- ఇంకా హీనస్థితికి దిగజారతాడు. అతని ఆలోచనలు సైతం దుర్వాసన కొడతాయి. నిర్హేతుకమైన దుష్టకార్యాలకు దారి తీస్తాయి. అందుచేత పై-పై సంగతులు కాక, మనో నైర్మల్యం కావాలి, ప్రతి ఒక్కరిలో," అన్నాడు. అది విని కొందరు మనసు మార్చుకున్నారు. కొందరు మెల్లిగా జారుకున్నారు. కుంపతో పాటు కొందరు ఆయన్ని అనుసరించారు.

* * *

బుద్ధుడు జేతవనంలో వున్నారు. ఒకరోజు భిక్షకు వెడుతుండగా "అశ్వలాయనుడు," అను బ్రాహ్మణుడు ఎదురై "లోకం, నిత్యమా? అనిత్యమా? దానికి అంతుగలదా? అది అంతులేనిదా? జీవుడు-శరీరం ఒకటా? రెండా? మరణించిన తర్వాత తథాగతుడు మరలపుట్టునా? పుట్టడా?," అని అడిగాడు.

"అవన్నీ అనిర్వాచ్యములు అవి స్పష్టంగా, ఖచ్చితంగా నిర్వచింపజాలనివి. అవి ప్రయోజనము కలవి కావు. ధర్మయుక్తమైనవి కావు. బ్రహ్మచర్యానికిగాని, నిర్వేదమునకుగాని, విరాగమునకుగాని, క్లేశ వినాశనమునకుగాని, శాంతికిగాని, అభిజ్ఞకుగాని, పరమార్థ జ్ఞానానికిగాని, నిర్వాణానికిగాని ఉపయోగించని సంగతులు, ప్రశ్నలు, సమస్యలు- అందుచేత వాటిని అవ్యాకృతములు అంటున్నాను," అన్నాడు బుద్ధుడు.

* * *

బుద్ధుని దయ సూర్యకాంతివలె అన్నింటిపై సమంగా పరచుకుంటుంది- వర్షంవలె అన్నింటినీ తడుపుతుంది. వారి-వారి- స్థితుల్ని బట్టి ఆయన బోధలు చేసేవారు. బుద్ధుని ప్రేమలో అంతా- అన్నీ- అందరూ ఒకటే-సమానమే. ఎటువంటి వ్యత్యాసంలేదు. కాని, అవసరమైన వారిమీద ఆ క్షణాన ప్రత్యేకశ్రద్ధ-దృష్టి పెట్టేవారు. సరైన మార్గాన నడవమని దయకల తండ్రి మాదిరిగా సంబోధిచ్చి, ప్రోత్సాహపరిచేవారు. ఎన్నోసంగతుల్ని కథలుగా చెప్పేవారు. అటువంటికథల్లో ఒకటి—ఒకాయన ఇంటికి తిరిగి వచ్చేప్పటికి, ఇంటికి నిప్పు అంటుకుంది. మంటల్ని గమనించకుండా తన పిల్లలు ఇంట్లో ఆడుకుంటున్నారు. ప్రేమకొద్దీ ఆయన ఆత్రుతతో, ఆందోళనతో- ఆరాటంతో- ఆవేశంతో, "పిల్లల్లారా, బైటికిరండి. త్వరగా రండి. ఇల్లు తగులబడి పోతోంది. లోపల వుంటే చనిపోతారు. త్వరగా బైటికిరండి," అని గట్టిగా అరచి, పిలిచాడు. కాని, ఆ పిల్లలు ఆటల్లో మునిగి ఆయన మాటలు వినిపించుకోలేదు. వాళ్ళ

ఆనందంలో వాళ్ళున్నారు. తండ్రిగా అతని హృదయం బాధపడింది-వ్యథ పడింది. బైట నిలవలేక, అతడు మళ్ళా మరింత గట్టిగా పిలిచాడు, "పిల్లల్లారా త్వరగా బైటకిరండి. మీకు మంచి-మంచి మిఠాయీలు-ఆట బొమ్మలూ తెచ్చాను. రండి. త్వరగా రండి. వచ్చి-మిఠాయీలుతిని, బొమ్మలతో ఆడుకోండి," అని పిలవగానే వాళ్ళంతా ఒక్క పరుగున బైటికి వచ్చారు.

ఈ కథలో-ప్రపంచం, కాలుతున్న ఇల్లు. పిల్లలు, ప్రజలు. అజ్ఞానంతో-అవివేకంతో వారు ఏమీ గమనించకుండా ఆడుకుంటున్నారు; బైట ఇల్లు తగులబడిపోతున్నా దయకల తండ్రి - బుద్ధుడు-ఆయన ఉద్దేశ్యం-వాళ్ళను దుఃఖం-కష్టం—బాధల నుంచి రక్షించాలని అందుకే ఆయన మృదు మధురంగా హృదయానికి హత్తుకునేటట్లు ప్రవచించేవాడు.

★ ★ ★

ఇంకోకథ :—

ఒక ధనవంతుని కొడుకు ఇల్లువదలి వెళ్ళిపోయాడు. దరిద్రంతో ఎక్కడెక్కడో తిరిగాడు. తండ్రి వెతికాడు. వెతికించాడు. కనుపించలేదు. అయినా తండ్రి తన ధర్మం విస్మరించకుండా ప్రయత్నం చేశాడు.

చాలా ఏళ్ళ తర్వాత తండ్రి- కొడుకులు ఒకచోట తారసపడ్డారు. తండ్రి, కొడుకును గుర్తించాడు. కొడుకు, తండ్రిని గుర్తించలేదు. తండ్రి-ఇంటికి వెళ్ళి-ఒక నౌకర్ని పిలిచి- ఫలానా చోట-ఫలానా విధంగావున్న అతన్ని ఇంటికి తీసుకురమ్మన్నాడు. అతడు వెళ్ళి అతన్ని తీసుకువచ్చాడు. అది తన ఇల్లనీ, అతను తన తండ్రనీ గుర్తించలేదు, అతను. ఆ ఇంటి భోగ - భాగ్యాల్లో-మోసాల్లో-కుటుంబ విషయాల్లో వుండి పోవడం ఇష్టంలేక అతడు

ఆ ఇంట్లోంచి వెళ్ళిపోవాలనుకుంటే, తండ్రిగా ఆయన హృదయం బాధపడి-"పోనీ, ఈ ఇంట్లో అందరితోపాటు నువ్వూ ఏదైనా ఒక పని చేస్తూ వుండిపోరాదా?" అన్నాడు. దానికతడు అంగీకరించి వున్నాడు.

తండ్రికి మరణ సమయం ఆసన్నమైంది. అనేక మంది బంధు-మిత్రులు ఆయన్ని చూడ్డానికి వచ్చారు. వారందరి సమ క్షంలో కొడుకును ఉద్దేశించి—"నౌకరుగావున్న ఇతడు-చిన్నప్పుడు ఇల్లు వదలి వెళ్ళిపోయిన నా కొడుకు-నిజంగా నా కొడుకే. చివరికి-కనుక్కొని-ఇంటికి పిలిపించి-ఇంట్లో వుండిపొమ్మంటే - ఇంటి పరి స్థితులు సమ్మతం కాక-వెళ్ళిపోతానంటే - నేనేవుండమన్నాను, ఈ ఇంట్లో ఏదో ఒక పనిచేస్తో. అందరితోపాటు వుండమన్నాను. అంగీకరించి వున్నాడు. ఇప్పుడు నాకు మృత్యువు సమీపించింది. నా ఆస్తి అంతా ఇతనికి ఇచ్చేస్తున్నాను," అన్నాడు.

ఈ కథలో తండ్రి - బుద్ధుడు. కొడుకు - ప్రజలు - దయకల తండ్రిగా, బుద్ధుడు ప్రజలందర్నీ తన హృదయానికి హత్తుకున్నాడు. పిల్లలైన ప్రజలకు ఉత్తమ మార్గం బోధించాడు. వాళ్ళకు జ్ఞాననిధి నిచ్చి-దానికి వాళ్ళను వారసుల్ని చేశాడు.

★ ★ ★

మరొక కథ :—

ఒక వైద్యుడు ఇంట్లోలేని సమయంలో ఆయన పిల్లలు పొరపాటున విషం మింగేశారు. ఆయన తిరిగి ఇంటికి వచ్చేప్పటికి పిల్లలు ప్రమాదస్థితిలో వున్నారు. వారిస్థితి గమనించి-దానికి కార ణం తెలుసుకుని-ఆ విషానికి విరుగుడు ఇచ్చాడు వైద్యుడు. దాన్ని కొందరే తీసుకున్నారు. తీసుకున్నవారు ప్రమాదం నుంచి తప్పించు కున్నారు. దయకల ఆ తండ్రి తక్కిన వారితో "బాబూ, నేను రేపు ఊరువెడుతున్నాను. అక్కడ నేను చనిపోవచ్చు. లేదా,

ఇక్కడ మీకు ఏదైనా ప్రమాదం సంభవించవచ్చు; మీరు పొర పాటున తీసుకున్న విషయంవల్ల-కాబట్టి ఇప్పుడే నేను ఇచ్చే ఈ విరుగుడు తీసుకోండి," అని వారికి యుక్తిగా, యుక్తంగా చెప్పి, వారి చేతదాన్ని తాగించి, వారిని కూడా ప్రమాదం నుంచి కాపాడినట్లు, బుద్ధుడు ప్రజల్ని-కోర్కెల్లో, బంధాల్లో, భ్రాంతుల్లో పడికొట్టుకునే వారిని రక్షించాలని ప్రేమతో-జనన మరణాల విషయంపై, ఇంకా అనేక-మిథ్య-కృత్రిమం, కల్పనాత్మకమైన విషయాలతో, మాటలతో-సమయాను కూలంగా చెప్పి, వారిని కడతేర్చినట్లు కనపడుతుంది, కొన్ని సంఘటనలు, సంగతులూ చూస్తే. రకరకాల మనస్తత్వంకల మనుష్యులు - ఆయన బోధల ద్వారా అనేక విధాల లాభాలు పొందారు.

* * *

బుద్ధుడు రోజూ - ఉదయం ఐదుగంటలకు నిద్రలేచి-బహు నెమ్మదిగా-ఎటువంటి శబ్దం చేయకుండా-ఎవరికీ ఇబ్బంది కలిగించకుండా-ఎవరి సహాయం తీసుకోకుండా - కాల కృత్యాలు తీర్చుకుని-ఏకాంత ప్రదేశంలో-ఏ చెట్టుక్రిందనో కొంతసేపు ధ్యానంలో వుండేవాడు. తర్వాత అందరితో కలసిగాని, ఒంటరిగా గాని భిక్షా పాత్ర తీసుకుని సమీప గ్రామానికో-పల్లెకో-పట్నానికో వెళ్ళేవాడు. ఇంటి గుమ్మం ముందు తలవొంచి-మౌనంగా నిలబడేవాడు. పెట్టిన భిక్ష తీసుకునేవాడు. భోజనా నంతరం కొంతసేపు మాత్రమే విశ్రమించి, తర్వాత అక్కడ చేరిన వారికి ఏదో-ఒక విషయం ప్రవచించేవాడు. వారి వారి అర్హతలను బట్టి ఆధ్యాత్మిక ఆసక్తినిబట్టి వారికి అనుగుణంగా బోధించేవాడు. ఆయన బోధ స్పష్టం. అది-నిత్య జీవిత సత్యం. ఆయన బోధించే అష్టాంగ మార్గం, అందరికీ ఆమోద యోగ్యమైనది. అది ఆధునికమైన మార్గం. ఆ మార్గం - ఆలోచనా విధానానికీ,- భావాలకూ సన్నిహిత సంబంధం కలిగి వుంటుంది. ఆయన భాష, సరళం, సుందరం. జనసామాన్యానికి అర్థమయ్యేటట్లు

ఆయన చెప్పే సంగతులు-కథలుగా, ఉపమానాలతో, దృష్టాంతరాలతో, సామ్యశాస్త్రాలతో - ఉదాహరణలతో-వాగ్వైభవంతో వుండేవి. ఆయన ఒకసారి శిష్యులతో, అనుచరులతో, "నా బోధలో వ్యత్యాసం లేదు. అది పవిత్ర జలం వంటిది. అన్నింటినీ కడిగి, శుభ్రం చేస్తుంది. అది అగ్ని వంటిది. అన్ని పాపాల్ని-దోషాల్ని కాల్చి-భస్మం చేస్తుంది," అన్నాడు.

ఆయన చుట్టూ చేరిన వారంతా హిందువులు,- వైదికులు-మతాచార్యులు-బ్రాహ్మణులు-సామాన్య ప్రజానీకం. ప్రసంగంలో-వారి-వారి సాంప్రదాయ పదాలనే ఉపయోగించేవారు. అనేక శాస్త్రాల-పురాణాల-ఉపనిషత్తుల నుంచి విషయాలు ఉపహరించేవారు. ఆయా సంగతుల్ని స్పష్టంగా-నిర్దిష్టంగా - స్వేచ్ఛగా-నిర్భయంగా - నిస్సంకోచంగా - నిర్మొహమాటంగా చెప్పేవారు. గృహస్థుకు బోధించేప్పుడు, "మీరు ప్రపంచం మధ్య వుంటున్నారు కనుక, గుణసంపత్తి-ఉదారస్వభావం-ఋజువర్తన - సత్యవాక్కు—ధర్మపరాయణత్వం, అలవరచుకుని - అష్టాంగ మార్గాన్ని అనుసరించండి.

"చెడు ఆలోచనలతో మాట్లాడినా, పని చేసినా-వాటిని బాధ, దుఃఖం అనుసరిస్తాయి. ఎద్దును బండి చక్రం అనుసరించినట్లు మంచి బుద్ధితో ఆలోచిస్తే-మంచి పని చేస్తే సుఖం, సంతోషం కలుగుతుంది. కనుక ఎల్లప్పుడూ మంచి ఆలోచనలే - మంచి పనులే చేయండి," అని చెప్పేవాడు.

ఒకసారి సారిపుత్రుడు, "భగవాన్! స్థూల శరీరాన్ని పరిగ్రహించిన వానికి మనోమయ, రూపరహిత శరీరాలు మిథ్యలగును. అప్పుడు స్థూల శరీరమే సత్యంగా తోచును. మనోమయ శరీరం పరిగ్రహించిన వానికి, తక్కిన రెండు శరీరాలు మిథ్యగను, మనోమయ శరీరమే సత్యంగా తోచును. అట్లే రూప రహిత శరీరం విషయం- అదే సత్యంగా తోచును." అన్నాడు.

"ఒక శరీరాన్ని పరిగ్రహించినప్పుడు, అదే సత్యంగా తోచును. నీవు ఎప్పుడూ భూతకాలంలోనే వుంటావు గనుక, నీవు వుంటావు. అలాగే, భవిష్యత్కాలంలో వుంటావు గనుక, వుంటావు. అప్పుడు అక్కడ నువ్వు వుండకపోతే, ఇప్పుడు ఇక్కడ వుండవు.

"ఇప్పుడు-నువ్వు వర్తమానంలో వున్నావు. కాని, ఇప్పుడు నువ్వు లేకపోతే, అప్పుడు అక్కడా కూడా వుండవుకదా? అని ఎవరైనా మనల్ని అడిగితే మనం ఏమంటాము?

"నేను ఇదివరకు వున్నాను. అప్పుడు లేకపోతే, ఇప్పుడూ వుండను. ఇప్పుడు వుంటే, ముందూ వుంటాను. అప్పుడు లేకపోతే వుండను. ఇప్పుడు వున్నాను. ఇప్పుడు లేకపోతే, ముందూ వుండను," అంటాం.

ఒకకాలంలో ఒక శరీరం వుంటే, తక్కిన కాలాలు, శరీరాలు మిథ్యలా? కాదు. అప్పటికి అది సత్యం. ఏ కాలంలో ఏది వుందో అప్పటికి అది సత్యం తక్కినవి అసత్యాలు. స్థూల శరీరం వుంటే, దాన్ని మనోమయ, రూపరహిత శరీరాలని అనం. అట్లే- తక్కిన శరీరాల విషయంలోనూ. అవి- పాలు, పెరుగు, వెన్న మాదిరిగా- మూడు అవస్థలు. పాలనుంచి పెరుగు, పెరుగు నుంచి వెన్న. పాలుగా వున్నప్పుడు అవి కేవలం పాలేగాని పెరుగు, వెన్న కావు. పెరుగుగా వుంటే దాన్ని పెరుగనే అంటాం కాని, పాలని, వెన్నని అనము. అలాగే స్థూలశరీరం వున్నప్పుడు దాన్ని స్థూలశరీరమనే అంటాంగాని, మనోమయ, రూపరహిత శరీరాలని అనము. అందు చేత దాన్ని స్థూల శరీరంగానే తెలియవలయును. అవి- లౌకిక సంజ్ఞలు. ఇది లోకవ్యవహారం. తథాగతులు వాటికి అంటక వ్యవహరింతురు.

నాలుగు భూతాలతో తయారై, ఆహారం భుజించే స్థూల శరీరం వదలి, పోవుటకు-సర్వాకారం కలిగిన మనోమయ శరీరం

వదలిపోవుటకు- సంజ్ఞామయమైన రూపరహిత శరీరం వదలిపోవు టకు నేను ధర్మోపదేశం చేస్తున్నాను. ఆ మార్గాన్ని అనుసరించిన వారికి చిత్తమాలిన్యాలు మనోక్లేశములు నశించును. సుఖం కలుగును.

సత్యవాక్కు- యొక్క జ్ఞానమే, బుద్ధి. అటువంటి బుద్ధికి శీలమే ప్రభువు. శీల- బుద్ధులు పవిత్రంగా వుంచుకుని, నీతి వర్తనులై జీవించడానికి మనోనిర్మలత్వం, బ్రహ్మచర్యం అవసరం. ఆశపోతే గాని, బుద్ధి నిలవదు. ఆశను విడిస్తే, జన్మే లేదు. దాన్నిబట్టి జనన మరణాలు పోతాయి," అని బుద్ధుడు చెప్పగా విని సారిపుత్రుడు పరమానందభరితుడయ్యాడు.

*     *     *

తనను ప్రశ్నించిన వారినే తిరిగి ప్రశ్నిస్తూ- ఓ ధర్మమో- సత్యమో చెప్పేముందు వారినుంచే సమాధానం రాబట్టేవాడు, బుద్ధుడు. వారిని ఉన్నతులను, వికాసవంతులను చేయాలనే ఉద్దే శ్యంతో- ఎవరికివారే స్వానుభవంతో సత్యం తెలుసుకునేందుకు ఆయన ఆ పద్ధతి ఉపయోగించేవాడు.

అయోగ్యులను తానెట్లా బ్రాహ్మణులు కావనేవారో, అలాగే, తన శిష్యులను, అనుచరులనూ, భిక్షువులను, సంఘ సభ్యులనుకూడా ముండనం చేయించుకున్నా, కాషాయం కట్టినా, భిక్షాపాత్ర, కర్రా చేతబూనినా; వారిలో వాంఛలు, తృష్ణలు, కోర్కెలు అణగనిదే వారిని భిక్షువుగా పిలిచేవారు కాదు. బాహ్యసంగతులకు ఆయన ప్రాధాన్యం ఇచ్చేవారు కాదు, ఎవ్వరికీ కూడా. వారి హృదయాలు పవిత్రంగా, మనసులు నిర్మలంగా, నిశ్చలంగా, ప్రశాంతంగా వుండి, నీతివంతమైన నడవడి కలిగివుండటమే చూసేవారు. వారి శ్రద్ధను పరిశీలించేవారు. ఒకసారి ఆయన అన్నారు, "నేను బాహ్య విష యాలు చూసి "భిక్షువు" అనను. అతడు మంచి, చెడ్డలకు అతీతుడు కావాలి. ద్వంద్వాతీతుడు కావాలి. పవిత్రుడు కావాలి. నిత్యసత్య

వంతుడు కావాలి. ఆంతర్యంలో అతడు అద్వైపుండాలి. అతను మనోనిగ్రహం కలిగి, పవిత్రజీవనం గడపాలి. ప్రాపంచిక సుఖ-సంపదలు లేకుండా వుండాలి భిక్షువన్నవాడు- తన మనోపరిధిలోని సమస్త విషయాలమీద ఏకాగ్రచిత్తంతో వుండాలి. తాబేలు తన అవయవాలన్నింటినీ లోపలకు తీసుకున్నట్లు, బాహ్యాంతర విషయాలన్నింటినీ నాశనం చేసిన తర్వాత, అంటే వాటిలో ఆసక్తి అణగిన తర్వాత కలిగిన స్థితే భిక్షువు స్థితి. ఆ భిక్షువే, బుద్ధుడు." అని నిర్మొహమాటంగా చెప్పేవారు. విరామసమయాల్లో- రాత్రివేళల్లో కూడా తాము మకాం చేసిన ప్రదేశమంతా నిర్వికారచిత్తంతో తిరిగేవారు.

ఆయనబోధ దయార్ద్ర హృదయులకు, మేధావులకు బాగా గ్రాహ్యమయ్యేది. బోధలద్వారా ఆయనఇచ్చే ప్రోత్సాహం, ప్రోద్బలం సామాన్యప్రజల్ని- వర్తకుల్ని- చక్రవర్తుల్ని- పరివర్తనం చెందించేది. నీతి విషయంలో ఆయన గట్టిగా నొక్కిచెప్పడం ద్వారా అంతర్వీక్షణ ద్వారా క్రమశిక్షణ ద్వారా బౌద్ధం ఎందరినో ఆకర్షించి, ఆకట్టుకుంది.

★ ★ ★

బుద్ధుడు నలభై ఐదేళ్ళు ప్రచారం చేసిన కాలంలో తిరిగిన స్థలాలూ- కలుసుకున్న వ్యక్తులూ- జరిగిన సంగతులూ- సంఘటనలూ- చెప్పిన గాథలు- చేసిన బోధలూ- ఇంకా అనేకానేక విషయాలు సంక్షిప్తంగా ఇందు పొందుపరచబడ్డాయి.

బుద్ధుడు కపిలవస్తు వెళ్ళాడు. మహాప్రజాపతి గౌతమి-యశోధరతో పాటు-మరో ఐదువందలమంది శాక్యమహిళలూ దీక్ష తీసుకున్నారు. అక్కడ నుంచి బయలుదేరి- తీవ్రప్రచారం ప్రారంభించి- రోజూ ఐదుయోజనాల దూరం నడచి- పల్లెలు, పట్నాలు, దేశాలు తిరిగాడు.

ఒకరోజున ఆనందుడు భిక్షకోసం గ్రామానికి వెళ్ళాడు. ఒక చోట ఒకామె నదిలోంచి బిందెతో నీళ్ళు తీసుకొస్తోంది. ఆనందునికి దాహంవేసి, ఆమెను నీళ్ళు అడిగాడు. దానికామె, "నేను అస్పృశ్యను," అంది.

"నేను త్రాగడానికి నీరు అడిగాను కాని, నీ కులం ఏమిటని అడగలేదు కదా?" అన్నాడు. ఆమె, అతనికి నీళ్ళు పోసింది. కాని, అతని వర్చస్సు- సౌజన్యం ఆమెను ఆకర్షించాయి. ప్రథమ దర్శనం తోనే- పూర్వాపరాలు విచారించకుండానే— అతన్ని వివాహం చేసు కోవడానికి నిశ్చయించుకుని, ఆ సంగతి తల్లికి చెప్పింది. తల్లి, ఆనందుని సంగతి విచారించి, "అమ్మా, అతడు బౌద్ధభిక్షువు. సన్యాసి. బ్రహ్మచారి. కాషాయాంబరధారి. సర్వసంగ పరిత్యాగి. సదా సంచారి. బుద్ధుని శిష్యుడు. అటువంటివానిని ఎట్లా వివాహం చేసు కుంటావు? అయినా అతడు నిన్ను వివాహం చేసుకోవడానికి అంగీక రించవద్దా? ఇటువంటి కోర్కె నీకు తగదు. అది సాధ్యమయ్యే సంగతికాదు అతనిపై ఆశలు పెట్టుకుని బాధపడకు" అని హితవు చెప్పింది- హెచ్చరించింది.

ఆ అమ్మాయి తల్లిమాట వినలేదు. మనసు మార్చుకోలేదు. అంతకన్నా మరణమే మేలనుకుని, "అమ్మా, నేను అతన్నే వివాహం చేసుకుంటాను. నువ్వు ఏదోవిధంగా అతన్ని ఒప్పించి- మా వివాహం జరిపించు," అని తల్లిని బ్రతిమాలింది. ఆమె ఆంతర్యం గమనించి, ఆ తల్లి ఆనందుని దగ్గరకు వెళ్ళి, "నాయనా, నాఇంటికి భిక్షకురా," అని ఆహ్వానించి— ఇంటికి తీసుకొచ్చి- తన కుమార్తె కోర్కె విన్నవించింది. అతడేమీ చలించక "నేను జీవి తాంతం బ్రహ్మచారిగా వుండదలిచాను. దీక్ష కూడా తీసుకున్నాను" అన్నాడు.

దానికామె, "నాకు అంతా తెలుసు నాయనా. కాని, నువ్వు నా కుమార్తెను వివాహం చేసుకోకపోతే, ఆమె నాకు దక్కదు.

నిరాహారదీక్ష పూనింది. ఎటువంటి అఘాయిత్యమైనా చేస్తుంది. నిన్ను మనసారా ప్రేమించింది. ఆ ప్రేమ, వ్యామోహంగా మారింది. నాయందు దయవుంచి నా కుమార్తెను వివాహం చేసుకో" అని ప్రాధేయపడింది. దానికతడు "ఈ విషయంలో నేను చేయగలిగింది ఏమీలేదు," అని ఖచ్చితంగా చెప్పడంతో- ఆ తల్లీ- కూతురు- ఇద్దరూ కలిసి అతన్ని తమ ఇంట్లో బంధించారు. ఆ అమ్మాయిపేరు ప్రాక్రితి- ఆమె చక్కగా అలంకరించుకుని ఆనందుడు వున్న గది లోకి వెళ్ళింది. ఆనందుడు నిశ్చలంగా, గదిలో ఓ మూల ధ్యాన నిమగ్నుడై కూర్చున్నాడు. ఎంతకీ అతను చలించక పోయేప్పటికి, ఆమెకు కోపం వచ్చి-, "నా మాట విని-నువ్వు నన్ను వివాహం చేసుకోకపోతే-నిన్ను చంపేస్తాము," అని బెదిరించింది. అయినా అతడు భయపడలేదు. గతిలేక, వాళ్ళు అతన్ని వదిలేశారు. అతడు వెళ్ళి—జరిగిన సంగతి బుద్ధునికి చెప్పాడు.

ఆ మర్నాడు ఆనందుని వెతుక్కుంటూ-ఆ తల్లీ-కూతురు- ఇద్దరూ జేతవనం చేరుకున్నారు. ప్రాక్రితి విషయం ముందుగా ఆనందుని ద్వారా తెలియడం వల్ల, "అమ్మా, నువ్వు ఆనందుని ఎందుకు వివాహం చేసుకోవాలనుకుంటున్నావు?" అని అడిగితే, "నేను అతన్ని ప్రేమించాను. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను," అంది. దానికి బుద్ధుడు, "అతను, భిక్షువు. సదా సంచారి. సంసార జీవితానికి ఎట్లా పనికివస్తాడు? నువ్వు-తప్పదనుకుంటే-నువ్వు వెళ్ళి ముండనం చేయించుకుని, రా. ఆ తర్వాత, సంగతి చూసుకోవచ్చు," అన్నాడు.

ఆమె వెళ్ళి-గుండు చేయించుకుని వచ్చింది.

"నీ వివాహానికి, ముందు నీ తల్లి అనుమతి తీసుకో," అన్నాడు బుద్ధుడు. అని, "అది సరేకాని, అసలు నువ్వు ఎందుకు ఆనందుని కోరుతున్నావు? నీకు ఏం కావాలి? అతనిలో నిన్ను ఆకర్షించింది ఏది?" అని వివరాలు అడిగాడు.

"అతని బాహ్య సౌందర్యం" అన్నది.

"చూడమ్మా! ఈ దేహం వుంది చూశావూ, అది వట్టి మురికి-మల, మూత్రమయం. అయినా స్త్రీ-పురుషులు కలిస్తే-సంతానం కలుగుతుంది. పుట్టిన వారికి రోగం వస్తుంది. చనిపోవచ్చు. మృత్యువు, భయంకరమైనది. అది విషాదహేతువు - దుఃఖకారణం. అటువంటప్పుడు నువ్వు ఆనందుని వివాహం చేసుకోవడంలో అర్థంలేదు," అన్నాడు బుద్ధుడు.

ప్రాక్రితి, బుద్ధుని మాటలు శ్రద్ధగావిని, అర్థం చేసుకుంది. ఆమెలో పరివర్తన కలిగింది. ఆమె, ఆయన పాదాలమీదపడి, "నా అజ్ఞానం తొలగింది. నేను ఇప్పుడు నిద్రనుంచి మేల్కొన్నాను. నా భ్రమ తొలగింది. నా తృష్ణ అణగింది. నా కోర్కె, అంతరించింది. ఆశ, ఎండిపోయింది," అన్నది. ఆ తర్వాత, ఆమె భిక్షుకి సంఘంలోచేరి, గతాన్నంతా మరచి - హాయిగా వుండి, బుద్ధుని పాదాలచెంత.

★ ★ ★

ఒక రోజున బుద్ధుని సమక్షంలో ఒక చర్చ జరిగింది. "పువ్వుల నుండి-చెట్ల మూలికలనుండి వచ్చే పరిమళాలు-గాలి వాలును బట్టి వ్యాపిస్తాయిగాని, గాలికి ఎదురుగా వ్యాపించవు. గాలి వాటు మీద ఆధారపడకుండా, అన్ని దిక్కులకూ వ్యాపించే పరిమళం-లోకంలో ఏదైనా వుందా? అని ప్రశ్నించారు ఒకరు. దానికి బుద్ధభగవానులు స్వార్థ చింతన వీడి-కేవలం, లోక హితాన్ని లక్ష్యంగా పెట్టుకుని-ఆ లక్ష్యసాధనలో భాగంగా-దాన పారమిత - శీలపారమిత-వీర్య పారమిత-ధ్యానపారమిత - ప్రజ్ఞా పారమిత-లను గడించే సాధు జనుల-సత్పురుషుల కీర్తి పరిమళాలు మాత్రమే అన్ని దిక్కులకూ వ్యాపిస్తాయి. దేవాది లోకాలకు కూడా వ్యాపిస్తాయి. అవి-గాలికి ఎదురుగా కూడా పోగలవు. భూలోక వస్తుపరిమళాలన్నింటి కంటే,

శీలసంపత్తి పరిమళం మిక్కిలి శ్రేష్ఠం," అని సమాధాన మిచ్చాడు.

★ ★ ★

ఒకరోజు ఉదయం బుద్ధుడు శిష్యులతో మాట్లాడుతూ వుండగా ఒకామె, ఏడుస్తూ ఒక బిడ్డను తీసుకువచ్చి, "స్వామీ, నా బిడ్డను బ్రతికించండి." అని మొరపెట్టుకుంది. ఆమె—శ్రావస్తిలో—ఒక ధన వంతుని కుమార్తె. ఆమె పేరు గౌతమి—ఆమె చాలా సన్నగా వుండ టంచేత అందరూ ఆమెను "కిసా గౌతమి" అని పిలిచేవారు. ఆమెకు ఒక వర్తకునితో వివాహమైంది. చాలా కాలానికి ఒక బిడ్డ పుట్టాడు. అతడు చిన్నతనంలోనే ఒక పాము కాటుకుగురై —అకస్మాత్తుగా మరణించాడు. కాని, ఆమె మనసులో అతడు చావలేదు. అతడు అపస్మారకస్థితిలో వున్నాడని-వైద్యం చేస్తే బ్రతుకుతాడనీ-వైద్యు లందరి దగ్గరకు వెళ్ళి-తాను ఆశించిన ఫలితం కనుపించక-చివరికి బుద్ధుని దగ్గరకు వెళ్ళి బ్రతికించమని బ్రతిమిలాడింది. ఆమె అవి వేకాన్ని గమనించి, "అమ్మా! ఊళ్ళోకి వెళ్ళి-ఎవరిఇంట ఎప్పుడూ- ఎవరూ మరణించలేదో— ఆ ఇంటినుంచి గుప్పెడు ఆవగింజలు తీసు కొస్తే- నీ బిడ్డబ్రతుకుతాడు," అన్నాడు.

ఆమె శ్రావస్తి అంతా తిరిగి- నిరాశతో బుద్ధుని దగ్గరకు వచ్చింది. "ఆవగింజలు తెచ్చావా?" అని బుద్ధుడు దయగా అడి గాడు. మరణమెరుగని కుటుంబమే లేకపోవడంతో ఆమెకు అసలు సత్యం బోధపడి- "అంతా అశాశ్వతం- అనిత్యం" అని తెలుసు కుని, బౌద్ధ సంఘంలో చేరి, బుద్ధుణ్ణి అనుసరించింది. ఆ తర్వాత బుద్ధుడు ఆమెకు దుఃఖోపశమన కారకమైన ధర్మాన్నంతా బోధిం చాడు. ఆమె శేషజీవితం, భిక్షుణిగా గడిపింది. ఒకరోజు రాత్రి ఆమె దీపం వెలిగిస్తుండగా— అది వెలిగి, అకస్మాత్తుగా ఆరి పోయింది. ఆ సంఘటనతో" లోకంలో ప్రతీదీ ఇంతే!" అనే అను

క్షజ్ఞానం కలిగి, ముక్తురాలు అయింది. కృతకృత్యురాలైన ఆమె గురించి బుద్ధుడు ఒకనాడు ఇట్లా అన్నాడు: "నిర్వాణాన్ని చూడ లేని నూరేండ్ల జీవితంకన్నా, నిర్వాణాన్ని చూడగల ఒక్కరోజు బ్రతుకు శ్రేష్ఠం" అని.

ఆ తర్వాత ఆమె కొన్ని గీతాలు కూడా రచించింది.

*  *  *

బౌద్ధులు- జైనులు ఎప్పుడూ కలసివుండలేదు. కాని, వారిరు వురికీ సంఘంతో, ప్రజలతో, ప్రపంచంతో ఎప్పుడూ, ఎటువంటి ఘర్షణా లేదు. బుద్ధుడు, వర్ధమానుడు ఇద్దరూ- శిష్యులతోసహా అనేకవిధాల సంఘంమీద- ఆహారం, వసతి, బట్ట వంటి విషయాలలో ఆధారపడినవారు. తమను అన్నివిధాలా ఆదుకుని, ఆశ్రయమిచ్చే ప్రజలమీద వారెట్లా తిరుగుబాటు చేస్తారు? తాము చెప్పదలచు కున్నది సౌమ్యంగా చెప్పడం తప్ప. సంఘంలో నీతి, ధర్మం, న్యాయం వంటి ముఖ్యవిషయాలు ఎంత అధోగతిలో వున్నా, సంఘాన్ని కాపనక తాము దర్శించిన సత్యాన్ని బోధిస్తో ప్రచార జీవితం గడిపారు. సంఘంలో ఒక భాగమై జీవించారు. వారిద్దరి తిరుగుబాటు అంతా బుద్ధిపరమైనది. అదీ మాటల్లోనే.

తీర్థులు, జైనధర్మం పాటించేవారు. కాని, వారు వర్ధమాన మహావీరుని పంథావారు మాత్రం కాదు. మహావీరుని పూర్వపువాడైన పార్శ్వనాథుని పంథావారు- తీర్థులు, బౌద్ధులను ద్వేషించేవారు. ఎందు కంటే, ప్రజలు, ప్రభువులు తమనుగాక బౌద్ధులను ఆదరించేవారు గనుక. అందుచేత వారు తమ పిల్లల్ని బౌద్ధవిహారాల ఛాయలకు పోనిచ్చేవారుకాదు. బుద్ధుని బోధల్ని విననిచ్చేవారు కాదు.

*  *  *

సంచారసమయంలో బుద్ధునితో కలసి- శిష్యులు-అనుచరులు- సంఘసభ్యులు వుండేవారు. వారంతా వనాల్లో- గుహల్లో-ఆరామాల్లో

మైదానాల్లో- దేవాలయాల్లో- బయళ్ళలో - విశ్రమించేవారు. వారికి వర్తకులు, ధనికులు, రాజులు— నిత్యావసర వస్తువులు ధర్మంగా ఇచ్చేవారు. ఆ సమయంలో కొందరు వారిని దర్శించి— వారి బోధలు విని — సంఘసభ్యులయ్యేవారు. కొందరు దీక్షలు తీసుకునేవారు. ఆకాలంలో-అనేకచోట్ల, అనేక సంఘటనలు జరిగాయి. అందులో 'తృణ' అనే గ్రామస్థులంతా బుద్ధుని నిరాకరిస్తే, ఒక దాసిపిల్ల ఆయన్ని ఆహ్వానించి, ఆతిథ్యమిస్తే - ఆమెను యజమానికొట్టి చంపిన ఘాతుకవిషయం కూడా వుంది.

* * *

బుద్ధుడు నలందలో వుండగా "కేవద్దాహ" అనే గృహస్థు- బుద్ధుని దగ్గరకు వెళ్ళి- నమస్కరించి - "మీరు మహాత్యాలు చేసి చూపితే, నలంద పౌరులందరూ బౌద్ధమతంలో చేరతారు" అన్నాడు. దానికి బుద్ధుడు "మహాత్యాలు చేసి చూపమని నేను నా శిష్యులకు చెప్పను. గారడీలు చేసేవాళ్ళు వున్నారు. మహాత్యాలు ఏం గొప్ప? మనసులు, హృదయాలు చదవగలిగినవారు వున్నారు. అయితే ఏం గొప్ప? మనోవాక్కాయ కర్మలలో పరిపూర్ణుడైతే, బౌద్ధధర్మం విని, అందు చేరతాడు. అదే ఒక మహత్యం" అన్నాడు.

* ★ ★

శ్వేతభ్యనగర పరిసరాల్లో బుద్ధుడు ధర్మోపదేశం చేస్తుండగా- "మహాకాలుడు-శూలకాలుడు" అను ఇద్దరు అన్నదమ్ములు - వివాహితులు-వర్తకులు-బుద్ధుని దర్శించారు. మహాకాలుడు బుద్ధుని బోధలు విని-ఆకర్షితుడై-సన్యసించాడు. సోదరుణ్ణి తిరిగి గృహస్థు చేయాలంటే, తానూ బౌద్ధ సన్యాసులలో చేరాలని, శూలకాలుడూ సన్యసించాడు. కాని, అతడు సోమరి-విషయలోలుడు— ఇంద్రియనిగ్రహం లేనివాడు కావడంతో భార్య ప్రయత్నంవల్ల, అతడు త్వరలోనే సంఘం వదలివెళ్ళి పోయాడు. అలాగే మహాకాలుని భార్య ప్రయ

త్నించగా-ఆ సంగతి తెలిసి బౌద్ధ భిక్షువు లంతా బాధపడుతో వుంటే, బుద్ధుడు కలగజేసుకుని- "విషయ ప్రీతిచే శుచి చింతన చేయని వానిని-ఇంద్రియ నిగ్రహం లేని వానిని - భోజన ప్రియుని - సోమరిని- శక్తి హీనుని- రాగ, ద్వేష, మోహాదులు సులభంగా జయిస్తాయి. దుర్బల వృక్షాన్ని చిరుగాలి పెకలించునట్లు. మనో - దేహ అశుచిత్వాన్ని భావనచేస్తూ - వైరాగ్యాన్ని పెంచుకుంటున్న వానిని-ఇంద్రియాలను చక్కగా అదుపులో పెట్టుకున్న వానిని — ఉత్సాహం కలవానిని- రాగ, ద్వేష, మోహాదులు కదిలించలేవు. ఎంత పెనుతుఫాను వచ్చినా పర్వతాన్ని కదిలించలేనట్లు" అని చెప్పేలోపుగా మహాకాలుడు బౌద్ధ భిక్షువుగా బుద్ధుని ముందు ప్రత్యక్ష మయ్యాడు.

* * *

దేవప్రియ ఒక వేశ్య ఆమె అవసానదశలో మహాచి పాలై నది. ఒళ్ళంతా పుళ్ళు-కళ్ళు కనపడవు. పరిచర్యచేసే దిక్కు లేక- అనాధయై - ఒంటరిగా ఇంట్లో పడివుంది. అన్నేళ్ళూ ఆమె అందాన్ని-అన్నివిధాలా ఆరాధించి-అనుభవించిన రసిక శిఖామణు లంతా, ఆమెను గజ్జికుక్కను వదిలేసినట్లు వదిలేశారు.

ఒకనాటి ఆమె ప్రియుడు బౌద్ధ భిక్షువయ్యాడు. ఆమె యందు ప్రేమ కొద్దీ, అనేకసార్లు ఆమెకు బుద్ధుని గురించి - ధర్మం గురించి చెప్పాడు. ఏనాడూ ఆమె అతని మాటలకు విలువ ఇవ్వలేదు. కాని, దీనావస్థలో వున్నప్పుడు-ఆనాటి తన ప్రియుని మాటలు పదే పదే గుర్తుకు వచ్చాయి. ఏం ప్రయోజనం? అతను అందరానంత దూర మయ్యాడు. కాని, ఆమె మనసులో బుద్ధుని నామం- ధర్మం నిరం తరం నిలవడంచేత-బుద్ధుని దర్శించాలని ఆశపడింది; ఆరాటపడింది. కాని, సమయం మించి పోయింది. దేహం ఏ మాత్రం అనుకూలంగా లేదు. క్రమంగా ఆమె దేహ పరిస్థితి క్షీణించింది.

ఒకరోజు సాయంత్రం ఆమె మనసు మరీ ఆందోళన చెందింది. కాని, తిండిలేక-చూసే దిక్కులేక- ఒంట్లో శక్తిలేక- రోగతీవ్రతతో- ఆరిపోతున్న దీపం మాదిరిగా చీకటింట్లో దిక్కులేకుండా పడివుంది. లోకమే శూన్యంగా తోచింది. శాశ్వతంగా కన్నుమూసే లోపల ఒకసారి బుద్ధుణ్ణి దర్శించాలనే బుద్ధి పుట్టింది. ఆమె పరితాపానికి అంతులేదు. తనకు మృత్యువు ఆసన్నమైనదని గుర్తించింది. ప్రభువు ఒక్కరే దిక్కని ఆ క్షణాన గట్టిగా విశ్వసించింది. ఆ దిక్కు-ఏ దిక్కున వుందో ఆమెకు తెలియదు. మనసు పనిచేయడం వల్ల చాలా మథనపడింది.

చీకటిపడే కొద్దీ రోగతీవ్రత అధికమైంది. ఒళ్ళు తెలియని స్థితిలో మంచంమీద నుంచి దొర్లి-కిందపడింది. నేలమీద కీటకం మాదిరిగా తడుముకుంటూ - పాకుతూ వీధిగుమ్మం దాటి - రోడ్డు మీదకు వచ్చింది. జనసంచారం తగ్గింది. ఆమె మనసు ప్రభువు దర్శనం కోసం ఆరాటపడుతూనే వుంది.

ఒకనాటి ఆమె ప్రియుడైన బౌద్ధ సన్యాసి-ఆమె ఇంటి ముందు నుంచి వెడుతున్నాడు ఆ సమయాన. రోడ్డు మధ్య, ఏదో పెద్ద మొద్దు పడివుండటం గమనించి-దాన్ని నిదానించి చూడగా-అది మొద్దు కాదని - మానవదేహమని - గుర్తించి — చేతుల్లోకి తీసుకున్నాడు.

అతని చేతుల్లో ఆమె-లేత అరటాకుల్లో వున్నంత హాయిగా వుంధి. అది-ఎవరోకాదు—ఒకనాటి తన ప్రియురాలు- "దేవప్రియ" అని గుర్తించి, ఆమె పరిస్థితికి విచారించాడు.

ఆమె ఒంటిమీద పుళ్ళు రసికారుతున్నాయి. మాట నీరసించి పోయింది. చూపు నిలవడంలేదు-దేహం, శక్తిహీనంగా వుంది. అతని చేతుల్లోంచి, ఆ దేహం జారి-అతని కాళ్ళ ముందు పడింది. అతడు కమండలంలోని నీళ్ళు ఆమె ముఖాన చల్లాడు-ఆమె కొంచెం తేరు

కుంది. దీనంగా, నెమ్మదిగా "ప్రభూ, వచ్చారా?" అన్నది. దానికి అతను, "దేవప్రియా, బాధపడకు. ఒకనాడు నీ దేహం, మనసు ప్రపంచాన్ని తీవ్రంగా కోరాయి - ఇప్పుడవి ప్రభువును కోరు తున్నాయి. నీ హృదయం-ప్రభువు దర్శనం కోసం—విమోచనకోసం ఆరాట పడుతున్నది. గాబరపడకు. నీ కోరెక్కె ఫలిస్తుంది," అన్నాడు. అతని స్వరం-అతని వంతం ఆమెకు పరిచయమే. అతడు తన ప్రియుడేనని గుర్తించి, "స్వామీ, మీరా? నన్ను రక్షించ డానికి వచ్చారా? ఇంత రాత్రివేళ-నా చివరి క్షణాల్లో? లేక-ప్రభువే మిమ్మల్ని నా దగ్గరకు పంపించారా? ప్రభువు దర్శనం కోసం ఆలస్యంగా బయలుదేరాను. దేహం ఏ మాత్రం సహకరించని సమ యంలో-కాని, నన్ను తీసుకోవడానికి ప్రభువు మీ రూపంలో వచ్చారు. నిజంగా నా కోసమే వచ్చారు. నాకు చాలా తృప్తిగా, సంతోషంగా, పరమానందంగా వుంది," అని, "స్వామీ, ఒకమాట అడుగుతాను - చెప్పండి. జీవితంలో మీకు శాంతి లభించిందా? ప్రభువు అనుగ్రహం పొందారా?" అని.

"ప్రభువు అనుగ్రహం ఎప్పుడూ వుంది. నేను ఆయన్ని దర్శించిన మొదటిక్షణం నుంచీ-అది మరింత స్పష్టంగా తెలుస్తోంది. ఆయన అనుగ్రహం-ప్రేమ—ఒక్క నా మీదే కాదు—సమస్త చరా చరంపై సమంగా వుంది. అదే శాంతి-ఆనందం," అని అతడు ఆమె శిరోపరిభాగాన మృదువుగా నిమిరాడు.

ఆమె మనసులో ఆరాటం అణగింది. శాంతపడింది. ప్రశాం తంగా కళ్ళు మూసింది. ఆమె కథ విన్న బుద్ధుడు, "అన్ని అనర్థా లకు "నేను-నాది" అనే తప్పుడు భావన. దేహ తత్వం పూర్తిగా అవగతమైతే-"నేను—నాది" అనే భావాలకు ఆధారం పోతుంది. ఆ తర్వాత, "నేను-నాది" అనే మాటలు కేవలం వ్యవహార సౌలభ్యా నికి మాత్రమే వాడే వట్టి మాటలౌతాయి. దేహాన్ని స్థిరమని—నిత్య మని-శుచియని-సుఖాస్పదమని అనుకుంటూ అలా వ్యవహరిస్తాం. అసలు అజ్ఞాన మంతా అక్కడే వుంది," అన్నాడు.

* * *

బుద్ధుడు ఒక గ్రామంలో విడిదిచేశాడు. ధర్మప్రచారం నిమిత్తం శిష్యులు తలోక గ్రామం వెళ్ళారు. తిరిగి వచ్చిన శిష్యుడొకడు, "భగవాన్! నేను ఒక విచిత్రమైన వ్యక్తిని చూశాను. అతను నన్ను నిర్లక్ష్యంగా చూస్తూ- నేను చెప్పే మాటల్ని ఎంత మాత్రం చెవికి ఎక్కించుకోవడంలేదు. ఏం చెయ్యాలో,- అతనికి ఎలా చెప్పాలో నాకు అర్థం కావడంలేదు," అన్నాడు. బుద్ధుడు- విని మౌనంగా వున్నాడు.

మర్నాడు బుద్ధుడు ఆ శిష్యునితో సహా ఆ గ్రామానికి వెళ్ళాడు. ఆ వ్యక్తిని చూశాడు. అతని గురించి వివరించాడు. అతనికి ఎన్నో రోజులనుంచి తిండిలేదు. ఆకలితో వున్నాడు. బుద్ధుడు వెంటనే ఆహార పదార్థాలు తెప్పించి- అతనికి తృప్తిగా పెట్టాడు. అతడు- ఆకలిబాధ తీరాక- బుద్ధునికి సాష్టాంగ నమస్కారం చేసి- బుద్ధుని ముందు కూర్చుని- ఆ రోజు ప్రసంగం శ్రద్ధగా విన్నాడు.

తిరిగి వెడుతూ, ఆ శిష్యునితో, "నాయనా, భిక్షూ! ఆ వ్యక్తికి కావలసిన ధర్మబోధన ఆ మార్గమే. ఆకలి అభిజ్ఞతకు అవరోధం; తెలుసుకోవడానికి ఆటంకం. ఆకలితో వుంటే, ధర్మం సరిగ్గా వినలేరు. "అన్నం" అనే ఔషధాన్ని తప్పనిసరిగా తీసుకోవలసిన రోగమే, "ఆకలి," అన్నారు, ఫిర్యాదు చేసిన ఆ శిష్యునితో.

*   *   *

తాము శాశ్వతులమనే దృష్టితో మనుష్యులు ఆస్తి-పాస్తుల్ని కూడబెట్టి, నిరంతరం తగాదాలు పడుతో అశాంతిగా వుంటారు. జేతవనంలోని బౌద్ధ భిక్షువులు కూడా ఒకరితో ఒకరు అల్పం-స్వల్పం-అయిన విషయాలకు తగాదాపడుతో వుంటే, ఆ వర్షాకాలం బుద్ధుడు జేతవనం వదలి ఒంటరిగా ఎక్కడికో వెళ్ళిపోయారు. ఆ నాలుగునెలలూ బుద్ధుడు జేతవనంలో లేకపోయేప్ప

టికి- ప్రజలెవరూ అక్కడకు వెళ్ళలేదు. భిక్షువుల్ని ఎవరూ ఆదరించ లేదు. ఆ సందర్భంలో ఆనందుడు- మరో ఐదువందలమంది పెద్ద లైన భిక్షువులు వెళ్ళి బుద్ధుణ్ణి కలుసుకుని విషయం చెప్పి "అందరూ తమ తప్పులు తెలుసుకుని- పశ్చాత్తాపంతో వున్నారు. తమరు తిరిగి జేతవనానికి రావలసినదిగా కోరుతున్నారని చెప్పగా బుద్ధుడు వెళ్ళి- "అంతా అశాశ్వతం" ప్రేమతో- అవగాహనతో జీవించమని- అదే నిర్వాణమని చెప్పారు.

*　　　*　　　*

బుద్ధుడు జేతవన విహారంలో ఉన్నప్పుడు జరిగిన సంగతి: "కానమాత" అనే ఒకామె వుంది. ఆమె కుమార్తె పేరు "కాన" ఆమెను ప్రక్కగ్రామవాసికి ఇచ్చి వివాహంచేసింది. ఒకసారి "కాన" తల్లిని చూడ్డానికి పుట్టింటికి వచ్చింది- కొన్నిరోజుల తర్వాత, ఆమె భర్త కబురుపెట్టాడు, మర్నాడు రమ్మని. దానికి కానమాత- "అమ్మా, రేపు ఇక్కడవుండి- ఎల్లుండి అత్తింటికి వెళ్ళు. నేను మిఠాయీలు- అవీ చేస్తాను. తీసుకువెళ్ళు," అంది. ఆమె మర్నాడు మిఠాయీలు చేసింది. అంతలో నలుగురు బౌద్ధభిక్షువులువస్తే, వారికా మిఠాయీలు పెట్టింది. వారు వెళ్ళి ఆశ్రమంలోని తక్కిన భిక్షువులకు ఆ సంగతి చెప్పారు. వాళ్ళంతా ఒకరితర్వాత ఒకరు కానమాత ఇంటికి వెళ్ళారు. వారందరికీ ఆ మిఠాయీలు పెట్టింది. చివరికి ఏమీ మిగలలేదు. అందుచేత "కాన" అత్తవారింటికి అన్నమాటప్రకారం వెళ్ళలేదు. ఆ తర్వాత కానమాత మళ్ళా మిఠాయీలు చేసింది- కూతురుకిచ్చి- అత్తింటికి పంపడానికి. ఆరోజునా భిక్షువులు వచ్చారు. ఆ మిఠాయీలు వారికి పెట్టేసింది. ఆవిధంగా ఆమె మూడుసార్లు మిఠాయీలూ చేసింది. మూడుసార్లు బౌద్ధభిక్షువులు వచ్చారు. వారికి ఆ మిఠాయీలు పెట్టింది. చివరికి కాన- అత్తవారింటికి వెళ్ళలేదు.

ఎంతకీరాని భార్యకొరకు "కాన" భర్త మళ్ళా కబురుపెట్టాడు, ఆ మర్నాడు ఇంటికి రాకపోతే— తాను మరో పెళ్ళి చేసుకుంటానని,

అందుచేత కానమాత మళ్ళా మిఠాయీలు చేసింది. "కాన" అత్త వారింటికి వెళ్ళే ఆ రోజున కూడా భిక్షువులు వస్తే- వారికా మిఠాయీలు పెట్టారు. చివరికి కూతుర్ని ఆనాడు కూడా అత్తవారింటికి పంపలేదు.

"కాన" భర్త మరో పెళ్ళి చేసుకున్నాడు. ఆ సంగతి తెలిసి "కాన" బౌద్ధభిక్షువుల రాకవల్ల తన సంసారం చెడిందని- జీవితం దుర్భరం అయిందని- వారిని నిందించింది- దానితో భిక్షువులు కాన మాత ఇంటి పరిసరాలకు వెళ్ళడం మానుకున్నారు-

బుద్ధునికి కానమాత సంగతి తెలిసి- భోజనానంతరం ఆమె ఇంటికి వెళ్ళి- "కాన ఎక్కడ?" అని అడిగాడు- ఆమె బుద్ధుని ముందుకు వచ్చి నిలబడింది. ఆమెను చూసి, "అమ్మా! మీరు ఇచ్చినవే భిక్షువులు తీసుకున్నారా? లేక- మీరు వారికి ఇవ్వనివి కూడా తీసుకున్నారా?" అని అడిగాడు. మేము ఇచ్చినవే తీసుకున్నారు. ఈ నావిషయంలో వారి దోషం లేదు. తప్పుఅంతా నాదే," అన్నది కాన- ఆ సందర్భంలో బుద్ధుడు ఆమెకు ధర్మోపదేశం చేశాడు. అది విని, ఆమె ఉన్నతురాలు అయింది.

కానమాత- ఇంటినుంచి బుద్ధుడు ఆరామానికి వెడుతూ కోసల రాజైన పాసినాడిని కలిసి- కానమాత కుటుంబానికి జరిగిన అన్యాయం గురించి వివరంగా చెప్పాడు. దానికి రాజు- "స్వామి, మీరు "కానకు ధర్మోపదేశం చేయలేదా?" అని అడిగాడు. "నేను ధర్మోపదేశం చేశాను. ఆమె శాంతపడింది," అన్నాడు బుద్ధుడు.

ఆతర్వాత రాజు- పల్లకి ఇచ్చి- పరివారాన్ని "కాన" ఇంటికి పంపించి- ఆమెను రాజదర్బారుకు తీసుకురమ్మన్నాడు. ఆమె- దర్బారుకు వచ్చాక- సభాసదులందరిముందూ, "నా ప్రియ కుమార్తె "కాన"ను మీలో ఎవరు, సహృదయంతో తీసుకుని ప్రేమగా చూసుకుంటారు?" అని అడిగాడు రాజు. దానికి ఒక మంత్రి ముందుకు వచ్చి- "కాన"ను తన కుమార్తెగా స్వీకరిస్తానన్నాడు. అని,

నా ఆస్తి అంతా ఆమెకు ఇస్తాను. ఆమె ఆ ఆస్తిని- తన ఇష్టం వచ్చినట్లు దాన-ధర్మాలు చేసుకోవచ్చు," అని కూడా అన్నాడు.

ఆ రోజునుంచి "కాన"-ప్రతిరోజు- బౌద్ధభిక్షువులకు దానాలు చేసేది. ఆమె సంగతి విని, "భిక్షువులారా! మంచు-మబ్బులతో కప్పబడ్డ సూర్యునివలె- అస్పష్టంగా, బుద్ధిమాంద్యంగా వున్న "కాన" మనసు- మంచిమాటలతో తేటపడి- నిర్మలం, నిశ్చలం అయింది, అన్నాడు బుద్ధుడు. లోతైన- నిశ్చలమైన- నిర్మలమైన పరిశుద్ధమైన తటాకం వలె- ధర్మోపదేశం విన్న సజ్జనులు పవిత్రులు అగుదురు," అన్నాడు.

* * *

బుద్ధుడు ఒక గ్రామంమీదుగా వెడుతున్నాడు. అది బ్రాహ్మణాధిక్యతకల గ్రామం. ఆ గ్రామస్తులంతా బుద్ధునికి వ్యతిరేకులు. తమ గ్రామం ప్రవేశించనున్న బుద్ధునికి బుద్ధిచెప్పాలని ఆయనకు ఎదురు వెళ్ళి, ఊరుబైట నిలబెట్టి నిందించి, దూషించి, ఆయన బోధించే ధర్మాన్ని ఖండించి, ఆరోపణలు చేసి, వెనక్కి తరిమెయ్యాలని చూశారు. వారి ప్రవర్తనవల్ల ఆనందునికి కోపం వచ్చింది. బుద్ధుని శాంత స్వరూపం చూసి ఆగిపోయాడు. బుద్ధుడు వారిని ఉద్దేశించి, "అయ్యా, చూడండి, సూర్యాస్తమయం లోపల మేము మరో గ్రామం చేరవలసి వుంది. మీరు నాకు వినిపించాలనుకున్న వన్నీ త్వరగా వినిపించండి. వ్యవధి చాలకపోతే, తిరుగుప్రయాణంలో మీకోసం కొంచెం ముందుగా ఇక్కడికి వచ్చి, మిగిలినవన్నీ తప్పకుండా వింటాం. రెండురోజుల్లో మేము తిరిగి ఈ దారినే వస్తాం. మీరు దయవుంచి ఈ రెండురోజులూ ఆగితే అప్పుడు అన్నీ సావధానంగా వింటాం" అన్నాడు.

ఆ గుంపులోంచి ఒకాయన ముందుకువచ్చి, "మా విషయంలో మీరేమీ కలతచెంది, గొడవపడుతున్నట్లు కనుపించడం లేదు. మేము

మీకు ఎటువంటి విషయాలూ, సంగతులు చెప్పి, వినిపించబోవడం లేదు. మిమ్మల్ని నిందించబోతున్నాం. మీరు బోధించే ధర్మాన్ని ఖండించబోతున్నాం. మిమ్మల్ని, మీ గురుపీఠాన్ని అవమానించ బోతున్నాం," అన్నాడు యూకుడుగా.

"అలాగా, నాయనా! అయితే మీరు కొంచెం ఆలస్యంగా వచ్చారు. కొన్నాళ్ళముందు వచ్చివుంటే, మీరంతా ఇక్కడనుంచి సజీవంగా ఏటిక్కడా తిరిగి మీ ఇళ్ళకు వెళ్ళకపోవుదురు. ఆనాడు నేనూ యోధుడనే. అప్పుడు ఇక్కడ రక్తం పారివుండేది. మేము ఇప్పుడు ఒక గ్రామం వెళ్ళాలి. ఆ గ్రామస్తులంతా మాకోసం ఎదురు చూస్తారు. ఇక్కడకు వచ్చేముందు మేము ఒక గ్రామం వెళ్ళాం. వారంతా మాకు పళ్ళు—ఫలహారాలు ఇచ్చారు. వారితో మేము ఇట్లా అన్నాం :

"మేము రోజుకోపూట మాత్రమే భోజనం చేస్తాం. ఇప్పుడు మా భోజనాలు పూర్తయ్యాయి. ఈ పదార్థాలు ఇప్పుడు మాకు అవసరంలేదు. దయవుంచి వాటిని మీరే తీసుకోండి," అన్నాం. అప్పుడు వారు ఏంచేసివుంటారో చెప్పండి," అని ప్రశ్నించాడు బుద్ధుడు.

"ఏం చేసి వుంటారు. తిరిగి తీసుకుని-తామే తిని వుంటారు," అన్నాడు ఒక పండితుడు.

"అవును. మీరు సరిగ్గా చెప్పారు. తెలివైనవారు మీరు కనుక అలాగే చేస్తారు. మీరేం తీసుకొచ్చినా, నేను అంగీకరించి తీసుకోను. కనుక వాటిని మీరే తీసుకోండి. నేను- మీ ఆరోపణల్ని - నిందల్ని- ఖండనల్ని తీసుకోకపోతే- ఇంక మీరు నన్నెట్లా అవమానించగలరు? అది- మీ నోరుగనుక— ఏమైనా వాగవచ్చు. అది మీ ఇష్టం. నేను అంగీకరించి తీసుకోనిది- అది వ్యర్థమై గాలిలో కలిసిపోతుంది. ఈ సంగతులన్నీ-మీరు ఇళ్ళకువెళ్ళి- ఒకరితోఒకరు చెప్పుకోండి. ఆనందించండి. రెండురోజుల్లో తిరిగి ఇటే వస్తాము. అప్పుడు సరిగ్గా- స్థిరంగా వుండండి," అన్నాడు బుద్ధుడు.

అదివిని, వారంతా ఆశ్చర్యచకితులయ్యారు. బుద్ధుడు ఏరకం మనిషో వారికి అర్థంకాలేదు. వాళ్ళు వెళ్ళినతర్వాత," ఇదేం బాగా లేదు. అనవసరంగా- అన్యాయంగా వారు నోటికివచ్చినట్లు మాట్లాడ టం—మీ ముఖం చూసి పూరుకున్నాను - కోపం అణచుకున్నాను. లేకపోతే వారిమీదికి దూకి-ఒక్కొక్కరినీ - ముక్కలు ముక్కలుగా నరకాలనిపించింది. నన్ను నేను బలవంతంగా అదుపులో పెట్టు కున్నాను," అన్నాడు ఆనంద్. దానికి బుద్ధుడు," వారు అన్న మాటలు నన్ను గాయపరచలేదు. కాని, నువ్వు ఇప్పుడు మాట్లాడిన మాటలు నన్ను గాయపరిచాయి. నువ్వు కొన్నాళ్ళనుంచి నాతో వున్నావు. ధర్మం, విన్నావు. సాధుజీవనం గడుపుతున్నావు. సత్వ గుణంపోయి- రజోగుణం ప్రధానమై పోయింది నీకు. సమయం వచ్చి నప్పుడు ఏం చెయ్యాలో-ఎట్లా ప్రవర్తించాలో - ఏం మాట్లాడాలో- ఎరుకలో లేకుండా ప్రవర్తిస్తున్నావు. అవివేకంగా - అజ్ఞానంతో- మిమ్మల్ని ధర్మదూతలుగా చేయాలనుకున్నాను. కాని, మత ప్రచా రకులుగా మాత్రంకాదు. ఇతరులకు సహాయం చేసేముందు - తమకు తాము సహాయపడవలసినది ఎంతో వుందనే సంగతి జ్ఞప్తిలో వుంచు కోవాలి. ఇతరులకు సత్యసందర్శన భాగ్యం కలిగించేముందు, మీరు సత్యాసందర్శకులై వుండాలి. ఏది వ్యాప్తి చేయాలన్నా - అది మీ జీవితానుభవమై కూడా వుండాలి," అన్నాడు బుద్ధుడు.

*　　　*　　　*

బుద్ధుడు శ్రావస్తిలో వున్నప్పుడు ఒక భిక్షువు - "కాలా" అనే అతను- రోజూ ఒకామె ఇంటికి భిక్షకు వెళ్ళేవాడు. ఆమె రుచికర మైన వంటకాలు భక్తి-శ్రద్ధలతో పెట్టేది. ఆమెకు- జేతవనం వెళ్ళి- బుద్ధుడు చెప్పేబోధలు స్వయంగా వినాలనేకోర్కె కలిగి- తన ఇంటికి రోజూ వచ్చే భిక్షువుతో చెప్పింది. దానికతడు అంగీకరించ లేదు. ఎన్నిసార్లు అడిగినా జేతవనం వెళ్ళవద్దనే చెప్పాడు. చివరికి ఆమె ఒకరోజు వెళ్ళి—బుద్ధుని విన్నది. ఆ సంగతి తెలిసి - ఆ భిక్షువు జేతవనానికి వెళ్ళి- "అయ్యా, ఆమెది మందబుద్ధి. మీరు చెప్పే

ధర్మం అర్థం చేసుకోలేని మందమతి," అని బుద్ధునితో చెప్పాడు. బుద్ధుడు అతని ఆంతర్యం గమనించి, "భిక్షూ! నువ్వు తెలివితక్కువ వాడివి. మందబుద్ధివి. నీ తప్పుడు అభిప్రాయంతో- నా బోధల్ని తప్పుపట్టి తక్కువ చేస్తున్నావు. ఆ విధంగా నిన్ను నీవే వంచించుకుని నాశనం చేసుకుంటున్నావు. నిజం చెప్పాలంటే, నిన్ను నీవే నాశనం చేసుకుంటున్నావు" అన్నాడు బుద్ధుడు.

★ ★ ★

శ్రావస్తిలో "బహుబంధికుడు" అనే ధనవంతుడున్నాడు. అతనికి బౌద్ధభిక్షువుగా మారాలనే కోర్కె కలిగి- భార్యతో చెపితే, "నాకు ఇంతవిషం ఇచ్చి- మీరు దీక్ష తీసుకోండి," అన్నది. అతడు అంతటితో తన ఆలోచనకు స్వస్తి చెప్పాడు.

కొన్నేళ్ళ తర్వాత భార్య చనిపోతే, బహుబంధికుడు దీక్ష తీసుకోవాలని, అన్ని ఏర్పాట్లు చేసుకున్నాడు. చిన్న కుటీరం నిర్మించుకుని- పరిచారకులను ఏర్పాటు చేసుకుని— భోజన, వసతి సౌకర్యాలు సమకూర్చుకుని-కావలసినంత ధనం నిల్వ జేసుకున్నాడు. భిక్షువు అయ్యాక అతని వేషం మారింది కాని, జీవనపద్ధతిలో మార్పు రాలేదు. చివరికి అతని పద్ధతి అందరికీ ఆశ్చర్యకరంగా-ఎగతాళిగా తయారైనది. అందరూ అతని ముఖంమీదే హేళనగా అనడంతో, అతనికి రోషం వచ్చి- "అసలు మీరంతా ఏం త్యాగంచేసి వచ్చారని గొప్పలు చెపుతున్నారు? నన్ను నిందించి హేళన చేస్తున్నారు? నాలాగ ధనమంతా వదలుకుని వచ్చినవారూ కాదు. గంజికి తికానాలేని వాళ్ళంతా వచ్చి- దీక్షలు తీసుకుని, ఆరామాల్లో హాయిగా- సుఖంగా జీవితం గడుపుతూ మహాతపస్వులుగా నటిస్తున్నారు చూడండి, తపస్సంటే ఏమిటో - నేను చేసి చూపుతాను" అని అక్కడనుంచి అడవికి వెళ్ళిపోయాడు. కొన్నేళ్ళకు— అతడు జడలు కట్టిన-దుమ్ము పట్టిన, కుషించి, శల్యమైన దేహంతో- పిచ్చివానివలె కనపడ్డాడు.

బుద్ధునికి ఆ సంగతి తెలిసి-అతను దగ్గరకువెళ్ళి- "చూడు నాయనా, భిక్షుక జీవనం విముక్తి జ్ఞానాన్ని సంపాదించుకోవడానికే గాని, రోషాలు-ద్వేషాలు-పంతాలు-పట్టింపులు-పట్టుదలలు- స్వార్థలకు ఆట భూమి కాదు. తృష్ణా సంశయ ఛేదనం చేస్తేనే మనిషి నిర్మలుడు అయ్యేది. అంతేకాని, దిగంబరత్వం, జడలు పెంచడం-ఉపవాసాలు వుండటం-దేహాన్ని హింసించి, శుష్కింప జేయడం-దుమ్ములో పొర్లడం-ఇవన్నీ మనిషికి శుద్ధినిచ్చేవికావు. ముక్తిమార్గంలో పయనిస్తేనే జన్మసార్థకమయ్యేది," అని హితవు చెప్పాడు.

* * *

పుణ్యదినాలలో ధర్మాచరణ కలిగిన గృహస్తులు ఆరామాలకు వెళ్ళి-తాము పాటించవలసిన "పంచశీల"-మొదలగు నియమాలను జ్ఞప్తికి తెచ్చుకోవడం-వాటిని మనసులో దృఢం చేసుకోవడం పరిపాటి. అటువంటి ఒక పుణ్యదినాన-తాను బౌద్ధ సంఘంకోసం నిర్మించిన "పూర్వారామ" ఆరామానికి అటువంటి గృహస్తులను రావలసినదిగా "విశాఖ" ప్రత్యేకంగా ఆహ్వానించింది. ఆమె యందు భక్తి-గౌరవ, మర్యాదలు ఉండటంచేత-అందరూ వచ్చారు. ఆ సందర్భంలో ఆమెకు ఒక కుతూహలం కలిగి, "పుణ్యదినాలలో మీరందరూ ఎందుకు- ఏ ఉద్దేశ్యంతో ఆరామాలకు వెడుతున్నారో, ఆ సంగతి ఏమీ దాచకుండా-నిజం చెప్పండి," అని కోరింది.

"తాము వెళ్ళేది ప్రాపంచిక, సాంసారిక-లౌకిక విషయ ప్రయోజనాలకోసమని, నియమాలు పాటిస్తే-తమ కష్టాలు, బాధలు, అంతరాయాలు-తొలగి, తమతమ వాంఛితాలు నెరవేరతాయి" అనే ఆశతో వెడుతున్నామని వారంతా చెప్పారు.

వారి ఆశయం తెలుసుకుని, విశాఖ చాలా బాధపడింది. ఆ విషయం బుద్ధుని ముందు వుంచితే, "అవును విశాఖా, మనుష్యులు ఎప్పుడూ అంతే! జన్మ-జరా-వ్యాధి-దుఃఖ-మృత్యు వలయమైన ఈ

చక్రమంలోపడి జీవులు నలిగిపోతున్నారు. దాన్నించి బైటపడే మార్గం మాత్రం వెతుక్కోవడంలేదు. మనిషి వట్టి సుఖలాలసపరుడు. అది భ్రమ-ఆ భ్రమవల్ల-పరిభ్రమణాయానం తప్ప ఒరిగేదేమీలేదు. పశువులకాపరి పశువుల్ని పచ్చిక పొలాలకు తోలుకుపోవునట్లు-జరా మరణాలు జీవుల ఆయువుల్ని తోలుకుపోతున్నాయి," అన్నాడు.

* * *

ఒకసారి బుద్ధుడు జేతనవనంలో వుండగా వైశాలిలో పెద్ద కరువు వచ్చింది. వర్షాలు లేక, పంటలు పండక, అంటురోగాలు కూడా వచ్చి అనేకమంది చనిపోయారు. కరువు నివారణకు అనేక ప్రయత్నాలు చేశారు. ఫలితం లేకపోయింది. ఆ ఆపదనుంచి కాపాడమని అనేకమంది మహాత్ముల్ని అర్థించారు. ఎవరూ ఏమీ సహాయం చేయలేక పోయారు. చివరికి వారు బుద్ధునితో మొరపెట్టుకున్నారు. వైశాలి రావలసినదిగా ఆహ్వానించారు; లిచ్ఛవీరాజైన "మహాలీ," మరో బ్రాహ్మణ పండితుడు మగధ వెళ్ళి బింబిసారుని ద్వారా ప్రయాణం ఏర్పాట్లు చేయించారు.

వైశాలి-రాజగృహ మధ్య గంగానది వుంది. బుద్ధునితో పాటు ఐదువందల మంది భిక్షువులు కూడా బయలుదేరారు. గంగానది ఒడ్డు వరకు బింబిసారుడు వెళ్ళి-సాగనంపాడు. దారి పొడవునా భోజన-వసతితోపాటు, మార్గం కూడా బాగుచేశారు. నది ఆవలి ఒడ్డునుంచి వైశాలివారు బుద్ధుని ఆహ్వానించి తీసుకువెళ్ళారు. వారూ దారిపొడవునా భోజన, వసతి ఏర్పాట్లు చేశారు. ప్రయాణం-ఏడు రోజులు పట్టింది.

బుద్ధుడు వైశాలిలో వారం రోజులున్నారు. ప్రతిరోజు ఉభయ సంధ్యలలో ధర్మోపదేశం చేసేవారు. ప్రజలందరూ భక్తి-శ్రద్ధలతో విని పరివర్తనం చెందారు. ఏడవరోజున శుభసూచకంగా వర్షం పడింది. రోగాలు తగ్గాయి. పరిస్థితి చక్కబడింది - నాట్లు వేశారు.

ఆసంపంగా వున్నారు. వారంతా బౌద్ధం స్వీకరించి, బుద్ధుని అను సరించారు. ఆయనకు అనేక రకాల కానుకలు ఇచ్చి-సత్కరించి-తిరిగి గంగానది ఒడ్డు వరకు సాగనంపగా, అక్కడ నుంచి బింబిసారుడు బుద్ధుని ఆహ్వానించి జేతవనానికి తీసుకువెళ్ళారు.

*　　　*　　　*

కోసలదేశంలో భార్గవుడు అనే ప్రధాన పురోహితునికి ఒక కొడుకు పుట్టాడు. అతని జనన సమయంలో అనేక అశుభలక్షణాలు కనుపించడంచేత-అతనికి "అహింసక" అని పేరు పెట్టారు. అతని అక్షరాభ్యాసానంతరం - విద్యాభ్యాసానికి పేరు, ప్రఖ్యాతులు గల తక్షశిల-విశ్వవిద్యాలయానికి పంపించారు. అహింసకుడు చురుకైన వాడు, తెలివైనవాడు. గురువుయెడ సేవాతత్పరత- వినయ విధేయ తలు కలవాడు కావడంతో, గురువుగారు, ఆయన భార్య ఇద్దరూ అతన్ని ప్రేమగా చూసుకునేవారు. ఆ సంగతి సహాధ్యాయులకు ఈర్ష్యగా వుండి-అహింసకునికి-గురువుగారి భార్యకు అక్రమసంబం ధం వుందని వదంతి పుట్టించారు. ఆ సంగతి గురువుగారికీ చెప్పారు. గురువుగారు మొదటనమ్మలేదు. కాని, పదే పదే చెప్పడం వల్ల-చుట్టుపక్కల ప్రచారం కావడంవల్ల-ఆ గురువుగారు వివేక శూన్యుడై, అహింసకునికి ప్రతీకారం చేయదలిచాడు. అతన్ని హత్యచేస్తే తన మీదకు నేరం వచ్చి పడుతుందనీ, పేరు ప్రతిష్ఠలు పోతాయని ఊహించి, చివరికి ఒక ఆలోచన చేశాడు; అతన్ని ఏ విధంగానైనా సర్వనాశనం చేయాలని, "నాయనా, అహింసకా! నా దగ్గర పరమోన్నతమైన తారక విద్యవుంది. దాన్ని నీకు చెపుతాను. కాబట్టి నువ్వు - వెళ్ళి-వెయ్యిమందిని-స్త్రీ - పురుషులు-ఎవరినైనాసరే-చంపి-దానికి నిదర్శంగా, వారి చిటికెనవ్రేలుకోసి-మాలగా గుచ్చి-నాకు సమర్పించాలి. అప్పుడు నీకు జ్ఞాన భిక్షకూడా పెడతాను. సమస్తశాస్త్ర విద్యాదానం చేస్తాను," అన్నాడు. దానికి అహింస కుడు "ఇతరులను చంపడం నాకు ఇష్టంలేదు. కాని, మీ వద్ద విద్య

అభ్యసించాలనే అభిలాషకొద్దీ-అది-మీ ఆజ్ఞగా భావించి - వెయ్యి మందిని హత్యచేసి-వారిచిటికెన వేళ్ళమాల తెచ్చి, మీకు సమర్పిస్తాను," అని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. అహింసకునిలో సుగుణాలతోపాటు-మితిమీరిన గురు విశ్వాసం - అమాయకత్వం, మూర్ఖత్వం కూడా వున్నాయి.

ఆ ప్రకారం అహింసకుడు అనేక మందిని అవివేకంగా హత్యచేసి వారి చిటికెన వేళ్ళుకోసి,-మాలగా గుచ్చి-లెఖ్ఖ తెలియడం కోసం మెడలో వేసుకుని అరణ్యప్రాంతం తిరుగుతున్నాడు.

అందుచేత అతనికి "అంగుళీ మాలుడు" అని పేరువచ్చింది. విద్య అభ్యసించాలనే తీవ్రకాంక్షతో, ఆ విధంగా ప్రవర్తిస్తున్నాడు. అతని పేరు వింటేనే ప్రజలు భయపడేవారు. ప్రభువులు సైతం అతన్ని ఏమీ చేయలేక పోయారు. అతని వింతప్రవర్తనకు, అర్థరహిత హత్యలకు ప్రజలు భయపడి, ప్రసేనజిత్ మహారాజుకు మొరపెట్టుకున్నారు. అయినా ఏమీ చేయలేకపోయారు.

అంగుళీమాలుడు ఒంటరిగా దొరికిన వారిని హత్యచేయడంతో ప్రజలు, ప్రభువులు అతన్ని ఏ విధంగానైనాసరే బంధించాలని గట్టి ప్రయత్నాలు చేశారు- ఆ సంగతి అంగుళీమాలుని తల్లి "మంతానికి" తెలిసింది. రాజు తన కొడుక్కి ఉరిశిక్ష విధిస్తాడని తెలిసి, అతన్ని వెతుక్కుంటూ ఆమె అరణ్యప్రాంతాలకు బయలుదేరింది.

అంగుళీమాలుడు విద్యార్జన కోసం హింసావృత్తిని చేబట్టిన సంగతి బుద్ధునికి తెలిసింది- అతన్ని కలుసుకుని ధర్మం బోధించడానికి బుద్ధుడు బయలుదేరాడు. అప్పటికే అతడు తొమ్మిది వందల తొంభై తొమ్మిదిమందిని చంపి, చివరి వ్యక్తి కొరకు ఎదురు చూస్తున్న సమయంలో, ఒకవైపునుంచి అతని తల్లి-మరొక వైపు నుంచి బుద్ధుడు బయలుదేరారు. వారిద్దరిలో ఎవరు అతనికి చివరి

వ్యక్తి కాబోతున్నారో! అందుచేత అనేక ప్రదేశాలు నిర్మాను-ష్యంగా తయారైనాయి.

వడివడిగా వెడుతున్న బుద్ధుణ్ణి ఒకచోట పశువుల కాపరులు ఆపి, "అయ్యా, ముందున్న అడవి ప్రాంతంలో దుర్మార్గుడైన అంగుళీమాలుడు వున్నాడు. అతడు నరహంతకుడు. మీరు అటు వెళ్ళడం శ్రేయస్కరంకాదు. మా మాటవిని, వెనక్కి వెళ్ళండి," అన్నాడు. అయినా బుద్ధుడు నిర్భయంగా ముందుకు సాగాడు.

బుద్ధుడు ఓ చిట్టడవి చేరుకున్నాడు. ఒకచోట - దారి మధ్య అంగుళీమాలుడు తీక్షణంగా చూస్తూ నిలబడ్డాడు. అతడు బుద్ధుణ్ణి చూసి, విభ్రాంతి చెంది, కొంతకంగారుపడి, తనకు తెలియకుండానే కలవరపడి, "ఏ, సన్యాసీ! ఆగు. ఓ భిక్షూ, నేనెవరో తెలుసా? నిర్భయంగా వస్తున్నావేమిటి? నా సంగతి తెలియక, సాహసించి ముందుకు వచ్చావా, మృత్యువాత పడతావు.

అందరికీ పట్టిన గతే నీకూ పడుతుంది.

నేను చివరి మనిషి కొరకు ఎదురుచూస్తున్నాను.

ముందుగా ఎవరు కనిపిస్తే, వారిని హత్యచేసి వారి చిటికెన వ్రేలుతో నా అంగుళీమాల పూర్తిచేసి, గురువుకు సమర్పించి; జ్ఞానార్జన చేయవలిచాను. కనుక, నువ్వు నా దగ్గరకురావద్దు. వివే-కం కలిగి వెనక్కి తిరిగి వెళ్ళిపో. దూరంగా పారిపో, నాకు చిక్క-కుండా," అన్నాడు. బుద్ధుడు అతని మాటలకు భయపడక, "నువ్వు ఎవరో నాకు తెలుసు. నేను నిశ్చలంగా వున్నాను. నువ్వు నిశ్చ-లంగాలేవు. నువ్వో దుఃఖితుడవు. నిన్ను చూస్తే నాకు జాలి వేస్తోంది. అయినా, చూడు మిత్రమా, నీలో మంచివుంది. అది ఇంకా చావలేదు. ఆ సంగతి నువ్వు గమనించినట్లులేదు. ఆ మంచికి నువ్వు కొంచెం అవకాశం ఇచ్చావా, అది - నీ ప్రవృత్తినే మారు-స్తుంది," అన్నాడు.

బుద్ధుడు ధైర్యంగా సమాధానం చెప్పడం చూసి, అంగుళీమాలుడు ఆశ్చర్యపోయాడు. ఆ క్షణంలో అవివేకం తొలగింది గావును, "భిక్షూ, నేను నీకు తెలుసా? నన్ను చూస్తేనీకు జాలి వేస్తోందా? నేను దుఃఖితుడనా? ఏమిటి, నీ మొండి వైఖరి? "నేను నిశ్చలంగా వున్నాను. నీవు నిశ్చలంగా లేవు" అని నాకు ధైర్యంగా సమాధానం చెప్పి, పైగా, నాకు సలహాకూడా ఇస్తున్నావేమిటి ?" అన్నాడు.

"నువ్వు నాకు ఎలా తెలుసునంటావా ? నీ మెడలో వ్రేళ్ళాడుతున్న ఆ అంగుళీమాలను చూస్తే, ఎవరికైనా తెలుస్తుంది! మూర్ఖంగా ఎంతోమందిని నిష్కారణంగా చంపావు. గురువు ఆజ్ఞ-విద్యార్జన అంటూ, పైగా దాన్ని దీక్షగా, వ్రతంగా భావించావు," అని బుద్ధుడు అతనికి మరింత దగ్గరకు వెళ్ళి, "అవును మిత్రమా, నేను ఏ జీవినీ చంపను. హింసించను. ఎవరినీ ఎప్పుడూ, దేనికీ, ఎందుకూ నిందించను, ఖండించను, విమర్శించను. కాని, నువ్వు హత్యలు చేయడం, భయపెట్టడం మానలేదు. ప్రేమరహితంగా ప్రవర్తిస్తున్నావు. కాబట్టి నువ్వే నిశ్చలంగాలేవు. చంచలంగా వున్నావు," అన్నాడు బుద్ధుడు.

బుద్ధుని మాటలు విన్నతర్వాత అంగుళీమాలునిలో ఆలోచనలు చెలరేగాయి. "అందరూ నన్నుచూసి, నా పేరు విని, భయపడి పారిపోతూవుంటే, నీవు, నాకు ఎదురుగా నిలబడి, నిర్భయంగా మాట్లాడుతున్నావే ? ఇదిగో, ఇప్పుడే నిన్ను చంపి, నా వ్రతం పూర్తిచేసుకుంటాను," అన్నాడు.

అంగుళీమాలుడు, డాంబికంగా.

"అందుకే నువ్వు దుఃఖితుడవు శాంతిలేక అడవుల్లో తిరుగుతున్నావు. నాకు భయంలేదు. ఆశలేదు. ఏమీలేదు. కనుక హాయిగా ఆనందంగా వున్నాను. నాకు ఈ లోకంలో ఏదీ అక్కరలేదు.

ఇదంతా—చివరికి నువ్వు, నేను ఎప్పటికో ఒకప్పటికి అంతం కావల సిందే! నేను చావుకు సిద్ధంగా వున్నాను. చంపు- నాకు భయంలేదు. బాధలేదు. నువ్వు నన్ను చంపినా, శాంతిగా— సుఖంగా, ఆనం దంగా- సంతోషంగా వుండలేవుకదా? సుఖంగా వుండే మార్గం తెలియ నంతవరకు, ఇట్లా దుఃఖితుడవై జీవిస్తావు- తప్పదు. అందుకే నిన్ను చూసి జాలిపడుతున్నాను," అన్నాడు బుద్ధుడు.

ఇతనెవరో వివేకవంతునిలా వున్నాడు. ఈ సాధువు, ధైర్య వంతుడు, జ్ఞానవంతుడు. ఇతడు నిశ్చయంగా బుద్ధుడైవుండాలి. నన్ను- నా దుర్మార్గపు ప్రవర్తననుంచి మళ్ళించి, నాకు జ్ఞానోదయం కలిగించడానికి వచ్చిన మహాత్ముడు," అని అనుకుని, వివేకవంతుడై ఆయుధాల్ని విసిరిపారేసి, మెడలోని అంగుళీమాలను తెంచేసి, ఆయన పాదాలమీద పడి, ప్రణమిల్లి, "ప్రభూ, నన్ను పూర్తిగా తీసుకుని- మీ శిష్యునిగా - అనుచరునిగా స్వీకరించండి," అని అర్థించగా, అక్కడే- ఆ క్షణంలోనే అతనికి ధర్మదీక్ష ఇచ్చి- భిక్షు వును చేశాడు, బుద్ధుడు. అతనిలో పరివర్తనం వచ్చింది. అతడు, మామూలుమనిషే కాదు, మహాత్ముడయ్యాడు. ఆ సందర్భంలో అతడు, "ప్రభూ, మీరు నన్ను నా ఘోరమైన, క్రూరమైన జీవితం నుంచి కాపాడారు. నాకు నూతన జీవితాన్ని ప్రసాదించారు. పసి బిడ్డను తీసుకున్నట్లు నన్ను తీసుకున్నారు. మీరు, నాకు తారస పడటంతో, నా గత జీవితం పూర్తిగా తెగిపోయింది. ఇంక మీరు నన్ను తీసుకుని, నా జీవితాన్ని నడపండి," అన్నాడు.

అంగుళీమాలుడు బుద్ధుని వెనక గొర్రెపిల్లమాదిరిగా జేతవనం వెళ్ళాడు. దారిపొడవునా తన జీవితచరిత్ర బుద్ధునికి చెప్పాడు. అతడా సంగతులన్నీ తలచుకుని బాధపడుతూ వుంటే, "అవి గత జన్మ స్మృతులు. అతనూ, ఇప్పటి నువ్వూ ఒకటికాదు," అన్నాడు.

"రాగ, ద్వేష మోహాదులే మనిషి శాంతిని, సుఖాన్ని హరించు శత్రువులు, అని చెప్పి, అతనికి అష్టాంగమార్గం బోధించి,

నిర్వాణమార్గం చూపగా హింసకుడయిన అంగుళీమాలుడు తిరిగి అహింసకుడుగా మారాడు.

అంగుళీమాలుడు కనుపించక అతని తల్లి అడవంతా గాలించి, అలసి జేతవనం చేరుకుంది. అంగుళీమాలుడు అక్కడ ప్రత్యక్ష మయ్యాడు. అతడు ధ్యాననిమగ్నుడై, బుద్ధుని ప్రక్కన కూర్చు న్నాడు; నిశ్చలంగా. అతన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయి, ఆ సంగతి వింతగా, గొప్పగా చెప్పుకున్నారు. ఆ వార్త క్షణాలమీద దేశదేశాలు వ్యాపించింది. దానితో బుద్ధుని కీర్తి దేశదేశాలు వ్యాపిం చింది. మహారాజులు సైతం చేయలేని ఘనకార్యం సాధించాడు బుద్ధుడు. త్వరలో అంగుళీమాలుడు భిక్షుకసంఘంలో చేరి ఉన్నతుడై అర్హతుడయ్యాడు.

ఒకరోజున అంగుళీమాలుడు పల్లెకు భిక్షకు వెళ్ళాడు. ఒక చోట-గతంలో అతడు చేసిన దుర్మార్గానికి గురైనవారు, అతన్ని గుర్తించి, రాళ్ళతో చావగొట్టారు. గాయాలతో, కొనఊపిరితో ఆశ్ర మానికి తిరిగివెడితే, బుద్ధుడు చూసి, "ఓర్పు వహించు," అన్నాడు.

పరివర్తనానంతరం అతడు ఎన్నో కష్టాలు, బాధలు పడ్డాడు. అయినా చివరకు ప్రభువును వదలలేదు. ఆ గాయాలతోనే అతడు ఆయన పాదాలమీద పడి, "ప్రభూ, ఈ క్షణంలో కూడా నాకు మీ పాదాలు దొరికాయి. అదే నా చివరి సంతోషం. మీ పాదాలు చాలు నాకు. నా మొదటిపేరు, "అహింసక". మొదట్లో నాలో దుర్మార్గం లేదు. తర్వాత విద్యార్జన, జ్ఞానార్జన, గురువాజ్ఞ అంటూ అవివేకంగా అనేకమందిని నిష్కారణంగా, నిర్దయగా చంపిన పాపాత్ముణ్ణి. అందుకే నాకీపేరు వచ్చింది. నా జీవిత చివరిదశలో మీరు దొరికారు. నా జన్మ, ధన్యమైంది. మీ దయ నాపై నిలిచింది. మిమ్మల్ని చూసి, విని త్రిరత్నాల్ని ఆచరించి, త్రిశరణాలు జొచ్చాను, నా మనస్సంత టిత్లో. గుర్రాన్ని ముందుకు తోలాలంటే, కొరడా వుండాలి. కాని, మీర్లు ఎటువంటి కొరడా ఉపయోగించకుండా, ప్రేమతో, పవిత్ర

బోధలతో నా మనస్సు నిర్మలం, నిశ్చలం చేశారు. కాని, ఈ రోజు నేను గతంలో నేనుచేసిన దాని ఫలితంగా, నిష్కారణంగా శారీరకంగా బాధకు గురైనాను. నేనింకా బ్రతకాలనుకోవడం లేదు. చావాలనీ అనుకోవడం లేదు. అసలు ఏమీ అనుకోవడం లేదు. సమయం కోసం ఎదురుచూస్తున్నాను. అంతే," అన్నాడు.

ఆ గాయాలతోనే అంగులిమాలుడు మరణించాడు. ఒకసారి మాటల సందర్భంలో, "అంగులిమాలుడు ఏ లోకానికి వెళ్ళాడు? నరకానికా?, స్వర్గానికా?" అని బుద్ధుణ్ణి అడిగారు శిష్యులు. దానికి బుద్ధుడు, "అతడు ఎక్కడికీ పోలేదు. నిర్వాణం పొందాడు. చేసిన పాపాల్ని, పుణ్యం ద్వారా అణగదొక్కినవాడు, నిర్వాణ మార్గం చూసి, జ్యోతి అవుతాడు. కారుమబ్బుల నుండి బైటికి వచ్చిన చంద్రుని లాంటివాడు, అతడు. మనసును అధీనంలో వుంచుకోవడం చాలా కష్టం. అది, వాంఛిత విషయాల మీదకు వేగంగా పోతుంది. చిత్తాన్ని అదుపులోకి తేవడం మంచిది. అదుపులో వున్న చిత్తం, సుఖాన్ని ఇస్తుంది. అటువంటి ప్రయత్నశీలుడు అంగులిమాలుడు- స్మృతిమంతుడు. మనోవాక్కాయ కర్మలలో శుద్ధికలవాడు. పూర్వాపరాలు చక్కగా విచారించి, పనులు చేయువాడు, ఇంద్రియ నిగ్రహం కలవాడు. ధర్మబద్ధ జీవితం గడిపేవాడు. అజాగ్రత్త లేనివాడు. అటువంటి కీర్తిసంపద క్రమంగా అభివృద్ధి అవుతుంది," అన్నాడు.

* * *

దేవదత్తుడు బుద్ధుని బంధువర్గంలోనివాడు. అతడు గొప్ప వక్త. బౌద్ధం స్వీకరించినా అతనిలో కీర్తికాంక్ష పోలేదు. బౌద్ధ సంఘానికి నాయకుడు కాదలచి- బుద్ధుణ్ణే వ్యతిరేకించి- చివరికి ఆయనతో విరోధించి- హత్యాప్రయత్నం కూడా చేశాడు. గురువుకే అపకారం, అపచారం తలపెట్టాడు. బుద్ధుణ్ణి అపకీర్తి పాలుచేసి, ప్రజల్లో ఆయనమీద అయిష్టం- అపనమ్మకం- అవిశ్వాసం-

అగౌరవం- అసహ్యం కలిగించపలిచాడు. రాగ - ద్వేషాలనే కషాయాల్ని వీడక, కాషాయం ధరించాడు. సత్యదమములకు దూరుడైనాడు. బౌద్ధసంఘంపై బుద్ధుని ఆధిపత్యం తొలగించాలని యత్నించాడు. ఎన్నో ప్రయత్నాలు చేశాడు. బుద్ధునిపై నిష్కారణ ద్వేషం పెంచుకున్నాడు. ఆ విషయంతో బింబిసార చక్రవర్తితో మంతనాలు జరిపాడు. ఆయన బుద్ధుని శిష్యుడు- అనుచరుడు కావడంతో, అతని ప్రయత్నాలు ఫలించలేదు. పైగా ఆయన దేవదత్తునే గట్టిగా మందలించాడు— నిందించాడు, నిరసించాడు. చక్రవర్తి తనమాట వినలేదని కొంతమంది ప్రజల్ని కూడగట్టుకుని బుద్ధునికి వ్యతిరేకంగా ప్రచారం చేయమని రెచ్చగొట్టాడు. ఆ విషయంలో బింబిసారుడు కలుగజేసుకుని దేవదత్తుని కుటిల ప్రయత్నాలన్నింటినీ విఫలం చేశాడు.

దేవదత్తుడు ఒకసారి బుద్ధుని మీదకు కొంతమంది హంతకుల్ని పంపించాడు. వారు ఆయన దివ్యతేజస్సు చూసి- సత్యవాక్కు విని- ఏమీ చేయక- ఆయన శిష్యులైనారు.

మరొకసారి బుద్ధుడు ఒక కొండ కిందనుంచి వెడుతుండగా— దేవదత్తుడు ఆ కొండపైనుంచి పెద్ద బండరాయిని ఆయనమీదకు దొర్లించాడు. ఆ రాయి ఆయన్ని చిన్నగా గాయపరచి తొలగింది.

సారిపుత్రుని — మౌద్గల్యాయనుని సంఘపెద్దలుగా చేశాడనే కోపంతో బుద్ధుడు మగధ రాజ్యంలో వున్నపుడు ఆయన మీదకు "నాలాగిరి" అనే మత్తేభానికి మద్యం తాగించి, మత్తు ఎక్కించి, దాన్ని బుద్ధుని మీదకు తరిమాడు. అది వెర్రెత్తి - ఎందరో తొక్కి, చంపి, భీతిగొలిపి- ఇళ్ళు కూలుస్తూ వీధులవెంట వీరవిహారం చేస్తూ- బుద్ధుని ముందుకు వచ్చి - తలవొంచి- ప్రణమిల్లినట్లు కాస్సేపు నిలబడి-ప్రక్కకు తొలగింది. విధ్వంసం సృష్టించిన ఆ మదపుటేనుగు తల నిమిరాడు, బుద్ధుడు ప్రేమగా. ఆ విధంగా దేవదత్తుని ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. చివరికి సంఘంలోని సభ్యుల్ని చీల్చాడు.

తన పక్షం చేర్చుకున్నాడు. బుద్ధుడు ఆ సంగతి తెలుసుకుని- సారి పుత్రను- మౌద్గల్యాయనుని ఆ భిక్షువుల దగ్గరకు పంపి- వారికి హితవు చెప్పించి- తిరిగి వారిని సంఘంలో చేర్చేటట్లు చేశాడు. వారూ తమ తప్పు తెలుసుకుని, పశ్చాత్తాపపడ్డారు.

అత్యాశకూ, ఘాతుకత్వానికీ, నమ్మకద్రోహానికీ దేవదత్తుడు మంచి ఉదాహరణ. బింబిసారుని కుమారుడు అజాతశత్రు కూడా అత్యాశాపరుడు కావడంచేత, దేవదత్తుడు అతని స్నేహంపట్టి- అతని సలహాలు పాటించనారంభించాడు. తన తండ్రిని చంపిగాని- లేక దౌర్జన్యంగా కాని, రాజ్యాధికారాన్ని చేజిక్కించుకునే యత్నంలో- అజాతశత్రు దేవదత్తునితో చేతులుకలిపి- వారిరువురు ఒక ఒప్పందం చేసుకున్నారు; రాజ్యాధికారం విషయంలో దేవదత్తుడు అజాతశత్రుకు సహాయం చేసినట్లయితే, బుద్ధుని హత్యాయత్నంలో అజాతశత్రు దేవదత్తునితో చేతులు కలపడానికి నిర్ణయం తీసుకున్నారు. ఒకరు తండ్రిని- మరొకరు గురువును హతమార్చడానికి నిర్ణయం తీసు కున్నారు. ఏవిధంగానైనాసరే బుద్ధుని హత్యచేసి- బౌద్ధ సంఘాధి పత్యం హస్తగతం చేసుకోవాలని దేవదత్తుని ఎత్తు. అందుచేత అతడు అజాతశత్రుకు బాగా విషం ఎక్కించాడు.

దేవదత్తుని సలహానుసారం, అజాతశత్రు- తన తండ్రి బింబి సారుని వయసుమళ్ళడంచేత - రాజ్యపాలనకు సమర్థుడు కాడనీ- ఆయన క్షత్రియధర్మం విస్మరించి- బౌద్ధం స్వీకరించి - సన్యాసిజీవితం గడుపుతూ ప్రజాక్షేమం పట్టించుకోడంలేదనీ-తండ్రిపై అభియోగాలు మోపి- తాను రాజ్యాధికారం చేబట్టి- ప్రజాసేవ చేసి- దేశపాలన సక్రమంగా సాగిస్తానని ప్రజలముందు- మంత్రుల, సామంతులతో మంతనాలు జరిపి, తండ్రిని ఖైదులో బంధించాడు.

ఒకరోజున బుద్ధుడు ఉదయంనుంచీ గంభీరంగా- మౌనంగా వున్నాడు. ఆ విధంగా ఆయన ఎప్పుడూ లేడు. విషయమేమిటో

వరికీ తెలియదు. ఆయన్ని అడిగే ధైర్యం- సాహసం ఎవరికీ లేదు. క్రమంగా ఆయన ధ్యానంలోకి- సమాధిస్థితికి వెళ్ళాడు. తక్కినవారు కూడా మౌనంగా వుండిపోయారు. ఆయన ఏమీ తినలేదు-

తక్కినవారూ తినలేదు. అంతటి శాంతమూర్తి ఆ రోజు ప్రళయరూపం ధరించారనిపించింది. కారణం తెలియక శిష్యులు కంగారు పడ్డారు- భయపడ్డారు- ఆందోళన చెందారు. సూర్యాస్తమయ సమయానికి బుద్ధుడు ప్రశాంతవదనుడయ్యాడు- అందర్నీ ప్రేమగా పలకరించాడు. చెల్లాచెదురుగా, మౌనంగా, మనోవికలురై వున్న శిష్యులంతా మళ్ళా ఆయన చుట్టూ చేరారు. చేరారేకాని, అందరి అంతర్యాల్లో ఏదో తెలియని భీతి వుండనే వుంది, విషయం తెలియక. అంతలో ఇద్దరు వ్యక్తులు ఏడుస్తూ వచ్చి, బుద్ధుని కాళ్ళ మీద పడ్డారు. ఆ దృశ్యం అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. "ఎవరు మీరు? ఎక్కడనుంచి వచ్చారు? ఎందుకు ఏడుస్తున్నారు?" అని బుద్ధుడు వారిని అడిగాడు. దానికి వారు, "మేము రాజగృహ నుంచి వస్తున్నాం, బింబిసారచక్రవర్తి అనుయాయులం. ఈ ఉదయం బింబిసారచక్రవర్తిని -కొడుకైన అజాతశత్రు హత్యచేశారు," అంటూ మళ్ళా గొళ్ళుమన్నారు.

బుద్ధుడు తలపైకెత్తి, ఆకాశం వంక శూన్యంగా చూస్తో, నేను బింబిసారుని గురించి ఆలోచించడం లేదు. అజాతశత్రు కోసం బాధపడుతున్నాను. ప్రజలకన్నా ప్రభువులు ఉత్తములు అయితే, దేశం అభివృద్ధి చెందుతుంది. ధర్మసంస్థాపనార్థం అవతరించిన చక్రవర్తి- బింబిసారుడు. తన జీవితాన్నే ధర్మానికి దానం చేశాడు. ఈ భూమి వున్నంతకాలం, ఆయనా వుంటాడు, ఒక జ్యోతి లాగ వెలుగుతూ," అని, వచ్చినవారివంక చూసి, "ఇంక మీరు వెళ్ళండి. నేను త్వరలోనే రాజగృహకు వస్తాను," అన్నాడు. ఆ మాట విన్న శిష్యులు "అజాతశత్రు మధ్యకా?" అన్నారు.

బింబిసారుని హత్య చేయడంతో ప్రసేనజిత్‌కు కోపం వచ్చి, తన చెల్లెలు బింబిసారుని భార్యకు- భరణంగా ఇచ్చిన గ్రామ రెవెన్యూ అజాతశత్రుకు చెల్లించలేదు. దానితో అజాతశత్రుకు కోపం వచ్చి, మేనమామపై దండెత్తాడు. ఆ యుద్ధంలో అజాతశత్రు ఓడిపోయాడు. సంధి- సంప్రదింపుల ప్రకారం ప్రసేనజిత్ కుమార్తెను అజాతశత్రు కిచ్చి వివాహం జరిపించారు. ఆ తర్వాత ఆ గ్రామ రెవెన్యూ చెల్లించారు, అజాతశత్రునిలోనూ మార్పు వచ్చింది.

అజాతశత్రు అండచూసుకుని దేవదత్తుడు మరొకసారి బుద్ధుని హత్యకు ప్రయత్నించి, హంతకులకు ఎంతో ధనం ఇచ్చాడు. వారెవరో కాదు, అజాతశత్రు సైన్యాధిపతులే. కాని, వారి ప్రయత్నాలూ ఫలించలేదు. తన ప్రయత్నాలన్నీ వ్యర్థం కావడంతో దేవదత్తుడు మరీ శత్రుత్వం పెంచుకున్నాడు.

తననూ, తన శిష్యులనూ- అనుచరులనూ నిర్లక్ష్యం చేసినా, బుద్ధుడు అజాతశత్రును ప్రేమగానే తీసుకున్నాడు.

"బుద్ధునివల్ల తనకూ, తన రాజ్యాధికారానికి ఎటువంటి ముప్పు- అపకారం జరగదని అజాతశత్రు గుర్తించాడు.

బుద్ధుడు చెప్పేది ఒకటి—చేసేది మరొకటి— ఆచరించేది వేరొకటి. ఆయన అందరికీ నిరాడంబర జీవితం బోధించి, తాను భోగభాగ్యాలు అనుభవిస్తున్నాడు," అని దేవదత్తుడు బుద్ధునిపై నేరారోపణ చేశాడు. ఆ ఆరోపణను బుద్ధుని శిష్యులలో కొందరు సమర్థించేటట్లు చేశాడు దేవదత్తుడు: బహు తెలివిగా, చాకచక్యంతో. కాని, ఆ శిష్యులు త్వరలోనే తమ తప్పు తెలుసుకుని, దేవదత్తునికి ఎదురు తిరిగారు.

ఉత్పలపర్ణ అనే ఒక సన్యాసిని ఎప్పుడూ, అందరికీ బౌద్ధ ధర్మాల్ని బోధిస్తూ కాలం గడిపేది. దేవదత్తుడు, అజాతశత్రుకు

చాలా కాలం దుర్మార్గం నూరిపోశాడు. తన తండ్రిని హత్యచేసి, మేనమామతో యుద్ధంచేసి, చివరికి తన తప్పు తెలుసుకుని - పరివర్త సంచెంది-మంచిగా మారాడు. అప్పటి నుంచి దేవదత్తుని పొత్తు నిరాకరించ నారంభించాడు.

ఒకరోజున దేవదత్తుడు, అజాతశత్రు దర్శనార్థం కోటలోపలకు వెడుతున్నాడు, పూర్వం మాదిరిగా - కోట కాపలాదారులు అతన్ని రాజభవనం లోపలకు ప్రవేశింప నీయలేదు. అదే సమయంలో కోట లోపలనుంచి ఉత్పలవర్ణ బైటికి వస్తోంది. ఆమెను చూసి, ఈర్ష్యపడి-అజాతశత్రుపై కోపంతో ఆమెను నిష్కారణంగా చావగొట్టాడు. ఆమె ప్రమాదస్థితిలో మఠం చేరుకుంది. తక్కిన సన్యాసినులు-ఏం జరిగిందని ఆమెను అడిగారు. దానికామె, ఏదీ ఎప్పుడూ ముందుగా తెలియని సంగతి కనుక, మానవ జీవితంలో ప్రతీదీ ఆకస్మికంగా జరిగినట్లుగానే వుంటుంది. ప్రతీదీ అశాశ్వతం-అస్థిరం—అనిత్యం-క్షణభంగురం. జ్ఞానం ఒక్కటే, శాశ్వతం, శాంత పూరితం-ప్రశాంతం. కనుక మీరు బుద్ధుని బోధలతో ప్రశాంత జీవితం గడపండి,'' అంటూ ఆమె శాశ్వతంగా కన్ను మూసింది.

★ ★ ★

ఒకసారి బుద్ధుడు వైశాలినుంచి రాజగృహ వెళ్ళి- వేలువనంలో మకాం చేసాడు. పన్నెండు వందల యాభైమంది భిక్షువులతో. ఒక పౌర్ణమిరోజు రాత్రి అజాతశత్రు మంత్రుల, సామంతుల - సపరివారంతో-వెన్నెల్లో ఉద్యానవనం చూడాలని వెళ్ళి, ఓ కొలను గట్టున కూర్చుని మిత్రులతో ముచ్చటిస్తో, ''మన హృదయాల్ని సంతృప్తిపరచే గురువు ఎవరైనా వున్నారా? అంతిమ జ్ఞానం-పరమ సత్యం బోధించే సద్గురువు వున్నారా?'' అని అడిగాడు. అందరూ తమకు తెలిసిన గురువుల్ని-వారి, వారి పద్ధతుల్ని-బోధల్ని వివరించి చెప్పారు. ఆయనకు ఏ ఒక్కరి పద్ధతీ సమ్మతం కాలేదు. జీవకుడు బుద్ధుని గురించి చెప్పాడు, ''ఆయన మహాజ్ఞాని. పన్నెండు వందల

యూభైమంది శిష్యులతో ప్రస్తుతం వేలువనంలో వున్నారు. ఆయన అద్వితీయుడు, సత్పురుషుడు. మీరు వెళ్ళి ఆయన్ని దర్శించండి," అన్నాడు.

అతని మాట ప్రకారం అజాతశత్రు అప్పటికప్పుడు సభా సదులంపరితోపాటు-ఐదువందల ఏనుగులమీద - ఐదు వందల మంది సుందరాంగులను ఎక్కించుకుని- పరిచారకులు కాగడాలు పట్టగా- సమస్త పరివారంతో-గొప్ప అట్టహాసంతో మహావైభవంగా వేలు వనానికి బయలుదేరాడు, జీవకుని ఆధ్వర్యంలో.

పున్నమి వెన్నెల వెలుగు - నీడలు చూస్తో బుద్ధుడు ఒక మామిడి చెట్టుకింద కూర్చున్నాడు. ఆయన చుట్టూ శిష్యులూ ఆసీనులై వున్నారు. అంతా మౌనంగా వున్నారు. ఒక్క వెన్నెల జాలు తప్ప—అంతా నిశ్చలంగా వుంది. బుద్ధుని సమీపించే కొద్దీ అజాతశత్రుకు ఎన్నడూ ఎరుగని భయం పట్టుకుని, జీవకునితో- "నీవు నన్ను మోసం చేయడం లేదుకదా? ఈ అర్థరాత్రి-ఆడ వాళ్ళతో శత్రువుల దగ్గరకు తీసుకుపోవడం లేదుకదా? అక్కడ అంతమంది మనుష్యులున్నా—ఎటువంటి శబ్దం వినిపించడం లేదే మిటి? భరించరానంత నిశ్శబ్దంగావుంది," అన్నాడు. దానికతడు- వెన్నెల, దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది కదా? నేను మిమ్మల్ని ఏమీ మోసం చేయడంలేదు. ధైర్యంగా వుండండి. విశ్వాసంతో ముందుకు నడవండి," అన్నాడు.

అజాతశత్రు ఏనుగు దిగి-బుద్ధుని సమీపించాడు. ఆయన తూర్పు ముఖంగా కూర్చున్నాడు. అజాతశత్రు భయం, భయంగా బుద్ధుని ముందుకు వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేసిన బుద్ధుడు గమనించినట్లనిపించలేదు. అజాతశత్రు ఆ తర్వాత అక్కడ వున్న భిక్షులందరికీ అభివందనం చేశాడు. "తమరు అనుగ్రహిస్తే, ఒక ప్రశ్న అడుగుతాను," అన్నాడు బుద్ధునితో "అడగండి" అన్నాడు బుద్ధుడు.

"లోకంలో-మనుష్యులు చేసిన పనులకు ఫలితాలు తెలిసేటట్లు—స్పష్టంగా వుంటాయి. ఈ బౌద్ధ భిక్షువులకు అటువంటి ఫలితం - ఈ జీవితకాలంలో తెలిసేటట్లు - స్పష్టంగా - ఏమైనా వుంటుందా?" అని అడిగాడు.

"మీకో నౌకరు వున్నాడనుకోండి. అతనికి ఎన్నో కోర్కెలు వుంటాయి. వాటిల్లో కొన్ని ఫలిస్తాయి. కొన్ని ఫలించవు. కొన్ని కోర్కెలకు అర్హత కూడా వుండాలి కదా! కాని, అతడు "నౌకరి వదలి-గుండు చేయించుకుని—కాషాయం కట్టి-భిక్షాపాత్ర చేతబట్టి-చెట్టు క్రింద స్వేచ్ఛగా, హాయిగా కూర్చుని-బ్రతుకుతాను," అని. అంటే- "వద్దు. వచ్చి నౌకరిలోచేరి-బానిసగా బ్రతుకు," అని మీరు అంటారా?" అని ఎదురుప్రశ్న వేశాడు, బుద్ధుడు.

"నేను వద్దనను. అతన్ని సంతోషంతో దీవించి పంపుతాను. అవసరమైతే అతనికి వసతి-భోజనం కూడా ఏర్పాటు చేస్తాను. అతని రక్షణ బాధ్యత కూడా తీసుకుంటాను," అన్నాడు అజాతశత్రు.

"అలాగైతే సన్యాస జీవితానికి ప్రత్యక్ష ఫలితం వున్నట్లే కదా?" అన్నాడు బుద్ధుడు.

"సరే, అదికాక ఇంకా ఏమైనా ఫలితం—ప్రతిఫలం—ఇంకా స్పష్టంగా కనుపించేది-తెలిసేది-ఏమైనా వుందేమో చెప్పండి," అన్నాడు.

"అష్టఐశ్వర్యాలు వున్న రాజు - ధర్మబోధలు విని-పరివర్తనం చెంది-కత్తి విసిరేసి-కరుణామయుడు కావడం స్పష్టమైన నిదర్శనం కాదా? కొండలమధ్య సరస్సు నిశ్చలంగా వున్నప్పుడు-ఒడ్డున నిలబడి నిదానంగా చూసే అతనికి- అందు అన్నీ ప్రతిబింబించడం కనుపిస్తాయి. అదే విధంగా ఉంటుంది-సన్యాసి జీవితం," అన్నాడు బుద్ధుడు.

"సరే నా వంటి వానిని కూడా తమ శిష్యునిగా స్వీకరిస్తారా? తమ సంఘంలో చేర్చుకుంటారా? నాకూ ధర్మం బోధిస్తారా? నేనూ జీవితాంతం—పవిత్రంగా జీవిస్తాను. నా తప్పుల్ని-పాపాల్ని-ఒప్పు కుంటాను. మీరు నన్ను స్వీకరిస్తారా?" అంటూ ఆయన పాదాల మీదపడి సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆ తర్వాత సంతో షంతో-సంతృప్తితో వెళ్ళిపోయాడు, అజాతశత్రు.

*　　　　*　　　　*

బుద్ధుడు న్యగ్రోధారామ విహారంలో ఉన్నప్పుడు-తొంభై ఏళ్ళ వయసుకల శుద్ధోధన మహారాజు అనారోగ్యంతో-ప్రమాద పరిస్థితిలో వున్నారన్న వార్త వచ్చింది. బుద్ధుడు కపిలవస్తు వెళ్ళి శుద్ధోధనునికి సేవలు చేస్తో, "సకల పదార్థాలు నాశన ధర్మం కలవే-అన్నీ-అంతా అశాశ్వతం," అన్నాడు. ఆయన శాంతితో శాశ్వ తంగా కళ్ళు మూశాడు. ఆయన అంత్యక్రియల్లో బుద్ధుడు పాల్గొన్నాడు.

బుద్ధుడు అక్కడనుంచి కూటాగార విహారానికి వెళ్ళాడు. పినతల్లి ప్రజాపతి గౌతమి అక్కడకువెళ్ళి- "మహారాజు మరణిం చారు. రాహులుడు, నందుడు నిన్ను అనుసరించారు. ఆడవాళ్ళం-మాతో పాటు మరో ఐదువందల మంది రాకుమార్తెలకు సన్యాసం ఇప్పించు. మేమూ ఆశ్రమవాసం గడుపుతాము," అంటే—బుద్ధుడు అంగీకరించలేదు. ఆమెతోపాటు వెళ్ళిన యశోధర కూడా శ్రవణ దీక్ష ఇవ్వమని అడిగింది. ఆమెనూ నిరాకరించాడు. ఆ విధంగా వారిని అప్పటికి మూడుసార్లు నిరాకరించాడు.

బుద్ధుడు వైశాలి దగ్గరవున్న మహావనంలో ఉన్నాడు. సుకుమారులైన ప్రజాపతి-యశోధరతోపాటు ఆ ఐదువందల మంది అంతఃపుర వాసులు అక్కడకు వెళ్ళారు-యాభై యోజనాల దూరం నడచి-రక్తసిక్తమైన పాదాలతో. ఆడవారిని సంఘంలో చేర్చుకో

కూడదని ఒకనాడు ఆనంద్ అభ్యంతరం తెలిపాడు. అందుచేత ప్రజాపతి గౌతమి ఈసారి ముండనం చేయించుకుని-కాషాయం కట్టి-బుద్ధుడు వుంటున్న ఆరామం ముందు నిలబడింది. ఆనందుడు ఆమెను చూసి "ఇక్కడకు ఎందుకు వచ్చారు?" అని అడిగితే-"బౌద్ధ సంఘంలో చేరడానికి. బుద్ధుడు మమ్మల్ని చేర్చుకోవడానికి నిరాకరించడంచేత ఈ విధంగా వచ్చాం." అన్నది. వెంటనే ఆనందుడు బుద్ధుని దగ్గరకువెళ్ళి-విషయంచెప్పి-అర్థించి-వాదించి-గతంలో విశాఖవంటివారు బౌద్ధం స్వీకరించిన సంగతి గుర్తుచేసి, బుద్ధుడు అవతరించింది. కేవలం పురుషులను ఉద్ధరించడానికేనా? నిజంగా, శ్రద్ధగా ప్రయత్నించే స్త్రీలకు కూడా సంఘంలో చోటులేదా?" అని ప్రశ్నించి-ప్రాధేయపడి - ప్రజాపతి గౌతమిని సంఘంలో చేర్పించాడు. ఆ తర్వాత యశోధర-ఇంకా అనేక మంది ఆడవాళ్ళు సంఘంలో చేరారు. స్త్రీల విషయంలో ఎట్లా ప్రవర్తించాలో సంఘ సభ్యులకు చెప్పాడు బుద్ధుడు. అలాగే స్త్రీలకు కొన్ని నియమాలు పెట్టాడు.

ప్రజాపతి గౌతమి అందరికీ పెద్దగా వుంది.

ఆమె త్వరలో అర్హతురాలైనది. సాధనచేసి, సమాధిస్థితిని అందుకుని, నిర్వాణాన్ని పొందింది.

సంఘంలో-స్త్రీలలో నిర్వాణం పొందిన వారిలో ఆమె మొదటిది.

ఆమె మరణ సమయంలో బుద్ధుడూ, ఆయన శిష్యులూ వున్నారు.

శుద్ధోధనుడు, మహాప్రజాపతి, నందుడు, రాహులుడు, దేవదత్తుడూ, సుప్రబుద్ధుడూ మొదలైన శాక్యవంశీయులంతా బౌద్ధ సన్యాసులు కావడం చేత, వారందరి ఆస్తికీ యశోధర వారసురాలు

అయింది. కాని, ఆమె కూడా సమస్తం పరిత్యజించి, బుద్ధుని చేరి, ప్రజాపతి నాయకత్వం కింద, తనతోపాటు తీసుకువెళ్ళిన వెయ్యి మంది స్త్రీలను సంఘంలో చేర్పించింది. రెండేళ్ళ తర్వాత ఆమె నిర్యాణం చెందింది. భిక్షుక సంఘంలో అందరికీ ప్రవేశ అర్హత వుండటం చేత బింబిసారుని భార్య క్షేమాదేవి కూడా అప్పటికే సంఘంలో చేరింది.

★ ★ ★

బుద్ధుడు జేతవనంలో ఉన్నప్పుడు రోజూ ఉభయ సంధ్యల్లో భక్తులకు, భిక్షువులకు, అనుచరులకు, ధర్మం బోధించేవారు. ఆయన కీర్తి బాగా వ్యాపించడంతో మతాచార్యుల, పండితుల, బ్రాహ్మణులతో పాటు వైదికుల పలుకుబడి మరీ తగ్గిపోయింది. వారంతా కలసి శ్రావస్తిలో నివసించే రూపవతియగు "చించామాణవిక" అనే సన్యాసినిని అర్థించి, బుద్ధుని కీర్తి పాడు చేయాలనుకున్నారు. ఆమె వారి కుట్రతో కలసి, బుద్ధుని బోధలు వినడానికి అందరికంటే ముందుగాగాని, చాలా ఆలస్యంగాగాని వెళ్ళేది. ఎవరైనా ఆలస్యానికి కారణం అడిగితే, "మా సన్యాసినుల సంగతి మీ కెందుకు?" అనేది ఆ విధంగా ఒక సంవత్సరం గడిచాక-తనకు, బుద్ధునికి అక్రమ సంబంధం వుందనీ, తత్ఫలితంగా తనకు గర్భం వచ్చిందనీ, గర్భాన్ని చూపిస్తో తిరగనారంభించింది. అది విని అందరూ ఆశ్చర్యపోయారు. ఓ రోజు ప్రసంగ సమయంలో "చించా" పైకి లేచి నిలబడి, బిగ్గరగా, "ఓ గౌతముడా! ఈ ఉపదేశాలకేమిగాని, నా ప్రసవ సమయమునకు తగిన ఏర్పాట్లు చేయరేమి?" అని అడిగింది. దానితో సభ కోలాహలంగా మారింది. అప్పుడు బుద్ధుడు ఆమె దగ్గరకు వెళ్ళి, పరీక్షగా చూసి, గర్భవతిగా కనుపించడానికి పొత్తిళ్ళలో పెట్టుకున్న బట్టల్ని తీయించి ఆమె మాయాగర్భం బయట పెట్టాడు. అక్కడ చేరిన వారందరూ ఆమెను తిట్టి-కొట్టబోవగా, ఆమె తన తప్పు ఒప్పుకుని, బుద్ధుని పాదాల మీద పడింది. ఆ

సందర్భంలో భిక్షుకీ సంఘం వారిని ఉద్దేశించి, "రాగాను రక్తులు స్వకృత తృష్ణా ప్రవాహంలోపడి నశింతురు," అన్నారు బుద్ధుడు.

* * *

బుద్ధుడు ధర్మప్రచారం చేస్తో ఒక పట్నం వెళ్ళాడు.

ఆ పట్నం చివర మైదానంలో ఒక శిధిలాలయం వుంది. మైదానమంతా మర్రి- మామిడి చెట్లు, చుట్టూ కొండలు. మైదానం మధ్య మంచినీళ్ళ కొలను. కొలనునిండా తామరలు కొలను గట్లమీద కుబేరాలు- ఆలయాన్ని ఆనుకుని ఒక పురాతన వటవృక్షం వుంది. దాని కొమ్మల్లో రకరకాల పక్షులు గూళ్ళు కట్టుకున్నాయి. పగలంతా ఆ పక్షులన్నీ తిండి వెతుక్కుంటూ ఒకదాన్ని ఒకటి పలకరించుకుంటూ- పిల్లలకు మేతపెడుతూ- ఒకటే సందడిగా వుంటాయి. ఆ ప్రదేశం బుద్ధుడికి ఎంతో నచ్చి- అక్కడ మకాం చేశారు. గూటికి వచ్చి-పోయే ఆ పక్షుల్ని చూస్తో బుద్ధుడు చాలా సేపు నిశ్చలంగా వుండేవాడు.

ఆ పట్నం ఒక సామంతరాజు ఆధీనంలో వుంది. అతడు పరమత ద్వేషి. పరమ చాందసుడు- సనాతనుడు- తన రాజ్యంలో పరమత ప్రవేశాన్ని ఏ మాత్రం అంగీకరించేవాడుకాదు. తన మతానికి- ధర్మానికి వ్యతిరేకంగా ఏం జరిగినా సహించేవాడుకాదు. ఆ విషయంలో నా- పర భేదం చూపని కఠినాత్ముడు.

బుద్ధుని ప్రవేశంతో ఆ పట్నంలో పెద్ద సంచలనం బయలుదేరింది. కొందరు నగరవాసులు బుద్ధుని వర్చస్సుకు ఆకర్షితులై- వెళ్ళి ఆయన బోధలువిని, ఆయన్ని అనుసరించారు. కొందరు దొంగచాటుగా బౌద్ధం స్వీకరించి- సంఘసభ్యులైనారు. వారు బుద్ధుని అంగీకరించి- అనుసరించారేకాని, రాజునికాని, సనాతన ధర్మాన్నికాని వ్యతిరేకించలేదు- కించపరచలేదు- అగౌరవ పరచలేదు. నిజమైన

భక్తి-విశ్వాసాలు- ప్రేమాభిమానాలు వుంటే-ఒకదాన్ని సిరసించడం- నిందించడం- ఖండించడం- విమర్శించడం- నిరాకరించడం- వ్యతిరేకించడం అంటూ ఏమీ వుండదు. వారు తిరుగుబాటూ చేయరు వారికి అంతా- అన్నీ సమానమే.

చుట్టుపక్కల పల్లెలనుంచీ- పేటలనుంచీ ప్రజలువచ్చి బుద్ధుని దర్శించి- అనుసరించడం రాజుకు తెలిసి - ఆశ్చర్యంతోపాటు ఆగ్రహంకూడా కలిగింది. వారందర్నీ శిక్షించేందుకు నేరారోపణ చేయలేక సమయం కోసం ఎదురుచూస్తున్న తరుణంలో- ఒకరోజు సాయంత్రం-రాజుగారి ఏకైక కుమార్తె-పూర్ణ-పదహారేళ్ళది-తలారా స్నానం చేసి- ధవళవస్త్రాలు ధరించి- బంగారు సజ్జనిండా పువ్వులు-పళ్ళు పెట్టుకుని బుద్ధుని దర్శనార్థం ఒంటరిగా రాజభవనం నుంచి బయలుదేరింది, తండ్రి అనుమతి తీసుకోకుండా భయంచేత పరిచారకులలో ఎవరూ ఆమెను అనుసరించలేదు. పరివారం ఎంత బ్రతిమాలి చెప్పినా పూర్ణ వినలేదు. ఆ రోజు బుద్ధుని దర్శించాలని ఆమె గట్టి సంకల్పంతో వుంది.

పూర్ణకోట గుమ్మం దగ్గరకు వెళ్ళేప్పటికి- వేటకు వెళ్ళిన తండ్రి- తిరిగి అదే సమయానికి అక్కడకు వచ్చాడు. తండ్రి- కూతుళ్ళు ఇద్దరూ కోటగుమ్మం దగ్గర ఎదురయ్యారు. పూర్ణను చూసి రాజు ఆశ్చర్యపోయాడుకాని, తండ్రిని చూసి ఆమె ఏమీ ఆలోచించక- ఆగక- పక్కకు తొలగి- తలవొంచి- నిలబడడం చూసి, రాజు గుర్రం దిగి- "అమ్మా, పూర్ణా! ఎక్కడికి ఒంటరిగా వెడుతున్నావు? నీ వెంటరావడానికి అంతఃపురంలో ఎవరూ మనుష్యులే లేరా?" అని అడిగాడు.

"ఎందరో వున్నారు, నాన్నగారూ! నేను ఎవరినీ అడగలేదు. వారెవరూ నన్ను అనుసరించలేదు," అన్నది.

"ఎందుకు?"

"రాజాజ్ఞ లేకుండా బుద్ధుణ్ని దర్శించడానికి వారెవరూ సాహసించరని నాకు తెలుసు."

"అయితే ఇప్పుడు నువ్వు వెళ్ళేది బుద్ధుని దర్శించడానికా?" అని కన్నెర్రజేసి- "వెళ్ళడానికి వీల్లేదు. వెనక్కి తిరిగి - లోపలకు వెళ్ళు. రాజాజ్ఞ తండ్రి ఆజ్ఞ లేకుండా బయలు దేరావా? ఆ సాహసం-ఎలా వచ్చింది?" అని హుంకరించాడు.

పూర్ణ సమాధానం చెప్పలేదు. వంచిన తలఎత్తలేదు. నిశ్చలంగా ప్రశాంతంగా నిలబడి, "నాన్నా, ప్రభువు పూజాసమయం మించిపోతోంది. నేను వెళ్ళి వస్తాను," అన్నది వినయంగా.

"ఎవరా, ప్రభువు? ఆ ప్రబుద్ధుడేనా? అతని సంగతి నీకు తెలియదు. అయినా నువ్వు అక్కడికి వెళ్ళడానికి వీల్లేదు. వాడొక బుద్ధిలేనివాడు. తండ్రిని, భార్యని, బిడ్డని, రాజ్యాన్ని, సాంప్రదాయాన్ని ధిక్కరించి- దేశంమీదకు బయలుదేరిన బికారి," అన్నాడు కటువుగా.

"కాదు, నాన్నా! ఆయన గురువులకే గురువు. జగద్గురువు. పరిపూర్ణ జ్ఞానవంతుడు—అర్హతుడు - సర్వోత్తముడు - బుద్ధుడు. ధర్మసంస్థాపనార్థం అవతరించిన మహానుభావుని దర్శించడం దోషమా? ఆయన ధర్మాన్ని- నీతిని-మంచినే బోధిస్తున్నారు. వారి బోధల్ని చెవులారా విని- పునీతురాలిని కావాలని బయలుదేరాను," అన్నది.

పూర్ణ తల్లిలేని బిడ్డ. తనకు ఏకైక కుమార్తె. అన్నేళ్ళూ ఆమెను అల్లారుముద్దుగా పెంచాడు. ఎప్పుడూ ఏమీ కోరని ఆమె- ఒక కోర్కె కోరింది. అది తండ్రి అహంకారం మీద గట్టిగా పని చేయగా, "అమ్మా, ఆరాధించడానికి మనకు దేవతలు ఎవరూ లేరా? పూజలు చేసుకోవడానికి కోటలో ఆలయాలెన్నో వున్నాయి. మన

ధర్మాన్ని—సాంప్రదాయాన్ని విస్మరించి, రాజాజ్ఞనే ధిక్కరించి, బయలుదేరావు. సనాతన ధర్మాన్ని నాశనం చెయ్యజూసే ఆ బుద్ధుని ఆరాధిస్తావా? ఏమైనా నువ్వు వెళ్ళడానికి వీల్లేదు.... నా మాట విని వెనక్కి తిరుగు," అన్నాడు.

పూజా సమయం మించిపోతోందని పూర్ణ తొందరపడి, ముందుకు అడుగువేసింది. "ఆగు" అని పిడుగువంటి కంఠస్వరంతో అరిచాడు. "ఈ అడుగులు ఆయన పవిత్రచరణాలవద్ద తప్ప మరెక్కడా ఆగవు" అని తలఎత్తి - తండ్రిని పరీక్షగా ఒక క్షణం చూసింది. ఆ చూపులో అతను తండ్రీ కాదు, రాజూ కాదు. అది గమనించని తండ్రి. కోపోద్రిక్తుడై, ఆమె ముందు హిరణ్యకశ్యపుని మాదిరిగా నిలిచాడు.

చివరి సూర్యకిరణం, ఆమె పాపిట పెట్టుకున్న కుంకుమను ముద్దుపెట్టుకుంది. తండ్రి దారికి అడ్డు నిలవడంవల్ల, ఆమె ఆగిందే కాని, వెనక్కి తిరగలేదు. తండ్రికి భయపడలేదు. నిశ్చలమనస్సుతో, నిర్మలభావంతో, పవిత్రహృదయంతో పూర్ణ మరో అడుగు ముందుకు వేసింది. కన్నకూతురే తనమాట వినకపోతే "ఇంకెవరు వింటారు?" అని, అతని అహం విజృంభించింది. దానితో అతడు వివేకం కోల్పోయాడు.

ఆ అహం, క్రమంగా ఆవేశరూపం దాల్చింది. ఆమె ముందున్నది తండ్రి, కాదు-అహంకార స్వరూపం. అహంకారానికి మంచి, చెడ్డలు, యోచించే శక్తి వుండదు. ప్రాణమిచ్చిన తండ్రి, ప్రాణం తీయడానికి ఒరలోంచి కత్తితీశాడు. అతని ఎదురుగా వున్నది-కూతురుకాదు, కోపం- కసి- పగ - ద్వేషం - అసూయ- ఒక్కవేటున కన్నకూతురు కుత్తుక నరికాడు. ఆమె లేతరక్తం, తెల్లటి కోటగోడలపై చిందింది. సూర్యాస్తమయ అరుణకాంతిలో ఆ రక్తం మరకలు మెరిశాయి. ఆమె చేతిలోని పూలసజ్జ నేలమీద దొర్లింది. పువ్వులు,

పక్షుల్లా చెల్లాచెదురైనాయి. తెల్లని పూరేకులపై, ఎర్రటి రక్తపు మరకలు. పూర్ణ రక్తపుమడుగులో నిర్జీవంగా పడివుంది.

రక్తపుతడి ఆరకముందే- పూజాసమయం మించకముందే- బహువిచిత్రంగా బుద్ధుడు అక్కడకు వచ్చాడు. ఎవరిని ఆరాధించ డానికి పూర్ణ బయలుదేరిందో, ఆ భగవానుడే- ఆ పూర్ణ మానవుడే, ఆమె దగ్గరకు వచ్చాడు- కాని, పూర్ణ లేదు, ఆయన ఆమె మృత దేహాన్ని, చేతుల్లోకి తీసుకుని, భారంగా భూమాతవంక చూశాడు. బుద్ధుణ్ణి చూసి రాజు భీతిచెంది, పశ్చాత్తాపపడి, భోరున ఏడుస్తూ ఆయన కాళ్ళమీద పడ్డాడు.

బుద్ధుడు రాజుకు దుఃఖనివృత్తి మార్గం బోధించి "చంపవల సింది తన కూతుర్ని కాదు, కోపాన్ని," అన్నాడు. రాజు బౌద్ధం స్వీకరించి, సంఘసభ్యుడై సమస్తం పరిత్యజించి- సన్యాసం స్వీక రించి, అర్హతుడైనాడు. ఏచోట పూర్ణ హత్య గావించబడ్డదో, ఆచోట గొప్ప అందమైన ఆరామం వెలిసింది.

* * *

ఒకరోజు సాయంత్రం బుద్ధుడు అస్తమిస్తోన్న సూర్యునికి అభిముఖంగా- అశ్వత్థ వృక్షం క్రింద కూర్చున్నాడు. ఆయనచుట్టూ శిష్యులు మౌనంగా కూర్చున్నారు. క్రమంగా పశ్చిమ ఆకాశం నారింజ రంగులోకి మారింది. సూర్యుడు కొండల వెనక్కి వెళ్ళాడు. అప్పుడు బుద్ధుడు అకస్మాత్తుగా- విషయప్రస్తావన చేస్తూ, "ఓనా ప్రియమైన భిక్షువులారా! జీవితంలో నిరాశ, నిస్పృహలకు చోటి వ్వకండి. అది మంచి సంగతి కాదు. అది- దేహానికీ-మనసుకీ హాని చేస్తుంది. మీరూ, శాంతిని, ఆనందాన్ని పొందగలరు. గొడవపడ కండి. తొందరపడకండి. సత్యదర్శనం బహుదుర్లభం. దాన్ని సాధించడమూ కష్టమే. దాన్ని జయించామా- ఈ పృథ్వీ- జలం- అగ్ని—వాయువు- ఆకాశం- ఏమీ వుండవు. పంచేంద్రియాలకు అతీత

మైన ఆనందాన్ని అనుభవించవచ్చు. ఆ పరమశాంతిని ఎవరూ- ఒకరినుంచి- ఒకరు తీసుకోలేరు. అది- అన్నిటికన్నా మహోన్నత మైనది-అత్యున్నతమైనది.

అటువంటి సత్యాన్ని నేను దర్శించినప్పుడు- క్రూరమైన విషనాగులు వంటి కొన్ని దుష్టశక్తులు అంటే- కుటిల యోచనలు- వాటి ఉద్దేశ్యం ఏమిటంటే- నేను ఏదోగా మారాలని- సరైనది- నిజ మైనది- వాస్తవమైనది- శాశ్వతమైనది కానిదాన్ని నేను పొందాలి- అనే వాంఛల్ని నాలో ప్రేరేపించాయి. కాని, నేనా ఆలోచనల్ని అధిగమించి- నన్ను నేను తెలుసుకున్నాను. చివరికి వాటిని దూరంగా తరిమేసి, సమూలంగా నాశనం చేసి, ఆ దుష్ట ఆలోచనలనుంచి తప్పించుకున్నాను.

సత్యమనే జ్యోతిని మీకు మీరే దర్శించి, మీకు మీరే జ్యోతు లుగా వెలగండి. సత్యాన్నే ఆశ్రయించండి. ఇతరమైనదాన్ని- దేన్నీ ఆపేక్షించకండి. మీరు దాన్ని భూమి నాలుగు చెరగులా వ్యాప్తి చేయండి. నిర్వాణం కోసం ప్రయత్నించండి.

నిర్వాణమంటే జగత్సత్య స్వరూపమైన సత్పదార్థంతో లీనం కావడం. అదే కైవల్యం. అదే పరిపూర్ణ శాంతం- ఆనందం. ఐక్యమై పోవడమన్నా అదే. ప్రాకృతమైన ప్రపంచం గురించి తలంపులు కలగకుండా వుండటమే, నిజమైన శూన్యం. అంటే, ఏమీ- ఏదీ- మిగలకుండా పోవడమూ కాదు-ఏమీ కాకుండా పోవడమూ కాదు. పూర్తి ఖాళీ కావడం కాదు. మౌనంలో తప్ప తెలుసుకోలేని అనుభవమది. అదే ఎరుక. దాన్ని మించిన ఆనందం మరొకటిలేదు. అటువంటి స్వానుభవ ఆనందానికి- "మోక్షం" అనేదానితో ఎటు వంటి సంబంధం లేదు. నిత్యం మన చుట్టూ- భయపెడుతూ-బుసలు కొడుతూ వుండే విషనాగులవంటి కోర్కెల్ని గట్టిగా ఊది- ఆర్పి- అంతం చేయడం- అగ్నిశిఖల వంటి మనోవాంఛల్ని పూర్తిగా అదు పులో వుంచుకోవడం ద్వారా- నిర్వాణ పథం చేరుకోవచ్చు. ఎవరికి

వారే తమతమ సాధనా విధానాలద్వారా, అంతే. నిరంతరం లోపలా, బైటా తమనుతాము అన్నివిషయాల్లో ఎటువంటి అరమరికా లేకుండా- అదుపులో వుంచుకుంటో- సర్వేంద్రియాల అనుభూతిని సునిశితంగా పరిశీలించుకోవాలి. అంటే సకల బంధాలనుంచీ బైట పడటం.

సమస్త వాంఛల్ని జయించడమే, నిర్వాణం. సంసారంలో వుండికూడా దాన్ని సాధించవచ్చు. అటువంటి నిర్వాణాన్ని పొందడానికి- చతుత్సత్యాల జ్ఞానం- అంటే, దుఃఖం- దుఃఖ కారణం- దుఃఖనివృత్తి- దుఃఖనాశనానికి కారణమైన అష్టాంగ మార్గం. బోధించాను. దానిద్వారా సౌశీల్యం- ప్రజ్ఞ-ధ్యానాదుల్ని సాధించండి.

సర్వమూ క్షణికం. ప్రతిదానికీ ఆద్యంతాలుంటాయి. ఈ దృశ్య ప్రపంచం అనిత్యం- దుఃఖభూయిష్టం. అశాశ్వతం. అందుచేత అతీత విషయాల గురించి చర్చించడం నిరుపయోగం, అనర్థదాయకం. కనుక ప్రతిఒక్కరూ అవిద్యను నాశనం చేసుకోవాలి. అవిద్య అంటే- దుఃఖాన్ని- దుఃఖమూలాన్ని- దుఃఖకారణాన్ని- దుఃఖ నాశనాన్ని తెలుసుకోలేకపోవడం. కనుక ప్రతి ఒక్కరూ- ప్రతిక్షణం- ప్రతిదానిగురించి నిజంగా, శ్రద్ధగా, కేంద్రీకృతమైన ఆలోచన చేయాలి. ఆ విధంగా తమ మేధస్సును తామే మధించి- అభివృద్ధి పరచుకోవాలి. ఆ మేధస్సును తగినరీతిలో- వివేకంతో మలచుకోవాలి కావలసినట్లు తయారుచేసుకుని దాన్ని ఉపయోగించుకోవాలి. అవసరమైనప్పుడు దాన్ని సరిచేసుకోవాలి- పూర్తి చేసుకోవాలి.

అహంభావ స్ఫూర్తిని ఆత్మగా ఎంచే- భావించే భావం పోవాలి. అది- వట్టి సంకుచితమైన అహంభావ స్ఫూర్తి మాత్రమే. అది కేవలం భ్రాంతి. అది ఒక్క- నిర్వాణస్థితిలోనే వేద్యమౌతుంది.

"నేను లేక- ఈ మనసు" అనేది- అనేక ప్రేరణల మూట- ఆ ప్రేరణలన్నీ పోయి- నిర్వాణస్థితిని అందుకున్న వారి మనసులు ఏమాత్రం మిగలకుండా మహాజ్వాలలో లీనమైపోతాయి. మహా జ్వాలలోంచి లేచిన వెలుగురవ్వలు తిరిగి అందులోనే లీనమైపోవు నట్లు- దేహం, మరణానంతరం పంచభూతాల్లో కలసిపోతుంది. మహా జ్వాలలోంచి లేచిన వెలుగురవ్వ- గాలివల్ల కొంతదూరం విసరబడి- తర్వాత నామరూపాలు— లేకుండా పోయినట్లు- దేహాన్ని విడిచిన మనసు, కూడా అట్లానే అయిపోతుంది.

అసలు నేనేం చెప్పాను ? ఒక్క దుఃఖం గురించే చెప్పాను. దాన్నెట్లా పోగొట్టుకోవాలో చెప్పాను. దాన్ని పోగొట్టుకునే విధం సూచించాను. అంతే! అదే నిర్వాణానికి సాధనా మార్గం. ఆ మార్గమే, లక్ష్యం దగ్గరకు తీసుకుపోతుంది.

తమలోని దల్మషాల్ని- దోషాల్ని- ఎవరికివారు- ఎప్పటి కప్పుడు- గట్టి పట్టుదలతో వడిగేసుకుని- వాటిని పోగొట్టుకోవాలి. దానికి మనస్సు నిర్మలం కావాలి. ఇంద్రియలోలత్వం కూడదు. ఆలోచనలనుంచి బైట పడాలి. భయం నుంచి విముక్తులు కావాలి. వ్యక్తిత్వపు హద్దులు కూలిపోవాలి. గతజీవితాన్ని పూర్తిగా వదలు కోవాలి. తాను చేసే కర్మలన్నింటికీ, తానే బాధ్యుడననే సంగతి మరచిపోకూడదు. కర్మను గురించిన మూఢనమ్మకాలు తొలగి పోవాలి. ధర్మం గురించిన సంశయం పోవాలి. భేదభావం తొలగాలి. విషయవాసనలు — రూపరాగాదులు పనికిరావు. స్వర్గాధిలోకాల్లో సుఖాపేక్ష పోవాలి. వివేకజ్ఞానం కలిగివుండాలి," అని ఎన్నో జీవిత సత్యాలను చెప్పి— "త్వరలో ఈ శుష్కదేహం నిర్యాణం చెందు తుంది," అన్నాడు. ఆనాటి ఆయన ఉపన్యాసం విన్నవారందరూ "ఇంక ఈ కాంతి కొన్నాళ్ళే ఈ భూమిమీద వుండబోతోంది," అను కున్నారు.

* * *

మధురానగరంలో వాసవదత్త - అనే రాజనర్తకి వుండేది. ఆమె ఉపగుప్తుడనే యువకుని ప్రేమించింది. అతడు చాలా అందగాడు. అతడు బుద్ధుని బోధలు విని- బౌద్ధం స్వీకరించి, దీక్ష తీసుకుని- సంఘసభ్యుడై - బుద్ధుని అనుసరించాడు, అయినప్పటికీ వాసవదత్త అతనిమీద ప్రేమ పెంచుకుంటూనే వుంది. అతనికోసం - అనేక కబుర్లు పంపించింది- ప్రతిసారి, "సమయం వచ్చినప్పుడు తప్పక వస్తాను," అని సమాధానమిచ్చాడు. "వాసవదత్తకు కావలసినది మణి- మాణిక్యాలు కాదు, ఉపగుప్తుని ప్రేమ," అని కబురుపెట్టినా, అతడు అదే సమాధానం ఇచ్చాడు. ఆమె అతని సమాధానాలతో విసుగుచెంది, మరో కళాకారునితో సంబంధం పెట్టుకుని, కొన్నాళ్ళు సుఖించింది.

కొన్నేళ్ళు గడిచాక, మధురానగరానికి ధనవంతుడైన ఒక వర్తకుడు వచ్చాడు. ఆమె అతన్ని- అతని ఐశ్వర్యాన్ని వలచింది. ఆమె ధనానికి దాసురాలై - కళాకారుని హత్యచేయించి, అతని శవాన్ని ఒక పేడకుప్పకింద పూడ్చిపెట్టించింది. అతని జాడ తెలియక, అతని బంధు - మిత్రులు తీవ్రంగా వెదకి - చివరికి అతని శవాన్ని కనుక్కున్నారు. విషయం తెలుసుకుని - ఆమెను న్యాయస్థానానికి పిలిపించారు. ఆమె, చేసిన తప్పు ఒప్పుకుంది. దానికి శిక్షగా ఆమె ముక్కు - చెవులూ కోసి - కాళ్ళు నరికి శ్మశానాల దొడ్లో పడేశారు.

అందమైన వాసవదత్త కామోద్రేకియై - ప్రియుని హత్య చేయించి- శిక్షపడి— అవసానదశలో - వికృతంగా - భయంకరంగా— ఊరిచివర శ్మశానంలో - ఒంటరిగా - దిక్కూ-మొక్కూ లేక - తిండి లేకుండా - యాతనలు పడుతోవుంది. పూర్వాశ్రమంలో ఆమె సేవకుల యెడ దయగా వుండటంచేత - ఒకామె దయతలచి- శ్మశానానికి వెళ్ళి వాసవదత్త దేహాన్ని కాకులు, గ్రద్దలూ పొడిచి, హింసించకుండా గుడ్డలు కప్పి- తిండిపెట్టి కాపాడుతోంది.

వాసవదత్త అటువంటి దీనావస్థలో వున్నప్పుడు - ఉపగుప్తుడు శ్మశానానికి వెళ్ళి- ఆమెను చూసి దిగులు పడ్డాడు. అతన్ని చూసి, ఆమె సిగ్గుపడి, పరిచారిక నడిగి- మిగిలిన దేహాన్ని ఓ చీకి గుడ్డతో కప్పుకున్నది. ఒకనాడు ఆమె దేహం పరిమళ ద్రవ్యాలతో నిండి- పట్టుబట్టల్లో చుట్టబడి - మెత్తని పరుపులమీద పవళించి వుండేది. మంచిముత్యాల హారాలు ధరించిన ఆమె దేహం, దయనీయమైన దుస్థితికి గురైనది.

ఆమె సర్వాంగసుందరంగా - సౌందర్యదేవతగా వెలిగిపోయిన రోజుల్లో పిలిచినా పలకని- కన్నెత్తి చూడని ఆమెను, ఉపగుప్తుడు వెళ్ళి "నేను, నా సంతోషంకొద్దీ, నీ దగ్గరకు రాలేదు. నువ్వు పోగొట్టుకున్న దేహసౌందర్యం కన్నా - గొప్ప అందాన్ని నీకు ప్రసాదించడానికి వచ్చాను. మానవాతీతుడైన బుద్ధుడు - విశ్వ కళ్యాణార్థం సదోపదేశ చేస్తో, ఈ భూమిమీద తిరుగుతూ వుంటే, నువ్వు సుఖలాలసవై- కామాంధురాలివై - ధనపిశాచానికి బానిసవై- విషయ వాసనలకు లోనై కాలం గడిపేవేకాని, ఒక్కనాడూ ఆయన బోధలు వినలేదు. ఆయన్ని దర్శించనూ లేదు. అప్పటి నీకాలమంతా అహం భావంతో నిండివుంది.

దేహసౌందర్యాన్ని మించిన సౌందర్యం వుంది. అది శాశ్వతమైనది. నువ్వు బుద్ధుని బోధలు వినివుంటే — ఆ శాశ్వత సౌందర్యాన్ని పొందివుండేదానివి" అన్నాడు, ఉపగుప్తుడు. సమయం వచ్చినప్పుడు వస్తానన్నమాట ప్రకారం ఉపగుప్తుడు వెళ్ళి - బుద్ధుని బోధలు వివరించి చెప్పాడు. ఆ మాటలు విని, వాసవదత్త శాంత పడింది. గాయాలబాధ మరచింది. త్రిశరణాల్ని శరణుజొచ్చి, తన జీవితానికి, ఆ మాత్రం ఆనందం చాలుననుకుని సంతోషపడింది. ఆ ఆనందంతోనే ఆమె ఉపగుప్తుని చేతుల్లో శాంతిగా కళ్ళు మూసింది.

*   *   *

బుద్ధుడు వైశాలినుంచి రాజగృహ వెళ్ళి-గృధ్రకూట పర్వతం మీద మకాం చేశారు. ఆ వర్షాకాలం-మకుల పర్వత విహారంలో మకాం చేశారు. ఆ తర్వాత శ్రావస్తి వెళ్ళారు. శ్రావస్తి అంటే బుద్ధునికి ఎంతో ఇష్టం. అందుచేత ఆయన తరచు అక్కడకు వెళ్ళే వారు. అక్కడ నుంచి కపిలవస్తుకు సమీపంలోవున్న శంకుమార ప్రాంతంలో కొన్నాళ్ళు వున్నారు. అక్కడ నుంచి ఆమ్రలతికా ఆరామానికి వెళ్ళారు. అక్కడ కొన్నాళ్ళు వుండి, నలంద వెళ్ళారు. అక్కడ వుండగా వర్ధమాన మహావీరుని శిష్యుడు "ఉపాలి," బుద్ధుని దర్శించి-ఆయన బోధలువిని-ఆకర్షితుడై- ఆయన్ని అనుసరించి- సాష్టాంగ ప్రణామం చేయగా, "ఉపాలి" ఇది నీ వంటివారు తీసుకో వలసిన తుదినిర్ణయంకాదు," అన్నాడు బుద్ధుడు. దానికి ఉపాలి "ఇదే మరో మతం అయితే నన్ను గొప్పచేసి-నాకు బ్రహ్మరథం పట్టి ఊరేగించేవారు. తన గురువునూ-మతాన్ని - పేరు ప్రఖ్యాతుల్ని-స్థానాన్ని - సమస్తాన్ని వదలివచ్చి నందుకు-కాని, మీరు, నన్ను మరొకసారి ఆలోచించ మంటున్నారు. ఈ మీ విషయం చాలా గొప్పగా వుంది," అన్నాడు.

* * *

నలందలో బుద్ధుడు సారిపుత్తను కలుసుకున్నారు. ఆ సందర్భంలో సారిపుత్త అక్కడ చేరిన వారిని ముఖ్యంగా బుద్ధుని శిష్యులను ఉద్దేశించి బౌద్ధ ధర్మగురించి సింహనాదం చేశారు. "మన గురుదేవులైన బుద్ధ భగవానుల దృష్టి-, ప్రధానంగా ధర్మదృష్టి- ధర్మమంటే,-సహజమైన మనసు కలిగి వుండటం. వర్తమానంలో జీవించడం. గోల, మనోవ్యాకులత లేకుండా వుండటం. అదే పరమ ధర్మం. అదే పరమ సత్యం.

జగద్వస్తు సమూహమంతా, ఆయనకు ధర్మరూపాలే.

ఆ ధర్మాన్నే, మోక్షసాధన మంటున్నారు, అటువంటి

ధర్మానుష్ఠాన జీవితంవల్ల, హృదయంలో జ్ఞానజ్యోతి ప్రకాశించే ప్పుడు, తత్వం అదే బోధపడుతుంది.

ధర్మానికో ఉనికిలేదు. అని- దానికి ఉనికిలేక పోవడమూ లేదు.

అది, ఆది మధ్యాంతములలోలేదు.

అమనస్కస్థితే ధర్మం. కాలినతాడు మాదిరిగావున్న మనస్సే, ధర్మం.

ఆ మనసు దేన్నీ బంధించలేదు.

ఆనందమే ధర్మం. ఆ ధర్మసాధనలో, తన్మయత్వం పొందాలి.

"ధర్మం అనంత ఆకాశం వంటిది.

సముద్రంలో చిన్న అలకూడా లేకపోతే, అవతలి తీరం చేరడం చాలా కష్టం. ఎన్నో విఘాలతో కూడిన ఈ మార్గాన్ని, ధర్మదేహం ఒక్కటే, చూసుకుపోగలదు. ధర్మకాయమంటే, వికా సం చెందిన మనసు."

"మనసును శూన్యంగా చూడాలని, మనసు గురించి బోధి సత్వులు ఎంతో మాట్లాడారు. గాఢమైన భ్రాంతిలో, మనోస్వభావాల మీదనే మనం మాట్లాడతాం, యోచిస్తాం. అటువంటి యోచన, బోధి సత్వుల "ఏకాగ్రచిత్తం" అనే దానికి సరిపడదు. అటువంటి యోచ నను ముఖ్య విషయంగా ఎంచి, అంతులేని సంభాషణలలోకి దించడం నిశ్చయంగా ధర్మానికి యోగ్యమైన సంగతి కాదు."

"సమస్త జీవరాసులు ఒకదాన్నించి ఒకటి భిన్నంకావు. అన్నీ, అంతా ఒకటే, సమానమే. అదే బౌద్ధ ధర్మ సూత్రం.

ద్వైతానికి ఆధారం లేనట్టి శుద్ధమనసుతో, విడిగా, సత్యాన్ని పర్శ్యించడం ఏమిటి? ఎందుకంటే, అక్కడ దర్శించడానికి, వినడానికి, ఏం చేయడానికి ఏమీలేదు. చూసేవాడు, చూడబడేది, లేదు. ఒక చోటు నుంచి నిలిచి చూసేందుకు, అసలు ఒక చోటు అంటూ ఏమీలేదు," అంటూ గొప్ప ఉపన్యాసం ఇచ్చాడు సారిపుత్ర.

"ఈ ఉనికీ, అదే మూలం, సత్. అదే చైతన్యశక్తి. ఆ శక్తి ఒక్కటే, తనంతట తాను ప్రస్ఫుట మౌతుంది. సత్తే, చిత్. అదే, శాశ్వతం. ఉన్నదీ అదే. అటువంటి దానికి మరో పుట్టుక స్థానం—మూలస్థానం అంటూ ఇంకోటిలేదు. కనుక, ఈ ఉనికే,- ఈ చైతన్యమే-ఈ కపటితే, అద్వితీయం, అఖండం. తక్కినవన్నీ అశాశ్వతం. అవన్నీ ఆ మూలం నుంచి ఉద్భవించినవే. ఆ మూలం, శుద్ధ చైతన్యం. అదే, అన్నింటికీ ఆధారం. మన నిజజీవితంలో ఆ శుద్ధ చైతన్యంకన్నా, భిన్నమైనది లేదు. తన మూలాన్ని తానే కప్పి, తానే అధికురాలుగా చెలామణి అవుతుంది, మనస్సు. దాన్ని ఆ మూలంలో వుంచుటే ధ్యానం.

తమ సమస్త సంబంధాలతో తాము చచ్చి, అంటే, మమతా అహంకారాలు నశించి, స్వస్వరూపమై వెలిగేవారే, జీవన్ముక్తులు," అన్నాడు.

*   *   *

బుద్ధుడు నలంద నుంచి రాజగృహ-కాశి-కోసల- వైశాలి- శ్రావస్తి మొదలైన ప్రదేశాలకు వెళ్ళాడు.

ధర్మప్రచారం చేస్తూ తిరుగుతున్న ఆ సమయంలో ఒక బ్రాహ్మణుడు బుద్ధుని దగ్గరకువచ్చి, "బాహుక" నదిలో స్నానం చేస్తే-సమస్త పాపాలు తుడిచిపెట్టుకు పోతాయంటారు. మీరు ఏమంటారు?" అని అడిగితే, "అవివేకిని, బుద్ధిహీనుని - అతని

పాపాలనుంచి బాహుకనది పవిత్రం చేయలేదు. ప్రతి ఒక్కరూ తనలో తానుమునిగి స్నానం చేయాలి. అప్పుడే, అన్ని పాపాలు పరిహారమౌతాయి. అన్ని నదుల్లో నీరు ఒకటే, సమానమే," అన్నాడు.

* * *

బుద్ధుడు జేతవనంలో వున్నప్పుడు, ఎప్పుడూ ఏకాంతంగా వుండి, ధ్యానం చేసుకునేవాడు. ఒకసారి "మాలుంక్యపుత్త," అనేక జటిల విషయాలకు సంబంధించిన ప్రశ్నలు అడిగాడు బుద్ధుణ్ణి. అవి, చాలా వరకు దేహం-ఆత్మ, కర్మ-పునర్జన్మ, ప్రపంచం శాశ్వతమా? అశాశ్వతమా? మరణానంతరం జీవనం వుంటుందా?" అనేవి. దానికి బుద్ధుడు, "మాలుంక్యపుత్తా! నువ్వువచ్చి, నా దగ్గర సాధనచేయమని నిన్ను ఎప్పుడైనా అడిగానా? నీ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెపుతానని నీకు మాట ఇచ్చానా?" అన్నాడు.

"లేదు, ప్రభూ!" అన్నాడు.

ఎవరో విషపూరిత బాణం విడువగా, అది ఒకతనికి గుచ్చుకుంది. దాన్నించి కాపాడాలని బంధు-మిత్రులు దయతో వైద్యుని పిలవాలనుకుంటే, అతను, "ఆగండి. ఈ బాణం నా మీద విసిరిన వాడు ఏ కులస్థుడు? అతనిది ఎటువంటి దేహ ఛాయ? అతడు ఏ తెగకు చెందినవాడు? అది, ఏ రకం విషం? అనే విషయాలు ముందు తెలుసుకునే వరకు, నా దేహంనుంచి ఈ విషపూరిత బాణం తీయవద్దు," అని మొండికేశాడు. అతని ప్రశ్నలకు సమాధానాలు రాక ముందే, అతడు మరణించాడు.

ధర్మ జీవనం, సిద్ధాంతాల మీద ఆధారపడదు కనుక, ఈ జీవితంలో పుట్టుక ముసలితనం, మృత్యువు, దుఃఖం, నిరాశ, బాధ,

వేదన మొదలైనవి సమూలంగా నాశనం చేసుకోవాలి. నేను ఏం చెప్పానో, దాని మీద దృష్టిపెట్టి, సాధన చేయండి. నేను చెప్పని వాటివల్ల ప్రయోజనంలేదు. అవి, మనలోని దుర్గుణాల్ని పోగొట్ట లేవు. నిర్వాణపథానికి అవి సహాయకారులూకావు. చతుస్సత్యాలు చెప్పాను కదా? అవి సహాయపడతాయి. దుర్గుణాల్ని పోగొడ తాయి,'' అన్నాడు.

కర్మ బంధంనుండి విముక్తి చెందడానికి మొదట నీతికి సం బంధించిన నిబంధనలను పాటించుట మానవుని ప్రధాన కర్తవ్యం. బండి ఇరుసును అనుసరించి పోవునట్లు, ప్రతిజీవి- కర్మానుసారంగా జీవిస్తాడు పురాకృత దుష్కృతములబట్టి—కర్మ విపాకమునుబట్టి నామ రూపాత్మకమగు దేహం - పలుమారులు ఉద్భవించినా క్రమంగా స్థిరమగు దేహం- పలుమారులు ఉద్భవించినా క్రమంగా స్థిరమగు శాంతిని పొందుట అవసరం.

సర్వసంసార దుఃఖములకు తృష్ణే కారణం కనుక, ఇంద్రియ నిగ్రహ, ధ్యాన, వైరాగ్యాలచే ఆ తృష్ణను రూపుమాపి భిక్షువృత్తి అవలంభించడమే పునర్జన్మ దుఃఖంనుండి బయట పడటానికి మార్గం,'' అని చెప్పాడు బుద్ధుడు.

★ ★ ★

ఒకసారి రాజగృహ వాసులు సారిపుత్త, మగ్గల్లానలను ఉదయం భిక్షకు ఆహ్వానించారు. వారితోపాటు మరో వెయ్యిమంది భిక్షువులూ వెళ్ళారు. ఆ రోజు భిక్షఖర్చుకు తన వంతుగా ఒకాయన చాలా విలువైన ఒక వస్త్రం ఇస్తూ. అవసరమైతే దాన్ని అమ్మి, ఆ సొమ్ము ఖర్చుపెట్టవలసినదిగా కోరాడు. ఆ వస్త్రం అమ్మనవసరం లేక పోవడంతో దాన్ని దేవదత్తునికి ఇచ్చారు. అతడు రాజగృహ ఆరామంలో శాశ్వత సభ్యుడు. అతడా వస్త్రం ధరించి, తక్కిన భిక్షువులముందు గొప్పగా, డాంబికంగా, అహం భావంతో అటూ, ఇటూ, నడవ నారంభించాడు. ఆ సంగతి బుద్ధునికి తెలిసింది.

అంతకు ముందు దేవదత్తుడు బుద్ధుని చంపడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలం కావడం, అజాతశత్రు స్నేహం చెడిపోవడంతో దేవదత్తుడు గతిలేక ఆత్మహత్యా ప్రయత్నానికి పూనుకున్నాడు. కాని, అంతలో అతనికి పెద్ద జబ్బు చేసింది. నలభై రోజులు భరించరాని వ్యాధితో పీడింపబడి, కడసారిగా, జేతవనంలో వుంటున్న బుద్ధుణ్ణి దర్శించాలని కొంతమంది భిక్షువులతో - ఒక పల్లకీలో బయలుదేరాడు. అతని రాక విషయం బుద్ధునికి ముందుగా శిష్యులద్వారా తెలిసి, "అతను నన్ను చూసే అవకాశం లేదు," అన్నాడు నిశ్చయస్వరంతో.

జేతవనం సమీపంలో ఒక కొలను వుంది. బుద్ధుని దర్శించే ముందు స్నానంచేసి వెళ్ళాలని, ఆ కొలను దగ్గరకు వెళ్ళారు. స్నానం చేయలేక పోయినా, కనీసం కాళ్ళు - చేతులు - ముఖం కడుక్కోవాలని కొలనులోకి దిగి, అందున్న ఊబిలో కూరుకు పోయాడు దేవదత్తుడు. బుద్ధునిమాట సత్యమైనది. వేరొక చరిత్ర పాఠంలో "పశ్చాత్తాపంతో దహించుకుపోతున్న దేవదత్తుడు-బుద్ధుని పాదాలమీదపడి," బుద్ధం శరణం గచ్ఛామి" అంటూ ప్రాణాలు విడిచాడు," అని వుంది.

★ ★ ★

శ్రావస్తిలో ఇద్దరు యువకులు బుద్ధుని బోధలకు ఆకర్షితులై సంఘంలో చేరారు. వారిలో ఒకడు గొప్ప పండితుడు.

అతడు ఆశ్రమ వాసులలో మంచిపేరు తెచ్చుకున్నాడు.

రెండవ అతను ఆధ్యాత్మిక జీవనం సాగిస్తున్నాడు.

అంతర్వీక్షణతో వుండి, చాలా వరకు మౌనంగా, నిశ్చలంగా వుండి, ధ్యానంలో వుండేవాడు.

కొన్నాళ్ళ తర్వాత జేతవనానికి బుద్ధుడు వచ్చాడని తెలిసి, వారి దర్శనం చేసుకోవడానికి ఆ పండితుడు వెళ్ళాడు. తన మిత్రుడు సంఘంలో అర్హత్వాన్ని పొంది, బుద్ధునితో వుండి పోవడంచేత, అతన్ని కూడా చూడవచ్చునని, ఆ పండితుడూ వెళ్ళాడు. వెళ్ళి, తన మిత్రుణ్ణి చులకనగా చూడ నారంభించాడు. ఎందుకంటే అతను శాస్త్రాధ్యయనం చేయలేదనీ, చదువురాని మొద్దనీ, సోమరని,—తక్కువ చేయాలని చూస్తుండగా, ఆ విషయం బుద్ధుడు గమనించి, ఆ పండిత భిక్షువును "ధ్యానం అంటే ఏమిటి? ఆ స్థాయిల్లో ఎదురయ్యే ఆటంకాలు ఏమిటి? అసలు, దాని వివిధ స్థాయిలు ఏమిటి? వాటిని అధిగమించడం ఎట్లా?" అని ప్రశ్నించాడు. అతనికి ఆ విషయాల్లో స్వానుభవంలేక, సమాధానం చెప్పలేక పోయాడు. అవే ప్రశ్నలు-చదువురాని ఆ రెండో అతన్ని అడగగా, తాను బుద్ధుని ద్వారా విన్న ధ్యానం—ధ్యానావస్థలు గురించి సరైన సమాధానాలు చెప్పాడు. అక్కడే చేరిన సభ్యులను ఉద్దేశించి, "ధర్మ విషయాల్ని అధ్యయనంచేసి, అనుష్ఠించకపోతే, అతడు జీతానికి పనిచేస్తున్న పశువుల కాపరివంటివాడు. అతను చేసే పని వల్ల, అతనికి రావలసిన జీతము మాత్రమే వస్తుంది, ధర్మాన్ని చక్కగా అవగాహన చేసుకుని, నిష్ఠగా అనుష్ఠించేవాడు, పాలు-మీగడ-వెన్న-నెయ్యి-పెరుగు ఇచ్చే పశువుల యజమాని వంటివాడు. ఒకటి దేహానికి, మరొకటి మనసుకి ఆరోగ్యాన్ని ఇస్తాయి. వైరాగ్యభావం పెరిగే కొద్దీ రాగ, ద్వేష, మోహాలు-అవే తొలగిపోతాయి," అన్నాడు బుద్ధుడు.

* * *

బుద్ధుడు "ఖాలియా" నుంచి శ్రావస్తి వెళ్ళారు.

అక్కడ నుంచి కపిలవస్తు వెళ్ళి న్యగ్రోధారామంలో చాలా కాలం వున్నాడు. అక్కడ "వాచగొట్టు" అనే ఒక సంచార సాధువు, "ఈ పదార్థ ప్రపంచం ఏ ఆధారం మీద నిలుస్తోంది?

అహంకారం అనేది వుందా?'' అని అడిగితే, బుద్ధుడు సమాధానం చెప్పక మౌనంగా వున్నాడు.

"ఇవంతా అహంకారం మీద కాక, మరేవిధంగా నిలుస్తోంది?" అని మళ్ళా అడిగాడాయన. దానికీ బుద్ధుడు సమాధానం చెప్ప లేదు. ఎంతకీ మౌనం వీడని బుద్ధుణ్ణి వదలి ఆయనే వెళ్ళిపోయాడు. ఆ సాధువు వెళ్ళిన తర్వాత ఆనందుడు బుద్ధుని దగ్గరకు వెళ్ళి, "స్వామీ, మీరు అతని ప్రశ్నలకు ఎందుకు జవాబు ఇవ్వలేదు," అని అడిగితే, "అహంకారం అనేది వుందా?" అని అడిగినప్పుడు దానికి నేను సమాధానం ఇస్తే, అహంకారం వున్నట్లే కదా? అప్పుడు ఆనందుడు శ్రమణుల, బ్రాహ్మణుల సిద్ధాంతాలలోని శాశ్వతత్వాన్ని నిశ్చయమని నమ్ముతాడు. "అహం అనేది లేదు" అని నేనంటే, అహం అనేది అసలు లేదని ఆనందుడు శ్రమణుల, బ్రాహ్మణుల సిద్ధాంతం అంతా అశాశ్వతమని అంటాడు," అని సమాధానమిచ్చాడు.

* * *

రాహులుడు బుద్ధుని వెనక భిక్షాపాత్ర పట్టుకుని వస్తూవుంటే, "సర్వ ప్రపంచాన్ని అవగాహనా దృష్టితో చూసి, తెలుసుకో," అన్నాడు బుద్ధుడు. "మీరు చెప్పేది భౌతికమైన వాటి సంగతా?" అని అడిగాడు రాహులుడు.

భౌతిక విషయాలేకాదు, ఆంతరంగికమైనవి-భావాలు మనో భీష్టాలు, స్ఫురణ, చైతన్యం—నీలోపలా, బైటా విషయాలన్నిం టినీ-సమస్తాన్నీ-సదా అవగాహన చేసుకోవాలి. మనసు ప్రతి దానితో స్నేహ భావంతో వుండేటట్లు చూడాలి. అవగాహనా సమ యంలో అన్నింటి యెడల మంచిని పెంచుకోవాలి," అని మరి ఎన్నో సంగతులు చెప్పాడు, బుద్ధుడు, దారి పొడవునా.

* * *

ఆనందుడు బుద్ధుణ్ణి అనుసరించినప్పటినుంచీ ఆయనకు నిస్వార్థంగా సేవచేశాడు. చివరి సంవత్సరాల్లో— బుద్ధుడు శ్రావస్తిలో వుండగా భిక్షువులను - శిష్యులను - అందర్నీ పిలిచి, "నేను పెద్దవాణ్ణి అవుతున్నాను. నన్ను నిరంతరం విడవకుండా చూసుకుంటూ వుండే వారు ఒకరు అవసరం," అనగా సారిపుత్రుడు లేచాడు. బుద్ధుడు అతన్ని వారించి, "సారిపుత్రా, నీవుచేసే ధర్మోపదేశం బుద్ధులుచేసే ధర్మోపదేశమునకు సమానం. అందువల్ల నిన్ను నా పరిచారకునిగా చేసుకోవడం ప్రయోజనకరం కాదు," అన్నాడు.

ఆ తర్వాత బుద్ధుడు స్వయంగా ఆనందుని పేరు సూచించాడు. దానికి ఆనందుడు ఎనిమిది షరతులు పెట్టాడు:

తనకు ఇచ్చిన విలువైన వస్త్రాల్ని బుద్ధుడు నాకు ఇవ్వరాదు.

తనతోబాటు నన్ను ఉండనివ్వరాదు.

ఆయనకు మంచి భోజనం లభిస్తే అది నాకు పెట్టకూడదు. ఎవరైనా ఆయన్ని ఆహ్వానిస్తే, నన్ను వెంట తీసుకువెళ్ళకూడదు. ఈ షరతులు ఎందుకంటే, వాటి ప్రలోభంవల్లనే ఆనందుడు పరిచర్యకు అంగీకరించాడనే అపవాదు రావచ్చు," అన్నాడు, ఆనందుడు.

తక్కిన నాలుగు షరతులు :

నేను ఏదైనా ఆయన పక్షాన ఆహ్వానాన్ని అంగీకరిస్తే, వారూ, దాన్ని అంగీకరించినట్లే అవుతుంది.

సందర్శకులను ఆయన దర్శనానికి తీసుకువెళ్ళే అధికారం నాకు వుంటుంది.

నాకు అవసరమైనప్పుడు, ఆయన్ని సమీపించే స్వేచ్ఛ

వుంటుంది. నా పరోక్షంలో భగవాన్ ఏదైనా ధర్మం - ఎవరికైనా బోధిస్తే, అది నాకు తప్పక తర్వాత చెప్పవలసి వుంటుంది.

బుద్ధుడు అతని షరతులకు అంగీకరించాడు.

ఆ తర్వాత బుద్ధుడు తన శిష్యులందర్నీ పంపించేసి, ఆనందునితో కలసి వేలువా విహారంలో వున్నారు. అక్కడ ఆయనకు పెద్ద జబ్బు చేసింది. బాగా నీరసపడ్డారు. అది, మామూలు జబ్బు అనిపించలేదు, ఆనందుకి. అతను గొడవపడి, "గురుదేవులు ఏమీ చెప్పకుండా- ఏదీ ప్రత్యేకంగా బోధించకుండా మహానిర్వాణం చెందితే, ఈ సంఘం ఎట్లా నడుస్తుంది? ఈ భిక్షువులంతా ఏం కావాలి?" అని మథన పడుతోవుంటే.

బుద్ధుడు గమనించి, "గురువంటే, దేహం కాదు. గురు వచనమే గురువు. నేను సలహాలు ఇవ్వను. ఏదైనా ఇవ్వడానికి, అసలు ఏమీ లేదు. సలహాలంటూ ప్రత్యేకంగా ఏముంటాయి? ఏవేవో సలహాలు ఇచ్చి - ఈ సంఘాన్ని నిలపాలి - నడపాలి- అనే యోచన నాకే నాడూ లేదు," అన్నాడు.

బుద్ధుడు నలభై ఐదుళ్ళు కాలినడకను ఉత్తరభారత దేశమంతా తిరిగి ధర్మం బోధించాడు. వర్షాకాలం తప్ప - తక్కినకాలమంతా శిష్యుల- అనుచరుల- సాధువుల - సన్యాసుల - సామాన్యప్రజలతో కలసి పాదచారియై- ధర్మం బోధిస్తో కాశీ, కోసల, మగధ మొదలైన రాజ్యాలు– పట్నాలు- పల్లెలూ తిరిగేవారు. ఆయా ప్రాంతాల ప్రజలు సద్ధర్మ శ్రవణమునకై ఆయన్ని విని, తరించేవారు.

శ్రావస్తి వెడుతూ దారిలో జబ్బుపడి, ఆనందునితో, "ఇంక ఈ దేహం మూడు నెలలకు నిర్యాణం చెందుతుంది," అన్నారు, చాలా నిశ్చయస్వరంతో అప్పటికి ఆయన వయసు ఎనభై సంవత్సరాలు- అనారోగ్యంతోనే చివరిసారిగా రాజగృహ వెళ్ళి - అక్కడ

నుంచి అనేక ప్రదేశములు తిరుగుతూ వుండగా- అంబలతికారామములో "సుప్రియుడు" అనే సన్యాసి బుద్ధుణ్ణి, ధర్మాన్ని, సంఘాన్ని నిందించాడు. కాని, అతని శిష్యుడైన బ్రహ్మదత్తుడు- బుద్ధుని స్తుతించాడు. ఆ సంగతి చూసి, "ఇతరులు ఎవరో ఏదో అన్నారని- ఆగ్రహం తెచ్చుకుని- సత్యమార్గులు కాకూడదు. రాగ, ద్వేష పూరితమైన మనసు సత్యాన్ని గ్రహించలేదు," అన్నాడు బుద్ధుడు.

బుద్ధుడు అక్కడనుంచి నలంద వెళ్ళాడు. అక్కడనుంచి గంగానది ఒడ్డునవున్న "పాటలీగాం" చేరుకున్నాడు. అక్కడనుంచి "నాదిక" వెళ్ళి- అక్కడనుంచి వైశాలి వెళ్ళారు. అక్కడ అమ్రపాలి వనంలో వున్నారు. తన వనంలో మకాంచేసిన బుద్ధుణ్ణి దర్శించడానికి గొప్ప వైభవంతో- అట్టహాసంతో బయలుదేరింది. ఆమె వేశ్య- రూపవతి కావడంచేత, "ఆకర్షణ- వశీకరణకు లోనుకావద్దు," అని బుద్ధుడు, అక్కడ చేరినవారిని హెచ్చరించాడు. ఆమె బుద్ధుణ్ణి దర్శించి తన ఇంటికి భిక్షకు ఆహ్వానించింది మరొకసారి. ఆయన వెళ్ళాడు. ఆమె బుద్ధుని పూర్తిగా అనుసరించి అర్హతస్థితిని పొందింది.

వైశాలిలో, తన భిక్షాపాత్రను లిచ్ఛవీయులకు ఇచ్చేశాడు, బుద్ధుడు. అక్కడనుంచి "భండగాం" వెళ్ళాడు. ఆ వర్షాకాలం "బేలువా" చేరుకున్నాడు. అక్కడ చేరిన వారిని ఉద్దేశించి, ఈ దేహయాత్ర ముగిసే సమయం ఆసన్నమైంది. భిక్షుసంఘం ఇంకా నానుంచి ఏమి ఎదురుచూస్తోంది? చెప్పవలసినదంతా చెప్పాను. ఏమీ దాచలేదు. సంఘం ఇంకా నామీద ఎందుకు ఆధారపడి వుండాలి? ధర్మదీపాన్ని తీసుకుని తరించండి. నాకాలం ముగిసింది. అరిగిపోయి, శిథిలావస్థలో వున్న ఈ శరీరాన్ని ఇంకా కదిలిస్తున్నాను. ధర్మాన్నే జ్యోతిగా, ఆశ్రయంగా తీసుకోండి. ఇంక దేని మీదా ఆధారపడకండి," అనిన బుద్ధుని మాటలు శ్రద్ధగా విన్న ఆత్మదత్తుడనే భిక్షువు- తథాగతుని పరినిర్వాణం సమీపిస్తున్నది:

ఇంక కొంత వ్యవధే వుంది. ఆ సంగతి ఆయనే స్వయంగా చెప్పారు. ఆలస్యం పనికిరాదు, త్వరపడాలి,'' అనుకుని వెళ్ళి, తీవ్రసాధనలో నిమగ్నుడయ్యాడు.

బుద్ధుడు అక్కడనుంచి కూటగారాశాలకు వెళ్ళి-అందరికీ ధర్మం బోధించాడు- సమస్త పదార్థాలు నశించేవే! జన్మించింది, మరణించి తీరుతుంది. నాశనం, భావం యొక్క స్వభావం. తత్వజ్ఞులు దేనికీ వగవరు. నేను పరిశోధించిన చతుత్సత్యాలను మీకు చెప్పాను. మీరు వాటిని అనుష్ఠించి, ఆచరణలో పెట్టి, దేశవ్యాప్తం చేయండి,'' అన్నాడు.

''సారిపుత్రుడు నిర్యాణం పొందాడు. ఆయన బట్టలు, కర్ర, భిక్షాపాత్ర- ఇతర సామాగ్రి ఇవిగో,'' అని ఒకరు వచ్చి నాతో చెప్పగా- నా శరీరమంతా శక్తిహీనమైపోయింది. నాకు అంతా శూన్యంగా తోచింది. కాస్సేపు ఏమీ తోచక, అగమ్యంగా వుంది,'' అన్నాడు ఆనందుడు, బుద్ధునితో.

''ఆనంద్! సారిపుత్రుడు శీలాన్ని తీసుకుని నిర్వాణం పొందాడా? లేక- సమాధి, ప్రజ్ఞను తీసుకుని నిర్వాణం పొందాడా?'' అని అడిగాడు బుద్ధుడు.

''ఆయన దేన్నీ తీసుకుని పోయి నిర్వాణం పొందలేదు. ఆయన మాకు ఉపదేష్ట. జ్ఞాతా జ్ఞాత విషయాల్ని తెలిపే జ్ఞానదాత.

ఆయన మమ్మల్ని ఉత్తేజపరచడం, బ్రహ్మచారులను అనుగ్రహించడం వారి ధర్మమై వుంది. ఆ ధర్మాన్నే మేము తలచుకుంటున్నాం,'' అన్నాడు.

''ఆనంద్! మనం ఎప్పుడో ఒకప్పుడు అన్ని ప్రియ వస్తువుల నుండి ఎడబాటు పొందవలసిందేనని నేను చెప్పలేదా? పుట్టినదెల్లా నాశనం పొందితీరుతుంది. సారమైన సారిపుత్త లేడు, నేడు. కనుక

మీరే, మీ మార్గాన్ని చూపు దీపములుగండు. ఇతరుల మీద ఆధార పడరాదు. ధర్మమునే శరణు జొచ్చండి." అని బుద్ధుడు అంటూ వుండగా "మౌద్గల్యాయనుడు నిర్వాణం పొందాడు" అన్న వార్త ఒకరు తీసుకువచ్చారు. బుద్ధుడు అది విని, "ఉత్తమమైన జంట. పరిషత్తులో- ప్రపంచంలో - ఎక్కడవున్నా- ఇంక ఎవరి అవసరం లేకుండా, ఏ లోటూ రాకుండా— అందరికీ ధర్మం బోధిస్తో ప్రచార జీవితం సాగించారు," అన్నాడు.

సారిపుత్త- మౌద్గల్యాయనులు- ఇద్దరూ ప్రధాన శిష్యులై బౌద్ధ ధర్మాన్ని శ్రద్ధగా విస్తృత ప్రచారం చేయడం పరమతస్థులకు మొదటి నుంచీ బాధాకరంగా వుండి-అనేక విధాల వారిని అణచా లని, చేసిన ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో చివరికి మౌద్గల్యా యనుని దారుణంగా హత్య చేశారు. అతడు చివరి క్షణంలో కూడా- "బుద్ధం శరణం గచ్ఛామి" అంటూ ప్రశాంతంగా కళ్ళు మూశాడు.

బుద్ధుడు కొంతమంది శిష్యుల్ని పంపించేసి, భోగనగరం మీదుగా "పావా" అనే గ్రామం వెళ్ళారు. అక్కడ "చందుడు" అనే వాని మామిడి తోటలో మకాం చేశారు. అనారోగ్యకారణంగా బుద్ధుడు చాలా నీరసంగా వున్నాడు. బుద్ధుడు వచ్చి, తనతోటలో మకాం చేశారనే సంతోషంతో చందుడు వారితోపాటు, తన బంధు- మిత్రులకు గొప్ప విందు ఏర్పాటు చేసి, ఆ విందులో రకరకాల వంటకాలు చేయించాడు. బహురుచ్యములగు ఆ పదార్థాల్లో ఒక ప్రత్యేక వంటకం - చరిత్రకారులు తలొక విధంగా రాసినవి- పుట్ట కొక్కులు- కుక్కగొడుగులు- పందిమాంసం- విందులో మొదట ఆ వంటకాన్ని వడ్డిస్తే- బుద్ధుడు దాన్ని రుచిచూసి, "చందూ, దీన్ని ఇంక ఎవరికీ వడ్డించకు. దీన్ని తీసుకుపోయి, గోతిలో వేసి పూడ్చెయ్యి," అన్నాడు.

ఆ తర్వాత బుద్ధునికి రక్త బంకవిరోచనాలు పట్టుకున్నాయి. దానితో ఆయన మరింత నీరసపడ్డాడు. క్రమంగా ఆయన దేహస్థితి

ప్రమాదస్థితికి వెళ్ళింది. మర్నాడు నిస్సత్తువగా- నిస్త్రాణగా వున్నా- పావా నుంచి "కూసినార" వెళ్ళడానికి ప్రయాణమయ్యారు. ఆ గ్రామం అక్కడకు పన్నెండు మైళ్ళ దూరంలో వుంది.

దారిలో అతిసార విరోచనాలు పట్టుకున్నాయి, బుద్ధునికి. క్రమంగా దేహం బలహీనమై, వశం తప్పుతోంది. కుకుత్స నది ఒడ్డున- ఓ చెట్టుక్రింద పక్క వేయించుకుని, కొంతసేపు విశ్రమించాడు. "దాహం"అంటే, ఆనందుడు నదిలోంచి నీరుతెచ్చి ఇచ్చాడు. నీరుత్రాగి, అతనితో "చూడు, ఆనంద్! చందుడు ఇచ్చిన భిక్షతో నా ఆరోగ్యం దాగా చెడిందని ఫిర్యాదుగా చెప్పకు. అతన్ని నువ్వు నిందించకు. అతడు ఇచ్చిన భిక్షతో నాకు పరినిర్వాణం కలుగనున్నది. ఆనాడు సుజాత పెట్టిన భిక్షతో జ్ఞానోదయమైంది. "ధర్మాత్ములు ఏదిపెడితే అది తినాలి" అనేది బౌద్ధభిక్షువుల నిర్ణయం. నియమం. ఈ రెండు భిక్షలూ నాకు ప్రీతిపాత్రములు. నా మరణానంతరం- నువ్వు అతని దగ్గరకు వెళ్ళి ఓదార్చు," అన్నాడు బుద్ధుడు. అని, "చూడు, ఆనంద్! చెందునితో, నువ్వు మహా భాగ్యశాలివి. భగవాన్ పరినిర్వాణం పొందేముందు నీవు ఇచ్చిన భిక్ష తీసుకున్నారు. నువ్వు అదృష్టవంతుడవు, "అని చెప్పు," అన్నాడు.

ఆ మర్నాడు బుద్ధుడు ప్రయాణం సాగించి "మల్లాం" అనే అడవి మధ్యకు వెళ్ళారు. తనకు నిర్యాణం సమీపించిందని తెలిసి, ఆ సంగతి తనతో వున్నవారికి చెప్పి, అక్కడనుంచి- ఇంత నడవలేక "హిరణ్యవతి" అనే నది అవతలి ఒడ్డునవున్న "ఉపవర్తనం" అనబడే మల్లుల సాలవృక్షవనంలోకి వెళ్ళి, అక్కడ రెండు సాల వృక్షాల మధ్య- తనకావిబట్ట పరచిన పక్కమీద ఉత్తరదిశకు తల పెట్టి- కుడిపక్కకు ఒత్తిగిలి- విశ్రాంతిగా పడుకున్నాడు. అక్కడ పక్కగా పరిచింది బుద్ధుని రెండవ అంగీయే.

ఆ సమయానికి సాలవృక్షాలు బాగా పూసి వున్నాయి. నది నిర్మలంగా, తేటగా వుంది. బుద్ధుడు కుడిచేతిపై తల ఆన్చి, కుడి

కాలుపై ఎడంకాలు వుంచి, శిష్యులవంక ప్రేమగా- తదేకంగా చూశాడు. ఆ క్షణాన బహుచిత్రంగా పక్షులన్నీ నిశ్శబ్ద మయ్యాయి. అందరి హృదయాలు ప్రశాంతంగా వున్నాయి. కాని, వారి మనసులు ఆరాటపడుతున్నాయి, బుద్ధుని ఆరోగ్య పరిస్థితికి వాడిన పువ్వులు కన్నీటి చుక్కల్లా ఆయన పక్కచుట్టూ రాలాయి. వారందరి వద నాలు విచారకరంగా, వేదనాభరితంగా వుండటం చూసి, "స్త్రీలు గాని, పురుషులు గాని, భిక్షువులుగాని, గృహస్థులు కాని సత్య జీవనులై - ధర్మపథాన నడచుకునేవారే తథాగతుని గౌరవించిన వారు. వారికి శాశ్వతానందం లభిస్తుంది," అని-ఆనందునితో, నేను నిర్వాణమైన తర్వాత నువ్వు తీర్థయాత్రలకు వెళ్ళు." అని సలహా ఇచ్చారు.

అప్పటికే సారిపుత్ర- మౌద్గల్యాయనుడు, అంగుళీమాలుడు- నిర్యాణం చెందారు. తన మహాపరి నిర్వాణం గురించి బుద్ధుడు కొన్నినెలల క్రితమే చెప్పారు. బుద్ధుని ఆరోగ్య పరిస్థితి చూసి "ఈ రాత్రి తథాగతుడు మహాపరినిర్వాణం చెందుతారు," అని ఆనందుడు నెమ్మదిగా సోదర సన్యాసులకు, అనుచరులకు చెపుతూ వుంటే, అది విని, "మిమ్మల్ని మీరు ఒక కాంతిగా చేసుకోండి మీమీదే మీరు ఆధారపడి వుండండి ఇతరుల మీద ఆధారపడకండి. ధర్మాన్ని కాంతి పథం చేసుకోండి. దానిని విశ్వసించండి.

మీరు మీ దేహం గురించే యోచన చేయండి. దానిలోని దోషాల్ని గమనించండి. దాని బాధా, సంతోషాలే దుఃఖానికి కారణ మని తెలుసుకోండి. దాని కోర్కెల కోరల్లో పడి, హద్దుమీరకండి.

"నేనవరు? అను విచారణ చేయండి ఏ అరమరికా లేకుండా లోపలా బైటా పరిశీలించి, పరీక్షించి- పరిశోధించండి. అప్పుడు మీరు హద్దుమీరి నడవరు. దేహం, అశాశ్వతం- అవాస్తవం-అస్థిరం. దానిగురించి చాలా గట్టియోచన చేయండి. యోచిస్తే, ఇంక భ్రాంతి పడరు. "నేను" అనే దానిచుట్టూ స్వార్థం, గర్వం, అహం

వున్నాయి. వాటిని నిరాకరించండి. అంతంకాని దుఃఖానికి, కారణా లను తెలుసుకోండి. అన్నింటినీ— అనుక్షణం పరిశీలించి- వాటన్నిం టిలో శాశ్వతమైన "నేను" వుందేమో తెలుసుకోండి.

ప్రపంచమంతటా దుఃఖం ఆవరించి వుందని గొడవపడకండి. నేను మరణించిన తర్వాత, కూడా నా మార్గాన్ని అనుసరించండి. అంటే, నా నడవడిని- నేను జీవించిన జీవన విధానాన్ని— అనుస రించండి- ఆ విధంగా నడిచారా, మీరు ఎప్పటికీ నా శిష్యుల్లో ఒక రుగా వుంటారు.

ఓ, నా ప్రియమైన భిక్షువుల్లారా, నా బోధల్ని— నా నడవడిని ఎప్పటికీ మరచిపోకండి. వాటిని విడవకండి. అవి- ఎప్పటికీ గొప్ప నిధులు. అవే సాధనా మార్గాలు. ఆ విధానంలో నడిచారా, ఆనం దంగా, శాంతిగా వుంటారు.

"నా బోధల్లోని సారం మనసును, నిగ్రహించడం- నిశ్చ లంగా వుంచడం. మనసును లోభత్వం నుంచి తప్పించడం. మనస్సు నిశ్చలంగా, నిర్మలంగా, పవిత్రంగా వుంటే, మీ మాటలూ- మీ బోధలూ- మీ పనులూ ప్రామాణికంగా, పవిత్రంగా వుంటాయి- సత్య మైనవిగా నిలుస్తాయి. "దేహం అశాశ్వతం" అనే విషయం గురించి నిరంతరం యోచన చేయండి. ఆలోచనల్లో క్రోధంనుంచి, లోభత్వం నుంచి దూరమౌతారు. తక్కిన— అముఖ్యమైన- అప్రధానమైన విషయాలన్నింటినీ తోసెయ్యగలుగుతారు. వాటిల్లో మీ మనసు ఒక వేళ ఇరుక్కుంటే—వాటివల్ల కలిగే ప్రేరణల్ని అణచి-అదుపులో పెట్టండి. ఎందుకంటే- మీ మనసుకు మీరే అధికారులు గనుక. బైట దేనినుంచీ- ఎవరినుంచీ— ఎప్పుడూ— ఎందుకూ— ఏదీ ఆశించ కండి, అదే ముఖ్యమైన సంగతి. ఒక విషయం మరచిపోకండి- మీ మనస్సే, మిమ్మల్ని బుద్ధునిగా మారుస్తుంది. లేదా, బద్ధునిగా తయారుచేస్తుంది. పొరపాటువల్ల రాక్షసులుగా, జ్ఞానంవల్ల బుద్ధ లుగా మారడం జరుగుతుంది. కనుక మనసును నిగ్రహించండి.

దాన్ని సరైన మార్గంలో పెట్టండి. అది, అటూ- ఇటూ చెదిరి పోకుండా చూడండి.

నా బోధ ప్రకారం నడచుకుని, మీరు ఒకరినొకర్ని గౌర వించుకోండి. తగాదాలు పడి విడిపోకండి. పాలు, నీళ్ళ మాదిరిగా కలిసి-మెలిసి అన్యోన్యంగా జీవించండి. ఆనందంగా, హాయిగా వుండండి. కలిసి సాధన చేయండి. శ్రమ పడండి. కలిసి నేర్చు కోండి. కాలం వృథా చేయకండి. సోమరిగా వుండకండి జ్ఞాన వికా సాన్ని అనుభవించండి.

"ఈ నా బోధలోని సారాన్ని గ్రహించి, అనుసరించండి. ఉపేక్ష చేశారా, ఎప్పటికీ మీరు నన్ను కలవలేరు. వాస్తవానికి మీరు నాకు భౌతికంగా సన్నిహితంగా వున్నా, నాకు దూరమౌతారు. నన్ను అనుసరిస్తే, దూరంగా వున్నానరే దగ్గర అవుతారు.

"నా శిష్యుల్లారా, సమయం ఆసన్నమైంది. ఇంక నేను వెళ్ళాలి. మన వియోగ సమయం బాగా సమీపించింది. విచారించ కండి. జీవితమంటే, నిరంతరం మారేది. ఈ దేహాన్ని వదలకుండా ఎవరూ వుండలేరు. దాన్ని తప్పించుకోవడం అసాధ్యం.

శిథిలమైన బండిమాదిరిగా నా దేహం అరిగి, అలసిపోయింది. ఇంక అది రాలి, కూలిపోతుంది. నాకు మృత్యువు సమీపిస్తోంది. నా మరణానికి వృథాగా ఏడవకండి. ఈ భూమిమీద ఏదీ శాశ్వతంకాదు- మానవజీవిత శూన్యత్వాన్ని దాన్నించే నేర్చుకోండి.

"అశాశ్వతమైనది శాశ్వతమై నిలవాలని, నిలుస్తుందని అను కోవడం-ఆశించి ప్రయత్నించడం మూర్ఖం. అటువంటి- పనికిమాలిన- తెలివితక్కువ ఆలోచనల్ని వెంబడించకండి. భౌతికమైన కోర్కెలు ఎప్పుడూ మోసం చేయడానికే చూస్తాయి. సుఖంగా, శాంతంగా గదిలో హాయిగా నిద్రించాలంటే, నీ గదిలో పొంచివున్న భయంకర మైన విషనాగుల్ని ముందు బైటకు తరమాలి. వాటిని తరిమినట్లే,

భౌతిక సుఖాల్ని—వాంఛల్ని—బంధాల్ని తెంచి పారెయ్యాలి. మీ మనసుల్ని పరిశుభ్రంగా-సక్రమంగా వుంచుకోండి.

"నా శిష్యుల్లారా, నాకు చివరి ఘడియలు ఆసన్నమౌతున్నాయి. నా దేహం కోసం గొడవపడి దుఃఖించకండి. నిజమైన బుద్ధుడు ఈ మానవదేహంకాదు. బుద్ధుడంటే, పరిపూర్ణ జ్ఞానమూర్తి. దేహం, అశాశ్వతం. అది అదృశ్యమౌతుంది. జ్ఞానం, శాశ్వతం. ఎప్పటికీ నాశనం కానిది, జ్ఞానం. నా దేహాన్ని చూసేవారు, నన్ను చూడలేరు. నా బోధల్ని నిజంగా అనుసరించేవారు- నన్ను దర్శించగలరు.

"నా మరణానంతరం ధర్మమే, మీ గురువు. మీరు దాన్ని అనుసరించండి. నాకు రహస్యబోధ అంటూ ఏమీలేదు. నా బోధలోని గూఢార్థాలు ఏమీలేవు. అందులో అంతా స్పష్టం. అంతా బహిరంగంగా వుంది. సహజంగా వుంది.

"నా ప్రియమైన శిష్యుల్లారా, ఇవే చివరి క్షణాలు. స్వల్ప కాలంలో నేను నిర్యాణం చెందుతాను. ఇదే నేను ఇచ్చే చివరి ఉపదేశం," అన్నాడు బుద్ధుడు.

తాను ఇచ్చిన భిక్షవల్ల బుద్ధుని ఆరోగ్యం మరింత ప్రమాద స్థితికి గురైనదని తెలుసుకుని చందుడు-దుఃఖిస్తోవుంటే -బుద్ధుడు, ఆనందుని పిలిచి, "నేను మరణించిన తర్వాత చందునితో చెప్పు-రాబోయే జన్మలో అతనికి గొప్ప ఫలం లభిస్తుంది," అని. ఎందుకంటే, అతను పెట్టిన భోజనం తిన్న తర్వాత నేను జన్మరాహిత్యాన్ని పొందుతున్నాను కనుక. ఈ మాటలు నావిగా అతనికి చెప్పు.

బుద్ధుడు మహాసమాధి కావడానికి సమయం సమీపించే కొద్దీ-ఆనందునిలో ఆందోళన-బాధ ఎక్కువైంది. అది భరించలేక అతడు పక్కకు తిరిగి-కన్నీరుపెట్టి దుఃఖిస్తోవుంటే, బుద్ధుడు పిలిచి, చూడు,

ఆనంద్! శుభకరమైన ఈ క్షణంలో నువ్వు దుఃఖించడం సరైన పద్ధతికాదు. వియోగం అనివార్యం-ప్రపంచంలోని వస్తు జాలమంతా మన్నో నిర్మాణమే, చివరికి ఈ నా దేహం-రోగభూయిష్టమైన శరీరం చేరింది. ఏదో పొందాలి, ఏదో సాధించాలి-మనం మారాలి," అనే భవిష్యత్కాల ఆలోచనలు-వాంఛలు ఏవీ నాలో లేవు. అనంతమూ, అపరిమితమూ అయిన దుఃఖం-బాధ నుంచి బైటపడ్డాను. ఇటు వంటి సమయంలో నన్ను చూసి-బాధపడి-విచారించడమా? దుఃఖిం చేందుకు ఇది సమయం కాదు.

"బహు సుఖలాలసవంతమైన ఈ ప్రపంచంలో రాత్రింబవళ్ళు అహాన్ని వెంబడించి-సత్యాన్వేషణ చేస్తో తిరిగాను. ఎందుకొమ్మల్ని విరుచుకుంటో-ముళ్ళ పొదల్ని కాల్చు కుంటో-వాడి రాళ్ళను నెట్టుకుంటో తిరిగాను. జీవనదుల వంటి అనేక శాస్త్రాల్ని అధ్య యనం చేశాను. యోగపద్ధతుల్ని-సాధనా విధానాల్ని అనుసరిం చాను, అనుష్ఠించాను. ఆచరించాను. చివరికి ఉన్నత పర్వత శిఖ రాన్ని అధిరోహించాను."

"కాని ఇప్పుడు - నా దేహంలో దారుఢ్యం తగ్గిపోయింది. నాలో జీవశక్తి అంతరించింది. నేను బాగా అలసిపోయాను, శారీర కంగా. నేనే కాదు-ప్రతిదీ-అన్నీ-అంతా చివరికి చెడిపోవడం-పడి పోవడం-నాశనం కావడం తప్పదు."

"నేను మొదట్లో అహాన్ని అందుకోలేక పోయాను. చివరికి ఒకనది ఒడ్డున-చెట్టునీడన-అహం జాడ గుర్తించాను. ఎండుటాకుల కింద-గుర్తులు కనుపించాయి. అప్పుడు-అగాధలోయల గర్భాల లోనూ,-పర్వత శిఖరాలమీదా-దాని వాణి విన్నాను. కోయిల కూతలు మధురంగా వున్నాయి. సూర్యకిరణాలు వేడిగా, తీక్ష ణంగా వున్నాయి. గాలి-ఆహ్లాదంగా వుంది. దయార్ద్ర హృద యంతో గరిక ఊగుతోంది.

"నా మనసును ప్రశాంతంగా వుంచుకోవడానికిగాని, అనవసరమైన ఆలోచనలను ఫలవంతం చేసుకోవాలనిగాని-నాకు నేనుగా ఎప్పుడూ ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. నా మనస్సును ప్రత్యేకంగా ఎప్పుడూ - ఏ ఒక్కదానిమీదో కేంద్రీకరించలేదు. దాన్ని ఏకాగ్రం చేయవలసిన అవసరం నాకు కనుపించలేదు. త్రికాలాలను స్వేచ్ఛగ అధిగమించి,- సుఖంగా నిద్రపోయాను. చల్లని సమీరం స్వచ్ఛమైన చంద్రుడు, నాకు సన్నిహితంగా వున్నాయి."

"నా బోధలు-సాధనచేసి, ఎవరికి వారు ఆ అనుభూతిని పొందాలి. ఆ పరమ సత్యాన్ని తెలుసుకోవాలి. దాని గురించిన తర్కాలు, తగాదాలు వృథా, వ్యర్థం. సత్యాన్ని కనుక్కోవడానికి విచక్షణా మార్గాన్ని అనుసరించాలి. దాన్ని ఉపయోగించుకోవాలి. దానికి పరిశీలన-హేతువాదం అవసరం. లక్ష్యసాధనలో అప్రమత్తులుగా వుండండి.

"ఆలోచన కల్పించే ఎటువంటి విషయానికీ ఎంత మాత్రం ప్రాముఖ్యం ఇవ్వవద్దు. ఇంద్రియాతీత విషయాల గురించి యోచించి, కాలం వృథా చేయడం కన్నా, తమను తాము తెలుసుకోవడం ఉత్తమం."

"తెలుసుకోవడానికి, అసలు ఏమీ లేదని తెలుసుకోవడమే నిజంగా తెలుసుకోవడం- "నేను" అనే వ్యక్తి ఎప్పుడూ నిజంగా లేదు. "నేను" అనేది లేనప్పుడు- "నాది-నీది" అనేదీ వుండదు. వాస్తవంగా- "సమస్త జీవకోటి" అంటూ ఏమీ లేదు. పట్టుకోవడానికి ఎటువంటి ఆధారమూ లేదు. ఆధారపడటానికి వీలులేని నిగూఢమైన దాన్ని తెలుసుకోవాలనే కుతూహలం వున్నవారికే తగు శిక్షణ అవసరం.

అసలు వుందో-లేదో తెలియకుండా, వుంటే, ఎక్కడ, ఏ విధంగా వుంది? అసలు అది ఏ విధంగా నిర్మాణమై వుంది? అది-

ఏమిటో ఏమీ తెలియని దాని గురించి యోచించి-సాధించ యత్నించ డం ఎలా వుంటుందంటే - నాలుగురోడ్ల మధ్య నిలబడి-ఆకాశంలో ఎక్కడో - ఒక భవనం ఉందనుకుని-ఆ భవనానికి మెట్లు-నాలుగు రోడ్ల మధ్యలో వున్నాయనుకునే వారితో, శ్రుతి ప్రమాణం అను సరించి-సత్యాన్ని నమ్మి-తద్దైక్యం కొరకు ప్రయత్నించడమూ,- వేదాలు ప్రమాణమని-వాటిపై ఆధారపడి-సత్యాన్ని స్థాపించ చూడ డంవలె వుంటుంది.

"నా సాధనలో అహాన్ని అన్వేషించాను. అది-ఎటువంటి విషయంలోనూ - ఎక్కడా కనుపించలేదు. కాని, చివరికి దాన్ని- తీవ్రంగా వెదకి పట్టుకున్నాను. దాని సంగతి పూర్తిగా తెలుసు కున్నాను. దాని శక్తి-సామర్థ్యాలు అపారం. దానికి ఉచ్చువేసి వుంచాను. దాన్ని మచ్చిక చేసుకున్నాను. అప్పుడు నా మనసు నిలిచింది. నా దృష్టి, ఏకాగ్రమైంది. అహం, సాధువైంది. క్రమంగా అది నా చేతిలో కీలు బొమ్మ అయింది. దాన్ని-దాని మూలస్థానం పై పుతిప్పాను. అది-నెమ్మదిగా హృదయకుహరమధ్య స్థానం-అదే- దాని మూలస్థానం చేరుకుంది. అప్పుడు అంతటా ఆనందమే ఆవరించి వుంది. నా కళ్ళముందు మహాశూన్యం-ఏర్పడింది. అదే, ఆనంద బంధురశూన్యం.

"చూడు, ఆనంద్! వ్యక్తిగతమైన ప్రతిఒక్కటీ నశిస్తుంది. ఈ పదార్థ ప్రపంచం పెరిగి, విరుగుతుంది. అది, దాని సహజ లక్షణం. ఏది శాశ్వతమో-ఏది సత్యమో దాన్ని తెలుసుకునేందుకు సాధన చెయ్యి. సర్వం విసర్జించిననాడే సమస్తం పొందగలవు. తనను తాను స్వాధీనపరచుకున్నవాడే (స్వేచ్ఛా పరుడు.) స్వతంత్రుడు.

"నేను చెప్పిన సత్యంలో విశ్వాసముంచి ధ్యానం చెయ్యి. దానిగురించి సంపూర్ణ అధికారం కలిగివుండు. దానిగురించి తీవ్రంగా శ్రద్ధగా, నిజంగా యోచన చెయ్యి, దాన్నే సాధనగా తీసుకో,

దాన్ని అంకటూ- అన్ని కాలాల్లో వ్యాప్తి చెయ్యి. దానికి స్థిర నిశ్చయం - మనోబలం - మనోనిగ్రహం - పరీక్ష- పరిశీలన - పరిశోధన అవసరం.

"విషయ వాసనలనుంచి విరమణవల్ల మనసు నిర్మలం- నిశ్చలం అవుతుంది. దానికి అష్టాంగ మార్గమే శరణ్యం - సమస్తాన్ని అవగాహన చేసుకుంటూ ధర్మమార్గంలో నడు. పాపానికి వ్యతిరేకంగా నిలబడు. విముక్తికోసం, నిజంగా- శ్రద్ధగా అన్వేషించు- నీ చీకటిని నువ్వే పారద్రోలుకునేందుకూ, నీ సంరక్షణ బాధ్యత నీకు నువ్వే స్వయంగా తీసుకునేందుకూ - నీకు నువ్వే జ్యోతిగా నిలిచి వెలిగేందుకూ, నిన్ను నీవు విస్మరించుకుని - వైట ఎటువంటి దానితోనూ, ఎటువంటి సంబంధం పెట్టుకోకు. దేన్ని ఆశ్రయించవద్దు- అనుసరించవద్దు- అనుకరించవద్దు. నీలోనే ఆ, ఆశ్రయమో- రక్షణో చేసుకో- నిన్ను మినహా మరెవరినీ దేనినీ- దేనికి ఎప్పుడూ- లక్ష్యంగా పెట్టుకోకు... అదే సరైన మార్గం.

"తనను తాను తెలుసుకుంటే, ఇంక తెలుసుకోవలసింది ఏమీ వుండదు. తనని తాను తెలుసుకోక- ఎన్ని విషయాలు తెలుసుకున్నా- ఏమీ ప్రయోజనం లేదు. ప్రవర్తన వినయంగా వుండేకొద్దీ మేలు అధికంగా, బహుముఖంగా వుంటుంది. దానికి సోమరితనం కూడదు కాలం, వృధాచేయకూడదు. వర్తమానంలో జీవించాలి.

"అజ్ఞానంవల్ల నేను - నాది" అనే అభిమానం— మమకారం వల్ల కామ, క్రోదాదులు కలుగుతాయి. వాటివల్ల అనేక కర్మలు జరుగుతాయి - దానితో దేహ సంబంధం. తత్ఫలితంగా అనేక జన్మలు ఎత్తవలసి వుంటుంది. అహాన్ని శాశ్వతంగా నిర్మూలించి— శాశ్వతానందాన్ని వికసింపజేసుకోవాలి.

"ఆలోచనారహిత స్థితే ప్రశాంతస్థితి. అదే నిజస్థితి. అది చాలా సున్నితం. దానికి జనన-మరణాలు లేవు. దాన్ని ఎట్టి పరి

స్థితులలోనూ మరపకూడదు. నీలోకి నీవు లోతుగా మునిగి- అందు దాగివున్న మహదైశ్వర్యాన్ని హస్తగతం చేసుకుని హృదయాన్ని విశాలపరచి- భవబంధాలను తెగనరికి, మహదానందంలో ఓలలాడు.

ఊరికే ఉండు. అంటే, ఆశ- ప్రయత్నం లేకుండా ఉండు. అహం నాశనం కావడం- మోక్షంమీద మోజు లేకపోవడం- పవిత్ర జీవనానికి గుర్తు.

నువ్వు ఎక్కడ ఎట్లా ఉన్నావో — అక్కడనుంచే విచారణ ప్రారంభించు- ఆ సాధనలో వాంఛా రహిత స్థితిని అందుకుని- కర్మాచరణ నిమగ్నుడవు కావాలి. ఏదీ అంటకుండా— నిష్కర్ముడవుగా ఉండు. అదే సముచితం-శాంతం- నిశ్చలం- నిర్మలం. అది- అన్ని వాంఛలూ అణగిన మనోస్థితి. ఆ స్థితిపరుడే జ్ఞాని. ఆ జ్ఞాని చేసే పనులు నిస్వార్థంగా- ప్రేమగా— కరుణతో- దయతో నిండి ఉంటాయి. అతడు సర్వజీవులపట్ల భేదభావం పాటించక- సమదృష్టి కలిగి ఉంటాడు. ఏంచేసినా- పరిపూర్ణమైన ఆయన నిశ్చలత్వాన్ని కలత చెందించవు. ఆ స్థితి- కొందరికి అప్పుడప్పుడూ కలగవచ్చు. కొందరికి స్థిరంగా ఉండవచ్చు. ఆ స్థితిని అందుకున్నవారిలో, కోర్కెలు నామరూపం లేకుండా పూర్తిగా అణగిపోతాయి," అన్నాడు బుద్ధుడు.

దీర్ఘోపన్యాసానంతరం బుద్ధుడు మౌనంగా, గంభీరంగా ఉన్న సమయంలో- "బుద్ధుని పరినిర్వాణ ఘడియలు సమీపిస్తోఉంటే- దూరదూరాల నుంచి ఎందరో అభిమానులు- అనుచరులు-సాధువులు- సన్యాసులు- భిక్షువులు- సామాన్యప్రజానీకం- వచ్చి—చూసి- వెడుతూ ఉంటే— ఆత్మదత్తుడు దగ్గరలో ఉండికూడా రాలేదనీ- అతని అవిధేయతను- నిర్లక్ష్యాన్ని ఆశ్చర్యంగా చెప్పుకోవడం విని- "నన్ను ఆరాధించేవాళ్ళు— గౌరవించే వాళ్ళు ఆత్మదత్తుని లాగ మెలగాలి. రోజూ నా దర్శనానికి వచ్చి- సాష్టాంగనమస్కారం చేసి— వెళ్ళడం- నన్ను ఆరాధించినట్లు కాదు. నన్ను గౌరవించినట్లూకాదు. ధర్మాన్ని

అనుష్ఠించడమే- నన్ను ఆరాధించడం, గౌరవించడం," అని- ఆ "అన్యవిషయాలు- అవి ఎంత గొప్పవి అయినా- వాటికోసం సత్యాన్ని- ధర్మాన్ని నిర్లక్ష్యం చేయకూడదు. కనుక సత్యాన్ని సాధించడానికే సర్వప్రయత్నాలు చేయాలి," అన్నారు.

బుద్ధుడు అవసానదశలో ఉండికూడా ఎన్నో సత్యాలు - సంగతులు — స్పష్టంగా- సక్రమంగా- సరిగ్గా చెప్పాడు. ఆ రోజు రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత, కుశినగరం నుంచి పరివ్రాజకు డైన- "సుభద్రుడు" అనే ఒక బ్రాహ్మణ పండితుడు- వేదాంత శాస్త్ర వేత్త- బుద్ధుని దర్శనార్థం వచ్చి- తనకేవో సంశయాలు ఉన్నాయని- వాటి నివృత్తికై బుద్ధుణ్ణి అడగాలనుకున్నాడు. ఆనంద్ అతని సంగతి తెలుసుకుని, "ఇది సమయం కాదు. తథాగతులు నిష్క్రమణ స్థితిలో ఉన్నారు," అన్నాడు. దానికతడు "బుద్ధుడే నా సందేహం నివృత్తి చేయగల భాస్కరుడని వచ్చాను." అన్నాడు. బుద్ధుడు వారి సంభాషణ విని- ఆనందుని పిలిచి, "అతనెవరో జ్ఞానార్థియై వచ్చాడు. అతన్ని నా దగ్గరకు తీసుకురా," అన్నారు. సుభద్రుడు బుద్ధుని దగ్గ రకువెళ్ళి సాష్టాంగనమస్కారంచేసి, ఎంతో మాట్లాడి—చివరికి తర్కం లోకి దిగి, "ఎందరో సాధకులు- సిద్ధులు— మహాత్ములు- ఉన్నారు. వారిలో గోశాలుణ్ణి- అజితకేశకంబళిని- సంజయుణ్ణి పూర్ణకాశ్యపుణ్ణి- మొదలైనవారిని చూశాను. విన్నాను. వారంతా సత్యాన్ని తెలుసు కున్నవారా?" అని అడిగాడు. దానికి బుద్ధుడు- అటువంటి సంగ తులు, సంశయాలు నిరర్థకాలు. అటువంటి జిజ్ఞాస అనవసరం. వారందరి సంగతీ మీకెందుకు? మీ సంగతి మీరు చూసుకుంటే, ఎన్ని సిద్ధాంతాలు, వ్యవహార శైలిభేదాలు ఎన్నివున్నా ఫరవాలేదు. నేను మీకు ధర్మాన్ని బోధిస్తాను. విని- దాన్ని జ్ఞప్తిలో ఉంచు కోండి," అన్నారు. అయినా సుభద్రుడు పట్టువిడవలేదు- తర్కం మానలేదు. ఆయన ధోరణి గమనించి- "వాదోపవాదాలు నిరర్థకాలు. ఆకాశంలో ఏ చిహ్నమూ లేదు. బాహ్యచిహ్నాలచే మానవుడు- శ్రమణుడు కాజాలడు. సౌశీల్య పథాన్ని విస్మరించిన మతం— మనిషి ముక్తిని పొందలేరు," అని-పరమపవిత్రతతో ఆరంభమైన ప్రేమలో

లీనమయ్యే అష్టాంగమార్గంతోనూ-చతుర్విధ సత్యాలతోనూ కూడిన ధర్మాన్ని బోధించి - ఎక్కడైతే — ఈ అష్టాంగ మార్గం ఆచరింపబడుతుందో— ఆ చోట మీరు నిజమైన సత్యసందర్శకుణ్ణి చూస్తారు," అన్నాడు బుద్ధుడు, అని, "తమ సంకల్పాన్ని ఏవిధంగా అభ్యాసం చేసుకోవాలో- ఏవిధంగా సాధన చేయాలో - తమను తాము ఏ విధంగా నిగ్రహించుకోవాలో - మెరుగుపరచుకోవాలో - ఎట్లా అభివృద్ధి పరచుకోవాలో - అసలు తమను తామెట్లా తెలుసుకోవాలో ఆ విధానంలో చాలా గట్టిదైన- ఉన్నతమైన పద్ధతుల్ని - మార్గాల్ని - విధానాల్ని-అవకాశాల్ని బోధించాడు. కాలాన్ని వృథా చేయవద్దని హెచ్చరించాడు; ముఖ్యం- అల్పం — స్వల్పం - జటిలం - అతీతం - అముఖ్యం అయిన విషయాలతో. పవిత్రజీవనంతో - భూతదయతో అష్టాంగమార్గాన్ని అనుసరించినవారికి సద్యోముక్తి లభించునన్నారు. కనుక పరిణామస్థితిలో ఉండే ప్రకృతితో సహకరించండి. దాని శక్తిని అనుసరించండి. దాని శాసనాన్ని పాటించండి. తద్వారా లాభం పొందండి. ఇతరులకూ సహాయపడండి,"అన్నాడు బ్రాహ్మణ పండితుడైన ఆ సుభద్రుడు బుద్ధుని బోధలు శ్రద్ధగా విని జ్ఞాన రసాస్వాదన చేసి- త్రిరత్నాల్ని త్రిశరణాల్ని ఆశ్రయించి - బౌద్ధం స్వీకరించి పరమానందభరితుడై వెళ్ళాడు.

ఆ తర్వాత బుద్ధుడు ఆనందుని పిలిచి-సుభద్రునికి దీక్ష ఇవ్వమన్నారు. బుద్ధుని జీవితంలో దీక్ష తీసుకున్నవారిలో సుభద్రుడు చివరివాడు. మొదటివారు— కౌండిన్యులవారు - ఆయన నలుగురు శిష్యులు.

సుభద్రుడు వెళ్ళిన తర్వాత ఆనందునితో వయోభారంతో వున్నాను. ఈ దేహం అరిగిపోయిన బండివలె వుంది. బాగా అలసిపోయాను. నువ్వు ఎంతో ప్రేమతో సేవచేశావు. చాలా సంతోషం విషయేంద్రియ ఆకర్షణనుంచీ-అవిద్యామోహం నుంచి విముక్తుడవు కమ్ము," అని సలహా ఇచ్చారు.

"గురువుగారు వెళ్ళి పోతున్నారు. ఇంక మనకు బోధించే వారెవరూ ఉండరు," అని అనుకోవద్దు, ఆనంద్! నేను వెళ్ళి పోయినా- ఇంతకాలం నేనేం చెప్పానో - ఏం ప్రచారంచేసి బోధించానో-ఎట్లా ప్రవర్తించానో-అదే మీ గురువు గురు వచనమే గురువు కాని, దేహం గురువుగాదు.

గురువుగారు చనిపోతున్నారని ఆనంద్ ఇంకా ఏడుస్తో ఉంటే-"జన్మతో పాటే మృత్యు బీజాలు అంకురిస్తాయి. పుట్టినది-గిట్టక తప్పదు. ఇంక నువ్వు నిజాయితీగా సాధనచెయ్యి. త్వరలో సమస్త భ్రాంతుల నుంచి నువ్వు బయట పడతావు," అన్నారు.

"బౌద్ధ సంఘానికి ఏదైనా-ప్రత్యేకంగా ఒక సందేశం ఇవ్వకుండా గురువుగారు మహాసమాధి కాకూడదు," అని వేడుకున్నాడు, ఆనంద్. దానికి-తనను తాను చూపుకుంటూ, "అలంకరించిన ఈ విగ్రహాన్ని చూడు! గాయపడి-రోగ భూయిష్టమైన దేహం- అది ఆలోచనా మయం. అది నిలకడలేని శరీరం. రక్తమాంసాలతో పూత పెట్టబడిన ఎముకలగూడు. ఈ దేహం-ఒక కోట వంటిది. ఈ దేహం దేశాలు తిరిగి అలసిపోయింది. అరిగిపోయింది. మనసు వాంఛారహితమై- మహా నిర్వాణ పథంలో ఉంది. ఈ దేహం ముఖ్యంకాదు. ధర్మం, ముఖ్యం-అదే నీ గురువు, దేహంకాదు. అది హృదయంలో వెలుగు నేను వెళ్ళిపోయినా-మిమ్మల్ని మీరు నిజంగా, శ్రద్ధగా తెలుసుకోండి," అన్నారు. అని, "సంఘం - అది ఇంకా నా నుంచి ఏం కోరుతోంది? సత్యాన్ని బహిరంగంగా బోధించాను. మీకు చెప్పకుండా నేనేమీ మిగల్చలేదు, దాచలేదు. నేను వృద్ధుడనయ్యాను. నా యాత్ర ముగిసింది. నాకు ఎనభై ఏళ్ళు నిండాయి. దేహం శుష్కించింది. ఇంక మీకు మీరు జ్యోతులుగా వెలగండి. బైట దేన్ని శరణు జొచ్చకండి. నా శిష్యుల్లారా, నా బోధలోకాని, ధర్మంలోకాని, సాధన విషయంలోకాని-ఇంకా ఏమైనా సంశయాలు ఉంటే అడగండి. తర్వాత అనవసరంగా ఆలోచిస్తో, పశ్చాత్తాపపడ

కండి. ముఖాముఖిని అడగలేకపోతిమే అని-ఆ తర్వాత విచారపడ కండి," అన్నారు.

శిష్యులెవరూ మాట్లాడలేదు. అది చూసి, "నా మీద మీకు చాలా గౌరవం కదూ? అందువల్లనే నన్ను ప్రశ్నించలేకుండా ఉన్నారు. లేదా, మరొకరి చేతనైనా నన్ను అడిగించండి, మీకు అవసరమైన సంగతి గురించి," అన్నా కూడా ఎవరూ మౌనం వీడ లేదు. ఆనంద్ కొంతసేపు నిదానించి, "గురూజీ ఈ సమావేశం-ఈ సంగతి-ఈ సంఘటన-ఈ సన్నివేశం-మీరూ, మేమూ అంతా-ఇదంతా బౌద్ధం గురించీ, సంఘం గురించీ, సాధన గురించీ ఎవరి లోనూ కించెత్తు సంశయంలేదు," అన్నాడు.

"నిజం చెప్పావు ఆనంద్! శిష్యులారా, నేనిప్పుడు మరొక సారి గట్టిగా చెపుతున్నాను, వినండి విభాగమైనవన్నీ, మార్పు చెందేవే! మిశ్రమ పదార్థాలు నాశనమౌతాయి. విముక్తి కోసం శ్రద్ధగా సాధన చెయ్యండి. శ్రమించండి. జనన, మరణవలయం నుంచి విముక్తి పొంది, నిర్వాణపథం పొందమని బౌద్ధం బోధిస్తుంది. నిర్వాణం బౌద్ధుల జీవితలక్ష్యం-అదే, అంతిమ శాంతి, ఆనందం.

"తామరపువ్వు నీళ్ళలో తడవనట్లు, నిర్వాణం-ప్రపంచ మాలిన్యంవల్ల మరకపడదు-మచ్చాపడదు. శీతలోదకం-దప్పి కను తీర్చి, సేదదీర్చి-శాంతిని ఇచ్చునట్లు-నిర్వాణం వాంఛను, తృష్ణను పోగొడుతుంది. ఔషధాలు, రోగాల్ని నయంచేసి, ఆరోగ్యాన్ని ఇచ్చునట్లు, నిర్వాణం అన్ని బాధల, కష్టాల, దుఃఖాల, విచారాల నుంచి ఉపశమనాన్ని ఇస్తుంది. ఆకాశానికి ఆద్యంతాలు లేనట్లు-చావు, పుట్టుకలులేనట్లు-జయింప శక్యం కానట్లు-దొంగిలించ వీలు కానట్లు-నిర్వాణమూ దేనివల్లా ఏమీ కాదు. పర్వత శిఖరం అధి రోహించ శక్యం కానట్లు-గంభీరం, మహత్తరం అయినట్లు-నిర్వాణం ఉన్నతం. అది అందుకో శక్యం కానిది." అన్నాడు బుద్ధుడు.

బుద్ధుడు అడవి మధ్య ఆ విధంగా దిక్కుమాలిన చావు చావ దంకాదు. రాజగృహ-కాశి వంటి మహానగరాల్లో అయితే భక్తులు,

అనుచరులు, సాధువులు, సన్యాసులు-శిష్యులు, భిక్షువులు, రాజులు, పండితులు-ఎంతోమంది సామాన్యజనం ఉండేవారు. వారంతా తమ గురువుగారి అంతిమయాత్రలో పాల్గొనేవారు, అని ఆనంద్ మనసులో అనుకున్నాడో-లేదో, "ఆనంద్! నువ్వు త్వరగా కూసి నారా వెళ్ళి-అక్కడి ప్రజలకు చెప్పు - తథాగతులు నిర్వాణం కాబోతున్నారని."

ఆనంద్ కూసినార వెళ్ళి, ఆ వార్త అక్కడి ప్రజలకు చెప్పాడు. ఆ ప్రజలంతా ఆ రాత్రికి రాత్రి వచ్చి - బుద్ధుని దర్శించారు. మాళ్వరాజులందరూ భార్యా - పిల్లలతో - పరివారంతో వచ్చారు.

ఆ రోజు రాత్రి-మూడు జాములు గడిచాయి. అప్పుడు బుద్ధుడు ఆనందుని పిలిచి, "తన తర్వాత తనచే నిర్దేశింపబడిన ధర్మమే-గురుస్థానాన్ని ఆక్రమించుకుంటుంది," అని చెప్పి-"ఇంకా ఏమైనా సంశయాలు ఉంటే ఇప్పుడే అడగండి" అని-మళ్ళా అడిగారు. అక్కడ చేరిన వారందరివంకా-ప్రేమగా, దయగా చూశారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా తలలు వొంచి నిలబడ్డారు. వాళ్ళను చూసి, "దుఃఖించకండి. మీకు మీరే జ్యోతులుగా వెలగండి. వెలిగి-ఆ కాంతిలో ప్రయాణం చేయండి. బైట దేనినుంచీ-ఎవరినుంచీ-ఎందుకూ, ఎటువంటి సహాయం కోసం, రక్షణకోసం-ఎదురు చూడక-సత్యాన్నే తీసుకోండి.

"గతంలో చదివిన-విన్న-చూసిన—ఊహించిన, భావించిన, ఆలోచించిన-అనుభవించిన — వాటిని ఆధారంగా తీసుకోకండి. ఉన్నత పథానికి చేరుస్తాయనే నమ్మకంతో సాంప్రదాయాల్ని పాటించకండి. గ్రంథాల్లో రాశారనీ-ఎవరో-గురువో - మహాత్ముడో చెప్పారనీ గుడ్డిగా దేనినీ అనుసరించకండి - ఆచరించకండి- అనుకరించకండి—కాని, మీ అంతర్వాణి మాట తూ.చ. తప్పకుండా పాటించండి. దృష్టి మార్చుకుని అంతర్ముఖులై మిమ్మల్ని మీరు తెలుసుకోండి.

"నేనే మొదటి-చివరి బుద్ధుణ్ణి కాను. శాశ్వతమైన సత్యాన్ని బోధించడానికి ఎప్పుడూ మహాత్ములు అవతరిస్తారు. నా తర్వాత మైత్రేయులు రాబోతున్నారు. మైత్రేయ అంటే, "దయ," "కరుణ" అని అర్థం.

బుద్ధుడు పక్క మీదనుంచి లేచి-"సంఘాత వస్తుజాల మంతా నశించేదే. శ్రద్ధావంతులై తమను తాము తెలుసుకుని - నిర్వాణసిద్ధికి ప్రయత్నించండి, నా బోధల్లో ఇంకా సందేహాలు సంశయాలు- అనుమానాలు ఉంటే, ఇప్పుడే అడగండి," అని మూడోసారి అడిగారు. ఎవరూ ఏమీ మాట్లాడకపోయేప్పటికి-"కార్య - కారణ సంబంధమైన వస్తన్నీ నశిస్తాయి. మీరు శ్రద్ధగా సాధన చేయండి. మీ గురువు మీకంటే అధికులు అనుకోకండి - గురుదేహం, గురువుకాదు. గురు వచనమే గురువు, "అని-ఆనందునివేపు తిరిగి – "నీ ప్రయత్నంలో – సాధనలో-అతిమెలకువతో, జాగరూకుడవై మెలగు. ఇంద్రియాలు– దేహం-వ్యక్తిత్వం - భ్రాంతి, అవిద్యలనుంచి జాగ్రత్త పడ్డావా, నువ్వు తప్పక నిర్వాణస్థితికి చేరుకుంటావు. అవాస్తవాన్ని - వాస్తవంగా, తీసుకుని ఎంత సాధనచేసినా- ఎన్నాళ్ళు తపస్సు, ధ్యానం చేసినా, భవబంధాలనుంచి- విషయ వాసనలనుంచి పైకి చెలరేగే - విజృంభించే, మత్తులనుంచి వ్యామోహాలనుంచి ఎవరూ విముక్తులు కాలేరు," అన్నారు. అని అవే-ఆయన ఆఖరు మాటలు ఆ తర్వాత తన మరణానంతరం ఆనందుని తీర్థయాత్రలకు వెళ్ళమని - తన దేహాన్ని అగ్నికి ఆహుతి చేయమని చెప్పారు. "అయితే అవశేషాలను ఏం చేయమంటారు?" అని అడిగితే - "ఆ సంగతి గృహస్థ భక్తుల ఇష్టానికి వదలు," అన్నారు.

నాల్గోజాము చివరిక్షణాల్లో - దీర్ఘోపన్యాసానంతరం బుద్ధుడు కొంతసేపు మౌనంగా విశ్రమించి-లోతైన ధ్యాన సమాధిలోకి వెళ్ళి- క్రమంగా ఆ ధ్యాన భూమికలను అతిక్రమించి - అపస్మారకస్థితిలోకి జారుకుని-నెమ్మదిగా–శాంతంగా-అజాతము- అ సంఘాతము అయిన నిర్వాణస్థితిని చేరుకుని–శాశ్వతంగా కన్నుమూశారు, అది-క్రీ.పూ.

483. వైశాఖ పూర్ణిమ-మంగళవారం భవకారిణి అయిన చిత్త జ్వాలోపశమనమే నిర్వాణం. అదే మహాపరినిర్వాణం.

అటువంటి మహాత్ముడు మరణించడమంటే - మొదటి మాన వుడు మరణించాడనిపిస్తుంది. ఆయన చరిత్ర—ఈ భూమి మీద ఒక ప్రేమ గీతంగా—ఒక జీవనది మాదిరిగా ఆ చంద్ర తారార్కం నిలిచి వుంటుంది.

అక్కడ చేరిన వారితో "మన గురుదేవులు గాఢధ్యాన నిష్ఠలో ప్రవేశించి-క్రమంగా దేహ సంబంధమైన విషయ జ్ఞానాన్ని విడిచి-చిత్తాన్ని నిర్వికల్ప సమాధిలో చేర్చి - ఆ తర్వాత దేహ త్యాగం చేశారు - గురువుగారు మహా పరినిర్వాణం చెందారు," అన్నాడు ఆనందుడు, అనిరుద్ధునితో పాటతడు, "ఆయన వెళ్ళి పోలేదు. ఆయన, దివ్యధామాన్ని చేరుకున్నారు," అన్నాడు, అని అక్కడ చేరి రోధించే వారందర్నీ ఓదార్చాడు.

"భౌతికమైన వస్తు నశిస్తాయి. నీ కోసం నువ్వే ప్రయాణం చేయవలసిఉంది. శ్రద్ధగా సాధన చేయాలి," అంటూ పరమానంద స్థితిలో శాశ్వతంగా కన్ను మూసిన తమ ప్రియతమ గురువు-మార్గ దర్శకుడు ఇంక లేరు. సదా తమను చూస్తూ, నడిపిస్తూ ఉండే జ్ఞాన నేత్రం శాశ్వతంగా మూతపడింది, "అంటూ నిలవలేని వాళ్ళు-ఏడ్చారు. విషయ వాసనలు పోనివాళ్ళు దుఃఖించారు. బుద్ధుని నిర్యాణ సమయానికి-అజాతశత్రువచ్చి - "నేనూ, బుద్ధుడు రా కుమారులం. నేను ఆయన్ని అనుసరించి-గౌరవించవలసిన బాధ్యత నాదిగా తీసుకుంటున్నాను," అన్నాడు పరితాపంతో. మగధ, వైశాలి, కపిలవస్తులనుంచి భిల్లులు - కోలియాసులు-ఇంకా అన్ని ప్రాంతాల ప్రజలు తమ ప్రియతమ గురువు చివరి దర్శనార్థం వచ్చారు. పరిమళ ద్రవ్యాలతో ఆ మునీంద్రుని అభిషేకించారు. పూలమాలతో అలంకరించారు.

ఆరు రోజులు భక్తి-శ్రద్ధలతో-నృత్య, గానాదులతో-వైభవంగా ఉత్సవాలు జరిపి-ఏడవరోజున-కూసినార వాసులు-బుద్ధుని శిష్యులు-

తక్కిన ప్రజలు, అనుచరులు, సాధువులు - సన్యాసులు - అందరూ కలసి ఆయన మృతదేహాన్ని స్నానం చేయించి-కొత్త బట్టల్లో చుట్టి-తైలంలో ముంచి - పూలమాలలతో కప్పి,-అలంకరించిన పాడిపై పడుకోబెట్టి సుగంధ ద్రవ్యాలు చల్లి-స్తుతి కీర్తనలతో-పాటలతో-నాట్యాలతో గొప్ప వేడుకగా - సంతోషంగా-ఆనందంగా "మకుట బందన" అనే ప్రదేశానికి తీసుకువెళ్ళి - చందన కాష్టంపై పడుకోబెట్టి-దహన సంస్కారాలు పూర్తిచేసే లోపల మహాకాశ్యపుడు శిష్యులతో వచ్చి-చివరి దర్శనం చేసుకున్నాడు. బుద్ధుని నామ కాయం దహించి పోతూంటే, ఆ క్షణంలో ఆయన మాటలు గుర్తు చేసుకున్నారు.

"ఇన్నేళ్ళూ నేనేం చెప్పానో, వాటి గురించి ఆలోచించి-గొడవ పడకండి. అంతకన్నా—నా నడవడిని గమనించండి. నేను చెప్పిన మాటల్ని మీకూ, నాకూ మధ్య నిలవనివ్వండి నా మౌనాన్ని అనుభవించండి. నా చుట్టూ వున్న శక్తి తరంగాల్ని తీసుకుని అనుభవించండి. అప్పుడు - నేనేం చెప్పానో-దాన్ని అర్థం చేసుకోగలరు. నేను, ఏం చెప్పానని కాదు, నేను ఎలా జీవించానో - దాన్ని అనుసరించి, అనుష్ఠించండి. అలా నడచుకోండి," అన్న ఆయన మాటలు గుర్తు చేసుకున్నారు.

పెద్దలైన కొందరు భిక్షువులు ఆనందుని ప్రశ్నించారు.

"ఇప్పుడు మీరు ఎట్లా వున్నారు?" అని.

దానికి ఆనందుడు "గురువుగారి విదేహముక్తితో పాటు నేనూ మరణించాను. ఇప్పుడు ఆయన నాలో సజీవులై వున్నారు. ఆయన కదిలించి-విడిచిన ధర్మచక్రాన్ని నేను మరింత వేగంగా కదిలించడానికి-ఆయన బోధల్ని మరింత తీవ్రంగా ప్రచారం చేయడానికి మిగిలి ఉన్నాను.

"సహాయం కోరిన వారికి సహాయం చేసేందుకు, ధర్మ ప్రచారం చేసి, బోధించేందుకూ అవసరమైనంతకాలం నేనూ ఈ దేహంలో ఉంటాను. ఆయన ధర్మం కోసం - బ్రతుకుతాను," అన్నాడు.

ఆయన అస్తికల్ని శిష్యులు సేకరించి - మల్లుల సభా భవనంలో ఉంచారు. వాటికోసం చుట్టు పక్కల రాజులందరూ వచ్చారు.

ఎనిమిదవ రోజున - అజాత శత్రు - వైశాలీ నగరరాజులు - కపిలవస్తు శాక్యులు - లిచ్ఛవులు - అత్త కప్ప బులియులు - రామగామ కొలియులు - పావామల్లులు కూసినారవాసులు వచ్చి - అస్తికల కోసం తగాదా పడ్డారు.

మల్లులు వారెవరికీ అస్తికలు ఇవ్వలేదు.

శాంతి సంబోధ మూర్తి అస్తికలకోసం - సమరం సిద్ధమైంది.

కూసినార రాజూ - ఆ దేశ ప్రజలు అస్తుల్ని ఎవరికీ ఇవ్వక పోయేప్పటికి యుద్ధానికి సిద్ధపడ్డారు, తక్కినవారు.

అంతలో - ద్రోణుడనే ఒక బ్రాహ్మణ పండితుడు వచ్చి, విషయం తెలుసుకుని, ఆ అస్తికల్ని తెలివిగా ఒక పాత్రతో ఎనిమిది భాగాలు చేసి - అర్హులైన వారికి ఒక్కొక్క భాగం ఇచ్చి- వాటిపై స్థూప నిర్మాణం చేయమని చెప్పి - బుద్ధుని జ్ఞాపకార్థం - అస్తికల్ని పంచిన పాత్రను తాను తీసుకున్నాడు-ద్రోణుడు.

అస్తికల్ని తీసుకు వెళ్ళినవారు - తమ తమ దేశాల్లో గొప్ప గొప్ప స్థూపాల్ని - ఆలయాల్ని నిర్మించారు.

కాష్టావశేషంపై - పిప్పిలి క్షత్రియులతో సహా పదిమంది స్థూప నిర్మాణం చేసి - మహావైభవంగా ఉత్సవం జరిపారు.

ప్రతి ఆలయంలో - ప్రతి స్థూపం ముందు రాజులు, ప్రజలు, బౌద్ధ భిక్షువులు, భక్తులు, అనుచరులు, సాధువులు - సన్యాసులు - సామాన్య ప్రజానీకం ఈ నాటికీ.

"బుద్ధం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి" అంటూ ముమ్మారు భక్తి శ్రద్ధలతో స్మరిస్తూ - ధర్మచక్రాన్ని తిప్పుతూనే వున్నారు.

* * *

బుద్ధుడు మహాపరినిర్వాణం చెందిన కొద్దిరోజుల తర్వాత ఆయన శిష్యులు, అనుచరులు, భిక్షువులు, కొందరు పెద్దలు కలసి బుద్ధుని బోధలు యథాతథంగా రూపొందించేందుకు ఒకచోట సమావేశమై, ఆ సమావేశానికి ఆనందుని ప్రవేశింపనీయక, సమావేశ స్థలానికి కొంతదూరంలో వేచి వుండవలనదిగా అతనిని ఆదేశించి, "మీరు బుద్ధునికి నీడలాగ సంవత్సరాల తరబడి సేవచేశారు కనుక, మీ అవసరముంటే, విషయ వివరణకు మిమ్మల్ని సభాస్థలికి పిలవవలసి ఉంటుంది కనుక, మీరు తప్పనిసరిగా సమావేశస్థలానికి బైట వేచి ఉండండి," అని చెప్పడంతో ఆనందుడు అభిమానపడి, అమాయకంగా చిన్నపిల్లవాని మాదిరిగా ఏడ్చి- ఏడ్చి- చివరకు అంతర్వీక్షణతో తనను తాను తెలుసుకుని, దుఃఖించడం మానేసి, ఆనందంగా ఉన్నాడు. ఆనంద తన్మయత్వంలో ఉన్న ఆనందుని చూసి, "ఇంత వరకు మీరు అర్హతను, బుద్ధత్వాన్ని పొందలేదు. ఇప్పుడు మీరు ఆ స్థితిని అందుకున్నారు గనుక, ఇంక మీరు సమావేశ స్థలానికి రావచ్చు," అన్నారు.

"అవును, అది నా పొరపాటు. గురువుగారు ఎన్నిసార్లు ఎంత గట్టిగా నొక్కిచెప్పినప్పటికీ నేనే అజ్ఞానంలో ఉండిపోయాను. సర్వ భూతాల్ని, సమస్త విషయాల్ని- దేన్ని దర్శించినా పాత అలవాటు ప్రకారం, ఆలోచించి, విషయీకరణ చేయక, 'సమస్తం సత్య స్వరూపంగా తెలుసుకోవడం మంచిది," అన్న గురువాక్యం ఇప్పుడే నాకు అర్థమైంది. నా అహంకారం పూర్తిగా నశించింది," అంటూ వారివెంట సభాస్థలికి వెళ్ళి, సమావేశమైన పెద్దల్ని ఉద్దేశించి, "బుద్ధుడంటే, జ్ఞానస్వరూపం. అటువంటి జ్ఞానం ఒక నిర్గుణరూపంలో బుద్ధునిగా ఈ లోకాన అవతరించింది. మనం ఆయన గురించి మాట్లాడినా, భావించినా, ఊహించినా— అది ఆయన అసలు రూపంకాదు. భౌతిక స్వరూపాన్నిబట్టిగాని, గుణ-గణాల్ని బట్టిగాని, బోధించిన ధర్మాన్ని బట్టిగాని ఆయన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించడం పొరపాటు. అవి ఏవీ అసలు బుద్ధుడు కాదు. భౌతిక పదార్థాలతో

పెంచి, పోషించేందుకు అదొక భౌతికదేహం కాదు. అది అసలు సత్.

సత్యం యొక్క సారమే, ధర్మకాయం, అదే ఆయన. ఆ ధర్మకాయం నుంచి అనంతంగా, అపారంగా, అపరిమితంగా దయ, ప్రేమ, కరుణ ప్రసరించి మానవాళి విముక్తికి దారితీసింది. ఆ దేహం ప్రాపంచిక తృష్ణ అంతమయ్యే వరకు చలించక, తడబడక, సంకోచించకుండా ఉంది.

అదే సంభోగకాయం. ప్రజల సంస్కార, స్వభావాల, సామర్థ్యాల, అర్హతల ప్రకారమే, జ్ఞానం ఆ దేహంలో దర్శనమిచ్చింది. అది అనారోగ్యం, వార్ధక్యం, మృత్యువువంటి సామాన్య మానవ దేహం వలె కాలధర్మాల్ని పాటించింది. అదే నిర్మాణకాయం. ఆ విధంగా ఆయన దేహం త్రివిధంగా పనిచేసింది.

జన్మించిన ఆ దేహం, ఆహారంతో, ఆరోగ్యవంతంగా, బలంగా ఉంది. అందున్న ప్రాణం- అదే, జీవం అనుభవంతో శక్తివంతం, తేజోవంతం అయింది. పదార్థం, శక్తి- ఒకదానికొకటి పరస్పర సంబంధం కలవి. ఒకటి ఉంటే, రెండవది ఉంటుంది. ఒకటి చావుంటే, రెండవది చావుంటుంది. పరిస్థితులవల్ల ఒకటి చెడితే, రెండవదీ చెడుతుంది. పరిస్థితులు మారితే రెండూ మారతాయి.

దేహం భూతాల సమ్మేళనం. అది, అశాశ్వతం. మనసు- అనేక కారణాల, నియమాల సమూహం. అది నిరంతరం చలిస్తూ, మార్పు చెందుతూ ఉంటుంది. అందుచేత నిత్యజీవితంలో- ఒక క్రమం, మనోనిగ్రహం, జ్ఞానం ఉండాలి. క్రమమంటే, కాలక్రమం. జీవుల అనంతప్రవాహం. ఆ ప్రవాహంలో జనన- మరణాలు, సుఖ, దుఃఖాలు ఆనంద- విషాదాలు అన్నీ ఉన్నాయి. ఆగకుండా అతి వేగంగా కదిలే ఆ ప్రవాహాన్ని - ఆ మహాకాల చక్రాన్ని ఎవరూ అడ్డగించలేరు. ఆపలేరు, ఎదిరించలేరు. కనుక మనం దేహాన్నీ-మనసునీ సక్రమంగా అదుపులో ఉంచుకోవాలి. మనోనిగ్రహమంటే, దురాశ- చెడు కోర్కెలు లేకుండా ఉండటం. జ్ఞానమంటే, సత్యాన్ని అవగాహన చేసుకోవడం. దానికి మార్గం, చతుస్సత్యాల్ని- అష్టాంగ

మార్గాన్ని అనుసరించడం.

మనం చేయవలసిన మొట్టమొదటి పని— దేహం విషయంలో - లోపల, బైట విషయాలకు- సంగతులకు, సంఘటనలకు — సమస్తానికి ఎరుకలో ఉండటం, కోట కాపలాదారుని మాదిరిగా లోపల— బైట ప్రమాదాలనుంచి దాన్ని కాపాడాలి, కాని, మనం సహజంగా బైట సంగతుల్నే ఆసక్తితో తెలుసుకోజూస్తాము. లోపలి సంగతులకు ప్రాముఖ్యత ఇవ్వకపోగా, నిర్లక్ష్యం చేస్తాం.

జ్ఞానం ఎప్పుడూ ఒక దివ్యకాంతిగా, గొప్పశక్తిగా దర్శన మిచ్చి మనల్ని మేల్కొల్పుతుంది. ఆ సత్యాన్ని గ్రహించి, భక్తి గౌరవాలతో దాన్ని అర్థం చేసుకుని, అనుష్ఠించి, ఆచరించువారే బుద్ధుణ్ణి అనుసరించగలరు. అంటే, బుద్ధుణ్ణి తెలుసుకునే మార్గమే తననుతాను తెలుసుకునే మార్గం.

మనోస్థితికి ఎరుకలో లేకపోవడమే, అజ్ఞానం. మన విజ్ఞాన మంతా అజ్ఞానానికే దారితీస్తుంది. ఆ అజ్ఞానం, దురాశరూపంలో అవతరించి, మానవమేధస్సునంతా ఆక్రమించడంచేత, జీవితం — భ్రాంతి, భావనతో సాగుతుంది. అదంతా మనోకల్పన. మనోసృష్టి కానిదేదీ లేదు ఈ ప్రపంచంలో. తాను కల్పించుకున్న భయాల, భ్రాంతుల అనుభవాల, జనన- మరణాలనుంచి, పరిస్థితుల - పరిసరాల నుంచి మనసు బైట పడలేదు, పడదు.

అనుభవంవల్ల అజ్ఞానం కరిగిపోదు. అనుభవం, అజ్ఞానానికి కొత్త అర్థాన్ని-కొత్త విలువను, కొత్త భ్రాంతిని, మాయను- కల్పించినా- అదీ అజ్ఞానమే. అది, ఇంకో రూపంలో తలెత్తుతుంది, అంతే! కోరిక- ఎంపిక లేనప్పుడే అజ్ఞానం తొలగుతుంది. భ్రాంతి లాగే జ్ఞానం కూడా మనసులోంచి పుట్టేదే. అజ్ఞానానికి, భ్రాంతికి భిన్నంగా- అన్యంగా- విడిచి జ్ఞానం లేదు. జ్ఞానాన్ని కూడా ఒక విషయంగా, వస్తువుగా చూడాలి. ఆ సంగతి తెలిసినవాడే, బుద్ధుణ్ణి దర్శించగలడు. అందుకే ఆయన అంటాడు, "ఈ నా దేహాన్ని చూసేవాడు, నన్ను చూడలేడు. నన్ను దర్శించి, తీసుకున్నవాడు నిజంగా నన్నే చూస్తాడు," అని - "నేను అట్లా అన్నానని మీరు

మీ దేహాల గురించి యోచించడం ఎప్పుడూ మానకండి. దాని కదలి కల్ని – మాలిన్యాన్ని - మనోగతాల్ని - నిరంతరం గమనించండి. దాని బాధా- సంతోషాలే దుఃఖకారణాలని తెలుసుకోండి. దేహం- అశాశ్వతం, అస్థిరం, క్షణభంగురం. అటువంటి దాని భ్రాంతుల్లో పడకండి. దాని కోర్కెల కోరల్లో చిక్కుకోకండి. కాని, నిరంతరం మీరు మీ గురించే ఆలోచించకండి," అని అన్నారు మన గురు దేవులు బుద్ధభగవానులు," అని ఆనందుడు తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.

*　　　*　　　*

జ్ఞానోదయానంతరం సిద్ధార్థుడు బుద్ధుడై, ధర్మప్రచారం నిమిత్తం సంచార గురువై, శిష్యులద్వారా ప్రపంచానికి పరిచయమై, జగద్గురువై, ఏనభై ఏళ్ళవరకై జీవించి - దాదాపు ఉత్తరభారత దేశ మంతా తిరిగి, బౌద్ధధర్మం బోధించినా అయన రాసిన గ్రంథమంటూ ఏమీలేదు.

ఆయన జీవితకాలంలో ఆయన శిష్యులు కాని, అనుచరులు కాని రాసిన జాడా లేదు. బుద్ధుని నామమేకాని, ఆయన రూపం- ఆయన సన్నిహితులు, అనుచరులు, శిష్యులు చెప్పిన గుర్తులు, పోలికలు, చిహ్నాలు ఆధారంగా చిత్రించినదే ఆయన రూపం అని పిస్తుంది. అందుచేతనే కాబోలు ఆరామాల్లో, గుహల్లో, దారిపక్క శిలలపై యోగముద్రలు, పాదాలు, చెట్లు మాత్రమే చెక్కారు.

మగధరాజైన బింబిసారుడు, కోసలరాజైన ప్రసేనజిత్తు- మొదలైనవారు బుద్ధుని గుర్తించి, ఆదరించి, అనుసరించి బౌద్ధ ధర్మ ప్రచారం చేశారు. అనాథ పిండకుడు - అమ్రపాలి, విశాఖ- జీవకుడు వంటి ధనవంతులు, వర్తకులు కానుకలు ఇచ్చి, ఆరామాలు కట్టించి, బౌద్ధ భిక్షువులకు ఆశ్రయమిచ్చి బౌద్ధధర్మ ప్రచా రానికి సహకరించారు. తమను తాము తెలుసుకునే యత్నంలో బౌద్ధ భిక్షువులు గృహ పరిత్యాగం చేశారేకాని, ప్రపంచాన్ని పరిత్య జించక, వివేకంతో వర్తించి–జీవించారు. బౌద్ధ ధర్మానికి కాగడాల

వంటి వారైన ఆ భిక్షువులు శిష్యులు, అనుచరులు, అభిమానులు బుద్ధుని ముఖతః విన్న సంగతుల్ని, తాము అవగాహన చేసుకున్న ధర్మాల్ని ఎరుకలో వుంచుకున్నారు. ఆ శుభవార్తల్ని ప్రజలకు బోధించారు. ఆ విధంగా బౌద్ధ ధర్మాలు ఆరామాల్లో, ప్రజల స్మృతి భాండాల్లో నిక్షిప్త నిధులుగా నిలిచి పోయాయి. స్వయం సాధన ద్వారా ధర్మాన్ని అనుష్ఠించి, అనుసరించడంచేత బుద్ధుని బోధలు యదాతథంగా, అనువంశికంగా, కంఠస్థంగా నిలిచి పోయాయి. ఆనాటి భిక్షువులు—శిష్యులు, అనుచరులు, అభిమానులు ఆ బోధల్లో ఇంకేమీ కలవకుండా జాగ్రత్తపడి, శ్రద్ధ తీసుకున్నారు. అందుచేత ఆ సంగతులు, ధర్మాలు స్వచ్ఛంగా వున్నాయి.

బుద్ధుని భావం, భాష సామాన్యులకు సహితం సులభంగా అర్థమయ్యేది. ఆయన బోధ క్లుప్తం-సూక్ష్మమైనది-సరైనది - సహజమైనది. నిత్య జీవిత సత్యాలకు సంబంధించినది. అది అందరికీ ఆమోదయోగ్యమైనది, ఆచరణీయమైనది. ఆ బోధల్ని ఆయన నిర్యాణానంతరం శిష్యులు, సంఘ సభ్యులు, భిక్షువులు, అనుచరులు ప్రచారంచేసి బోధించారు. కాని. అనుచర వర్గంలో వ్యతిరేక భావాలు, తలెత్తాయి. ఆయన బోధల్ని సమన్వయ పరచడానికి, బౌద్ధ మత విస్తరణకు - బౌద్ధ సూత్రాల క్రోడీకరణకు అనేక ప్రాంతాల, దేశాల పండితులు, మేధావులు, జిజ్ఞాసువులు, విజ్ఞులు, విద్యావేత్తలు, భిక్షువులు, శిష్యులు పూనుకున్నారు. వారితో పాటు ఐదువందలమంది బుద్ధుని అనుచరులు-సిద్ధహస్తులైన యతీంద్రులు, అరిషడ్వర్గాలను జయించిన మహాత్ములు-ముఖ్యం బౌద్ధ సూత్రాల్లో ఆరితేరినవారూ మగధరాజధాని రాజగృహాలో-అజాతశత్రు ఆధ్వర్యంలో, ఆదరణలో ఒక సభ ఏర్పాటు చేసి—ఉత్తమ పండితుడైన మహాకాశ్యపుని అధ్యక్షునిగా ఎనుకున్నారు. అదే మొదటి బౌద్ధ మహాసభ. ఆ సభకు "పంచశతిక" అని పేరు వచ్చింది; ఐదు వందలమంది బౌద్ధ భిక్షువులు హాజరు కావడంచేత.

అప్పటికి ప్రచారంలో ఉన్న బుద్ధుని బోధలను, సూత్రాలను, ధర్మాలను, క్రమశిక్షణలను, మార్గాన్ని ప్రమాణంగా పరిచేసి,

పరిశీలించి, పరీక్షించి, పరిశోధించి, సమీకరించి, అర్థయుక్తమైన, అవసరమైన వ్యాఖ్యలు చేసి, ఒక క్రమంలో గ్రంథస్థం చేయాలనే నిశ్చయంతో తత్వ విచార సంబంధమైన భావాల్ని వ్యక్త పరచమని ఆ సమావేశం కాశ్యపుని కోరింది. అలాగే బుద్ధుని శిష్యులలో వృద్ధుడు-అనుభవజ్ఞుడు, అగ్రగణ్యుడు-అయిన "ఉపాలి"ని శిక్షా సూత్రాల్ని-నియమాల్ని, ధర్మాల్ని చదవమని సంఘం కోరింది. ఆ తర్వాత సంచారకాలంలో బుద్ధుడు చెప్పిన సంగతుల్ని-విషయాల్ని-నీతి బోధల్ని-కథల్ని ప్రచారం నిమిత్తం చెప్పమని ఆనందుని కోరింది. ఆ సభలో ఆనందుడు, కాశ్యపుడు, ఉపాలి చెప్పిన సంగతుల్ని త్రిపిటకాలన్నారు. "పిటకం" అంటే "బుట్ట" అని అర్థం. ఆ త్రిపిటకాల ఆధారంగా ఆనాటి నుంచి ఈ నాటి వరకు-ప్రపంచ అన్ని దేశాల, జాతుల, భాషల, వర్గాలవారు-మేధావులు - పండితులు, విద్యావంతులు, సాధకులు అనేక రచనలు చేస్తూనే వున్నారు.

ఉపాలి చెప్పిన వినయ పిటకం క్రమశిక్షణతో నైతిక పరమైన సిద్ధాంతాలతో కూడినది. అందులో బుద్ధుని జీవిత చరిత్రతో పాటు - ప్రాచీన చరిత్ర - భారతీయుల ఆచార - వ్యవహారాలు, సాంప్రదాయాలు, అలవాట్లు కళలు, విజ్ఞానం-మొదలైనవి పరోక్షంగా వుంటే, బౌద్ధ సంఘంలోని మత గురువుల నియమ - నిబంధనలు ప్రత్యక్షంగా ఉన్నాయి. బౌద్ధమతానికి సంఘమే మార్గదర్శి- సంరక్షకురాలు. కనక, సంఘంలోని సభ్యులకు శిక్షణ ఇస్తారు. సన్యాసుల ఆశ్రమధర్మాలు - నియమాలు - అందు వివరించబడ్డాయి. అందులో నాలుగు ప్రధానమైన భాగాలున్నాయి — "పాటిమొక్ఖ-మహా-సుత్త విభంగ-ఖాండక-పరివార"-అవి.

ఆనందుడు చెప్పిన "స్తుతిపిటక"లో బుద్ధుడు చేసిన ప్రసంగాలు-సారిపుత్త, మగ్గల్లాన వంటి మేధా వంతులిచ్చిన ఉపన్యాసాలు-సూక్తులు- బుద్ధుని సుభాషితాయి ఉన్నాయి. ఇది ధ్యానమునకు సంబంధించినది. బుద్ధుని జీవితం, బోధలు కూడా అందుచోటు చేసుకున్నాయి. స్తుతి పిటకలో ఐదు భాగాలున్నాయి- బుద్ధుని బోధలు-ఉపన్యాసాలు-ప్రసంగాలు-సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న సిద్ధాం

తాలు-చర్చలు. వాటిని "నికాయ" అంటారు. అవి దిగనికాయ-మజ్జిమనికాయ - సంయుత్తనికాయ - అంగుత్తనికాయ - ఖుద్దాకనికాయ," అని ఐదు ఉన్నాయి.

కాశ్యపుని "అభిధమ్మ పిటక" ఆ మూడింటిలో ముఖ్యమైనది. ధర్మ వివరణతో కూడిన వేదాంత తత్త్వమంతా అందులో ఇమిడి ఉంది. ఆధ్యాత్మిక సంబంధమైన- అత్యున్నతమైన సిద్ధాంతాలతో, నిండివున్న గ్రంథరాజమది. అది కేవలం జ్ఞాన మార్గమేకాక, అతీత జ్ఞానానికి సంబంధించినది. పరిశోధకులకు, అది మార్గదర్శి. అది ఆలోచనలను రేకెత్తించేది కనుక, అది విజ్ఞానాత్మక గ్రంథమనవచ్చు. అందులో అంతరాత్మ స్వరూప స్వభావాలగురించి-వివరించడం జరిగింది. అంతరాత్మకు వివరణ ఇవ్వబడింది. నైతిక ప్రమాణాలవృష్ట్యా ఆలోచనలు వివరించబడ్డాయి. మనోస్థితిగతులు చర్చించడం జరిగింది. నీతి, మనస్తత్వం జ్ఞాన స్వరూపం మొదలైన విషయాల వివరణతోపాటు పదార్థం గురించి కూడా స్థూలంగా చర్చించబడింది. పదార్థాల లక్షణాలు, వాటి ఆధారాలు - మనస్సు, దానికిగల సంబంధాలు, మనోశక్తి మొదలైనవన్నీ అందు వివరించబడ్డాయి. మనసు - పదార్థాలను ఉన్నవి వున్నట్లుగా అవగాహన చేసుకునే విధానాలతో కూడిన గ్రంథమది.

నిర్వాణస్థితిని అందుకోవడానికి అభిధమ్మ పిటకలో ధర్మాల వర్గీకరణ - వ్యక్తుల వర్ణన- ధాతువులకు సంబంధించిన విషయచర్చ అందు లిఖించబడ్డాయి. మొత్తం మీద అభిధమ్మ పిటక-సాధకులకు, భిక్షువులకు, మేధావులకు కావలసిన వస్తు సామగ్రినంతా సమకూర్చింది. అంతే, ఆ గ్రంథం అందరికీ ఎంతో ఉపయోగపడుతుంది. వాస్తవాలను గూర్చి సత్యాలను గూర్చి బుద్ధుడు ఇచ్చిన వివరణలన్నీ అందులో వున్నాయి. ఆచరణ యోగ్యం కాని వాటిని అందుచేర్చలేదు, చర్చించలేదు.

కాశ్యపుని అభిధమ్మ పిటకలో ఏడుభాగాలున్నాయి. ధర్మ సంగణి - విభాంగి - కథ వట్టుహు - పుగ్గల 'పన్నాటి - ధాతు - యమక - పత్తాన - అని, అందులో వేదాంత తత్వమే కాక,

బుద్ధుని జీవిత విశేషాలూ వున్నాయి. బౌద్ధ వాఙ్మయం అనే పూల తోటలో పూసిన పూల మాలవలె అందంగా కూర్చబడిన బౌద్ధ ధర్మాల సముదాయమే ధమ్మ పిటక, అది జ్ఞాన భాండాగారం. అది, ఆచరణాత్మక గ్రంథం.

ఆ మూడింటినీ కలిపి త్రిపిటకము లంటారు. అవే- శీల, ప్రజ్ఞ, సమాధి. మొదటిది వినయపిటక- క్రమశిక్షణకు సంబంధించి నది. రెండవది, సుత్తపిటక, అది వ్యక్తికి సంబంధించినది. మూడ వది, అభిధమ్మపిటక- అదే అసలు మూలసూత్రం. ఆ మూడూ బుద్ధుని బోధల సారాంశం. వాటిలో అన్నిరకాల వారికి కావలసిన యోచనా సామగ్రి ఉంది. అవి- వాస్తవాలను గూర్చి, సత్యం గూర్చి విపులంగా చెపుతాయి. అవి- మొదట్లో కేవలం వాచారూపంలో ఉండి, తర్వాత- క్రీ. పూ. 80 ప్రాంతంలో శ్రీలంక రాజైన వట్టగామిని కాలంలో రచనలలోకి వచ్చాయి.

★ ★ ★

బౌద్ధం, సత్యానికి సంబంధించిన విషయం. అది, ఒక సిద్ధాంతం. అది - బాధ, దుఃఖం నుంచి విముక్తిని ప్రసా దించే మహత్తర సాధనం. అది శాశ్వతం. ఏకత్వభావం కలిగి వుండటమే, బౌద్ధంలో ముఖ్యాంశం. అటువంటి బుద్ధత్వాన్ని కాంక్షించేవారు పదిపారమితాలను సాధించవలసి వుంది. అవి-దానం, శీలం, నైష్కర్మ్యం, ప్రజ్ఞ, సత్యం, వీర్యం, క్షాంతి, అధిష్ఠానం, మైత్రి, ఉపేక్ష. వాటిని తెలుసుకుని- అవగాహన చేసుకుని అనుష్ఠిం చాలి. కొందరు వాటిని అనేక జన్మలలో సాధిస్తారంటారు. వారిలో బుద్ధుడు ఒకడు అంటారు. అటువంటి మహాత్ముల పూర్వజన్మలను వివ రించు గాథల సమూహమును జాతకకథలన్నారు. ఆ మహాత్ముల- బోధిసత్వుల- ఆయా జన్మల్ని అవతారాలుగా పరిగణించారు పెద్దలు. వారు, ఒక్కొక్క అవతారంలో ఒకొక్క ఘనకార్యం చేసి, ప్రజలకు నీతి- ధర్మం బోధించినట్లు బౌద్ధుల నమ్మకం. అవి- ఐదు వందల నలభై ఏడు కథలు. అవి, హిందూమతంలోని పురాణాలు

వంటివి. వాటిని మొదట పాలీ భాషలో రాశారు. ఆ కథల్లో కొన్నిం టిని "ఆర్యశూరుడు" సంస్కృతంలో రాసి, దానికి "జాతకమాల" అని పేరుపెట్టాడు- ఆ కథల ద్వారా వైరాగ్యం, భూతదయ, బోధ పడుతుంది. ఆ కథలలో కొన్ని ఇందు పొందుపరచబడ్డాయి.

## కుందేలు-దాని స్నేహితులు :

నేను ఒక జన్మలో కుందేలు అవతారం ఎత్తి, ఒక అడవిలో నివసించాను. నాకు ఒక కోతి— ఒక నక్క - ఒకనీటిపిల్లి స్నేహంగా వుండేవి. మేం నలుగురం హాయిగా, ఆనందంగా, స్వేచ్ఛగా తిరుగుతూ, ఆహారాన్ని అన్వేషించుకునే వాళ్ళం. సాయంత్రాలు- "మంచి-చెడ్డల" గురించి నాకు తోచింది వారికి చెప్పేవాడిని. "దానం చేయండి. ఉపవాసాలు చేయవలసిన రోజుల్లో ఉపవాసాలు వుండండి!" అని సలహా ఇచ్చేవాడిని.

ఒకరోజున- మా ఆహార అన్వేషణలో నేను కొంచెం గడ్డి, పువ్వులు సంపాదించాను. కోతి కొన్ని పళ్ళు, నక్క కొంచెం మాంసం, నీటిపిల్లి కొన్ని చేపలు సంపాదించాయి. మేము భోజనాలు చేయబోయేముందు ఒక వృద్ధుడు మా వద్దకు వచ్చాడు. మమ్మల్ని అభినందించి, "నా, బిడ్డల్లారా! మీరు ఇక్కడ సుఖంగా వున్నారు కదా?" అని అడిగాడు. దానికి మేము, "పచ్చికమైదానాల్లో తిరిగి, మాకు కావలసినంత ఆహారాన్నే సంపాదించుకుని, ఒకరికొకరం స్నేహంగా, శాంతంగా వున్నాం," అన్నాం.

దానికి ఆయన- గాఢమైన మీ స్నేహబంధం గురించి బాగా విని, మిమ్మల్ని చూడ్డానికి చాలా దూరంనుంచి వచ్చాను. నాకు బాగా ఆకలిగా వుంది, అలసిపోయాను. తినడానికి ఏమైనా పెట్టండి," అని అడిగాడు. వెంటనే నేను కొంతగడ్డి, కొన్నిపువ్వులు నక్క కొంచెం మాంసం, కోతి కొన్ని పళ్ళు - నీటి పిల్లి కొన్ని చేపలు-ఇచ్చాం. అతిథి వచ్చిన సంతోషంలో నేను తన్మయత్వంతో ఆనందనృత్యం చేశాను. ఆ తర్వాత ఆయనతో, "ఈరోజు మీకు

నేను గొప్పవిందు ఇవ్వదలిచాను. మీరు కొన్ని ఎండుకట్టెలు తెచ్చి, మంట పెట్టండి.” అన్నాను. ఆయన అట్లా చేశాడు. మంటలు బాగా పైకి లేచాయి. నేను అక్కడనుంచి కొంచెం దూరం వెళ్ళి - నా బొచ్చులో, నాకు తెలియకుండా వున్న సూక్ష్మజీవుల్ని ముమ్మారు దులిపి- రాజహంసలాగ గాలిలో ఎగిరి- ఒక్కదూకున ఆ అగ్ని గుండంలో పడ్డాను. ఒళ్ళు కాలి, చల్లారిన తర్వాత - పచనమైన దేహాన్ని ఆకలితో వున్న ఆ వృద్ధునికి సమర్పించాను. ఆ దృశ్యం చూసి, ఆశ్చర్యపడి, తన నిజరూపంతో ప్రత్యక్షమయ్యాడు, ఆ వృద్ధుడు. అతడెవరో కాదు, సాక్షాత్తూ సర్వలోకాధిపతి - ఇంద్రుడు అతడు నాకు తిరిగి- పునర్జీవనం-ప్రసాదించాడు. నేను మామూలుగా అయ్యాను. నన్ను చూసి, “నీ ధర్మం, నీతి మానవాళి వున్నంత వరకు నిలిచివుంటాయి. నిన్ను తలచుకుంటూ నీ గాథలు చాటు తుంటూ వుంటారు, ప్రజలు” అని, నన్ను పట్టులాంటి లేతగరికపై పడుకోబెట్టి, ఒక పర్వతాన్ని పిండి - ఆ సారంతో చంద్రునిపై ఒక కుందేలు బొమ్మ చిత్రించాడు. ఆ విధంగా ఆ కుందేలు - చంద్రునిలో ప్రకాశిస్తో అమరత్వం పొందింది.

* * *

## రాజైన జింక :

ఒక అరణ్యంలో ఐదువందల జింకలమందకు “బనియన్” అనే జింక రాజు వున్నాడు. ఆయనకు బంగారంవంటి తల, రత్నాలు వంటి నేత్రాలు, వెండిలా మెరిసే కొమ్ములూ వున్నాయి. దాని నోరు దొండపండువలె, దాని కాళ్ళ గిట్టలు లక్కరంగులో వున్నాయి. దానితోక చమర మృగంతోకవలె వుంది. మామిడి, అశ్వద్థవృక్ష ఛాయలలో స్వేచ్ఛగా తిరుగుతూ వుండేవి, అవన్నీ.

కాశీనగర రాజు-బ్రహ్మదత్తుడు ఆ అడవికి వేటకు వెళ్ళాడు. ఆయన్ని చూసి, తన పరివారాన్నంతా హతమారుస్తాడు అనే

భయంతో, ఆయన దగ్గరకు వెళ్ళి "మమ్మల్ని ఇప్పుడు వేటాడక విడిచిపెట్టండి. మేము రోజు కొకరం చొప్పున మీ పాకశాలకు వస్తాం," అని అర్థించింది బనియన్. దానికి రాజు అంగీకరించాడు.

రోజు కొకరు పాకశాలకు వెళ్ళేముందు- తల్లులు పిల్లలకోసం, మగవారు భార్యలకోసం గొల్లుమనేవారు. ఆ దృశ్యంచూసి బనియన్ బాధపడేవాడు. ఒకరోజున గర్భవతిగా వున్న ఒక జింక వంతు వచ్చింది. అది బనియన్ దగ్గరకు వెళ్ళి, ప్రసవించేవరకు తనకు వ్యవధి ఇవ్వవలసినదిగా, కోరింది. అతడు జాలిపడి, దానివంతుగా ఆ రోజు బనియన్ పాకశాలకు వెళ్ళాడు. రాజు దాని అందానికి, తేజస్సుకు అబ్బురపడి, పరివారంతో, "దాన్ని చంపకండి," అని చెప్పి, విషయం తెలుసుకుని, ఆ రోజునుంచి జింకలను తినడం మానుకోవడమేకాక, తన ఆధీనంలో వున్న అడవుల్ని- నదుల్ని- కొలనుల్ని పశుపక్ష్యాదులకు, జలచరాలకు స్వేచ్ఛగా వదలమని, వాటికి ఎవరూ ఎటువంటి హానీ తలపెట్టరాదని శాసించాడు.

★ ★ ★

## శిబిచక్రవర్తి :

బోధిసత్వుడు ఒకసారి శిబిచక్రవర్తిగా జన్మించాడు. తన శరణుజొచ్చిన వారిని తన ప్రాణమిచ్చి అయినా రక్షించెదనని శపథం చేశాడు. ఒక రోజున ఆయన రాజదర్బారులో న్యాయ నిర్ణయం చేస్తున్న సమయంలో భీతి చెందిన ఒక పావురం వణుకుతూ హాల్లోకి వచ్చి పడింది. అది ఎగిరి రాజుగారి తొడపై కూర్చుంది. భయంతో ఆయన బట్టల్లో దూరడానికి ప్రయత్నించింది. రాజు దాని తల నిమురుతూ, "ఎందుకు భయంతో వణుకుతున్నావు? నేను నిన్ను రక్షిస్తాను," అన్నాడు.

అంతలో ఒక డేగ బాణంలాగ హాల్లోకి దూసుకువచ్చి రాజును సమీపించి, "రాజా, ఈ పావురం నా ఆహారం. దీని దేహంపై- నా

గోళ్ళ గుర్తులు వున్నాయి. ఇది నాది. ఆకాశంలో విహరించే పక్షుల విషయంలో జోక్యం చేసుకోవలసిన అవసరం, అధికారం మీకు ఏముంది? నేను ఆకలితో వున్నాను. దాని ప్రాణం కాపాడి, పుణ్యం సంపాదించుకోదలిస్తే, నా ఆకలికూడా గమనించి, నా ప్రాణం కూడా కాపాడు" అన్నది.

దానికి రాజు, సరే. నీ ఆహారానికి కావలసినంత ఏ మాంసం అయినా ఇవ్వగలను." అన్నాడు. "నేను జంతువుల మాంసం తినను. పక్షులే ధర్మబద్ధమైన, న్యాయబద్ధమైన, చట్టబద్ధమైన ఆహారం నాకు. ఈ పావురాన్ని నువ్వు రక్షించాలనుకుంటే, దాని ఎత్తు మాంసం నీ దేహం నుంచి కోసి ఇయ్యి," అంది. రాజు అందుకు అంగీకరించి- వెంటనే త్రాసు తెప్పించి, తన దేహభాగం కోసి సిబ్బెలో వేశాడు. ఎంత మాంసం కోసివేసినా ఆ పావురానికి సరి తూగలేదు. చివరికి రాజు అస్తిపంజరం అయ్యాడు. దర్బారులో వున్నవారంతా బాధపడ్డారు. చివరికి చక్రవర్తే సిబ్బెలో కూర్చు న్నాడు. అప్పుడు తూకం సరిపోయింది. అంతలో అమరగానం విన వచ్చింది. ఇంద్రుడు, బ్రహ్మ ప్రత్యక్షమయ్యారు. అమృతం ఇచ్చి, రాజును రక్షించారు. "ఆ జన్మలో శిబిచక్రవర్తిని నేను. ఈ జన్మలో ఆ డేగ, దేవదత్తుడు," అన్నాడు బుద్ధుడు.

* * *

బోధిసత్త్వుడు ఒక జన్మలో దున్నపోతుగా జన్మించాడు. అతడు చాలా బలంగా, భీకరంగా వుండేవాడు. కొండలు, గుట్టలు, అడవులు తిరిగి-తిరిగి ఓ రోజు ఓ చెట్టుకింద నిద్రపోయాడు. ఆ చెట్టుపై వున్న ఓ కొంటె కోతి- కిందికి దిగి, దాన్ని నానాహింసలూ పెట్టింది. ఆ దున్నపోతు అన్నీ భరించింది.

కొన్నాళ్ళ తర్వాత ఆ చెట్టుకిందే, మరో దున్నపోతు నిద్ర పోతుంది. ఆ కొంటెకోతి, మళ్ళా కిందికిదిగి వచ్చి, దాన్ని నానా హింసలూ పెట్టింది. అది ఎదురుతిరిగి, దాన్ని కొమ్ములతో కుమ్మి,

కాళ్ళతో తొక్కి చంపింది. శాంతస్వభావం కల ఆ దున్నపోతు, బోధి సత్వుడు.

* * *

## దిగితి :

పూర్వం కోసలరాజ్యాన్ని "దిగితి" అనే రాజు పాలించేవాడు. శక్తివంతుడైన కాశీరాజు అతనిపై దండెత్తి ఓడించాడు. దిగితి భార్యతోసహా అరణ్యంలోకి పారిపోయాడు. మారువేషంలో ఓ పల్లెలో జీవిస్తున్నాడు. ఆ పల్లె కాశీ రాజ్యానికి చెందింది. దిగితికి ఒక కొడుకు పుట్టాడు. అతనికి "దిగవు" అని పేరు పెట్టారు.

దిగితి ఉనికి తెలుసుకుని, కాశీరాజు అతన్ని బంధించి, ఉరి తీయడానికి తీసుకువెళ్తున్నప్పుడు "దిగవు"తో "దూరదృష్టి కలిగి వుండు" అని సలహా ఇచ్చాడు. చెబుతూ, "ద్వేషాన్ని, ప్రేమతో జయించు," అన్నాడు.

దిగవు పెద్దవాడయ్యాడు. కాశీరాజు కొలువులో చేరాడు. ఒక రోజున దిగవు రాజు వెంట వేటకు వెళ్ళాడు. అడవి మధ్య దిగవు, రాజుగారు ఒకచోట విశ్రమిస్తూ వుండగా, తన తల్లి తండ్రులను ఉరితీయించి తన రాజ్యాన్ని దోచుకున్న రాజు తన సమక్షంలో నిద్రపోతున్నాడు. అతన్ని హత్య చేయాలనే ఆలోచన రాగానే ఒకనాడు తండ్రి చెప్పిన మాటలు "దూరదృష్టి కలిగివుండు. ద్వేషాన్ని, ప్రేమతో జయించు," జ్ఞప్తికి వచ్చి ఆగిపోయాడు. రాజు నిద్రలేచిన తర్వాత దిగవు తానెవరో చెప్పాడు. అది విని, రాజు వివేకంతో అతని రాజ్యాన్ని అతనికి ఇచ్చేశాడు.

* * *

## వెసంతర్ కథ :

పూర్వం వెసంతర్ అనే రాజు వుండేవాడు. ఆయన పవిత్రుడు, దానధర్మాలు చేసేవాడు. అర్థించిన వారిని రిక్తహస్తా

లతో ఏనాడూ పంపలేదు. అతనికి "మాద్రి" అనే భార్య- ఇద్దరు పిల్లలూ, వర్షం కురిపించే శక్తిగల "ఐరావతం" వున్నాయి. ప్రజలు దాన్ని గొప్పగా చూసుకునేవారు.

ఒకరోజున ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి, "ఐరావతం" ఇవ్వమని కోరాడు. రాజు దాన్ని అతనికి ధారపోయబోతే, ప్రజలు అడ్డుకొన్నారు- తనను ప్రజలు దేశ బహిష్కరణ చేస్తారని తెలిసి- భార్యా పిల్లలతో- ఓ రథంలో అరణ్యప్రాంతానికి వెళ్ళిపోయాడు. దారిలో నలుగురు బ్రాహ్మణులు ఎదురై అర్థించగా, వారికి-రథానికి కట్టిన నాలుగు గుర్రాలు ఇచ్చేశాడు.

ఒక కొండపై చిన్న కుటీరం నిర్మించుకుని, కందమూలాదులు తింటూ కాలక్షేపం చేస్తూ వుండగా, కళింగ రాజ్యానికి చెందిన ఒక బీద బ్రాహ్మణుడు వచ్చి- అతని ఇద్దరు పిల్లల్ని తనకు బానిసలుగా పంపమని కోరాడు. అతడు కురూపి, క్రూరుడు. అతన్ని చూసి ఆ పిల్లలు భయపడి తండ్రి వెనక దాక్కుంటే, ఆ బ్రాహ్మణుడు వారిని కర్రతో చావబాది తీసుకుపోయాడు.

వెసంతరుని ధర్మం-నీతి ఇంకా పరీక్షించాలని ఆ బ్రాహ్మణుడు ఒక సాధు వేషంలో వచ్చి- "మాద్రిని నాకు ఇవ్వండి" అని కోరాడు. మాద్రి అంటే, ఆయనకు ఎంతో ప్రేమ. తన ప్రతిజ్ఞ జ్ఞప్తికి తెచ్చుకుని, తన భార్యను ఆ సాధువుకు అప్పగించాడు.

అతని త్యాగానికి బ్రహ్మ ప్రత్యక్షమై, అతని భార్యా, పిల్లల్ని తిరిగి అప్పగించి, తిరిగి రాజును చేశాడు. అతడు యథా ప్రకారం దానధర్మాలు చేస్తూ రాజ్యం పాలించాడు. వెసంతరునిదే చివరి అవతారం, బోధిసత్వులలో. ఆ తర్వాత బోధిసత్వుడు కపిల వస్తులో- సిద్ధార్థుడుగా జన్మించాడు.

* * *

మానవచరిత్రలో-తాత్విక విషయాలలో బుద్ధచరిత్ర ప్రముఖమైనది. క్రీ. పూ. 5 వ శతాబ్దం మధ్యలో జరిగిన సంఘటన అది.

జ్ఞానోదయానంతరం సిద్ధార్థుడు బుద్ధుడై బోధించిన ధర్మాతే బౌద్ధ మతం. ఆయన ఆ కాలానికీ, అందరికీ అప్పుడు - మంచి మిత్రుడు - మార్గదర్శకుడు. అధర్మం- అసత్యం - అజ్ఞానంతో నిండిన ప్రపంచంలో ధర్మం బోధించడం. బహు కష్టమని తెలిసినా, అపారమైన ప్రేమ, దయ, కరుణ వల్ల ప్రజల్ని అనేక విధాల సమీపించి - తానూ అనేక బాధలు, యాతనలు పడి వారికి దుఃఖవిముక్తి కలిగించ యత్నించాడు బుద్ధుడు. నలభై ఏండ్లు మధ్య ఇండియా అంతటా పర్యటించి సత్యం- ధర్మం — జ్ఞానం - అహింస బోధించాడు. ఆ బోధలో విశ్వాసముంచి దీక్ష తీసుకున్న వారిని బౌద్ధభిక్షువులన్నారు. వారే సంఘీయులు. ఆ సంఘంలో సన్యాసులు, సన్యాసినులు- సామాన్య ప్రజానీకం - (స్త్రీ-పురుషులు) కూడా వుండేవారు. మొదట్లో గృహపరిత్యాగం చేసిన స్త్రీ - పురుషులే సంఘసభ్యులుగా వుండేవారు. మహాయానం వచ్చిన తర్వాత సామాన్యులూ ఆ సంఘంలో చేరారు. బుద్ధుడూ - బుద్ధుడు బోధించిన ధర్మమూ బుద్ధుడు ఏర్పరచిన సంఘమూ ఆ మూడింటినీ "త్రిశరణాలు" అని వాటిని శరణుజొచ్చమని ప్రజలకు చెప్పేవారు. ఆ కాలంలో ఎన్నో ఆరామాలు- ఆలయాలు వెలిశాయి.

బుద్ధుడు చెప్పిన సంగతులే బౌద్ధమతానికి మూలాధారం. ఆయన బోధల సంక్షిప్త స్వరూపమే, ధర్మపాద - ధర్మపదం. అది- అధికారపూర్వకగ్రంథం. బౌద్ధం-నిత్యజీవిత సత్యాలతో- సమస్యలతో ముడిపడి వుండటంవలన, అవి సూటిగా మానవ హృదయాల్ని తాకి ఉత్తేజపరచి-ఉత్సాహపరచి, ప్రోత్సాహపరిచాయి. ఎటువంటి పక్షపాతం, దురభిమానం లేకుండా - ఎంతో విలువైనవిగా స్వేచ్ఛగా, స్వచ్ఛంగా- సహజంగా - సామాన్యమైనవిగా సరైనవిగా వుండి; సమస్తాన్ని తప్పేశాయి. అందుకే బుద్ధుని ప్రతిబోధా - మన స్వంత మనిపిస్తుంది.

బుద్ధుని మార్గం, మధ్యే మార్గం, ప్రతిదాంట్లో తీవ్రవాదాన్ని - "అతి"ని వదలివేయడం. "అతి"ని విసర్జించడమే ఆ సిద్ధాంతాల

ముఖోద్దేశ్యం. అందుకే శరీరాన్ని శుష్కింపజేసే తపస్సు వ్యర్థమన్నారు. అంతులేని సుఖాల్లో మునిగి, నీతి సూత్రాల్ని ఉల్లంఘించరాదన్నారు. యజ్ఞ-యాగాది క్రతువుల్ని- జంతు బలుల్ని ఖండించారు. మంచిని పెంచి, మనసును పరిశుభ్రం చేసుకోమన్నారు. బానిసల, దుఃఖితుల, పీడితుల, అనాథుల, పతితుల, వెనకబడిన-బలహీనవర్గాల పక్షాన నిలబడ్డారు. నీతి-నియమాల ఉల్లంఘన జరుగుతుందేమోనని మొదట భిక్షుకి సంఘ స్థాపనకు అంగీకరించలేదు, బుద్ధుడు. తర్వాత ఆనందుని పట్టువల్ల కొన్ని కఠిన నియమ – నిష్టలతో భిక్షుకీసంఘం ఏర్పాటుకు అంగీకరించాడు. మంచి మనసుతో-చక్రవర్తుల మధ్య- వర్గాలమధ్య, కుటుంబాల మధ్య, వైషమ్యాల్ని తొలగించి- యుద్ధాల్ని, పోరాటాల్ని, కలతల్ని ఆపుజేసి - శాంతిని నెలకొల్పారు. మేధావులను, పండితులను, పెద్దలను, గురువులను-మతాధి మఠాధిపతులను-పరివ్రాజకులను కలుసుకుని అనేక విషయాలు చర్చించారు. ఆ విధంగా బౌద్ధులు ధర్మాన్ని దేశం నలుమూలలా విస్తరింపజేశారు. అందుచేత బుద్ధుని బోధలకు బౌద్ధ ఆరామాలే నిజమైన కేంద్రాలుగా నిలిచాయి ఆ ఆరామాల్లో మతైక, లౌకిక విషయాల్ని కూడా బౌద్ధ భిక్షువులు చర్చించి, బోధించేవారు. నిజం చెప్పాలంటే ఒక్క బౌద్ధ సన్యాసులే ఆనాటి విద్య-సాంస్కృతి- విషయాలపై శ్రద్ధ వహించారనిపిస్తుంది. బుద్ధుని ప్రవచనాల్ని - ప్రబోధాల్ని - ప్రసంగాల్ని - పరివర్తనా నియమావళిని- కథల్ని- అన్నింటినీ ఆ ఆరామాలే - ఆ సన్యాసులే బౌద్ధ వాఙ్మయంగా భద్రపరిచారు.

మొదటి బౌద్ధమహాసభ జరిగిన వందేళ్ళ తర్వాత "కాకవర్ణి" ఆధ్వర్యంలో- వైశాలిలో రెండవ మహాసభ జరిగినప్పుడు, ఆ సభలో వినయపిటక వ్యాఖ్యానాలపై అంతః కలహంవచ్చి, సభ్యులు విభేదించి, అప్పటికప్పుడే రెండుశాఖలుగా చీలిపోయారు. ఒకటి - థేరులు. రెండవశాఖవారు- మహాసాంఘికులు. థేరులు-శీలం. నీతి ఆచారానికి ప్రాధాన్యమిస్తే, మహాసాంఘికులు తత్త్వవిచారానికి, లోకోపకార విషయాలకు ప్రాధాన్యమిచ్చారు.

వైశాలి– పాటలీపుత్రవారు తూర్పు భిక్షువులుగా, కౌసంబీ-అవంతి ప్రాంతంవారు పశ్చిమ భిక్షువులుగా వ్యవహరింపబడేవారు. వారిరువురు ప్రధానమైన పదినియమాలలో- క్రమశిక్షణ విషయాల్లో భేదించారు. ఆ తగాదా పరిష్కరించాలని- "రేవతుడు" అనే ఆయన నలుగురు భిక్షువులను-సర్వకామి, సాఘుడు, ఖుజ్జశోభితుడు, వార్షభగ్రామికుడు- అనువారిని ఎన్నుకుని తనతోపాటు మరో ముగ్గురు భిక్షువులను సంభూత సాణవాసి- యశకాకండ పుత్రుడు, సుమనుడు అనువారిని ఎన్నికచేసి- వారిద్వారా సౌదేయగ్రామంలో ధర్మగానం చేయించాడు. ఆ సభలో ఏడువందలమంది భిక్షువులు పాల్గొనుటచే దానికి "సప్తశతిక" అని పేరు వచ్చింది.

ఆ తుపక్షాలనుంచి నలుగురు, నలుగురు సంఘసభ్యులు కలిసి, సంప్రదించినా వారి విషయం పరిష్కారం కాలేదు. వైశాలివారు తమ సంస్థాపకులుగా మహాకాశ్యపుని అనుసరించారు. వారి కేంద్రం- వైశాలీనగరం. ఆ తర్వాత ఆ కేంద్రం ఆంధ్రకు తరలివచ్చి, అమరావతి- నాగార్జున కొండలలో స్థిరపడింది. వారే మహా సాంఘికులు- పశ్చిమప్రాంతంవారు థేరవాద తెగవారుగా వ్యవహరింపబడ్డారు.

బౌద్ధ సంఘంలో పుట్టిన విభేదాల్ని పరిష్కరించాలనే యత్నంతో మరో వందసంవత్సరాలకు మూడవ మహాబౌద్ధ సభ ఏర్పాటు చేయబడింది. ఆ సభా విఫలమైంది. కాని, ఆయా సమావేశాలలో ప్రతిసారి సంఘాలు ఏర్పడి పనిచేశాయి. వాటితోపాటు బౌద్ధధర్మబోధకులలో కొందరు పెద్దలు, పండితులు, మేధావంతులు, జిజ్ఞాసాపరులు, బుద్ధుని బోధలు క్రోడీకరించాలని తీవ్ర చర్చలు జరిపారు. తత్ఫలితంగా బౌద్ధంలో ఒక క్రమం ఏర్పడింది. ఆ క్రమ పద్ధతి రచనారూపం దాల్చింది. ఆ రచనల మీద వ్యాఖ్యలు వచ్చాయి. బౌద్ధమత విస్తరణ కార్యక్రమంలో వచ్చిన రచనలు

వేదాంత పరిభాషలోకీ, ప్రక్రియల్లోకీ, ధ్యాన- సమాధిపరమైన యోగంలోకీ ప్రవేశించాయి. అవన్నీ పాలీ భాషలో వున్నాయి. వాటిల్లో ఎన్నోకథలు, సాంప్రదాయాలు, చరిత్రలూ వున్నాయి. బుద్ధుడు బోధించిన బోధలు సూత్రాలలోనూ, పరివర్తనా నియమావళి, వినయాల్లోనూ వున్నాయి. ఆ తర్వాత కాలంలో సూత్రాల మీద, వినయాలమీద వచ్చిన వ్యాఖ్యలు, విమర్శలు, చర్చలు, తాత్త్విక విషయాలు అభిధర్మాలుగా వెలువడ్డాయి. ఆ మూడవ సభ వ్యవహారం ముగిసేప్పటికి తొమ్మిది మాసాలు పట్టింది.

పశ్చిమ ప్రాంత సన్యాసులు - థేరవాదవారే, హీనయానం వారు. ఆ థేరవాద వారి నుంచి పైటికి వచ్చినవారు—మహాయానం వారు. వారు-అందరి విముక్తి కొరకు పాటుపడితే, థేరవాదవారు, అదే హీనయానంవారు-వ్యక్తిగత విముక్తి కోసం చూసేవారు. వారు, అంతా అశాశ్వతం అంటారు. మహాయానం వారు - అంతా, అన్నీ అముఖ్యం, అనిత్యం, అని,—ఈజగంమాయ, విచ్ఛల్లత, బుద్బుదం-మరుమరీచిక వంటిదంటారు. అంతా పూర్తి శూన్యం అంటారు. ఆ మహాయానంలో శూన్యవాదం లేక—మాధ్యమికవాదం అనీ—విజ్ఞానవాదమనీ రెండు వర్గాలున్నాయి. ఆచార్య నాగార్జునుడు శూన్యవాదాన్ని సమర్థించాడు.

శుద్ధచిత్ స్వరూపం-నిత్య— పవిత్రం — అఖండజ్వాల - సమగ్ర యథార్థ జ్ఞానం-నిత్యముక్తం - అవినాశము-స్వయం ప్రభుత-కలది-అదే ఆనంద స్వరూపం అయినది ఒకటి వుందనిచెప్పి మహాయానం-బుద్ధుణ్ణి దేవుణ్ణి చేసింది. దానితో బుద్ధ పురాణం వెలిసింది. మహాయానంలో ఎందరో బోధిసత్వులు ఉదయించారు. వారంతా సర్వలోక హితైషి అయిన బుద్ధుణ్ణి అనుసరించారు. అందుచేత మహాయానానికి బోధిసత్వ యానమని కూడా పేరు వచ్చింది. మహాయానం మహోజ్వలంగా రూపొందటంతో బౌద్ధం ప్రతి ఒక్కరికీ అందుబాటులోకి వచ్చింది. తత్త్వజిజ్ఞాస ఎక్కువైంది.

సిగ్గవస్థ విరుడు, చండవజ్జిష్ఠ విరుడు అను యువకులిద్దరు త్రిపిటకాల్ని అధ్యయనంచేసి, భిక్షువులై ఎందరికో ధర్మం బోధించారు. భిక్షువైన పది సంవత్సరాలకు స్థవిరుడని, ఇరవై ఏళ్ళకు మహాస్థవిరుడని-పిలవబడేవారు.

హీనయానం బర్మా, శ్రీలంక, సయాం, జావాలలోనూ, మహాయానం టిబెట్, చైనా, జపాన్, మంగోలియాలోనూ వ్యాప్తి చెందింది.

బుద్ధోపదేశాల్ని విశేషించి భాషించి వ్యాఖ్యానించేవారిని వైభాషికులనేవారు. బౌద్ధ సూత్రాల్ని అంగీకరించేవారిని, సౌతాంత్రికులనేవారు. "బాహ్య భౌతిక జగత్తు మిధ్య" అని చిత్త విజ్ఞానమే సత్యమనేవారిని విజ్ఞానవాదులనేవారు.

క్రీ.పూ. **268-232** ప్రాంతంలో అశోక చక్రవర్తి దాదాపు ఇండియా అంతా జయించి, "చండాశోకుడు" అను పేరుగాంచి, కళింగ యుద్ధంలో ఘన విజయం సాధించి, గృహోన్ముఖుడై-దారిలో రక్తపు ఏరులు చూసి, హృదయం ద్రవించగా పరివర్తనం చెంది "న్యగ్రోధ కుమారుడు" అను బౌద్ధ భిక్షువు దగ్గర బౌద్ధ ధర్మం తెలుసుకుని, హింసను వదలి, ధర్మప్రవర్తనుడైనాడు. అతడు "అశోకారామము" అను ఆరామాన్ని నిర్మించి భిక్షువులకు అర్పించాడు.

అశోకుడు బౌద్ధ ధర్మం స్వీకరించి, అహింసా వ్రతంపూని, బౌద్ధమత ధర్మాల్ని - భారతదేశమంతా శిలలపై చెక్కించడమేకాక, పల్లె పల్లెల్లో వాటిని చాటించి, ప్రచారం చేయించాడు. రాయబార వర్గాన్ని విదేశాలకు పంపించి బౌద్ధమత విస్తరణకు తోడ్పడ్డాడు. తన కుమారుడు మహేంద్రుని - ఇరవై ఏళ్ళ వానిని బౌద్ధ భిక్షువుగా చేశాడు. అలాగే కుమార్తె సంఘమిత్ర కూడా బౌద్ధ భిక్షువురాల

య్యాను; పద్దెనిమిదవపట-ఆమె భర్త అగ్నిబ్రహ్మ అప్పటికే బౌద్ధ మతావలంబి, మహేంద్రుడనే, మిహిందుడు అనేవారు. అతడు బౌద్ధధర్మ ప్రచారానికి శ్రీలంక వెళ్ళాడు. సన్యాసిని - సంఘ మిత్ర ద్వారా శ్రీలంకకు—బుద్ధగయలో వున్న బోధి వృక్షశాఖ నొకటి పంపించాడు అశోకుడు. అక్కడ ఆమె ప్రభావం వల్ల శ్రీలంక యావత్తు బౌద్ధ మతం స్వీకరించింది. ఆమె తీసుకువెళ్ళిన ఆ వృక్షశాఖ - బ్రతికి, మహావృక్షమైతే, చాలా ఏళ్ళ తర్వాత బుద్ధగయలోని మాతృవృక్షం వృద్ధాప్యంలో వుందని తెలుసుకుని, తిరిగి శ్రీలంక నుంచి - దాని భాగమై విలసిల్లుతున్న బోధివృక్షశాఖ నొకటి తిరిగి బుద్ధగయకు తెప్పించి, అదేచోట నాటినట్లు, అది పెరిగి పెద్దదైనట్లు కొందరు చెపుతారు.

అశోకుని చెల్లెలు యమలాదేవి ఐదువందలమంది కన్యల తోను, మరో ఐదువందలమంది అంతఃపుర స్త్రీలతోను సంఘమిత్ర దగ్గరకు వెళ్ళి దీక్ష తీసుకుని బౌద్ధధర్మ ప్రచారం చేసింది. అలాగే అనేకమంది బౌద్ధభిక్షువులు - సిరియా, బర్మా, కాశ్మీర్ - పెషావరు, ఇండోర్, వింధ్యాచల పర్వతప్రాంతం, బొంబాయి, మహారాష్ట్ర - మొదలైన ప్రాంతాలకు వెళ్ళి ధర్మప్రచారం చేశారు.

* * *

క్రీ.పూ. ఒకటవ - శతాబ్దంలో - సింహళంలో బౌద్ధసాహిత్యం విరివిగా అనువాదరూపంలో ప్రచారమైంది. క్రీ.శ. 80 ప్రాంతంలో శ్రీలంక రాజైన - వట్టగామణి - అప్పటివరకు అనుశ్రుతంగా, అను వంశికంగా వస్తున్న బుద్ధుని బోధలన్నింటినీ దేశీయభాషల్లో వ్రాయిం చారు. పాలీ గ్రంథాల, జాతకకథల, సాంచిస్థూపాల, చిత్రాలనుంచీ, హుయున్ సాంగ్‌వంటి చైనా యాత్రికులనుంచీ - ఆనాటి అనేక సంగతుల ప్రాశస్త్యం గురించి, బౌద్ధ ధర్మంగురించి కొంతవరకు తెలుసుకోవచ్చు. వారు, బుద్ధుని సిద్ధాంతాలసారమైన త్రిపిటకాల్ని

ఒకరకమైన ఆకులమీద రాశారు. అది- బైబిల్ కన్నా పదకొండు రెట్లు పెద్దది. ఆ విధంగా బౌద్ధసాహిత్యంపై అనేక గ్రంథాలు వెంట వెంటనే వచ్చాయి.

బ్రాహ్మణుడు, గొప్ప సంస్కృత పండితుడు. కవి అయిన అశ్వఘోషునిపై చిన్నప్పటినుంచీ వాల్మీకిరామాయణ ప్రభావం ఎంతో వుంది.

వ్యాఖ్యానకర్తలలో అతడు ప్రసిద్ధుడు. ఆయన అనేక రచనలు చేశారు. వాటిల్లో బుద్ధచరిత్ర- సౌందరనందం ప్రముఖమైనవి. ఆయన ఇరవై రెండు రచనలు చేశాడు. ఈశ్వరభావ నిరాకరణ- అనాత్మవాద సమర్థనతో- అష్టాంగమార్గమే నైష్టిక, ధార్మిక విభాగంగా మిగిలింది.

బుద్ధచరిత్ర :- ఆయన రచనలలో ప్రముఖమైనది.

సౌందరనందం :- బుద్ధుడు, నందునికి భిక్షాపాత్ర ఇచ్చిన సందర్భమే, కథావస్తువు. ఆ సమయంలో నందుని భార్య పడిన వ్యథ, విరహం- అందు వివరించబడింది. భౌతిక సుఖాలనుంచి- సమస్త విషయాలనుంచి మానవుడు విముక్తుడు కావడానికీ, వాటిపై అతనిలో విముఖత్వం, వైరాగ్యం కలగడానికి బుద్ధుని మార్గదర్శకత్వంతో నందుడు అర్హత్‌స్థానం పొందడంవంటి విషయాలు ఆ గ్రంథంలో అద్భుతంగా వర్ణించబడ్డాయి.

సూత్రాలంకార : అనేక గాథలతో కూడిన వచన గ్రంథం.

ఆ కథల్లో ఒకటి- ఒకతను బౌద్ధ ఆరామానికి వెళ్ళి, తనను ఆశ్రమంలో చేర్చుకోమని అడుగుతాడు.

సారిపుత్త అతన్ని నిశితంగా పరీక్షించి- జీవితంలో ఎప్పుడూ ఒక్క మంచిపని చేయని నువ్వు, ఆశ్రమవాసి కావడానికి అనర్హు

దపు- అని నిరాకరిస్తే- అతను సరాసరి బుద్ధుని దగ్గరకు వెళ్ళి, "తనకు బౌద్ధవిహారంలో జీవితం గడపాలని వుంది." అని చెప్పి, తనను సారిపుత్త నిరాకరించారని, తనను అనుగ్రహించి, తీసుకో మని ప్రార్థిస్తే— బుద్ధుడు అతనికి దీక్ష ఇచ్చి, తీసుకున్నాడు. అదీ ఇతివృత్తం. అతడు త్వరలో అర్హతుడైన సంగతికూడా అందులో చేర్చబడింది.

శతపంచసతికి - అందమైన పద్యకావ్యం

ఆర్యసురజాతకమాల - కథలసంపుటి.

అవధానశతకం - కథలసంపుటి.

సద్ధర్మపుండరీకం - బుద్ధుని బోధలు.

అవలోకితేశ్వర - కరుణరసప్రధానమైనది.

సుఖావతి వ్యూహ—ఆనందునికి బుద్ధుడు చెప్పిన సంగతులు.

ప్రాజ్ఞా పరామిత — వేదాంత గ్రంథం అదే-అష్టసహస్రిక అది-ఎనిమిదివేల సూత్రాలతో కూడినది.

గంధ వ్యూహ – ప్రార్థనతో కూడినది.

రాష్ట్రిపాలుని ప్రశ్నలు - బుద్ధుని సమాధానాలు.

లంకావతార సూత్ర-

చంద్రప్రదీపునకు, బుద్ధునికి మధ్య జరిగిన సంభాషణ.

సువర్ణ ప్రభాస.

మాధ్యమికసూత్ర.

ఆర్యదేవ.

కథా సంగ్రహ.

భక్తిశతకం!

పంచక్రమ - యోగానికి సంబంధించినది.

*           *           *

క్రీ.శ. రెండు-మూడు శతాబ్దాల మధ్య విదర్భదేశంలో పుట్టి-ఆంధ్ర దేశంలో నివసించి-అక్కడే మరణించిన నాగార్జునుడు, వైదిక పండితుడు. అతడు బౌద్ధం స్వీకరించి, బుద్ధుడు సూచించిన శూన్యతనూ-ఉపనిషత్ భావన అయిన నిరాకార నిర్గుణ పరబ్రహ్మ భావననూ కలిపాడు. అతడు మహాతాత్త్వికుడు. ఎన్నో తాత్త్విక గ్రంథాలు రాశాడు. అతడూ మాధ్యమిక మార్గాన్నే సూచించాడు.

నాగార్జునాచార్యుడు కళాప్రియుడు. తత్త్వవిచారంగా ఎంచి శూన్యవాదం ప్రతిపాదించాడు. అంటే, నిర్వాణం పొందిన తర్వాత మిగిలేది శూన్యమని ఆయనంటే - కాదు - మిగిలేది విజ్ఞానమని మైత్రేయ నాథుడు అన్నాడు. అదే విజ్ఞానవాదం. దానికే యోగాచార వాదమనీ పేరు. అప్పుడు మహాసుఖవాదం అనేది వచ్చి, విజ్ఞానవాదంతో కలిసింది. మహా సుఖవాదంలోంచి వజ్రయానం ఆవిర్భవించింది. బౌద్ధం పొందిన దశలలో అదే చివరిది. వజ్రయానం రావడంతో, బౌద్ధంలో సంఖ్యాతీతంగా దేవ, దేవతలు వెలిశారు. విగ్రహ నిర్మాణం - ఆరాధన ప్రబలాయి. దాంట్లో తాంత్రిక పూజ, వామాచారం ప్రబలి, బౌద్ధం ప్రజాదరణ కోల్పోయింది.

కాని ఎన్ని తెగలు, శాఖలు, వర్గాలు ఏర్పడితేనేం, బౌద్ధ మతం హిందూ దేశంలో గొప్ప ఆలోచనా పరుల్ని, మేధావుల్ని తయారు చేసింది. వారిలో చెప్పుకోతగ్గవాడు ఆచార్య నాగార్జునుడు ఆయనను వ్యాఖ్యానించిన ఆర్యదేవుని శిష్యులైన కుమారజీవ-బుద్ధ పాలిత-చంద్రకీర్తి ఆ ముగ్గురూ ప్రఖ్యాతతాత్త్వికులు, గొప్ప రచయితలు.

ఆచార్య కుమారిలభట్టు రచన "పూర్వ మీ మాంసక" వచ్చే వరకు శూన్యవాదం గొప్ప చెలామణిలో వుంది. అంటే, ఒకటి, రెండు శతాబ్దాలలో బౌద్ధం మంచి ప్రాపకంలో వుంది. బౌద్ధ చరిత్రలో నలుగురు నాగార్జునులు కనుపిస్తారు. క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో కనిష్క-చక్రవర్తి సమకాలీకుడైన నాగార్జునుడు క్రీ.శ. నాల్గవ శతాబ్దంలో నలందా విశ్వ విద్యాలయంలోవున్న నాగార్జునాచార్యులు, అలాగే ఏడవ శతాబ్దంలో శాతవాహన సార్వభౌమునిపద్ద మంత్రిగా వున్న నాగార్జునుడు-సిద్ధుడని ప్రతీతి కలదు.

★ ★ ★

ఐదవ శతాబ్దంలో మగధరాజ్యంలో - మహా బోధి పరిసర ప్రాంతంలో బ్రాహ్మణ వంశంలో జన్మించిన బుద్ధ ఘోషుడు వేదాధ్యయనంచేసి, జంబూ ద్వీపంలో మహావాదియై - సర్వవాళ విశారదుడై - బౌద్ధం స్వీకరించి త్రిపిటకాలకు వ్యాఖ్య రాశాడు. అది "విశుద్ధమగ్గము"గా వెలువడింది. బౌద్ధ సారస్వతానికి ఆయన భాష్యకారుడై వ్యాఖ్యాన కర్తలలో ప్రసిద్ధుడుగా పేరు గాంచాడు.

"మహానాయుడు" అనురాజు పరిపాలిస్తున్నరోజుల్లో బుద్ధ ఘోషుడు సింహాళం వెళ్ళాడు. అనూరాధ పురంలో మహా విహారంలో వుండి, జాతక కథలపై వ్యాఖ్యానాలు రాశాడు. వినయ పిటకానికి "సమంత ప్రసారిక" అని వ్యాఖ్యరాశాడు. అతని ప్రసిద్ధ గ్రంథం "విశుద్ధ మగ్గం" కూడా అక్కడే రాశాడు అంటారు. బుద్ధ చరిత్ర నిర్మాణానికి సింహాళంలో అవకాశాలు కల్పించి, యశోకీర్తి నార్జించాడు.

సూత్ర పిటక చివరి నికాయంలోని పదిహేను భాగాల్లో ధమ్మ పదం ఒకటి. ధమ్మ అంటే ధర్మం అని అర్థం. పదం అంటే భాగ మని అర్థం. అందులో నాలుగు వందల ఇరవైమూడు శ్లోకాలు

న్నాయి. బుద్ధుని బోధల్లో స్కంధాలు, ధాతువులు, ఆయతనాలు అంటూ అనేక కొత్త పదాలు ఉపయోగించబడ్డాయి. పాలీభాషలో అనేక గ్రంధాలు రచించిన బుద్ధ ఘోషుడని విశిష్ట రచనగా విశ్వసింపబడుతున్న ధమ్మపదం - బ్రహ్మచారులు, సన్యాసులు,—సాధకులు, భిక్షువులు, ఆత్మ పరిశీలన చేసుకోవడానికి అద్దంలా ఉపయోగపడే మూడువందల ఐదు కథలు అందులో చేర్చడం జరిగింది. ఆ గ్రంథంలో ధ్యానానికి సంబంధించిన విషయాలు చెప్పారేకాని, విజ్ఞానశాస్త్రాభివృద్ధికిగాని, సిద్ధాంతాల నిర్మాణానికిగానికాదు— అని గ్రహించ వలసివుంది. అవన్నీ భవరోగ నివారణకు సరైన మందులు మాత్రమే. సుప్రసిద్ధ బౌద్ధ పదాచార్యుడైన బుద్ధ ఘోషుని సమకాలికులు—సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు- బుద్ధ దత్తుడు, ఆనందుడు, ధర్మపాలుడు మొదలైనవారు.

ఆ తర్వాత సింహళంలో అనేక కాలాల్లో అనేక రచనలు వచ్చాయి. 15వ. శతాబ్దంలో బర్మాలో "అభిధమ్మ"ను గూర్చి విస్తార పరిశ్రమ చేశారు. ఆ విధంగా పాలీ భాషకు సంబంధించిన అనేక లక్షల గ్రంథాలు దక్షిణ భారత దేశంలో-బర్మా, సిలోన్ దేశాల్లో వెలుగులోకి వచ్చాయి.

టిబెట్‌లో 7వ. శతాబ్దంలో బౌద్ధం ప్రవేశించింది. 9వ. శతాబ్దం నాటికి బౌద్ధ వాఙ్మయమంతా టిబెట్ దేశ భాషల్లోకి అనువదించుకున్నారు.

నిశిత తార్కికుడైన నాగసేనునకు, గ్రీకురాజైన మిలానందునకు మధ్య జరిగిన సంభాషణ - బుద్ధోపదేశానికి ప్రమాణ గ్రంథంగా పరిగణింపబడింది.

★ ★ ★

బౌద్ధమతం క్రమంగా సముద్రాలుదాటి విస్తరించింది. బౌద్ధ మతాన్ని స్వీకరించిన మొదటి విదేశం - చైనా క్రీ. పూ. 67లో

అది చైనా ప్రవేశించింది. దానితో ఇండియా - చైనాలమధ్య సత్సంబంధాలు - సాంస్కృతిక, వ్యాపార సంబంధాలు ఏర్పడ్డాయి. కేవలం బుద్ధుని బోధలు తెలుసుకుని అధ్యయనం చేసేందుకు చైనా పండితులు, మత గురువులు — మేధా వంతులు — ఆశ్రమాధిపతులు భారతదేశం వచ్చి, సంస్కృతం నేర్చుకుని, బౌద్ధ వాఙ్మయాన్నంతా తమ మాతృ భాషలోకి-ఐదువేల ఐదువందల-ఎనభై ఆరు (5586) భాగాలుగా తయారు చేసుకున్నారు. అలా వచ్చిన వారిలో హుయాన్‌సాంగ్ ముఖ్యుడు. అతని రచనలు బాగా వెలుగులోకి వచ్చి-బౌద్ధ ధర్మం ప్రచారమైంది. ఆ విధంగా చైనాకి బౌద్ధమత సూత్రాల్ని తీసుకు వెళ్ళారు. కాని, అవి మొదట్లో ఒక క్రమంలో లేవు. తర్వాత పరిశోధనలు జరిపి, వాటిని సరిచేసుకున్నారు. క్రమంగా బౌద్ధ ధర్మం చైనాలో బాగా విస్తరించింది.. క్రీ.శ. 151. నాటికి తత్ఫలితంగా బౌద్ధ వాఙ్మయం అక్కడ 1440 గ్రంథాలుగా వెలువడ్డాయి.

క్రీ. శ. 400 నాటికే బౌద్ధమతానికి ఇండియాలో రాజాదరణ తగ్గింది. గుప్తరాజులు హిందూ మత పునరుద్ధరణకు పూనుకున్నారు. వర్గవ్యవస్థ స్థానంలో వర్ణవ్యవస్థ-కులవ్యవస్థ ప్రాబల్యంలోకి వచ్చాయి. శంకరుల అద్వైత సిద్ధాంతం ముందు ఆనాటి శూన్యవాద సిద్ధాంతం నిలవలేకపోయింది. క్రమంగా బౌద్ధమతం ఇండియా వదలిపోవలసిన సమయం ఏర్పడింది. బౌద్ధ సంఘాలు చెల్లాచెదురయ్యాయి. బౌద్ధం - తన స్వరూపాన్నే కోల్పోయింది, ఇండియాలో.

* * *

క్రీ. శ. 500 ప్రాంతంలో కొరియారాజు రాయబారి ద్వారా బుద్ధుని విగ్రహాన్ని-బౌద్ధ ధర్మాల్ని-కొన్ని బౌద్ధ సూత్రాల్ని జపాన్‌కు పంపించారు. దానితో తూర్పు దేశాల్లో బౌద్ధం ప్రవేశించి త్వరలో అధిక ప్రాబల్యాన్ని పొందింది. బౌద్ధంతోపాటు ఆయాదేశాల్లో కొత్త నాగరికత-కొత్త ఆలోచనా విధానం-కొత్త సాంస్కృతి చోటు చేసు

కున్నాయి. ఆరామాలు-స్థూపాలు, ఆలయాలు, మండపాలు-కట్టడాలు లేచాయి. సెంట్రల్ ఆసియా, చైనా సౌత్‌సీదేశాల్లో మతైక - తాత్త్విక మేధావర్గం బౌద్ధంపై తీవ్రంగా పనిచేసింది. చివరికి చైనాలో బోధిధర్మ ఆధ్వర్యంలో "జెన్" అనే ధ్యాన విధానం ఒకటి అవతరించింది.

జపాన్‌లో బౌద్ధమతం, దేశమతమైంది. వారు బౌద్ధ మతాన్ని తమ పద్ధతుల్లోకి తిప్పుకున్నారు. అనేక పరిశోధనలు పరిశీలనలు జరిపి, క్రీ.శ. 8వ శతాబ్దం నాటికి పూర్తిగా బౌద్ధం స్వీకరించింది. జపాన్ అదంతా మహాయానమార్గం. అదే ఇప్పటికి జపాన్‌లో స్థిరంగా వుంది. అలాగే బౌద్ధ సూత్రాలు చైనా, కొరియా, సిలోన్ కంబోడియా, టర్కీ మొదలైన తూర్పు దేశాల భాషల్లోకి అనువదింపబడ్డాయి. ఆ తర్వాత లాటిన్, ఫ్రెంచ్, ఇంగ్లీషు - జర్మన్, ఇటాలియన్ భాషల్లోకి అనువదించబడ్డాయి. క్రమంగా బౌద్ధం టిబెట్ వరకు వ్యాపించి, అక్కడ స్థిరపడింది. ఆ దేశ ప్రజలు బౌద్ధ సూత్రాల్ని తమ దేశభాషల్లోకి అనువదించుకున్నారు. ఎన్నో వేల గ్రంథాలు-వాటిపై వ్యాఖ్యలు-విమర్శలు-వచ్చాయి. ఆనాడు భారత దేశంలో నలంద - విక్రమశిల విశ్వవిద్యాలయాలు బౌద్ధమత ప్రచారానికి కేంద్రాలుగా మిగిలాయి.

* * *

క్రీ.పూ. 500లో ప్రారంభమైన బౌద్ధమతం క్రీ.శ. 500 నాటికి హిందూదేశ ప్రజల్లో పూర్తిగా బలహీన పడింది. బుద్ధుడు బోధించిన ధర్మం చాలా తేలికగా ఇండియాలో అదృశ్యమైంది. ఒక కలలాగ కరిగి పోయింది. చరిత్రలో ఆ విధంగా మరేమతానికీ జరగలేదు. ఎన్ని విపత్కర పరిస్థితులు ఎదురైనా, ఎటువంటి సిద్ధాంతాలతోనూ బుద్ధుడు రాజీపడలేదు. "ధర్మాత్ములం" అనుకునే-అనబడే వారంతా - బుద్ధుణ్ణి అవహేళనచేసి, విమర్శించి, నిందించి, నిరసించి, ఖండించారు. బుద్ధుడు రాకుమారుడని తెలియగానే

కొందరు రాజులు ఈర్ష్యపడ్డారు. కొందరు వ్యతిరేకించారు. కొన్ని వర్గాలవారు, కొన్ని మతాలవారు బుద్ధునిపై తిరుగుబాటు చేశారు. దేవదత్తుడు వంటి అనుచరులే అఘాయిత్యాలకు పాల్పడ్డారు. పిల్లల్నీ, స్త్రీలనూ, సంఘంలో చేర్చుకుంటారనీ, సుఖసంసారాల్ని విచ్ఛిన్నం చేస్తున్నారనీ, యజ్ఞయాగాది క్రతువుల్ని నిరసిస్తున్నారనీ, అమాయకపు ప్రజల్ని తన ఆకర్షణతో తమ మతంలోకి మారుస్తున్నారనీ, పరాన్న భుక్తులనీ నిందా ప్రచారం చేశారు.

బుద్ధుని అనంతరం అనేక కష్టాలకు, బాధలకు, యాతనలకు గురైన కొందరు శిష్యులు, విదేశాలకు వలసపోయారు. ఆ విధంగా వెళ్ళినవారు ఆసియా అంతటా వ్యాపించారు. వెళ్ళిన ప్రతిచోటా ప్రజల్ని బౌద్ధులుగా మార్చారు. అక్కడి ప్రజలతో సంధి సంప్రదింపులు జరిపి, ఒడంబడికలు చేసుకుని వారి సాంప్రదాయాల్ని, ఆచార వ్యవహారాల్ని తెలివిగా తమ మనుగడకోసం పాటించారు. ఆ విధంగా వారు స్థానికులను అన్ని విధాలా అంగీకరించి తీసుకోవడంతో తాము గౌరవింపబడుతేకాక, ఆదరణా లభించేది. ఆ శిష్యులే-ఆ అనుచరులే ఇండియాలో ఎప్పుడూ ఏ మతంతోనూ, ఏ సిద్ధాంతంతోనూ సంధి—ఒడంబడిక- రాజీపడి - అంగీకారం పొందలేదు. అది గురుద్రోహంగా భావించి-కష్టాలు - బాధలు, యాతనలు పడి—చివరికి చావులకూ తెగించారేకాని, ఎవరితోనూ ఎటువంటి సంధి సంప్రదింపులూ, ఒడంబడికలూ చేసుకోలేదు. అటువంటి బౌద్ధమతం విదేశాలలో- అన్నిరకాల మతాల, సిద్ధాంతాల, వర్గాల వారితో స్వేచ్ఛగా చేయి కలిపింది. బుద్ధుడు బ్రతికి వున్నంతకాలం, హిందూమతం బౌద్ధమతాన్ని ఏమాత్రం ఎదుర్కోలేక పోయింది. ఎందరు పండితులు, మేధావులు ఎంత తర్కించి, వివరించి ప్రయత్నాలు చేసినా, బుద్ధుడు చలించలేదు. ఆయన ఎదుట వారంతా కేవలం చిలకలు మాదిరిగా తాము చదివి, విని, సంపాదించిన జ్ఞానంతో ప్రవసించారు. అది వారి అనుభవజ్ఞానం కాకపోవుటచేత బుద్ధుని ముందు అవన్నీ పేలవమై పోయాయి. వాళ్ళంతా- స్వాను

భవ జ్ఞానం కాక, ఎవరో - గురువులో - గ్రంథమో చెప్పారంటూ చెప్పేవారు. వారు మూఢ నమ్మకాలతో తర్కించి ఎప్పటికీ నిలవలేక పోయేవారు. బుద్ధుని జ్ఞానం, స్వానుభవం కనుక, దానికే అధికారం ఉంటుంది. అది శక్తివంతమై, ప్రకాశిస్తో వెలిగింది.

ఆనంద్, ఉపాలి, కాశ్యపుడు వంటి మహా మేధావంతులు, జ్ఞానవంతులు, అనుభవశాలురు, మేరువు పర్వతం వంటి ఎంతోమంది శిష్యులు ఆ మహాకాంతిలో వెలిగి, మహామౌనంతో ఉండేప్పటికి ఎవరూ ఏ మతం - వర్గంవారు దరి చేరలేకపోయారు. ఆ విధంగా ఆ శిష్య పరంపర కొంతి వెయ్యేళ్ళు నిలిచి వెలగడంతో ఎవరూ సాహసించి దాన్ని ఖండించలేకపోయారు. సమయం కోసం ఎదురు చూసిన హిందూమతానికి వెయ్యేళ్ళు పట్టింది బౌద్ధమతాన్ని ఎదుర్కోవడానికి.

ఏడవ శతాబ్దం వచ్చేప్పటికి ఇండియాలో బౌద్ధయుగం చాలా వరకు సమాప్తమైనట్లేనని చెప్పవచ్చు. బౌద్ధమతంలోనూ చాలా మార్పులు వచ్చాయి. అది రెండుగా చీలింది. ఒక శాఖవారు బుద్ధుని బోధలను - కఠోర నియమ నిష్ఠలతో అనుష్ఠించ నారంభించారు. రెండవ వర్గంవారు బుద్ధుని బోధల్ని తమ ఇచ్ఛానుసారం నడలించుకున్నారు. మొదటిది మహాయానం. వారి భాష సంస్కృతం. రెండవది - హీనయానం. వారి భాష పాళీ భాష. వారిమధ్య ముఖ్యమైన భేదం - విమోచనో - నిర్వాణమో - అది తమకోసమే కృషిచేసేది, హీనయానం. అందరి విముక్తికోసం - అంటే, సర్వజీవుల నిర్వాణ స్థితికి - సంబుద్ధత్వ స్థితికి కృషి చేసేది - మహాయానం - అంటే, నైతిక సంబంధమైన మార్గదర్శకత్వం కోసం హీనయానం వారు పాటుపడితే, గుప్తవిద్యల, శక్తుల సాధనకు తంత్రయానాన్ని, సాంప్రదాయాన్ని మహాయానంవారు తీసుకున్నారు. అందరి విమోచన కోసం - అజ్ఞాన నిర్మూలంకోసం మహాత్ములు మళ్ళా మళ్ళా అవతరిస్తారంటుంది మహాయానం. మహాయానం మంగోలియా,

టిబెట్, చైనా, జపాన్, కొరియా దేశాల్లో విస్తరించింది. అందు, మంత్ర, తంత్ర, మార్మిక విషయాలు ప్రవేశపెట్టబడ్డాయి. వాటికి తోడు మూఢ నమ్మకాలు - అంధ విశ్వాసాలు, కర్మకాండలు ప్రబలాయి.

రెండవది హీనయానం. అది సింహళం, సయాం, బర్మా, జావా, మొదలగు దేశాల్లో స్థిరపడింది. క్రమంగా ఆ రెండు శాఖ ల్లోనూ మార్పులు వచ్చాయి. తర్వాత ఉపశాఖలూ ఏర్పడ్డాయి. ఆ కాలంలో సౌరాష్ట్ర రాజకుమారుడైన శాంతి దేవుడు రాజ్యాన్ని పరిత్యజించి బౌద్ధ భిక్షువై రెండు గొప్ప గ్రంథాలు రాశాడు. 1) The path of light 2) శిక్షాసముచయం.

బౌద్ధమత పతనానికి హిందూదేశంలో అనేక ఇతర కార ణాలు ఎదురయ్యాయి. బౌద్ధంలో అనేక సంఘాలు ఏర్పడి బౌద్ధ ధర్మంమీద స్వంత వ్యాఖ్యలు చేయనారంభించాయి. ఆ సంఘాలు తమదే సరైనది - మూలసిద్ధాంత పరమైనది అంటూ మొండి పట్టు దలల వరకు వచ్చి తగాదాలు పడ్డాయి. వాటికి తోడు దేశంలో శైవ-వైష్ణవ - తాంత్రిక మతశాఖలు వచ్చి - బౌద్ధమతాన్ని గట్టిగా ఎదుర్కొన్నాయి. దేశకాలాలకు అనుగుణంగా మహాయాన శాఖ వారు ప్రవర్తించి - వారికి తగినట్లుగా - వారికి అనుకూలంగా - తమ పద్ధతులను మార్చుకున్నారు. ఏకాకి, నిరాడంబరి - నిశ్చల, నిర్మల మనస్కుడు అయిన బుద్ధుని చుట్టూ క్షుద్ర ఆరాధనా విధానం - యోగప్రక్రియలూ, అద్భుతాలు - మహిమలు చేయడం, చూపడం, దూరశ్రవణం, భూత - పిశాచాదికములను దర్శించడం - గారడీ ప్రదర్శనలు - ఇవ్వడం, బుద్ధుణ్ణి దేవుణ్ణి చేయాలని చేపట్టిన పుక్కిటి గాథలు ప్రకటించి - ప్రచారం చేయడం, మూఢనమ్మకాలు, అంధ విశ్వాసాలు, సాంప్రదాయాలు, పద్ధతులు క్రమంగా బౌద్ధంలో కలి శాయి. స్వార్థపరత్వం, భోగలాలసత్వం సన్యాసులలో కనుపించ డమేకాక, బౌద్ధమతాన్ని హిందూమతంలో ఒక శాఖగా మాట్లాడ

నారంభించారు. కొందరు బుద్ధుణ్ణి, విష్ణు అవతారమన్నారు. క్రమంగా మహాయానం, హిందూతత్త్వంలో కలిసిపోయింది. దానితో బ్రాహ్మణమతం బలం పుంజుకుంది. బౌద్ధమతం వ్యక్తి వ్యాపారంలో దిగింది. క్రమంగా బౌద్ధమతాకాశమంతా కలుషితం అయింది.

క్రీ. శ. 5వ శతాబ్దంలో— "పదార్థం, మార్పులేని అణు సముదాయం" అనేభావం బౌద్ధంలో చోటుచేసుకోవడంతో హీనయాన శాఖలో- వైభాషిక— సౌతాంత్రిక అనే రెండు ఉపశాఖలు ఏర్పడ్డాయి. భౌతిక ప్రపంచం- భావప్రపంచం రెండూ వాస్తవమైనవనీ, పంచేంద్రియాల ద్వారా ఈ ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానాన్ని సాధించగలమనీ అంటారు, వైభాషికులు.

సౌతాంత్రిక శాఖవారు, భౌతిక- భావప్రపంచాలు రెండూ వాస్తవమైతే, వానిని పంచేంద్రియాల సహాయంతో సూటిగా గ్రహించలేము. అనుభవం ద్వారా మాత్రమే జ్ఞానాన్ని పొందగలం అంటారు.

అలాగే మహాయానశాఖలో "విజ్ఞానవాదం- శూన్యవాదం," అని, రెండు ఉపశాఖలు ఏర్పడ్డాయి. విజ్ఞానవాదంవారు— భౌతిక ప్రపంచమంతా మిథ్య. భావప్రపంచం మాత్రమే వాస్తవం. దానిని విజ్ఞానం ద్వారా మాత్రమే తెలుసుకోగలం. అందుకుగాను యోగ నియమాలను అవలంభించాలి అంటారు.

భౌతిక- భావప్రపంచాలు వాస్తవమూ కావు, అవాస్తవమూ కావు, అవి- కార్యకారణ సూత్రానికి అనుగుణ్యంగా పరస్పర ఆధారమైనవి" అంటుంది శూన్యవాదం. పైగా- భౌతిక— భావ ప్రపంచాల ఘటనలన్నీ క్షణికమన్నారు. ఈ సిద్ధాంతాన్ని బాగా ప్రచారం చేసినవారు- ఆచార్య నాగార్జునుడు. ఆయన నాగార్జున కొండమీద ఉండేవారు. అక్కడ ఒక విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. భౌతిక-భావ ప్రపంచాలు వాస్తవమో, అవాస్తవమో తేల్చ

నందువల్ల, ఈ వాదాన్ని శూన్యవాదమనీ, లేక మిథ్యావాదమనీ వ్యవహరిస్తారు.

కార్య-కారణ సూత్రానికి నాగార్జునుడు "శూన్యత" అని పేరుపెట్టాడు. సర్వం క్షణికం. ఏదీ శాశ్వతం కాదు. ప్రతీదీ మార్పు చెందుతుంది. అన్నీ- ఒకక్షణం- మాత్రమే- తమతమ రూపాల్లో ఉండి, మరుక్షణంలో మరోరూపం ధరిస్తాయి. అన్నీ- కార్య, కారణ బద్ధమూ, క్షణికమూ. "ప్రతి మార్పు, ఆంతరంగిక వైరుధ్యాల ఫలితంగా జరుగుతుంది," అని జర్మన్ తత్త్వవేత్త హెగెల్ ఒక అఖండ భావాన్ని ఊహించాడు. అలాగే నాగార్జునుడు కూడా ఈ వాస్తవిక ప్రపంచం చాటున వేరే ఏదో వాస్తవమైన- శాశ్వతమైన సత్యం ఒకటి ఉందన్నాడు. అంటే, ఈ దృశ్య మాన ప్రపంచానికి వేరుగా-భిన్నంగా, అన్యంగా, అతీతంగా వేరొక వాస్తవ ప్రపంచం- ఏదో ఉందని ఊహించాడు. బౌద్ధ సిద్ధాంతాలన్నింటిలోకి శూన్య వాదం విశేష ప్రచారం పొంది, దేశదేశాలు వ్యాపించింది. దానితో బుద్ధుని దేవునిగా ఆరాధించడం ఆరంభమైంది. బౌద్ధం, ముఖ్యా ప్రజాదరణ పొందింది.

బ్రాహ్మణమత పద్ధతిలో బుద్ధుని సగుణమూర్తిగా ఆరాధనలు ఆరంభించారు. విగ్రహారాధన పనికిరాదని, ఎవరికివారు తమను తాము తెలుసుకుని నిర్వాణం పొందాలని హీనయానంవారి వాదన. వారు, కేవలం బౌద్ధధర్మాలే పాటిస్తారు. ఆంతరంగిక దృష్టే, వారికి ముఖ్యం, ప్రధానం. వారికి బాహ్యప్రపంచంతో సంబంధం లేదు. ఆ విధానం బర్మా, సిలోన్ దేశాల్లో బాగా వృద్ధి చెందింది.

బౌద్ధమతానికి విస్తార ప్రజాదరణ- ప్రచారం లభించాలంటే, విగ్రహారాధన, అవసరమన్నారు కొందరు. అన్ని వర్గాలవారికీ బుద్ధుని సిద్ధాంతాలను, అందించడం ముఖ్యమనీ, యోగం—దైవభక్తి వుండాలనీ అంటుంది మహాయానం. అందుచేత అది నేపాల్— చైనా దేశాల్లో బాగా వ్యాప్తి చెందింది. ఆనాడు హీనయాన-మహా యానాల మధ్యగల భేదం - ముఖ్యంగా - ఉపదేశంకోసం ఆవేశపడ

టం, ఉపదేశానికి యత్నించడం, గతజన్మల్లో సత్ఫలితాలు కలిగి వుండటం,- లక్ష్యం, గమ్యం చేరడంలో కాలనిర్ణయం,- ఈ పద్ధతుల్ని పూర్తిగా అనుసరిస్తున్న మహాయానమే చివరికి గెలిచింది. అది-పెద్ద వరవలాగా తూర్పు దేశాలమీద విరుచుకుపడింది. దాన్ని నాగార్జునుడు కూడా గట్టిగా బలపరచి, ప్రచారం చేశాడు.

ఈనాడు బౌద్ధంలో హీనయాన, మహాయాన-అనే రెండు ప్రధానశాఖలు మాత్రమే అమలులో వున్నాయి. హీనయానం - అదే తెరవాడ-బుద్ధుని ప్రథమ శిష్యులతో సంఘపెద్దలతో కూడినది. అది ప్రస్తుతం బర్మా, సిలోన్ – థాయ్‌లాండ్ (సయాం) కంబోడియా దేశాల్లో వ్యాప్తిలో వుంది. హీనయానంలోంచి వచ్చిందే మహాయానం అది టిబెట్, చైనా, జపాన్, దేశాల్లో స్థిరపడి, వృద్ధి చెందింది. బౌద్ధ వాఙ్మయం యావత్తూ ప్రపంచభాషలన్నింటిలో ఈనాడు లభ్యమౌతోంది.

* * *

బౌద్ధం సర్వజనామోదయోగ్యమైన, ఆచరణ సాధ్యమైన ధర్మం బోధించిందేకాని, వ్యక్తిగత ప్రాముఖ్యత గురించి - అమ్మోతాత్మ గురించి చెప్పలేదు-ఎవరికి వారు తమను తాము లక్ష్యం చేరుకునేందుకు నైతిక విలువలను ప్రసాదించింది. ధర్మమంటే - నిష్కల్మషమైన జీవితం గడపటం-జీవితంలో పరిపక్వత సాధించడం - నిర్వాణపథంలో పయనించడం - కాంక్షను విడనాడటం - సర్వం అనిత్యం, అశాశ్వతం అని విశ్వసించడం-నైతిక విధానానికి కర్మ (నిర్వర్తన) ఆధారమని నమ్మడం. ఆ విధంగా బౌద్ధం రాగ - ద్వేష – మోహాల నుంచి విముక్తి మార్గం చూపింది. అటువంటి బౌద్ధాన్ని ఒక మతం అనడంకన్నా - మహోన్నత ధర్మం అనడం సమంజసం. ధర్మమంటే-ఏది వాస్తవంగా వుందో - అదే ధర్మం. పాలీ భాషలో ధర్మాన్ని "ధమ్మ" అంటారు. ధర్మమనేది వ్యక్తిగత అనుభవం మీద ఆధారపడి వుంటుంది. అందుచేత బౌద్ధం బుద్ధికి - విజ్ఞతకు-నచ్ఛీలం, సత్ప్రవర్తనలకు ప్రాధాన్యం ఇస్తుంది. ధర్మానికి

భిన్నంగా-అన్యంగా-విడిగా మరో దేవుడులేడు. అలాగే—ఆత్మ-స్వర్గ, నరకాలు- మూఢ నమ్మకాలు ఏమీలేవు: ఉన్నది ధర్మం ఒక్కటే-అది సామాజిక ధర్మం. శీల-ప్రజ్ఞ - సమాధి సహితమైనది. దానికి అందరూ, అంతా ఒకటే, సమానమే. అది సత్యానికి సంబంధించిన సిద్ధాంతం. ఏదైనా ఒకటి - ఒక సిద్ధాంతమైతే, అది తన స్వంత బలంపై నిలబడాలేకాని, మనిషి అజమాయిషీకి లోబడివుండ కూడదు. అలా అయితే అది సిద్ధాంతమేకాదు. ధర్మాచరణ పేరులు సమ్యక్ దృష్టి కలిగి ఉపవాసాలు, ప్రార్థనలు నిష్ప్రయోజనాలని గ్రహించి - ఆహారం కన్నా సత్ప్రవర్తన, మడి- ఆచారం కన్నా పవిత్రత అలవరచుకుంటారు. అదే బౌద్ధం బోధించిన ధర్మోపదేశాలు. ఆ మార్గం, సామాన్యులకు సహితం సులభ సాధ్యంగా వుంది. బాధనుంచి విముక్తిని ప్రసాదించే మహత్తర సాధనమది.

కాని, నిత్య జీవితంలో ధర్మంకానిది ఎంతో-ఎన్నో విధాలుగా అనుక్షణం చోటు చేసుకుంటూనే వుంటుంది. ప్రకృతికి అతీతమైనవి ఉన్నావని నమ్మడం - అది ధర్మాచరణలో ఒక భాగం కావడం-బ్రహ్మలో ఐక్యమగుటే జీవితధ్యేయమని విశ్వసించి యజ్ఞ యాగాది క్రతువులు ఆచరించడం, ధార్మిక గ్రంథాలు చదవడం, అవే దోషాతీతమైనవని నమ్మడం—ఇవన్నీ ధర్మంకాదు.

మైత్రిని పెంపొందించేది, కరుణను బోధించేది, ప్రజ్ఞా ప్రాముఖ్యతను తెలిపేదీ, జ్ఞానార్జన అందరికీ — ఎల్లప్పుడూ అందుబాటులో వుంచే ధర్మమే, సద్ధర్మం. అంటే, సామాజిక అవరోధాలను కూల్చివేయగల ధర్మమే, సద్ధర్మం. పుట్టుకను బట్టికాక, వ్యక్తిగత విశిష్టతను— వికాసాన్ని బట్టి విలువను నిర్ణయించాలనుకోవడం-మనిషికి, మనిషికి మధ్య సమత్వాన్ని బోధించడమే సద్ధర్మం. అటువంటి సద్ధర్మంలో పయనించేందుకు మరొకరితోడు— సహాయం అవసరం లేదు. మనం చేయవలసిందీ చూడవలసిందీ మనసులోని మాలిన్యాలను ప్రక్షాళనం చేయడం. ప్రపంచాన్ని సద్ధర్మ రాజ్యంగా మార్చడం జ్ఞానసముపార్జనకు ప్రజ్ఞ ఒక్కటే చాలదు. దానికి శీలం కూడా తోడుకావాలి. అంతేకాదు — దానికి కరుణయొక్క

ఆవశ్యకత ఎంతో వుంది. కరుణ అంటే, మనుష్యులమధ్య అవగాహనతో కూడిన మైత్రి, ప్రేమ- ఇతరులకు హాని, కష్టం, నష్టం, బాధ, దుఃఖం కలిగించకుండుట- ఇతరుల తప్పులు ఎంచకుండుట- చెడు సంకల్పం లేకపోవుట- అణకువ, నిగ్రహం, పవిత్రత కలిగి ప్రశాంతంగా- ప్రసన్నంగా వుండటం- ప్రజ్ఞ, న్యాయం, సజ్జన సాంగత్యం కలిగివుండటం-అవీ బౌద్ధ ధర్మంలోని ముఖ్యవిషయాలు. ఆ విధంగా జీవితం ధర్మమయం చేసుకోమన్నాడు బుద్ధుడు. ఆ మార్గమంతా మనిషికి- మనిషికి మధ్యకల సంబంధం మాత్రమే. అది సంఘపరమైనది. అది సత్యం, సమత్వం, వాస్తవం మీద ఆధారపడినది. అది నీతిపరమైనది. అది దివ్యజ్ఞానం. అది అందరికీ అనుసరణీయమైనది, ఆచరణీయమైనది.

శాశ్వతమైన, నిత్యనూతనమైన ఆ ధర్మం, ఒక మతమైతే- అది మతాలకు మతం. అదే మొదటి మతం అనవచ్చు. దానిలక్ష్యం సమస్త ప్రాణికోటికి దుఃఖవిమోచన కలిగించడం. కనుక మానవుని లోని దుఃఖతీవ్రత తగ్గించడానికి, ఉపశమనం కలిగించడానికి బౌద్ధ ధర్మం అద్భుతంగా పనిచేస్తుంది.

ఈ విశ్వమంతా ధర్మస్వరూపం....ఆ ధర్మం ప్రకారమే నడుస్తోంది విశ్వం- ఒకక్రమంలో. ఆ ధర్మంపైనే ఈ విశ్వం ఆధారపడి వుంది. ధర్మపరుడు సమస్త దుఃఖాలనుంచి విముక్తుడై, శాంతిగా వుంటాడు. అటువంటి ధర్మాన్ని మనకు మనం కనుక్కోవలసి వుంది. మన స్వభావం— గుణం- శీలం- నడవడి- ప్రవర్తన వృద్ధి చేసుకోవడం ద్వారా దాన్ని కనుక్కోగలం. అటువంటి సౌశీల్యం కోసం ఎటువంటి ప్రత్యేక యోగభ్యాసం చేయనవసరం లేదు. అలౌకిక శక్తుల్ని పొందనవసరం లేదు- మనోనిగ్రహంతో- ఉద్రేకాల్ని పరిశుభ్రం చేసుకుంటే చాలు.

* * *

మహాత్ములు- మేధావులు ఒక లక్ష్యాన్నో- ఉద్దేశ్యాన్నో- ఆదర్శాన్నో- అభిప్రాయాన్నో, ధర్మాన్నో దృష్టిలో పెట్టుకుని ఏర్పరచినదే మతం- అది, మనోజనితం. అది ఒక నియమాన్ని-

పద్ధతిని ఏర్పాటుచేసి, మనిషి ఏం చెయ్యాలో, ఏం చెయ్యకూడదో శాసిస్తుంది. అవి అణగారిన వారికి ఓదార్పును, ఉపశమనాన్ని కలిగిస్తే- కొందరికి మార్గదర్శకత్వం వహిస్తాయి. మరికొందరి యెడల పోలీసు అధికారిగా తయారైనాయి. అది-ప్రవక్త ప్రవచనం గానో, దేవదూత దివ్యవాణిగానో, ప్రజాజీవనంలో ప్రవేశించి, ప్రచారమై కాలంలో స్థిరపడి, చివరికి వ్యక్తినో, గ్రంథాన్నో ప్రధాన ఆధారంగా వుంచుతాయి. దానికి ప్రజలు విధేయులై, విశ్వాస ముంచి- దాన్ని విముక్తి మార్గంగా- మూలాధారంగా తీసుకుని, ఆరాధించి- సాంప్రదాయం చేసి- నియమనిబంధనలు, సిద్ధాంతాలు, పద్ధతులు, మార్గాలు ఏర్పాటుచేసి- వాటిని తమ భావితరాలవారికి అందిస్తారు. ప్రతిమతం తమ మతం తాలూకు గుర్తులు- చిహ్నాలు— రూపాలు- చిత్రాలు- విగ్రహాలు- గురువులు, గుడులు, గ్రంథాలు- సిద్ధాంతాలు, నమ్మకాలు మొదలైనవి ఎన్నో కల్పిస్తాయి. ఆయా మతాలకు చెందినవారు వాటిగురించి ఏమాత్రం విచారణ చేయక- అనేక దైనందిన కారణాలకు వాటిని తీసుకుని, అంగీకరించి, అనుస రించి, ఆచరిస్తారు. వారికి మతమంటే, ఓ నియమం, పద్ధతి- అది వారికి రక్షకభటుడు వంటిది. వారి ఆధ్యాత్మిక ఆసక్తికి తల్లివంటిది. అందుచేతనే ప్రతిఒక్కరూ జీవితాంతం దానికి విధేయులై వుంటారే కాని, బైట ప్రపంచాన్ని-లోపలి ప్రపంచాన్ని ఒకటిగా చూడరు. జీవితమే మతమని, సర్వకర్మలు, సమస్త ఫలితాలు మతమనే సంగతి విస్మరిస్తారు.

"ప్రతి మతంలోనూ వేదాంతం, పురాణం, కర్మకాండ" అనే మూడు ప్రధాన అంశాలు వుంటాయి. వేదాంతం, విజ్ఞానులకు- తార్కికులకు అవసరం- నీచప్రకృతినుంచి- మూఢ విశ్వాసంనుంచి తప్పుకోమంటుంది. వేదాంతం. ప్రేమ స్వరూపమైన సన్యాస తత్వాన్ని కర్మరంగంలో ప్రదర్శించడమే, అనుష్ఠాన వేదాంతం- రెండవది- పురాణం: అది— రసపిపాసులకు ఏర్పడింది. అది అనుభ వాలకు అందేది. మూడవది- కర్మకాండ. అది- మిగిలిన జనసామా న్యానికి- నిర్దేశింపబడింది. వస్తువులవల్ల కలిగేది సుఖం కనుక,

మతాలుకూడా అఖండ సుఖాలు పొందడానికి సాధనాలేకాని పరమా వధులు కానేరవు.

మతమంటే, మశీదు, చర్చి, గుడికాదు. క్షణక్షణానికి లోపలా - బైటా కదలికలకు పూర్తి ఎరుకలో వుండటం. స్వధర్మానుష్ఠానంతో పారమార్థికమైన శ్రద్ధ గడించడం. అందు శ్రద్ధ ముఖ్యం. శ్రద్ధే, సర్వసిద్ధికీ మూలం. ఏ మతానికైనా నైతికబలం వెన్నెముక వంటిది. తనలో - ఇతరులలో వున్న దివ్యత్వంలో - మంచితనంలో విశ్వాసముంచడమే, మతం. అంతా, అన్నీ సమానమే, ఒకటే అనే భావం కలిగివుండటం. అదే నిజమైన మతం. ఎదురుతిరిగే, లేక పారిపోయే అలవాటు కలిగిన మనసును పక్కన పెట్టమంటుందా మతం. ఎట్టి పరిస్థితులలోనూ కామం - కాంక్ష జీవితాన్ని లోబరుచు కునే అవకాశాన్ని ఇవ్వకూడదంటుంది. ఎందుకంటే, కామానికి సమానమైన అగ్ని లేదు. తృష్ణకు సాటియైన ప్రవాహం లేదు. తృష్ణా తత్పరతే మానవులలో గల సహజ శక్తులను ప్రకోపింపజేస్తుంది. క్షుద్రమైన కామభావము నుండి- పరమోత్కృష్టమైన ప్రేమభావం ఉదయింప జేసినమతం, బౌద్ధమతం.

ఇంతకాలం మతమువేదాన్ని అపార్థం చేసుకోవడమే జరిగిం దనిపిస్తుంది. అది చాలావరకు మనిషికి-దేవునికి మధ్య గల సంబం ధం మాత్రమే. అది కేవలం నమ్మకం- విశ్వాసం, అభిప్రాయం మీద ఆధారపడినది. అది పరిమితమయినది. అది పూర్తిగా విషయ విజ్ఞానమయం. దైవం- ఆత్మ ప్రార్థన— పూజ- యజ్ఞయాగాది క్రతు నిర్వహణ— మొదలైన విషయ ప్రాముఖ్యతే కాని, అందు నీతికి ప్రత్యేకస్థానం వున్నట్లు తోచదు. మనిషికి నీతిని మించిన ధర్మం మరొకటి లేదు- అంటుంది బౌద్ధమతం. ఆ నీతి- పవిత్రమైనది- విశ్వజనీనమైనది అయివుండవలె నంటుంది. ఆ నీతే ధర్మం. ధర్మం యొక్క సారమే, నీతి- అందుకే బౌద్ధమతం నైతికంగా అన్ని మతాలకన్నా ఉన్నతమైనది అయింది. అది శీలానికే ప్రాముఖ్యం ఇస్తుంది, ఆ శీలాన్ని ప్రజ్ఞతో జోడించమంటుంది. నైతికంగా అంటే, తానూ సమస్త జీవకోటి ఒకటిగా వుందని ప్రేమించడం.

బౌద్ధమతం విశ్వజనీనమైనది. సహనం- సచ్ఛీలం- నీతి- అహింస- హేతువాదం వంటి వాటి మేటి కలయికయే బౌద్ధమతం. ఒకరినొకరిని దగ్గరకు చేర్చి- సమైక్యపరచి, సమానత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను చేకూర్చేదే బౌద్ధమతం. స్వచ్ఛమైన- నిష్కళంకమైన జీవితాన్ని గడపమనీ- అలాగే పవిత్రంగా ఆలోచించమని చెప్పేదే బౌద్ధమతం. మానసిక పవిత్రతే మతమన్న మానవోత్తముడు బుద్ధుడు. ఆయన బోధించింది విశ్వాసం - సమ్మకం - సాంప్రదాయం లేనివారికీ సమస్తం-సమగ్రంగా-సమూలంగా తెలుసుకుని, తత్సంబంధమైన జ్ఞానాన్ని సముపార్జించుకుని, దాని ఆధారంతో విచారణచేసి-అవగాహన చేసుకోమంటుంది బౌద్ధమతం. దాన్నే "నివృత్తి పథం" అన్నారు బౌద్ధులు.

అన్ని మతాలు ఇంద్రధనస్సులోని రంగులు వంటివే. అసలు వున్నది స్వచ్ఛమైన తెలుపు ఒక్కటే. ఏ రంగూ, తక్కిన రంగులు కంటే గొప్పదీ-భిన్నమైనదీ కాదు. అలాగే ఏ మతస్థుడూ తక్కిన మతానుష్ఠాన పరునికన్నా అధికుడూ కాదు. అన్ని మతాల, సిద్ధాంతాల, శాస్త్రీయ గ్రంథాలకంటే గొప్పది- సత్యం. అవి ఏవీ సత్యాన్ని సంపూర్ణంగా ప్రతిబింబించజాలవు. అటువంటి సత్యం - ధర్మం - బోధించేప్పటికి- అప్పటికి వున్న హిందూ, వైదిక, సనాతన మతాలన్నీ బుద్ధుణ్ణి- బౌద్ధమతాన్ని వ్యతిరేకించాయి.

ఇండియాలో పుట్టి- ఇండియాలో అభివృద్ధిచెంది- విదేశాలకు వ్యాపించినా ఇండియాలోనే బౌద్ధమత పతనానికి బీజాలు ఏర్పడ్డాయి. కాలక్రమేణా ప్రపంచంలో అనేకచోట్ల అనేకమంది మహాత్ములు, మేధావంతులు, జ్ఞానులు, ప్రవక్తలు అంతరించి- అనేక కొత్త మతాలు- మార్గాలు ఏర్పాటు చేశారు. ఆ తర్వాత బౌద్ధమతానికి రాజాదరణ తగ్గిపోవడంతో, ప్రజాదరణ కూడా తగ్గిపోయింది. దానితో వ్యతిరేక వర్గాలవారు బౌద్ధంపై బాహాటంగా తిరుగుబాటు లేవదీశారు. దానికితోడు అసమర్థులైన రాజులు వారసులు కావడం, విదేశీ దండయాత్రలు- దేశంలో అనైక్యత-కల్లోలాలు- యుద్ధాలు- అశాంతి మొదలైనవి కూడా బౌద్ధమత పతనానికి తోడ్పడ్డాయి.

ఆ తర్వాత దేశంలో కుమారిలభట్టు - శంకరాచార్యులవారి ప్రభావం అధికమైంది. హిందూమతం, బౌద్ధమతసిద్ధాంతాల్ని, పద్ధతుల్ని ఏదో ఒకరూపంలో - ఏదో ఒక విధంగా అంగీకరించి తీసుకోవడంతో బౌద్ధమతం మరింత నీరసపడిపోయింది. అది, ఇండియాలో ఎనిమిది వందల సంవత్సరాలు మాత్రమే బహుముఖంగా వికాసం చెందింది. ఆ తర్వాత చెప్పుకోదగ్గ పెద్దదెబ్బ - ముస్లిం దండయాత్ర. ఆ వెంటనే బ్రిటిష్‌పాలన- క్రైస్తవమత విస్తరణ.

ప్రపంచంలో ఎన్నిమార్పులు వచ్చినా, కొత్తగా ఎన్ని మతాలు- సిద్ధాంతాలు- వర్గాలు- ఇజాలు వచ్చినా- సర్వభూతదయా పర్వతమే బుద్ధుణ్ణి ఇన్నేళ్ళూ సజీవంగా నిలిపింది. అందుకే ఆయన నామోచ్చరణ ఒక మధురస్మృతిగా మిగిలి వుంది. అదే బౌద్ధ మతాన్ని కలకాలం నిలుపుతుంది. దాని పరిమళం- భూమి నాలుగు చెరగులా వ్యాపించేవుంది. అది- భారతీయ సంస్కృతిలో విడదీయ రాని ఒక ముఖ్యమైన భాగం అయిపోయింది.

భారతదేశంలో శిల్పం- చిత్రకళ బౌద్ధమతం ద్వారా వెలుగు లోకి వచ్చాయి. బౌద్ధమత ప్రచారం నిమిత్తం పాలీభాషకు లిపి ఏర్పరచి- దాన్ని ప్రచారంలోకి తెచ్చింది బౌద్ధులు - చైనాలో బౌద్ధులే మొదటి అచ్చుయంత్రాన్ని కనుక్కున్నారు. ఆయు ర్వేదం- రసాయన శాస్త్రం-వృక్షశాస్త్రం వంటివి బౌద్ధవిహారాల్లో వృద్ధి చెందాయి. నలందా- తక్షశిల- అమరావతి- నాగార్జునకొండ మొదలైన ప్రాచీన విద్యాకేంద్రాలన్నీ బౌద్ధసంస్కృతి ఫలితాలే, విద్యను ప్రజాసామాన్యానికి అందించింది బౌద్ధులే.

బౌద్ధమతం హేతువాదంతో ప్రారంభమైంది. అది ఆచరణకు అనువైనది, ఉద్రేకానికి కాకుండా, అది విజ్ఞతకు ప్రాధాన్యం ఇస్తుంది. బౌద్ధం ఒక ప్రత్యేకమైన- విలక్షణమైన నిర్వాణ మార్గం. అది సర్వోత్కృష్టమైన విముక్తి మార్గం.

* * *

ఆదిలో ఏ మతమైనా స్వచ్ఛమైనా జీవనది మాదిరిగా వుంటుంది. ప్రవాహవశాన-కాలంలో కలుషితమౌతుంది. బౌద్ధమతం కూడా కాలంలో వచ్చిన గ్రంథాలు - బ్రాహ్మణుల షడ్దర్శనాల స్పర్శగలవే అయినాయి. అంతేకాదు ఆర్షసాంప్రదాయమైన యోగ పద్ధతిని ఆమోదించి, అనుసరించాయి. స్వర్గ - నరకాల్ని అంగీక రించాయి. పాప-పుణ్యాలవంటి ఫలాల్ని ఆమోదించాయి. స్వాను భవంలేని బౌద్ధ భిక్షువులు తాము చెప్పే సంగతుల్ని ఏ విధంగానూ నిరూపించలేకపోయారు. ప్రజలకు అనుకూలంగా ప్రవర్తించి, జీవించవలసి రావడంతో, హిందూ శాస్త్రాల్ని-పద్ధతుల్ని-సాంప్రదా యాల్ని ఆశ్రయించారు. అలాగే - విదేశాలలో స్థిరపడ్డ బౌద్ధులు - ఆయాదేశ కాలపరిస్థితులకు అనుకూల విధానంలో బౌద్ధ ధర్మం బోధించారు. బుద్ధుణ్ణి దేవుణ్ణి చేశారు. ఆయన జీవితాన్ని పురాణం చేసి, ఆయన నామాన్ని, రూపాన్ని కలకాలం నిలపాలని విగ్రహాలు మలచి-ఆలయాలుకట్టి - ఆరామాలు నెలకొల్పి - స్థూపాలు నిర్మించి ఆరాధించనారంభించారు. ఆయన మాటల్ని సూక్తులు చేశారు. ఎన్నో సృష్టించారు - ఎంతో రాశారు. ఆయన పేరు మీద చివరికి సిద్ధాంతాల్ని-నమ్మకాల్ని- నియమనిష్టల్ని - ఆచార వ్యవహారాల్ని- కర్మ కలాపాల్ని-సాధనా విధానాల్ని - సాంప్రదాయాల్ని ఏర్పరి చారు.

బుద్ధుడు హిందువుగా జన్మించాడు. ఆయన అనుచరులంతా హిందువులే. కాని, ఆయన బోధించింది హిందూమతంకాదు. హిందూమత భావాల్ని - నూతన భావాలతో చెప్పారు. హిందూ మతంలో ధర్మం అంటే "బాధ్యత-DUTY"-అనే అర్థంలో వాడారు. భగవంతుడు మనపై సంకల్పంతో వుంచిన లేక విధించిన బాధ్యతగా చెపుతారు పెద్దలు. కాని, బుద్ధుడు ధర్మాన్ని ఈశ్వర సంకల్పంగా, ఈశ్వరేచ్ఛగా చెప్పలేదు. ఏ సందర్భంలోనూ ఆయన ఈశ్వర ప్రసక్తి తీసుకురాలేదు.

ప్రతి ఒక్కరినీ బలీయమైన మూడు శక్తులు-రాగం (కోర్కె)- ద్వేషం (అసూయ, ఈర్ష్య)- మోహం (భ్రాంతి) పట్టి జీవితాన్ని

దుఃఖమయం చేస్తాయి. మానవుని సన్మార్గ - సౌశీల్య - సత్ప్రవర్తన నుంచి దారితప్పిస్తాయి. రాగమంటే, అన్ని రూపాల్లో వుండేకోర్కె-అది-మానవుణ్ని స్వార్థపరుణ్ని చేస్తుంది. అధర్మపరునిగా మారుస్తుంది. లేదా-మర్మార్గునిగా, ఇతరుల యెడ చెడ్డవానిగా చేస్తుంది. భయంకరమైన ప్రవాహంలో ఎండుకట్టె కొట్టుకుపోవునట్లు-కోర్కె మానవుణ్ని ఈడ్చుకుపోతుంది, వినాశనకర భూమికలకు- పర్వతారోహకుని పోగమంచు అడ్డుకున్నట్లు-సత్యాన్వేషికి రాగాదులు అడ్డు వస్తాయి. అప్పుడు, అతనికి సరైన దారికనపడక — తికమక పడతాడు. ఒకే రకమైన కోర్కెతో అంధులైనవారు కొట్టుకు చస్తారు. తమ కోర్కె సాఫల్యం కోసం. అదీ మన, నిత్య జీవితం- దాని ఫలితం, దుఃఖం-దైన్యం.

రాగం వంటిదే ద్వేషం. అదే పగ, విరోధం, అసూయ, ఈర్ష్య—అది-నేరానికి దారి తీస్తుంది. వివేకం లేకపోతే - ద్వేషం, వానినే తినేస్తుంది. మూడవది, మోహం అది-చాలా సూక్ష్మమైనది. తమోమయా వరణశక్తి కప్పగా, వ్యక్తి తన స్వస్వరూప జ్ఞానం మరచి, మోహవశుడై—విషయ విషంతో నిండిన అపార సంసార సాగరంలో మునిగి- దుఃఖాన్నే అనుభవిస్తాడు. ఎంతటి వారినీ మోహం, తలక్రిందులు చేస్తుంది. మోసపుచ్చుతుంది. మంత్రిం చేస్తుంది. సమస్తం తనవైపుకు తిరిగి- తనను ఆరాధించాలని ఆశిస్తుంది. తన చుట్టూ ఒక పరిధి ఏర్పరచుకుని, అందున్న వన్నీ తనవేనంటుంది. ఆ పరిధిలో వుండి, శాంతి,- ఆనందం కోరతాడు మనిషి, సహజంగా అవి లభించకపోతే, తికమకపడి తననూ, ఇతరులనూ తిడతాడు.

దీనికంతకూ కారణం, మనం అనుక్షణం రాగ-ద్వేష - మోహాలలోపడి కొట్టుకోవడం. అవి మనలో సంక్షోభం సృష్టించకముందే—వాటిని నిశ్చలంచేసి, అదుపులో వుంచమంటాడు బుద్ధుడు. అంటే, జాగ్రత్తగా తనను తాను పరిశీలించి, పరిశోధించి, పరీక్షించుకోవడం

ద్వారా–అంటే, అదే అంతర్వీక్షణ. అందుకే ఆయన అంటారు- "నిన్ను నీవే రక్షించుకో. నిన్ను నీవే మేల్కొల్పుకో!" అని అంటే, "నిన్ను నీవు తెలుసుకో" అని దానికి దుఃఖ నివృత్తి మార్గం సూచించారు. మోహంనుంచి తప్పించు కోవాలంటే, మనలో ప్రేమకు-దయకు చోటు ఇవ్వాలి. సానుభూతి అలవరచుకోవాలి. అన్నింటి మొదలా- అన్ని వేళలా ఆ విధంగా ప్రవర్తిస్తే- మోహం అణగి, క్రమంగా అదృశ్యమౌతుంది. అప్పుడు నూతన ప్రపంచం దర్శనమిస్తుంది. రాగ, ద్వేష, మోహాదులు నశించిననాడు, మిగిలేది ధర్మమే. అదే జ్ఞానం. అది - దేవతారాధనవల్ల - మూఢ నమ్మకాలవల్ల - విశ్వాసాలవల్ల – సాంప్రదాయాలవల్ల - ఆచారా నుష్ఠానాల వల్ల కలిగేది కాదు. అటువంటి స్థితిలో వున్ననాడు, మనం ఇంకేమీ కోరుకోము. ఆ స్థితే నిర్వా ణం. అదే శక్తి- శాంతి-ఆనందం - సత్యం. అంతా, అన్నీ అదే- దాన్ని మనసు అర్థం చేసుకోలేదు. దాన్ని మాటల్లో వర్ణించి చెప్ప లేము. అది ఒక అనుభవం. వ్యక్తిగత హద్దులన్నీ మారిపోయిన స్థితి అది-అది-ఏమీ మిగలకుండా పోయిన స్థితికాదు. అది—పరి పూర్ణజ్ఞానం. సమస్యా పరిష్కారానికి అది అంతరదృష్టిని ప్రసా దిస్తుంది.

మనకూ-మనం పొందకోరే నిర్వాణానికీ మధ్య తానొక మధ్య వర్తిననలేదు; బుద్ధుడు. తాను కేవలం "మార్గదర్శకుడు, బోధకుడు," అని చెప్పి— "మీకు మీరే నడవాలి. ప్రతి ఒక్కరూ పవిత్రంగా-ధార్మికంగా, దయగా, దాతృత్వంతో, ఔదార్యంతో, క్షమతో, సహృదయంతో వుండి శాంతి జీవనం సాగించండి," అన్నాడు.

మానవజాతిని దుఃఖంనుంచి ఆనందానికీ, అజ్ఞానం నుంచి జ్ఞానానికీ, అంధకారం నుంచి కాంతి వైపుకు నడిపించడానికి ఏర్ప

రచిన సంఘానికి జనసామాన్యమైన నియమాలు- "చంపకు, దొంగిలించకు, వ్యభిచరించకు, అబద్ధమాడకు, మత్తు పానీయాలు ముట్టకు," అనే నియమాలు పెట్టారు. బౌద్ధం ముఖ్యంగా మానవుని ప్రవర్తనావళి మీద ఆధారపడివుంది.

ప్రతి ఒక్కడూ తనను తాను తెలుసుకునే మార్గమే, బుద్ధుని మార్గం. అది నమ్మకానికి చెందిందికాదు-మనిషి తాను చేయవలసిన సాధన ఎంతో, ఏమిటో చెపుతుంది ఆ మార్గం. అందుచేత అది- అద్భుతమైన కల్పన వంటి ఒక మతంకాదు, కాకమ్మ కథలతో కూడినదీకాదు. అది కేవలం అభ్యాస సిద్ధమైన మార్గం. ప్రతిక్షణం- ప్రతిఒక్కరూ తమను - తాము లోపలా, బైటా ఏ అరమరికా లేకుండా పరిశీలించుకోవడం - అర్థరహితమైన కర్మాచరణను, నియమ నిష్ఠల్ని తోసెయ్యడం. కోర్కెల్ని అదుపులో పెట్టుకోవడం. ప్రేమ, దయ, కరుణ, మానవత్వం, సమత్వం కలిగివుండటం. పవిత్రంగా, నిస్వార్థంగా, నిర్మలంగా జీవితం గడపడం. ఆ జీవనమే నీతివంతం—అంటే నీతి-వ్యక్తిగతమైనది. ధర్మం సంఘపరమైనది— నీతి, ధర్మానికి ఆలంబనం- కాని, ఒక కోణం నుంచి చూస్తే, నీతే, ధర్మం. ఆ మార్గాన నడవదలచుకున్నవారు త్రిశరణాల్ని-ఆశ్రయించి తు.చ. తప్పకుండా పాటించవలసి వుంది.

రోగి, వైద్యుని శరణుజొచ్చినట్లు, సాధకులు, వివేకవంతులు బుద్ధుని శరణుజొచ్చారు; భవరోగ నివారణార్థం. అయినా బుద్ధుడు ఎప్పుడూ-ఎటువంటి పరిస్థితులలోనూ, ఎవరికి, ఏ విషయంలోనూ హామీ ఇవ్వలేదు. ఉపదేశకుడుగా, ఉపదేష్టగా అనన్యసామాన్యమైన ముక్తి మార్గం సూచించాడు. జ్ఞాన జ్యోతిని దర్శించాలంటే, నిరంతరం, నిర్విరామకృషి, నిరాడంబర జీవితం, కార్యదీక్ష, శ్రద్ధ ముఖ్యమన్నాడు. బుద్ధుని బోధ నీతి సంబంధమైనది - ఋజువర్తన కలది

కావడంవల్ల- దుఃఖితులు శాంతి పొందారు. నేరస్థులు, నీచులు, అధికారులు, అహంకారులు, నియంతలు సద్గుణ సంపన్నులయ్యారు. అన్ని రకాల ప్రజానీకం మేలు పొందారు. మనశ్శాంతి పొంది, ప్రభావితులయ్యారు.

★ ★ ★

చైనా, జపాన్ దేశాలు మొదట మహాయానం వైపు మొగ్గి, చివరికి "Z E N- జెన్," మార్గంగా ఏర్పడ్డాయి. 'జెన్' అంటే ధ్యానమని అర్థం. ఈనాడు అది బౌద్ధంలో ఒక మహనీయమైన మార్గమైనది- దాని లక్ష్యం- మనిషిని మనో బంధంనుంచి విముక్తి పరచడం. అది ఒక మతం కాదు. అది ఒక ధ్యాన మార్గం. 'జెన్' అంటే, పరిపూర్ణ వికాసం. అది శుద్ధ చైతన్యం. సహజస్థితి. దాని ఉద్దేశ్యం- మనోనాశనమేకాని, మనోలయం కాదు. అట్లా అని- అది మానసికమైన సంగతి కాదు. అహంకారానికి అతీతంగా వుండటమే, జెన్, దీపం యొక్క కాంతే జెన్.

ధ్యానమంటే- లోపలా, బైటా నిరంతరం ఎడతెగని గమనిక. ఆ గమనికే నూతన జీవితాన్ని ప్రసాదిస్తుంది. అది ఒక అనుభవం. అది వికసించిన పద్మం వంటి జీవితం. అది దేన్నీ అంటక ఎత్తున నిలుస్తుంది. ఆ గమనిక ఒక కర్మకాదు. అది ఏదీ కాదు. అది సహజంగా జరిగే సంగతి. అది ఒక కళాకాదు, వృత్తి కాదు. ఏం చేసినా అది ప్రతిక్రియే అవుతుంది. ఎక్కడ, ఎట్లా వున్నా ఏం చేస్తున్నా- చూస్తున్నా-వింటున్నా ఆ గమనిక వుండనే వుంటుంది. అది ఒక పద్ధతిద్వారా జరిగే- కలిగే- స్థితి కాదు. అది మనోరహిత స్థితి. అంటే, మనసుకు అతీతమైనది. అది ఒక అవగాహనాస్థితి- అవస్థ. అది- ఎరుకతో పరిణామం కలిగిస్తుంది. అనుభవంలో చివరి ఆనందావస్థే, ధ్యానం. భక్తి, ప్రార్థన, ఏకాగ్రత,

పూజ, నామజపం- మొదలైనవి ఏవీ ధ్యానం కాదు. అన్నీ అణగి, మౌనంగా మారడమే ధ్యానం. అది అన్నింటినీ — చివరికి - మనం ఊహించి, భావించి, అనుకునే సత్యం, దైవం సహితం నిరాకరించి, తోసేసి, ఏమీ కాకుండా మనల్ని వదలుతుంది. అదే మహాశూన్యం. అటువంటి మహాశూన్యాన్ని తలచుకుని మనసు భయపడుతుంది, గొడవపడుతుంది, ఆందోళన- ఆరాటం - ఆతృతచెందుతుంది. మహాశూన్యమంటే, ఏమిటో తెలియక, అనుభవంలో లేక భయపడతాం. అంతేకాదు వ్యక్తిత్వం లేకుండా జీవించలేకనా్న మనసుతో మనడమే మేలనుకుంటాం. లేదా, ఏదో ఒకదాన్ని- మతం — నమ్మకం— సాంప్రదాయం- ప్రజాసేవ- దేశసేవ మొదలైనవి— తెచ్చి— ఆ శూన్యాన్ని నింపాలని చూస్తాం. అదీ మనతీరు ఇంతవరకు ఆ మహాశూన్యాన్ని సత్యంకాని దానితో నింపాయి మతాలు. బుద్ధుని బోధలతో ఆ అబద్ధాలు- అసత్యాలు బయటపడ్డాయి. బుద్ధుడు తన శిష్యులను ఎప్పుడూ ఆ మహాశూన్యంవైపు నడిపేవేకాని, విషయాల మీదకు ఏనాడూ మళ్ళించలేదు.

ఒక్కమాట మాట్లాడకుండా తనను సమీపించిన మహాకాశ్యపునకు పూర్తిగా విచ్చుకున్న ఒక తామరపువ్వు ఇచ్చాడు - బుద్ధుడు. అతడూ ఏమీ మాట్లాడకుండా ఆ తామర పువ్వు తీసుకుని ఎప్పుడూ ధ్యానంలో కూర్చునే చెట్టుకిందకు వెళ్ళి కూర్చున్నాడు, తానూ పద్మంవలె వికాసం చెందాలన్నట్లు.

ధ్యానం కాని, ఏదికాని చెయ్యాలనుకుంటే, అందు మనసు వుంటుంది- అనుకునేది, అనుకోవడం రెండూ మనసే. అటువంటి మనసు మానసాతీతమైన ధ్యానాన్ని ఏవిధంగా సాగిస్తుంది? వివేకంతో యోచిస్తే- ఆ సంగతి మనకు తెలియకపోదు. కాని, బలవంతంగా ధ్యానంచేస్తే ప్రమాదం జరుగవచ్చు. అయితే ఏం చెయ్యాలనే ప్రశ్న కలుగుతుంది. ఏమీ చేయక వూరికే వుండాలి - గతించి

పోతున్న వాటికి సదా సాక్షిభూతంగా వుండాలి. మనో విజృంభణ లేకుండా, ప్రశాంతంగా వుండాలి. ఆలోచించే- మాట్లాడే అలవాటు వల్ల, మొదట్లో మౌనం, ఇబ్బందిగా వుండి, కొన్ని క్షణాలే నిలుస్తుంది. క్రమంగా సాధనసాగేకొద్దీ మౌనకాలం - దీర్ఘం అవుతుంది. అప్పుడు మనసు నెమ్మదించి, శాంతపడుతుంది. మనోఉద్రేకం ఆగి, మౌనమే మిగులుతుంది. మౌనం, మాట రూపం దాలిస్తే- అది ప్రార్థన అవుతుంది. ఏ రూపం, దాలిస్తే-అది–అదే అవుతుంది.

అసలు వున్నది ఉనికి ఒక్కటే. అది నువ్వూ కాదు, నేనూ కాదు– ఏదీకాదు. అది జీవసన్మృత్వం. నువ్వు- నేను– ఏదీ లేక పోయినా ఉనికి వుంటుంది. ఆ స్థితే - ఆ ఉనికే - అసలు సత్యం. విశ్వహృదయంలో. మన హృదయం లీనమైనప్పుడు, అప్పుడు ఉనికే నీ గృహమౌతుంది. అది శాశ్వతం - కాలాతీతం - అనంతం- అపారం-అఖండం-స్వచ్ఛం-అటువంటి స్థితిలో నిలవాలంటే, గతం నుంచి విముక్తి పొందాలి. దానికి, నిన్ను నీవు పూర్తిగా, సదా అనుసరించాలి. దానికి మార్గం, ధ్యానం, అది-మౌనమార్గం. అది మనసులేనిస్థితి-అదే సహజస్థితి-కాబట్టి, సమస్తం మనలోనే వుంది. అంతా మనమీదే ఆధారపడి వుంది. లోలోపలకు వెళ్ళేకొద్దీ, బుద్ధత్వం మన స్వభావంగా, మనస్థితిగా మారుతుంది. ఆ విధంగా మనస్ఫురణ-Consciouness- జ్ఞానం-ప్రజ్ఞ–దృష్టి మారడంతో– మన చుట్టూ, లోపల. అంతటా - మార్పు వస్తుంది. అప్పుడు ప్రతి ఒక్కటీ అందంగా నూతనంగా దర్శనమిస్తుంది. ఆ క్షణాల్లో మన లోపలి, బైటి పరిస్థితులకు, పరిసరాలకు, విషయాలకు, సంగతులకు, ఎరుకలో వుండి పనిచేయాలి. అదే సత్కర్మ - ఆ కర్మకు పాప-పుణ్యాలు, స్వర్గ-నరకాలు, మంచి-చెడ్డలు, ఏమీ లేవు. చెట్టువేళ్ళు భూమిలో లోపలకు వెళ్ళేకొద్దీ బైట దాని శాఖలు బాగా విస్తరించి,

ఆకాశంలోకి ఎగిరిపోతాయి. అలాగే, మనమూ విశాలంగా ఎదుగుతాము. వికాసం చెందుతాం. అంటే, నిద్రాణమైవున్న అధో చేతనం మేల్కొని, ఊర్ధ్వచేతనంగా మారుతుంది.

* * *

మనం చేయవలసింది. గతంలో పోగుచేసుకున్న విజ్ఞానాన్ని-గ్రంథాల్ని—గురువుల్ని - పద్ధతుల్ని-సిద్ధాంతాల్ని- మార్గాల్ని - నమ్మకాల్ని-సాంప్రదాయాల్ని—విశ్వాసాల్ని - తత్త్వశాస్త్రాల్ని-అన్నింటినీ వదలడం. అప్పుడే మనం వివేకవంతంగా జీవించగలుగుతాం. ఆ జీవనమే, ధ్యానం. ఆ ధ్యానం సమస్తాన్ని వలిచేస్తుంది-కోసేస్తుంది-చీల్చేస్తుంది— దహించేస్తుంది. చివరికి నగ్నంగా నిలబెడుతుంది. క్రమంగా ఆ ధ్యానం అనంతత్వంలోకి, అమృతత్వంలోకి, శాశ్వతత్వంలోకి, దివ్యత్వంలోకి, హృదయంలోకి తీసుకుపోతుంది.

గతమంటే, మనపై అల్లబడిన మాయతెర—మనం ఎప్పుడూ ఆ మాయ తెరలోంచే చూస్తాం. ఆ తెర తృష్ణ - కోర్కె - ద్వేషం-మోహం మొదలైన వాటితో అల్లబడివుంటుంది. అటువంటి గతమంతా పూర్తి ఆలోచనా మయం. ఆలోచనలు చాలా వరకు మనవి కావు. అవి, ఇతరులవి - ఇతరమైనవి. ఆ ఆలోచనలన్నీ మనకళ్ళ మీద ముసుగు మాదిరిగా తయారౌతాయి. అటువంటి గతం, అన్వేషణకు పెద్ద అవరోధం-ఆ గతాన్ని వదలి "నాకేం తెలియదు" అని నిజంగా అనగలిగినప్పుడే, విచారణ ఆరంభమౌతుంది. ఆ విచారణ స్వచ్ఛమైనది. అదే నిజమైన అన్వేషణ.

పెద్దలనుంచీ, గ్రంథాలనుంచీ, పురాణాలనుంచీ విజ్ఞానం నుంచీ పోగుచేసుకున్న నమ్మకాల్ని బలపరచి, అవే సరైనవి అంటుంది మనసు. అటువంటి నమ్మకం ఎప్పటికీ సత్యాన్ని చూడ

లేము. అవి నిత్య జీవితానందాన్ని ఇవ్వలేము. నమ్మకమంటే-ఉన్న సందేహాన్ని మరొక దానితో కప్పడం. నమ్మకం-సుఖాన్ని అనుకూలమైన జీవితాన్ని ఇస్తుంది గనుక మనం ఎప్పుడూ ఏదో ఒక దాన్ని నమ్ముతాం. సుఖమైన-వీలైన, గౌరవ ప్రదమైన, సంఘపరమైన-మర్యాద కరమైన మార్గం ఒకటి-తరతరాలుగా ఏర్పడివుంది. ఆ మార్గం, అబద్ధాలతో, అలవాట్లతో అహంతో నిండివుంది. దాన్ని వదలాలి. దాన్ని వదలడానికి ధైర్యం కావాలి.

మనం గతంలో సాధించిందంతా అహమే-అంటే, మన స్వభావమే, మన గుణాలే, మన ఆలోచనలే- అవే మన శత్రువులు-ఆ శత్రువులతో పోరాడాలి- అంటే, మనమూ, మనం కల్పించుకున్న ప్రపంచానికీ మధ్య పనిచేసే-మన మనసే, మనశ్శత్రువు. ముందు ఆ శత్రువును జయించాలి. ఆ శత్రువును జయించాలని దేన్నీ ఆశ్రయించకు-అర్థించకు- అనుసరించకు-ఆచరించకు - ఆదరించకు - దానితో చివరి వరకు ఒంటరిగా, నిర్భయంగా పోరాడాలి.

మనం దేనినుంచి అయినా తప్పించుకోగలంకాని, మననుంచి మనం తప్పించుకోలేము. అంటే, మనకు మనమే శత్రువులం - దేనికైనా మనకు-మనమే బాధ్యులం. ఇంకెవరూ కాదు, లేరు, వుండరు. ఎందుకంటే, ఉన్నది మనమే కనుక. అందుచేత ముందు మనని మనం తెలుసుకోవాలి. దానికి ఒకటే మార్గం వుంది. అది— వచ్చి-పోయే ఆలోచనలకు సదా ఎరుకలో, మెలకువలో వుండి గమనించడం. ఆ గమనికకు ఒకటే ద్వారం వుంది. అది మనలోనే వుంది. అంటే, మనకుమనమే వికాసంచెందాలి. ఆ ఎరుక జీవితాన్ని మరింత ఫలవంతం, సౌందర్యవంతం, ఆనందమయం, కాంతివంతం చేస్తుంది. మనల్ని శాంతిగా వుంచుతుంది. ఆ సంగతి మనకు తెలియ జెప్పి, విశదపరచడానికే బుద్ధుడు వచ్చాడు. ఆ సంగతి తెలుసుకుంటే, జీవితం ఆనందంగా మారుతుంది.

మనం పోగుచేసుకున్న విజ్ఞానంతో మనం ఎప్పటికీ వాగుడు కాయలు మాదిరిగానే వుంటాం. మనం చేసే పనులూ చాలావరకు గారడీవాడు చేసే పనులు మాదిరిగానే వుంటాయి. మనల్ని మనం నిరంతరం వంచించుకుంటూ, కాలం గడుపుతాం. కనుక మన సమస్యలు ఎప్పటికీ పరిష్కారం కాకుండా మిగిలిపోతూనే వున్నాయి. కాబట్టి వ్యర్థం, నిరర్థకం అయిన సంగతుల్ని పట్టుకుని వేళ్ళాడకూడదు. అసలు జ్ఞానాన్ని- సత్యాన్ని పొందడానికే చూడాలి. నిరంతరం భయంతో - అర్థం లేని అతి సామాన్యం, స్వల్పం, అల్పం అయిన రక్షణల్ని విడిచిపెట్టాలి. జ్ఞానం- సత్యం- దైవం- ఆత్మ- ఏదైనా అనండి అది, మనం నిద్రలేవగానే మన కళ్ళ ముందుకు వచ్చి దర్శన మివ్వదు. అలాగే, మనం నిద్రపోగానే, అది అదృశ్యమూ కాదు. అది- మారేదీ, నశించేదీ, అదృశ్యమయ్యేదీ, ఉద్భవించేదీ, దర్శనమిచ్చేదీ కాదు. అది- దేనిమీదా ఆధారపడదు. అది శాశ్వతమైనది. తక్కినదంతా అశాశ్వతం. అశాశ్వతమైన వ్యక్తిత్వాన్ని, గౌరవాన్ని, సుఖాన్ని, విజ్ఞానాన్ని, తృప్తిని- పొందాలని చూడకూడదు. కాని, మనం వాటికోసం ఎదురు చూడ్డం, ఆశించడం, ప్రయత్నించడం ఎప్పటికీ మానం. వాటి వెనక పడకుండా వుండనూ లేము. అదీ మన జీవితం.

అటువంటి సత్యాన్ని పొందాలని, తెలుసుకోవాలని ఆశా- ప్రయత్నాలతో ఎంతో విజ్ఞానాన్ని పోగుచేస్తాం. అనేక గ్రంథాలు పఠిస్తాం. అనేకమంది గురువుల్ని ఆశ్రయిస్తాం. ఆశ్రమాల్లో చేరతాం. ఆలయాలు దర్శిస్తాం. శాస్త్రాలు అధ్యయనం చేస్తాం. సిద్ధాంతాలు పోగుచేస్తాం. అనేక విధాలైన సాధనలు చేస్తాం. అవన్నీ తుదినిర్ణయాలు తీసుకోవడానికి, తర్కానికి మాత్రమే ఉపయోగపడతాయి. కనుక జీవితం అన్వేషణతో సాగాలి కాని, కోర్కెతో కాదు. మనని మనం తెలుసుకో నారంభించినప్పటినుంచే, అసలు జీవితం

ఆరంభమౌతుంది. మొగ్గ పువ్వుగా వికసించునట్లు-మనిషి BEINGగా వుండటంనుంచి BECOMING-కావడంలోకి రూపాంతరం చెందాలి.

అటువంటి జ్ఞానం పొందేందుకు, ముందు మనసును పూర్తిగా ఖాళీ చేయాలి. బైటనుంచి ఏదీ తీసుకున్నా, అది వృష్టిని మసక పరుస్తుంది- విచారణ మార్గంనుంచి మనల్ని మళ్ళిస్తుంది. మనని మనం తప్ప మరెవరూ మనల్ని బంధించరు, బాధించరు. అసలు మన ఉనికే కుళ్ళునీళ్ళ గుంట మాదిరిగా వుంది. ముందు దాన్నించి బైటపడే మార్గం వెతుక్కోవాలి.

ఆ సందర్భంలో మతానికో, ఈశ్వరునికో- సిద్ధాంతానికో, ఆదర్శానికో, అభిప్రాయానికో- దేనికో ఒకదానికి- లేదా, ఒక నమ్మకానికో- అతుక్కుని, తమని తాము పూర్తిగా అర్పించికుని, దానికి శరణాగతి చెందమంటారు పెద్దలు. అది విశేషమైన సంగతి కాదు. అది, కోతిపిల్ల చేష్టవంటిది. కోతిపిల్లకు భయం ఎక్కువ. అది తల్లిని వదలక గట్టిగా పట్టుకుంటుంది.

అసలు సంగతి ఏమిటంటే - మనం ఎప్పుడూ ఎవరినీ, ఎందుకూ, దేనికోసమూ అనుసరించకూడదు. ఏ నమ్మకానికీ తలొగ్గ కూడదు. ఊహలతో, భావాలతో, ఆలోచనలతో, అభిప్రాయాలతో - ఏ విషయంలోనూ మనల్ని ఇతరులతో పోల్చుకోవడం, ఎంచుకోవ డం, వ్యాఖ్యానించు కోవడం, లెఖ్కవేసుకోవడం వంటి అల్ప విష యాలతో కాలం గడప కూడదు. ఆ విధంగా మనమూ- మనచుట్టూ వున్న వారిమధ్య పిచ్చికూతలు, వెర్రిపనులు, వదరుబోతు తనం వది లేసి, మౌనంగా వుండాలి. అంతే, పూరిగే వుండాలి.

ఊరికే మౌనంగా వుండమన్నారని శారీరకంగా, కదల కుండా- పనిచేయకుండా, నిర్వీర్యంగా- రాయిలాగ పడివుండి- మనో విజృంభణతో అన్వేషణ ఆరంభించకూడదు. దానివల్ల మరిన్ని ఆలో

చనలు-ఆందోళనలు-ఆరాటాలు, ఆత్రుతలు కలుగుతాయి. తత్ఫలితంగా మంత్రాల్ని పఠిస్తారు - సాధనలు చేస్తారు - గురువుల్ని చేరతారు. అసలు సత్యం పొందాలని, అంతిమజ్ఞానం సిద్ధించాలని అనేకం చేస్తారు. ఆ సందర్భంలో చాలా వరకు తప్పు తోవలు తొక్కుతారు. తమను విస్మరించి - ఏది తీసుకుని, ఏం చేసినా చివరకు మన ఆలోచనలకు, భావాలకు, ఊహలకు, విలువ ఇచ్చినా, గొప్ప చేసినా-అవి బంధాలే అవుతాయి.

సత్యాన్ని దర్శించడానికి బదులు మననిమనం నిరంతరం వంచించుకుంటూ, మోసపుచ్చుకుంటూ, భ్రాంతుల్ని కల్పించుకుంటూ కాలం గడుపుతాం. ఆ విధంగా మనచుట్టూ రాతిగోడల్ని కట్టుకుంటాం. అదీ మనం నిత్యం చేసేపని. మనమేకాదు అందరూ అంతే. చివరికి సిద్ధార్థుడు సహితం మొదట్లో జ్ఞానార్జనకు-సత్య సందర్శనానికి మానసికంగానే ప్రయత్నించాడు. దేహాన్ని హింసించాడు. చివరికి ఆలోచించాడు - ఆశ-ప్రయత్నం పనికి మాలినవని. ఆ సంగతి అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. కఠిన సాధనలతో-క్రమశిక్షణలతో - నియమ నిష్టలతో సత్యాన్ని సాధించలేమని-వ్యక్తిగత ప్రయత్నం ద్వారా సిద్ధార్థుడు ఏమీ సాధించలేదు. ఏమీ చేయక-పూరిత వుండి తలపులు మూసి, తలుపులు పూర్తిగా తెరిచాడు. బోధి వృక్షం క్రింద కూర్చుని - తన అజ్ఞానాన్ని గుర్తించాడు. ఆ గమనికతో సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు. ప్రశాంతంగా శేష జీవితం గడిపాడు. ఏమీలేని, నిరామయ, నిర్వికార నిర్వాణ స్థితే బుద్ధత్వం-అదే సత్యం-అంటే, సత్యం కనుక్కునేదీ-కల్పించేది కాదు. మహాత్ముల పర్శనంతో-సేవలతో-గ్రంథ పఠనాలతో, నామ జపాలతో-యోగం, తపస్సులతో – చివరికి దేనితోనూ దాన్ని సాధించలేము. సత్యం-ఎక్కడో అందరానంత దూరాన - ఎత్తున వుందని భావించి-దాన్ని పొందాలని ఆశించి - ప్రయత్నించి సాధనలతో - ఆరాధనలతో-ఆలోచనలతో వుంటాం. మన మనస్సు ఎప్పుడూ ఆ

విధమైన ఆశా-ప్రయత్నాలతో నిండి వుంటుంది. సహజంగా, కాని, సత్యం అక్కడే - ఆ క్షణంలోనే—అదీ మనలోనే వుందనే సంగతి మనకు తెలియకుండా వుంది. ఆ సంగతి తెలియ చెప్పడానికే మహాత్ములు అవతరిస్తారు.

మనం సహజంగా వుంటే, సత్యాన్ని క్షణంలో దర్శించగలం. దానికి మధ్యవర్తులు అవసరంలేదు. దాన్ని దర్శించినవాడే, బుద్ధుడు.

* * *

భారత దేశంలో ఒక క్రమ బద్ధమైన-నియమబద్ధమైన-నీతి వంతమైన-ఆధ్యాత్మిక తత్త్వాన్ని బౌద్ధ మతం ఏర్పాటు చేసిందని నిశ్చయంగా చెప్పవచ్చు. శతాబ్దాల తరబడి పేరుకుపోయిన విశ్వాస మాంద్యాన్ని, అకస్మాత్తుగా, విప్లవాందోళనలతో పూల్చింది బౌద్ధమతం - ఒకనాడు. కొందరి నిగూఢ తాత్త్విక జిజ్ఞాసాసక్తిని తీర్చింది ఆనాడు - ఈనాడు. అంధవిశ్వాస పద్ధతిని - అపరిశుద్ధ ఆచార విధానాన్ని అణగదొక్కింది. మనసును ప్రక్షాళనంచేసే-పరిశుద్ధ మొనర్చే ఒక గొప్ప ఔషధరాజంగా పనిచేసింది బౌద్ధ మతం. విమర్శనా దృష్టినీ, పరిశీలనా పటిమను ప్రజల్లో ఉద్భవింప జేసింది. ఆ మతంలో వర్గ- వర్ణ- స్త్రీ, పురుష- ఎటువంటి భేదం లేక- అందరికీ ప్రవేశ అర్హత వుంది. అది విమోచనా విధానాన్ని ప్రచారం చేసింది. అది అన్ని మతాలకంటే భిన్నమైనది. ఆ మత ఆవిర్భావంతో ఆధునిక తాత్త్విక విజ్ఞానంతో సుప్రసిద్ధమైన, సూక్ష్మ మైన ఒక శకం ఆరంభమైంది. అదే, బౌద్ధయుగం. సాంస్కృతికీ, నాగరికతకు బ్రహ్మాండమైన ఒక ఉద్యమంగా వ్యాప్తి చెందింది- బౌద్ధమతం. ప్రపంచదేశాల— వర్గాల- జాతుల మధ్య సహజీవనం సదవగాహన- సౌభ్రాతృత్వం పెంపొందించింది... మానవధర్మమే,

బౌద్ధధర్మం, మనోవాక్కాయ కర్మలలో పవిత్రతే ధర్మం. కోర్కెల జ్వాల అణచుటే, ధర్మం. మానవుణ్ని ఉన్నతస్థితికి తీసుకుపోయే మార్గమే, బౌద్ధధర్మం. అందులోని ప్రేమ, స్వేచ్ఛ, సమత, సహోదరత- సహృదయత- అహింస మొదలైన సామాజిక సందేశాలే బౌద్ధధర్మం. అదే సద్ధర్మం. దానికి ఆయన జీవితమే సరైన వ్యాఖ్య.

బౌద్ధమతం ఒక్క భారతీయ సంస్కృతిపైనేగాక, ఇంకా అనేక ప్రపంచ దేశాలపైకూడా శాశ్వతమైన చెరగని, చెదరని, చెడని గట్టిముద్ర వేసింది. దాని ప్రభావం ప్రపంచమంతటా అన్ని రంగాల్లో నేటికి నిలిచి వుంది. శాంతం - సాధుత్వం — మృదుత్వం— సౌమ్యం- స్థిమితం- నిర్మలం- నిశ్చలం- స్వచ్ఛం- దయ- ప్రేమ— కరుణ- జాలి- కృప మొదలైన గుణాల్ని - స్వార్థచింతననుంచి స్వేచ్ఛ పడటం ద్వారా పొందవలెనన్న బుద్ధుని బోధలు- ఇరవై ఐదువందల సంవత్సరాల క్రిందట బహుస్వల్ప సంఖ్యలో వున్నా, నేడు ప్రపంచమంతటా - అసంఖ్యాక ప్రజానీకంలో బాగా వ్యాప్తి చెందాయి.

కాని, జీవితసత్యాల్ని విమర్శించడంచేత మనిషికి- మనిషే పరమశత్రువై - ఒకరిమీద ఒకరికి ద్వేషం- పగ- ఈర్ష్య - అసూయ ప్రబలింది. తత్ఫలితంగా ఎల్లకాలం యుద్ధాలతో, రక్తపాతంతో నిండివుంది. ఎటుచూసినా భయ - భ్రాంతులతో, హింసా- ద్వేషాలతో, ఘోరకుటిల - నిష్ఠుర కంటకాల - మోహ, జటిల - మలిన దుర్వాసనల- వక్రమార్గాల - అత్యాశల - కలవరాల - విషపూరిత ఉన్మత్తస్థితిలో విశృంఖల వీరవిహారం చేస్తోంది ప్రపంచం.

భ్రాంతులతో పగటికాలం చీకటిగా వుందని - భయపడుతు - చీలిన బాటవద్ద సంశయాలతో - దిగ్భ్రమచెందిన సాధకుని - సత్యాన్వేషిని - ఆదుకోవడానికి-తవ్వియూసిన గోతులనుంచీ, దుఃఖవలయం నుంచి అతన్ని తప్పించి, స్వేచ్ఛాపథానికి నడిపించడానికి - నిరాశా అంధకారాన్ని, మనోవ్యాకులాన్ని-సమస్త పీడకలల్ని తుడిచేసే - కడిగేసే- జీవనజలాల్ని భూమిమీద చల్లే శాంతి ప్రదాత - సంక్షేమ కర్త-పవిత్రుడు, ప్రేమస్వరూపుడు అయిన బుద్ధుడు - నూతనోద్భవ రవికిరణ ప్రకాశంతో నమానుడైన బుద్ధుడు - అవతరించి, సర్వజీవ రాసులయెడ ప్రేమ, దయ, కరుణ - సమానత్వం, అసమాన ఔదార్యం చూపి - ధర్మదీక్షానివేశంతో - నిర్దుష్టపూర్ణభావ సమన్వితంతో- అనంతకారుణ్యంతో ధర్మం బోధించిన విశ్వవంద్యమూర్తి బుద్ధ భగవానుడు.

*　　*　　*

# చిక్కాల కృష్ణారావు రచనలు

| | |
|---|---|
| భగవాన్ రమణ మహర్షి | — 40.00 |
| కృష్ణాజీ జీవితం (జిడ్డు కృష్ణమూర్తి) | — 60.00 |
| మోహరాత్రి | — 6.00 |
| నిశ్చల మనస్సు | — 15.00 |
| అనుభవ ధూళి | — 10.00 |
| రమణ బోధలు | — .00 |
| ప్రవక్త | — 15.00 |
| కబీరు గీతాలు | — 15.00 |
| మహాజ్ఞానం | — 15.00 |
| ఖలీల్ జిబ్రాన్ | — 15.00 |

